# రచయిత కృతజ్ఞతలు

ఈ పుస్తక రచనలో నాకు రాహుల్జీ రచనలు, ఇతర వ్యాసాలు తోడ్పడ్డాయి. ఇందుకు రాహుల్జీకి, వ్యాసకర్తలకు నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను. నా రచనలో ఒకవేళ రాహుల్జీ వ్యక్తిత్వానికి భంగం కలిగించే మాటలు ఏవైనా దొరలిఉంటే, ఆ దోషం నాదే అవుతుంది. సూచించినదే తడవుగా, ఈ గ్రంథాన్ని ప్రచురించబూనుకొన్న జయంతి పబ్లికేషన్స్ అధినేత శ్రీ పెరుమాళ్లుగారికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

ఇట్లు,

బండ్లపల్లె ఓబులరెడ్డి,

1—3—63.

# నా మాట

విశ్వశ్రేయస్సే జీవితపరమావధిగా పెట్టుకున్న మహోన్నత మానవుడు రాహుల్జీ ప్రపంచయాత్రికుడుగా, చరిత్ర పరిశోధకుడుగా, బహుభాషాపండితుడుగా, ఉత్తమ దేశభక్తుడుగాకూడ వెలుగొందారు.

ప్రతిమానవునకు జీవితచరిత్ర అంటూ ఎంతోకొంత వుంటుంది. అయితే అది అతనికి, అతనివారికే పరిమితమయి వుంటుంది. నూటికి తొంభైతొమ్మిది జీవితచరిత్రలు అంతే. నూటికి, కోటికి, ఏ ఒక్కరి జీవితచరిత్రో మానవసమాజానికి వెలుగుబాటగా, విశ్వమానవ కల్యాణానికి గోహదకారిగా పరిణమిస్తుంది.

మూడువందలకోట్లుగల యీ విశ్వంలో ప్రముఖచరిత్ర పరిశోధకులను, బహుభాషాపండితులను వ్రేళ్ళమీద లెక్కించవచ్చు. వారిలో రాహుల్జీ ముఖ్యులు.

రాహుల్జీ వంశీయులు మహాపండితులైనప్పటికీ, వారి కుటుంబంవారు విద్యావిహీనులు. అట్టి కుటుంబంలో పుట్టిన రాహుల్జీ ముప్ఫైభాషలలో మహాపాండిత్యం సంపాదించారు.

భారతదేశములోని అన్నిరాష్ట్రాలు, ముఖ్యనగరాలు, చారిత్రకప్రదేశాలు, ఆ యా ప్రజలభాషలు, సాంఘికకట్టు

బాట్లు, వారి పూర్వుల ఔన్నత్యము, వారి పూర్వులజీవనం, ఆచారవ్యవహారాలు, మొదలగు వాటినిగురించి ఎంతో పరిశోధన చేసారు.

ప్రపంచ యాత్రార్థమై టిబెట్టు, సింహళం, జపాన్, ఇరాన్, ఇరాక్, రష్యా, ఇంగ్లండ్ మొదలగుదేశాలు పర్యటించి బౌద్ధయుగంనాటి భారతావనిని, యీనాటి భారతావనిని గురించి ఎన్నోసభలలో మాట్లాడారు. బౌద్ధయుగ సంస్కృతి, సాహిత్యం, భారతావనిలో హిందూమతోద్ధారకులు కాలరాచి నేలమట్టంచేసినా, విదేశాలలో ముఖ్యంగా టిబెట్టులో చెక్కుచెదరకుండా నిలిచివున్నాయి. భారతదేశంలోపుట్టి, భారతదేశంలో ప్రవర్ధమానమయిన బుద్ధుని నీతి, న్యాయసూత్రాలు టిబెటన్, పాళీ, పైశాచీభాషల్లో ఎన్నోవేల తాళపత్రగ్రంథాలలోపొందుపరచబడివున్నాయి. వాటన్నింటినీ సాకల్యంగా అధ్యయనంచేసి, మూల అనువాదములలో వాటిని మనకందించిన పూర్ణప్రజ్ఞుడు రాహుల్జీ.

ప్రథమంగా ఆర్యసమాజికుడుగా, కాంగ్రెసు ముఖ్యుడుగా, బుద్ధిస్టుగా, ప్రముఖమార్క్సిస్టుగా, దేశభక్తిగుణంతో కార్యక్రమాలలో అయిదేండ్లు జైలుజీవితం గడిపిన దేశభక్తుడు రాహుల్జీ.

రాహుల్జీ రెండువందలపేజీలు మొదలు వేయిపేజీలు గల 140 గ్రంథాలు రచించారు.

* * *

రాహుల్జీ యీనాడు రష్యాలో స్పృహలేక, జ్ఞాపక శక్తిలేక, మెదడు జబ్బుతో బాధపడుతూ ఆసుపత్రిలో వున్నారు. ఆ మహనీయుడు త్వరలో కోలుకొని మాతృదేశం రావాలని ఆకాంక్షిస్తున్నాను.

మహాపండితుడు, మహాయాత్రికుడు, మహోన్నత మానవుడైన రాహుల్జీకి మొన్నీమధ్య పద్మభూషణ బిరుదు స్పృహలేని, మాతృభూమిలోలేని పరిస్థితులలో యిచ్చారు. త్వరలోనే వీరు కోలుకొని మాతృదేశానికి తిరిగి రాగానే ప్రభుత్వం భారతరత్న బిరుదుయిచ్చి,సత్కరిస్తుందనిఆశిస్తాను.

రాహుల్ జీవితవిశేషాలన్నీ పేర్చికూర్చి, పుస్తకంగా ప్రచురించుటకు అవకాశమిచ్చిన శ్రీ ఓబులరెడ్డిగారికి, పుస్తకప్రచురణలో చేయూత, సలహాలొసగిన మిత్రులు, పెద్దలు, శ్రీ శ్రీనివాస చక్రవర్తి, నర్ఘా రాజగోపాలరావు, ఎమ్. దుర్గా ప్రసాదరావు, జె. వి. సుబ్బారావుగార్లకు, మా ప్రచురణ రచయితలకు, చిత్రకారులకు, మా ప్రచురణల నాదరిస్తున్న ఆంధ్రప్రజానీకానికి మా కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు,
ప్ర చు ర ణ క ర్త.

౧

# మొదటి అధ్యాయం

## బాల్యం

రాహుల్జీ ఒక కుగ్రామంలో పేరుమోసిన, తెలియని బ్రాహ్మణ రైతుకుటుంబంలో జన్మించారు. ఉత్తరభారత దేశంలోని ఆయనవంశీయులు సంస్కృతపాండిత్యంలో ప్రసిద్ధిచెందినవారు. సనాతనభావాలు కలవారైనందువల్ల వారు ఇంగ్లీషుజోలికి పోలేదు. కాశీలోని సంస్కృతవిద్యాపీఠమే వారి చదువులకు పట్టుగొమ్మ. రాహుల్జీ వంశీయులలో ఎవ్వరూ నిన్నమొన్నటిదాకా ఏ విదేశ విశ్వవిద్యాలయంలోను విద్య నభ్యసించలేదు.

ఆయన క్రీ. శ. 1893 లో తన అమ్మమ్మగారి ఇంట పుట్టారు. ఆయన మాతృదేవి కులవంతి తరచు పుట్టింటనే ఉండేది. ఆయన తాతగారు రామశరణ్‌పాఠక్ తన యవ్వనంలో ఇంటినుండి పారిపోయి దక్షిణాదినవున్న హైద్రాబాద్ సైనికపటాలంలో చేరారు. పదేళ్ళకుపైగా అక్కడే గడిపివచ్చినతర్వాత కలిగిన ఏకైక సంతానం కులవంతి. ఆమెకు వివాహమైనతర్వాత చాలాకాలంవరకు పుట్టింటనే గడిపింది. అందుచేత రాహుల్జీకూడ అక్కడే గారాబంగా పెరిగారు. ఏడాదికొకసారి తనతండ్రి గోవర్ధన్‌పాండేగారి ఊరికి వెళ్ళి, అక్కడ వారం పదిరోజులు ఉండివచ్చేవారు. అందుచేత వారిద్దరికి మధ్య పెద్ద చనువు ఉండేదికాదు. పని

పన్నెండేళ్ళతర్వాతనే రాహుల్జీకి తనతండ్రితో పరిచయం ఏర్పడింది.

రాహుల్జీ మొదటిపేరు కేదారనాథ్. ఆయన తన అమ్మమ్మగారింట చాలా అల్లారుముద్దుగా పెరిగారు. బయటికి వెళ్ళి తోడివారితో ఆడుకోవడంకూడ తాతగారికి ఇష్టం ఉండేదికాదు. ఏదైనా ప్రమాదం తెచ్చుకొంటాడని తాతగారి భయం. అందుచేత చెట్టుయెక్కడం రాహుల్జీ తన జీవితంలోనే నేర్చుకోలేకపోయారు. ఆడుకునేటప్పుడు ఒక కుర్రవాడు కాలుజారి గుంటలో పడిపోతే, ఆ నేరం రాహుల్జీ మీద వచ్చిపడింది. అందుచేత ఆయనను బడిలో పెట్టాలని అమ్మమ్మ, తాతగారు ఇద్దరూ నిశ్చయించారు.

గ్రామానికి మైలుదూరంలో బడి ఉండేది. రాహుల్జీ వయస్సు అప్పటికి అయిదేళ్ళు. మధ్యాహ్నంపూట భోజనం మాస్టారుగారి ఇంటివద్దనే ఏర్పాటు చేశారు. చిన్నవయస్సు గదా, ఏమినేర్చుకొంటాడు ? అని అమ్మమ్మగారు అంటే, కూర్చోవడం నేర్చుకొంటే చాలు అని తాతగారు జవాబు చెప్పారు. శుభముహూర్తం చూచి రాహుల్జీని బడికి పంపించారు. కాని అక్కడ చదువు సాగలేదు. కూర్చోవడం మాత్రమే నేర్చుకొన్నారు. ఇంతలో మాస్టరుగారికి గృహకలహం వచ్చిపడింది. ఆ కొట్లాట మూలంగా ఆయనకు శిక్ష విధించారు. బడి మూతపడింది.

II

# అక్షరాభ్యాసం

ఆ సంవత్సరమే రాహుల్జీ తన తండ్రిగారి ఊరికి వెళ్ళారు. అక్కడికి సమీపంలో ఒక బడి ఉండేది. రాహుల్జీ ఆ బడిలో హిందీలో అక్షరాలు నేర్చుకున్నారు. వర్ణమాల పుస్తకంపైన సరస్వతి చిత్రం ఉండేది. ఆ బడిలో రాహుల్జీ నెలన్నరకంటె ఎక్కువకాలం చదవలేదు.

ఆయన తిరిగి అమ్మమ్మగారి ఇంటికి వచ్చారు. అంతకుక్రితం చదివిన బడిలో చేరారు. కొత్తమాస్టరు నవయువకుడు. ఆయన వేషభాషలలో పట్టణ నాగరికత కనిపించేది. అప్పటికి ఇంకా బట్టలు కుట్టే మిషన్ రాలేదు. వంశపారంపర్యంగా బట్టలుకుట్టే ఒక ముస్లించేత రాహుల్జీకి చొక్కాలు కుట్టించేవారు. తాతగారు చొక్కాబట్ట కొలిపించుకు రావడానికై రాహుల్జీనికూడ బస్తీకి తనవెంట తీసుకువెళ్లేవారు. ఆయన చదువుకొనే ఆ చిన్నబస్తీలో దుకాణాల పరిస్థితి ఇప్పటివలె లేదు. పసుపు లవంగాలు అమ్మే దుకాణంలోనే బట్టలుకూడ అమ్మేవారు.

రాహుల్జీ ఉదయమే చద్దిఅన్నం తిని, తన తోడివారితో బారెడు ప్రొద్దు ఎక్కేవేళకు బడికి చేరేవారు. మధ్యాహ్నంపూట తినడానికి అటుకులో, పేలపిండో మూటగట్టుకు వెళ్ళేవారు. హిందీ నేర్చుకొనే పిల్లలు ఇసుకలో అక్షరాలు దిద్దుకొనేవారు. ఉర్దూ నేర్చుకొనే పిల్లలకు ప్రారంభంనుండే తెల్లని పట్టీపై పాతకాలపు సిరాతో అక్షరాలు దిద్దబెట్టేవారు. రాహుల్జీ ఆ బడిలో ఉర్దూ నేర్చుకొన్నారు. కలిగిన

కుటుంబంవారి బిడ్డ అని చాటిచెప్పుకొనేనిమిత్తం రాహుల్జీ తాతగారు ఆయనచేతులకు, కాళ్ళకు వెండి కడియాలు తొడిగించారు; చెవులకు బంగారుపోగులు పెట్టించారు.

ఆయన పుట్టకముందే అమ్మమ్మ, తాతగారు వైష్ణవ దీక్ష పొందారు. అందుచేత చేపలు, మాంసం తినేవారు కారు. అయినప్పటికీ రాహుల్జీ చేపలు, మాంసం తినడానికి తగు ఏర్పాట్లు చేసేవారు. కొంచెం ఊహవచ్చినతర్వాత రాహుల్జీ స్వయంగా దొడ్లో చేపలు వండుకు తినేవారు. అమ్మమ్మ మసాలా నూరి ఇచ్చేది; వండుకునే పద్ధతికూడ చెప్పేది. తాతగారికి స్థానికంగా కొందరు మహమ్మదీయులతో స్నేహసంబంధాలు ఉండేవి. వారు రామశరణ్‌పాఠక్ ఇంటికి వచ్చినప్పుడు, స్వయంగా తమచేతితో మంచినీళ్ళు ముంచుకు త్రాగేవారు. కాని కొందరు మహమ్మదీయులు బ్రాహ్మణులు ముట్టుకొన్న వస్తు వేదీ ఉపయోగించేవారు కారు. ఈ పద్ధతిని గ్రామస్థులు తెగపొగడేవారు.

నెత్తిమీద టోపీలేకుండా బడికి వెళ్ళడం అనాచారంగా భావించే రోజులు అవి. రాహుల్జీ అనేక పర్యాయాలు టోపీ పోగొట్టుకొనేవారు. ఇందుమూలంగా తనకూ, ఇంటివారికీ చాలా చీకాకు కలిగేది. టోపీని మెడమీదనుండి చొక్కాకు అతుకువేసి పెట్టినా ఎక్కడో జారిపోయేది. అందుచేత టోపీ లేకపోతేనే బాగుండునని రాహుల్జీకి అనిపించేది. ఒకసారి తన తాతగారు పట్టుటోపీ కుట్టించారు. కాని అది నాలుగురోజులకంటే ఎక్కువకాలం ఉండలేదు. సాయంత్రం చూచుకొంటే టోపీ మాయమైంది. తాతగారు కోప

పడతారని రాహుల్జీకి భయంవేసింది. అందువల్ల ఊరికి వెళ్ళ లేదు. ఇక్కడా అక్కడా తిరుగుతూ ఉండగానే చీకటి పడింది. బడి దగ్గరలోనే తాతగారికి తెలిసిన ఒక వడ్రంగి ఉండేవాడు. ఏదో వంక పెట్టి రాహుల్జీ ఆ రాత్రి అక్కడ ఉండిపోదలచారు. అది చలికాలం. రాహుల్జీకి ఒంటిపైనున్న బట్టలుతప్ప మరేవీలేవు. వడ్రంగికూడ బీదవాడు. అతడు ఒక సంచిపట్ట ఇచ్చాడు. రాహుల్జీ తల బయట పెట్టి, దాంట్లో ఒళ్ళు దూర్చుకొని పడుకున్నారు. తాతగారు వెదకి వేసారి ఇక్కడికి వచ్చారు. రాహుల్జీకి పట్టిన దుర్గతిచూచి ఆయన కోపం మాయమైంది. "టోపీ పోతేపోయింది. భయపడటం ఎందుకు? పద-మీఅమ్మమ్మ నీకోసం పరితపిస్తున్నది" అన్నారు. ఇంటికి వెళ్ళినవెంటనే టోపీని ఎల్లప్పుడూ చొక్కాకు గట్టిగా కుట్టి పెట్టాలని నిశ్చయించారు.

రాహుల్జీకి బడిలో ఏడాది పొడుగునా చదివించే పుస్తకం మూడునెలలలోనే కంఠస్థం అయ్యేది. అందువల్ల తక్కిన కాలమంతా ఊరకనే గడచిపోయేది. కాలం ఎంత దుర్వినియోగం అవుతున్నదో రాహుల్జీకి అప్పట్లో తట్టేది కాదు. ఇదొక నియమం అనుకునేవారు. ఆయనకు కథలు వినడం అంటే చాలా ఇష్టంగా ఉండేది. అమ్మమ్మ, తాత గార్లు ఇద్దరూ కథలు వినిపించేవారు. ఇతరపిల్లలు కథలు వింటూ నిద్రపోతే, రాహుల్జీకి నిద్రపట్టేదికాదు. తాతగారు పాతకాలంనాటి కబుర్లు ఇతరులకు చెబుతూఉంటే, రాహుల్జీ కూడా వినేవారు. ఒకేకథకాని, ఘటనగాని రెండోసారి విన డం ఆయనకు ఏవగింపుగా ఉండేది. కాని తాతగారు చెప్పిందే

పదిసార్లు చెబుతూ ఉండేవారు. కొద్దికాలానికి ఆయనవద్ద కబుర్లు వినేవారే కరువైనారు.

ప్రతిసంవత్సరం డిసెంబరు నెలలో పరీక్షలు పెట్టి, సెలవులు ఇచ్చే సంప్రదాయం ఉండేది. సెలవులలో రాహుల్జీ తన తండ్రిగారి ఊరికి వెళ్లేవారు. తాతగారి ఊరివద్ద తనను పగ్గాలతో కట్టి బంధించినట్లు ఉండేది అందుచేత తండ్రిగారి ఊరివద్ద స్వేచ్ఛగా ఉండదలచుకొనేవారు. ఉదయంనుండి బాగా చీకటిపడేదాకా ఆటలలో గడిపి, అన్నం తినడానికి మాత్రమే ఇంటికివచ్చేవారు. చేపలు వేటాడి వాటిని నిప్పుల్లో కాల్చుకుతినేవారు. ఇంట్లో ఎవ్వరూ మాంసంముట్టరు. అందుచేత తానే ఎక్కడైనా యాటమాంసం తెచ్చి, పశువుల కొట్టంలో వండుకుతినేవారు. ఇలా సెలవులు కొద్దివారాల లోనే సమాప్తమయ్యేవి.

రాహుల్జీ తిరిగి బడిలో ప్రవేశించేసరికి కొత్తమాస్టరు గారు వచ్చారు. పాతమాస్టరుగారి చేతిలో బెత్తం ఉండేది. కాని, పిల్లలను బాదేవారుకాదు. కొత్తమాస్టరు మహాకోపిష్టిగా కనిపించారు. ఆయన దయఅనేది లేకుండా పిల్లలను కొట్టేవారు. రాహుల్జీ తన తరగతిలో అందరికంటె చురుకైన కుర్రవాడుగా ఉండేవారు. అందుచేత ఎన్నడూ ఏ మాస్టరుగారిచేత దెబ్బలు తినలేదు. కాని ఒకరోజు ఉదయం రాహుల్జీ తనపాఠం చదివి వినిపిస్తూఉండగా ఏదో తప్పు దొరలింది. కొత్తమాస్టరు కొట్టినదెబ్బ కాలి చీలమండకు తగిలి నెత్తురుకారింది. తెలివైన పిల్లవానిపట్ల మాస్టరుప్రవర్తన ఈవిధంగా ఉన్నప్పుడు, మందబుద్ధిగల పిల్లలవిషయం

ఇక చెప్పనక్కరలేదు. వారు ఈ మాస్టరు అంటే భయంతో వణకిపోయేవారు.

మాస్టరు మంచంమీద కూర్చుని పాఠాలు అప్ప జెప్పుకొనేవారు. ఆయన నిద్రనుండి లేవగానే కోపం ఎక్కు వయ్యేది. దీనికి పిల్లలు విరుగుడు కనిపెట్టారు. ఇద్దరు పిల్లలు పరుగెత్తుకువెళ్ళి హుక్కా తయారుచేసుకొని వచ్చేవారు. మాస్టరు హుక్కా త్రాగుతూ శాంతించేవారు. ఆయన పిల్ల లను బాదుతూ ఏదో సామెత వాడేవారు. ఆ సామెతలన్నీ పిల్లలకు నవ్వుపుట్టించేవి. కాని నవ్వితేకూడ ఆయనకు కోపం వచ్చేది. నవ్వినవానికి దెబ్బలుపడేవి. మాస్టరు నిద్రపోయే టప్పుడు పిల్లలచేత కాళ్ళు వత్తించుకొనేవారు.

క్రీ. శ. 1902 జూన్-జూలై నెలలో రాహుల్జీ అమ్మమ్మగారి ఊళ్లో కలరా వ్యాపించింది. అందుచేత ఆయ నను తండ్రిగారి ఊరికి పంపించారు. ఏడాదిన్నరక్రితం ఇక్కడకూడ కలరా వ్యాపించింది. కాని రాహుల్జీ కుటుం బంలో ఎవరూ చనిపోలేదు. ఆయనబంధువు మహాదేవ పాండే అని ఒక సంస్కృత పండితుడు ఉండేవారు. కలరా వ్యాపించిన సమయంలో ఆయన ఏవో మంత్రాలు వల్లించే వారు. కలరాపీడితులకు కర్పూరపు నీళ్ళు ఇచ్చేవారు.

మహాదేవపాండేని గూర్చి చాలా గొప్పగా చెప్పు కునేవారు. ఆయనవంటి పండితుడు పది ఇరవై క్రోసుల దూరంలోకూడ ఉండేవాడు కాడట. ఎక్కువ చదివినందు వల్ల ఆయన ఒక సంవత్సరకాలం పిచ్చివాడైపోయారు. మహాదేవపాండే స్వగ్రామం ఇక్కడికి మూడుమైళ్ళ

దూరంలో ఉండేది. సంస్కృతం చెబుతానని రాహుల్జీని ఆయన తన వెంట తీసుకువెళ్లారు. ఆయనకు సంస్కృతవ్యాకరణం కొట్టింపిండి. ఆయన చదివిన గ్రంథాలు చాలవరకు కంఠస్థమే. కావలసినంత పొలం - పుట్ర ఉండేది. అందువల్ల తిండికి కొరత ఉండేదికాదు. తాను నేర్చినవిద్య మరొక విధంగా ఉపయోగపడేదికాదు. అందుచేత కొందరు విద్యార్థులకు ఇంటివద్దనే సంస్కృతం చెప్పేవారు. వారికి ప్రక్క గ్రామాలలో ఉచిత భోజనసౌకర్యం కల్పించారు. సిద్ధాంతకౌముది అగో-పాతికో చదివినతర్వాత విద్యార్థులు కాశీకివెళ్ళి, అక్కడ విద్యాభ్యాసంచేసేవారు. సమీపంలోనే కాశీ ఉండటం మహాదేవపాండే పాఠశాలకు ఆటంకంగా పరిణమించింది.

వారంరోజులకు ఆయన రాహుల్జీకికూడ సంస్కృతం నేర్పడం మొదలుపెట్టారు. రాహుల్జీకి అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉండేది. సంస్కృతం చదువుకొనే నిమిత్తం తనను ఇక్కడే వదలిపెడితే బాగుండుననిపించేది. ఇక్కడ తాను ఆడుకోవడానికికూడ స్వేచ్ఛఉండేది. కాని ఒకనెల గడిచిందో లేదో అప్పుడే తాతగారివద్దనుండి, ఊరికిరమ్మని కబురు వచ్చింది. తండ్రిగారి గ్రామంమీదుగా అక్కడికి వెళ్ళక తప్పిందికాదు.

## క్రొత్త స్నేహితులు

రాహుల్జీకి ఈ పర్యాయం క్రొత్తస్నేహితులు తోడైనారు. అందులో గ్రామపట్వారీ కుమారుడొకడు. వీరు పాఠశాలలోఉన్న అదే మాస్టరువద్ద చదువుకోవడానికి వెళ్ళ

వలసివచ్చింది. ఆయనబెత్తం చూడగానే వీరికి వణకు పుట్టేది. వీరు ఒకరోజు ఆటలలోమునిగి బడికి వెళ్ళడం ఆలస్యమైంది. దెబ్బలు తప్పించుకోవడానికి ఆరోజు బడి మానుకొన్నారు. కాని మరునాడు వెళ్ళితే ఇంకా ఎక్కువ దెబ్బలు పడతాయని వారంరోజులు మానివేశారు. బడికి వెళతామని ఇంటివద్దనుండి బయలుదేరి, సాయంత్రం నిశ్చితసమయానికి తిరిగి వచ్చేవారు. రాహుల్జీతాతగారు కొద్దిరోజులుగా ఇంటివద్దలేరు. వచ్చినతర్వాత మాస్టరును కలుసుకొన్నారు. వారంరోజులనుండి రాహుల్జీ బడికి రావడంలేదని తెలిసింది. తాతగారు వెదురుబెత్తం పుచ్చుకొనివచ్చారు. రాహుల్జీకి కంపం పుట్టింది. అమ్మమ్మ ఒళ్లో దాక్కున్నారు. తాతగారు గట్టిగా కేకపెట్టారు. బెత్తంతో నాలుగైదు దెబ్బలు గోడమీదకొట్టారు. మరునాడు రాహుల్జీని బడికి పట్టుకువెళ్ళి వదిలారు. ఆయన వెళ్ళిపోయినతర్వాత మాస్టరు రాహుల్జీని చితకబాదారు.

లోయర్ ప్రయిమరీగా ఉన్న ఈ స్కూలులో పిల్లలసంఖ్య పెరిగింది. అప్పర్ ప్రయిమరీస్కూలుఅయింది. మరొకరు హెడ్మాస్టరుగా వచ్చారు.

రాహుల్జీ తాతగారు రాత్రిపూట ఆయనకు ఏవేవో కథలు వినిపిస్తూ ఉండేవారు. భారతదేశంలోని అనేక పట్టణాలపేర్లు ఆ కథలలో వినిపించేవి. ఆయన తాతగారు అజంతా, ఎల్లోరా, ఔరంగాబాద్ గుహలను వేరుపేర్లతో వర్ణించేవారు. ఎల్లోరా, అజంతాగుహలనుగూర్చి ఆయన ఇలా చెప్పేవాడు: శ్రీరాముడు వనవాసం వెళ్ళుతాడని గ్రహించి

విశ్వకర్మ కొండలు తొలిచి ఈ భవనాలు నిర్మించాడు. ఇందులో దేవతలు నివసిస్తారని, శ్రీరామునికి వనవాసంలో ఇబ్బంది ఉండదని అతడు అనుకొన్నాడు. అయితే భవనాలు నిర్మించి, ఈ విషయం బ్రహ్మదేవునికి చెబుదామని వెళ్లేసరికి, రాక్షసులువచ్చి ఆ భవనాలలో మకాంపెట్టారు. విశ్వకర్మ తిరిగివచ్చి చూశాడు. అతనికి చాలా కోపంవచ్చింది. మీరంతా శిలలు అయిపోదురుగాక అని శాపంఇచ్చాడు.

అజంతా- ఎల్లోరాలోని విగ్రహాలు రాళ్లుగామారిన రాక్షసులనే రాహుల్జీ తాత, ఆయన తరంలోని వారి అభిప్రాయం. "ఏ రాక్షసుడు ఎలా ఉన్నాడో, అలాగే అక్కడ రాయి అయిపోయాడు. మద్యంసేవించేవాని సీసా అలాగే చేతిలోను,నోట్లోనుఅతుక్కునిఉంది. నృత్యంచేసేవారుఅలాగే నృత్యం చేస్తున్నారు. నిద్రపోయేవారు అలాగే నిద్రపోతున్నారు. కూర్చున్నవారు అలాగే కూర్చున్నారు. ఇప్పుడేలేచి మాట్లాడతారా ఏమి అనిపిస్తుంది" అని రాహుల్జీతాతగారు చెప్పేవారు.

## తొలియాత్ర

తొమ్మిదేళ్ళప్రాయంలో రాహుల్జీకి పదుగు తల పెట్టారు. కాని అది ఇంటివద్ద కాకుండా వింధ్యాచలంలో చేయదలచారు. రాహుల్జీ దీర్ఘాయుష్మంతుడు కావాలని పెద్దల ఉద్దేశం. రాహుల్జీపినతండ్రి వచ్చి, స్వగ్రామానికి పిలుచుకు వెళ్ళారు. అక్కడికి 14 మైళ్ళదూరంలో రైల్వే స్టేషన్ ఉండేది. రాహుల్జీ ఇప్పటివరకు రైలుబండిని చూచి

ఉండలేదు. ఆయనకుటుంబంవారు సాయంకాలం రైల్వే స్టేషన్ చేరుకున్నారు. రైలుబండి రాత్రిపూట వచ్చింది. అందరూ దానిలో ఎక్కి కాశీకివచ్చారు. తమ బంధువుల ఇంట్లో మకాంపెట్టారు. రాహుల్జీ ఇంత పెద్దపట్టణం చూడటం ఇదే ప్రథమం. తన పినతండ్రి తనను గంగానదిలో ముంచుకువచ్చారు. వచ్చేటప్పుడు దారిలో తనకోసం కొన్ని పుస్తకాలు ఖరీదు చేశారు. కాని రాహుల్జీకి తృప్తికలుగలేదు. మరునాడు ఆయన తనపినతండ్రి కనుతప్పించి బయలుదేరారు. దారి మలుపులు తిరుగుతూ, క్రితంరోజు పుస్తకాలు ఖరీదుచేసిన చోటికి వచ్చారు. అర్థణా చొప్పున అయిదారు పుస్తకాలుకొని, తిరిగి ఇంటికి బయలుదేరారు. ఈలోగా ఆయనపినతండ్రి కంగారుపడుతూ వెదుకుతూ వచ్చారు. ఆయన రాహుల్జీని కొట్టలేదు. కాని భయపెట్టారు. పోగొట్టుకున్న కుర్రవాడు దొరికినట్లయింది. తనపినతండ్రికి అదే సంతోషం. రాహుల్జీ సాహసోపేతమైన యాత్రలకు నాంది జరిగింది ఇక్కడే.

తర్వాత రాహుల్జీనితీసుకుని రైలులో వింధ్యాచలం వెళ్ళారు. అక్కడ దేవతామందిరంలో వడుగుచేయించారు. తిరిగి కాశీకివచ్చి, తమ బంధువులఇంట్లో దిగారు. పిమ్మట కాశీనుండి పగటిపూట రైలుబండిలో స్వగ్రామంవచ్చారు. అక్కడినుండి రాహుల్జీ తిరిగి తన తాతగారి ఊరు చేరుకొన్నారు. బడిలో పోస్టుమాస్టరు కుమారుని అడిగి, కాశీకి ఉత్తరం ఎలా వ్రాయాలో తెలుసుకొన్నారు. అక్కడ చూచిన ఒక మిత్రునికి పోస్టుకార్డు వ్రాశారు. ఆరోజులలో

పోస్టుకార్డు వెల కానీమాత్రమే. కాని ఆఉత్తరానికి జవాబు రాలేదు. బహుశా అది చేరి ఉండదు.

రాహుల్జీ తాతగారు ఆయనను తన వారసుడుగా చేసుకొన్నారు. ఇది పెదతాతగారికుమారులకు గిట్టలేదు. అందుచేత రెండు కుటుంబాలకు మధ్య మనస్పర్ధలు తలెత్తాయి. ఒకరి ఇంటికి ఒకరు వెళ్ళడం, ఒకరితో నొకరు మాట్లాడటం మానుకొన్నారు. ఇది రాహుల్జీకి చాలా బాధ కలిగించింది.

## యాత్రనుప్రోత్సహించిన గాధ

క్రీ. శ. 1903 లో రాహుల్జీ రెండోతరగతి ప్యాసై మూడోతరగతికి వచ్చారు. ఆసంవత్సరపు పాఠ్యగ్రంథంలోని ఒక కథలో ఇలా ఉండేది: "సైర్ కర్ దునియాంకి గాఫిల్ జిందగానీ ఫిర్ కహాం, జిందగీ గర్ కుఛ్ రహీతో నౌజవానీ ఫిర్ కహాం?" "ఓ మూర్ఖుడా, మళ్ళీ జీవితం దుర్లభంకాబట్టి ప్రపంచపర్యటనచేయి. ఒకవేళ జీవితం కొంత మిగిలినా, మళ్ళీ యవ్వనం దుర్లభం" అని దాని తాత్పర్యం. ఇది రాహుల్జీ మనస్సుపైన, భవిష్యత్ జీవితంపైన చాలా గాఢమైన ముద్ర పడవేసింది.

రైలుకూ, ప్లేగుకూ దగ్గర సంబంధంఉందని గ్రామీణులు సర్వసాధారణంగా చెప్పుకునేవారు. క్రీ. శ. 1904లో రాహుల్జీ చదువుకొనేగ్రామంలో ఎలుకలు చావడం మొదలైంది. ఇళ్ళు ఖాళీచేయాలని ప్రభుత్వసలహా వచ్చింది. అందువల్ల బడి ఇంకొకగ్రామంలోకి మార్చారు. కాని

అక్కడ బట్టబయలులో పిల్లలకు చదువు మొదలుపెట్టారు. రాహుల్జీ తాతగారి ఊళ్ళోకూడ ప్లేగు వ్యాపించింది. అందు చేత రాహుల్జీ ఇక్కడే స్వయంపాకం చేసుకొంటూ బడికి వెళ్ళవలసివచ్చింది. ఇంతలో తన బంధువు, వయస్సులో తనకంటె చిన్నవాడైన యోగేశ్ వివాహానికి వెళ్ళవలసిన అవసరం ఏర్పడింది. అక్కడినుండి తిరిగివచ్చేసరికి మాష్టరు ప్లేగువ్యాధికి బలిఅయిపోయారు. హెడ్మాస్టరుకూడ బదిలీ అయిపోయారు. కొత్తమాష్టర్లు ఇద్దరు తాత్కాలికంగా వచ్చారు. వీరిద్దరూ నవయువకులు, చాలా సజ్జనులు. వీరంటే బడిపిల్లలకు ఎంతో ఇష్టం. వీరే ఎల్లకాలం ఉండాలని కోరుకునేవారు.

## బాల్య వివాహం

ఎండాకాలం వచ్చింది. బడిపిల్లలకు సెలవుఇచ్చారు. రాహుల్జీ తనతండ్రిగారి ఊరికి వెళ్ళారు. అక్కడికి మూడు మైళ్ళదూరంలో బడి ఉండేది. రాహుల్జీ మరికొందరు పిల్లలతో కలిసి, ఆబడికి వెళ్లేవారు. కాని ఇలా కొద్దిరోజులే సాగింది. తాను తిరిగి తాతగారిఊరికి రావలసివచ్చింది. రాహుల్జీకి అప్పుడే పెళ్ళిచేయాలనే ఆలోచనలు చేస్తున్నారు. ఆయనతండ్రి అభిప్రాయం తద్వ్యతిరేకంగా ఉంటుందేమోనని తాతగారి భయం. అందుచేత మొదలకుండా రాహుల్జీని తిరిగి తండ్రిగారి ఊరికి పంపించారు. పెళ్ళిపెద్దలు అక్కడికికూడా వెళ్ళారు. కొద్దిసేపు సంభాషణలు జరిపిరాహుల్జీకి పెళ్లినిశ్చయించారు.ఆ ఎండాకాలంలోనే పెళ్ళి

అయిపోయింది. అప్పటికి రాహుల్జీ వయస్సు పదకొండేళ్ళు మాత్రమే. ఆయనకు ఇది ఒక తమాషాగా కనపడింది. సమాజానికి తాను ఎదురు తిరగడానికి దోహదం చేకూర్చింది కూడ ఈ ఘటనే.

రాహుల్జీకి పదిహేనేళ్ళు వచ్చేటప్పటికి కొంచెం ఊహ తెలిసింది. అప్పటినుండీ ఈ పెళ్ళిని అనుమాన దృష్టితో చూడసాగారు. తర్వాత రెండో సంవత్సరంనుండి ఇంటికి రావడం తగ్గించారు. మరో నాలుగేళ్ళకు అసలు రావడమే మానివేశారు. మరో నాలుగేళ్ళతర్వాత తన జిల్లాలో అడుగుపెట్టలేదు. ఇలా పాతికేళ్ళ కాలంగడిచింది. పసితనంలో తనకు జరిగినపెళ్ళికి రాహుల్జీ బాధ్యతవహించ లేదు.

రాహుల్జీ చదివే బడిలో ఉపాధ్యాయులు మారిపోయారు. కొత్తవారువచ్చారు. నాలుగో తరగతిలో పిల్లలసంఖ్య పదమూడు పద్నాలుగుకు మించిలేదు. అందులో ఉర్దూ విద్యార్థి రాహుల్జీ ఒక్కడే. కాని హిందీపాఠాలు చెబుతూ ఉంటే, విని వాటినిగూడ చక్కగా అర్థం చేసుకొనేవారు.

వార్షిక పరీక్షలు బడికి సమీపంలో ఒకతోటలో జరిగేవి. చుట్టుప్రక్కలఉన్న ఇతరపాఠశాలలనుండికూడ విద్యార్థులు పరీక్షకు వచ్చేవారు. అయితే రాహుల్జీ నాలుగో తరగతి పరీక్షకు కూర్చున్న సంవత్సరం ఇలా జరగలేదు. స్కూళ్ళఇన్‌స్పెక్టర్లలో క్రింది హోదాగలవారు అంతకు ముందురోజు సాయంకాలమే బడికివచ్చారు. పై అధికారి వస్తాడని పదిగంటలదాకా ఎదురుచూశారు. రైలుబండివెళ్ళి

పోయింది కాని ఆయన రాలేదు. అందుచేత వారే పరీక్షలు జరిపించారు. నాలుగోతరగతిలో ఇద్దరు తప్ప తక్కిన వారందరూ ఉత్తీర్ణులైనారు. స్కూళ్ళ పైఅధికారి రైలు బండిలో ఒళ్ళుమరచి నిద్రపోయారు. రెండుస్టేషన్లు దాటిన తర్వాతనే ఆయనకు మెలకువ వచ్చింది. రెండోబండిలో బడికివచ్చారు. పిల్లలకు మళ్ళీ పరీక్ష పెడతారని ఎవరూ అనుకోలేదు. కాని ఆయన వచ్చీరావడంతోటే మొదటి పరీక్షాఫలితాలను రద్దుచేశారు. మళ్ళీ పరీక్ష పెట్టారు. తరగతి అంతటిలోకి ఇద్దరు ఉత్తీర్ణులైనారు. అందులో రాహుల్జీ ఒకరు.

మంచిమార్కులతో రాహుల్జీ పరీక్షలో ఉత్తీర్ణులైనారని తెలిసి, ఆయన తాతగారు చాలా సంతోషించారు. జిల్లా అంతటా అప్పర్ ప్రయిమరీ ప్యాసైన పిల్లలకు స్కాలర్ షిప్ కోసం మరో పరీక్ష పెడతారని తెలిసింది. దానికి తయారు కావలసివచ్చినందువల్ల రాహుల్జీ తన తండ్రిగారి ఊరికి వెళ్ళలేదు. ఆయనతల్లి ఆరేడు నెలలనుండి అక్కడ జబ్బుతో బాధపడుతున్నది. ప్రసూతిజ్వరం పాండురోగంగా పరిణమించింది. రాహుల్జీ తండ్రిగారు అప్పటికప్పుడు స్వంత వైద్యం మొదలుపెట్టారు. ఏదోమందు తయారుచేసిఇచ్చారు.

ప్లేగుకారణంగా ఆ సంవత్సరం జనవరి నెలలో రాహుల్జీ చదివేబడిని ఇంకొక గ్రామానికి మార్చారు. రాహుల్జీ అక్కడ చదువుకొని, ఇంటికి తిరిగివచ్చేవారు. రాహుల్జీతల్లి చిన్ననాటి స్నేహితురాలుఒకామెకొన్ని కారణాలవల్లపుట్టింటనేఉండేది. రాహుల్జీ ఒకరోజు బడినుండి ఇంటికి వస్తుండగా, ఆమెచూచి కళ్ళనీళ్ళుపెట్టుకొన్నది. "అక్కాయి ముఖం చూచేఅదృష్టం

అబ్బాయికి లేదు" అని ఆమె నోటినుండి అప్రయత్నంగా మాటలు వెలువడ్డాయి. అంతకు క్రితంరోజే రాహుల్జీ తండ్రి గారి ఊరినుండి అత్యవసరంగా కబురువస్తే, తాతగారు అక్కడికి వెళ్ళారు. తనతల్లి స్నేహితురాలిమాటలువిని రాహుల్జీకి తనతల్లి చనిపోయినట్లు అనుమానం కలిగింది. ఇంట్లోకివెళ్ళి చూస్తే, అమ్మమ్మ, తాతగారు ఇద్దరూ విలపిస్తున్నారు. కాని రాహుల్జీకి ఏడ్పురాలేదు; కంటతడిపెట్టలేదు. విచారసాగరంలో మునిగిపోయారు. చనిపోయినవారు చితిపైనుండి లేచి వచ్చినట్లు రాహుల్జీ విని ఉన్నారు. కాని తన తల్లిని దహనం చేసి ఉంటే ఎలాగ? అనేప్రశ్న ఉదయించింది. రాహుల్జీది పట్టి అమాయక హృదయం. శ్రాద్ధంరోజున తన తండ్రిగారి ఊరికివెళ్ళారు. తన తల్లి తిరిగి వస్తుందనే ఆశ సన్నగిలింది. ఏడాదిలో పదకొండున్నర నెలలు ఆయనకు తన అమ్మమ్మే అమ్మ. ఆమెను తాను అమ్మా అనే పిలుస్తూ ఉండేవారు.

రాహుల్జీ ఆబడిలో చదువు పూర్తిచేశారు. తన తాతగారి గ్రామానికి మూడు నాలుగు మైళ్ళదూరాన నిజామాబాద్‌లో మిడిల్‌స్కూలు ఉండేది. తనను అక్కడికి పంపించాలని తాతగారు నిశ్చయించారు. స్కాలర్‌షిప్‌కోసం పరీక్షలో పాల్గొనవలసి ఉన్నప్పటికీ, తాతగారు మిడిల్ స్కూలులో చేర్పించివచ్చారు. సుప్రసిద్ధకవి పండిత అయోధ్యా సింహ "హరిఔధ్" ఆ బస్తీలోనే జన్మించారు. ఆయన లోగడ మిడిల్‌స్కూలు హెడ్మాస్టరుగా పనిచేశారు. ఉపాధ్యాయకవి అని అప్పటివరకు రాహుల్జీకి బొత్తిగా తెలియదు. కవిత్వం చేయడం చాలా ప్రమాదకరమైన విషయ

మని, ఛందస్సులో ఒకమాత్ర తప్పినా చచ్చిపోతారని కొందరిద్వారా తెలుసుకొన్నారు. కవిత్వంపట్ల తనకు అంతఃప్రేరణ లేకపోయినా, రాహుల్జీ కొంత ప్రయత్నంచేసి మానుకొన్నారు.

రాహుల్జీ తన తరగతిలో ప్రథముడుగా ఉండేవారు. గణితమంటే ఆయనకు కొట్టినపిండి. చరిత్రలో సంవత్సరాలు, తేదీలు మినహా, పాఠం ముగిసినవెంటనే అదంతా అప్పజెప్పేవారు. భూగోళం చెప్పేమాస్టరు ఎన్నోసార్లు పాఠం చెప్పేపని రాహుల్జీకే అప్పగించారు. గులాంగౌస్ అనే అరవై ఏళ్ళవృద్ధుడు హెడ్మాస్టరుగా ఉండేవారు. ఆయన జుట్టూ, గడ్డమూ పూర్తిగా నెరిసిపోయింది. 56 ఏళ్ళకు పైబడిన మాస్టర్లనందరినీ తొలిగిస్తారని పుకారు వ్యాపించింది. అప్పటినుండి గులాంగౌస్ తెల్లని వెంట్రుకలకు రంగు వేసుకొని వచ్చేవారు. ఆయనకు నెలజీతం ఇరవై రూపాయలు. అందులో పదిహేనురూపాయలు తనకొడుకు చదువుకోసం పంపించేవారు. తక్కిన అయిదురూపాయలతో పెద్ద కుటుంబాన్ని పోషించవలసివచ్చేది.

పరీక్షలు దగ్గరపడేకొద్దీ మాస్టర్లు విద్యార్థులను దగ్గర కూర్చోబెట్టుకొని రాత్రింబగళ్ళు గట్టిగా చదివించేవారు. రాత్రిపూట లాంతరువద్ద నిద్రపోతే, ముక్కుపట్టి లాగమని మాస్టర్లు ఆదేశించారు. కాని రాహుల్జీ రాత్రిపూట చదివేవారు కారు. ఏదో వంకపెట్టుకొని వెళ్ళి, నిద్రపోయేవారు. ఒకనాడు లెక్కలమాస్టరు మూడునెలలక్రితం చెప్పినలెక్క అడిగారు. తప్పుచెబితే, అందరినీ వదలిపెట్టి రాహుల్జీని

బాదారు. "బలే తెలివైనవాడివిరా" అని వెక్కిరించారు. చదువువిషయంలో ఇక్కడ దెబ్బలుతినడం ఇదే మొదలు.

రాహుల్జీ దేశాల పటాలు (Maps) గీయడంలో మాస్టరు మెప్పుపొందారు. అక్షరాలపొంకం, రంగులువేసిన తీరుచూచి మాస్టరు మురిసిపోయేవారు. సంస్థానాలు వగైరాల ఎల్లలుగీయడం తప్పులతడకగా ఉండేది. అయినా అక్షరాలు పొంకంగా వ్రాయడం, రకరకాల రంగులువేయడంద్వారా రాహుల్జీ తనమాస్టరును దగాచేసేవారు. పటాలుగీసేటప్పుడు, వివిధపట్టణాలపేర్లను వ్రాసేటప్పుడు తన తాతగారుచెప్పిన కబుర్లు గుర్తుకు వచ్చేవి. తాతగారుచెప్పిన స్థలాలు దేశ పటంలో గుర్తించి సంబరపడేవారు.

మిడిల్ స్కూలులో ఆరో తరగతే ఆఖరు తరగతిగా ఉండేది. పరీక్షలు దగ్గరపడినప్పుడు లెక్కలమాస్టరు ఆరో తరగతి విద్యార్థులను, అయిదోతరగతి విద్యార్థులను కలిపి లెక్కలు అడిగేవారు. నరసింహరాయి అనే విద్యార్థి ఆరో తరగతిలో అందరికంటె చురుకైనవాడు. అతనికి మిడిల్ పరీక్షలో ప్రభుత్వస్కాలర్ షిప్పుకూడ ఇచ్చారు. రాహుల్జీ అయిదోతరగతి విద్యార్థి. కాని అందరినికలిపి లెక్కలు అడిగేటప్పుడు ఎన్నోసార్లు నరసింహరాయ్ తో సమానంగా మార్కులు తెచ్చుకునేవారు.

క్రీ.శ 1907 మార్చిలో వార్షికపరీక్ష పూర్తయింది. సెలవులలో రాహుల్జీ తనతాతగారి ఊరికివెళ్ళారు. అక్కడ ప్లేగువ్యాపించింది. అందువల్ల అమ్మమ్మ మనుమడే రాహుల్జీని ఆయన తండ్రిగారి ఊరికి పంపించింది. ఇప్పుడు సొం

స్కాలర్‌షిప్ కారణంగా తనస్థాయి కొంచెం పెరిగింది. ఆ గ్రామం తనకు పట్టిమోటుగా కనిపించింది. ఆ గ్రామం నిర్మించినప్పటినుండి ఇప్పటివరకు తనకంటె ఎక్కువ చదువుకొన్నవారెవరూ పుట్టలేదు. తన తమ్ములు ముగ్గురు - శ్యామలాల్, రామధారి, శ్రీనాథ్ చదువుకొంటున్నారు. ఆ గ్రామంలోని పెద్దలలో ఒకరిద్దరు మాత్రమే బడిలో శిక్షణ పొందారు. అక్కడి వినోదాలన్నీ రాహుల్జీకి కొద్దిరోజులలోనే అరుచి పుట్టించాయి. అందుచేత సమీపంలోని తన బంధువుల గ్రామానికివెళ్లారు. అక్కడ తన మిత్రులతో కొంతకాలం గడిపారు. అక్కడఉండగానే తనఅమ్మమ్మ ప్లేగువ్యాధికి బలి అయిపోయినట్లు కబురుఅందింది.

## పరారీ

మిడిల్ స్కూలు పరీక్షాఫలితాలు తెలిసినతర్వాత రాహుల్జీ నిజామాబాదుకు వెళ్ళారు. కాని అక్కడ చాలా రోజులు ఉండలేదు. తనతాతగారుచెప్పిన కబుర్లు, తనపాఠ్య పుస్తకంలో ప్రపంచపర్యటనను ప్రోత్సహించే మాటలు గుర్తుకురావడం మొదలుపెట్టాయి. తాను స్వయంపాకం చేసుకోవడానికి తెచ్చుకొన్న రొట్టెలపిండి, బియ్యమూ బజార్లో అమ్మివేశారు. మొత్తం రెండున్నర రూపాయలు వచ్చింది. వెంటనే ఫరిహా రైల్వేస్టేషన్‌కు వెళ్ళారు. కాశీకి టిక్కెట్టుతీసుకొని, రైలుబండిలో కూర్చున్నారు. కాశీలో తన బంధువులఇంటికి ఒంటరిగావెళ్ళితే అనుమానిస్తారని భయం. అందుచేత ఆఇంటికి సమీపంలోని ఒక మందిరానికి వెళ్ళారు. సంస్కృతం చదువుకోవడానికి వచ్చానని చెప్పారు.

అక్కడ స్వయంపాకం చేసుకొన్నారు. ప్రపంచపర్యటనకు ఇబ్బందిఏర్పడింది. చేతిలోఉన్న డబ్బులు అయిపోతున్నాయి. కాళ్ళుచేతులు కట్టివేస్తున్నట్లు అనిపించింది. ఇంటికి వెను దిరిగారు. టికెట్టుకొని రైలులోకూర్చున్నారు కాని ఒళ్లు మరచి నిద్రించారు. దిగవలసినస్టేషన్‌కంటె ఒక స్టేషన్ దాటి వెళ్ళారు. తనదగ్గర డబ్బులుకూడ లేవు. అయితే స్టేషన్ మాస్టరు ఇబ్బందిపెట్టలేదు. ఆరాత్రి స్టేషన్‌లోనే గడిపి, మరునాడు తన తండ్రిగారి గ్రామం బయలుదేరారు.

ప్రపంచపర్యటనకై జరిపిన తొలిప్రయత్నం విఫల మైంది. కాని తరువాత ఘటనలు మళ్ళీ తనను అందుకు ప్రోత్సహించాయి. అమ్మమ్మ చనిపోయినతర్వాత తాత గారు ఏకాకిగా ఉంటున్నారు. రాహుల్జీ తనసోదరి రామ ప్యారీతోకలిసి ఆగ్రామం వెళ్ళారు. వారే ఇంటిపనులన్నీ చూచుకోవలసివచ్చింది. ఒకరోజు రాహుల్జీచేసిన పొరబాటు వల్ల రెండుసేర్ల నెయ్యి నేల ఒలికిపోయింది. తాతగారు కోప పడతారని భయంవేసింది. ఎదురు అమ్మగానచ్చిన ఇరవై రూపాయలు తీసుకొని, రైలుస్టేషన్ వైపు వెళ్ళారు. దారిలో కొంతఆలస్యం జరిగింది. రైలుకు లైన్ క్లియర్ ఇవ్వబడింది. ఇంతలోనే దూరంగా తన తాతగారు వస్తున్నట్లు కనిపిం చారు. రాహుల్జీ ఆస్టేషన్‌నుంచి కాలినడకను ఆజంగఢ్ స్టేషన్‌కువెళ్ళారు. తన తాతగారు ఆయనను వెంబడించలేక పోయారు. తన మనుమడు ఎటువెళ్ళిందీ ఆయనకు అంతు పట్టలేదు.

రాహుల్జీ ఆజంగఢ్‌నుండి కాశీకి టిక్కెట్టు తీసుకొన్నారు. అక్కడినుండి ముగల్‌సరాయ్, వింధ్యాచలం వెళ్ళారు. దారిలో పదిహేడు - పద్దెనిమిది రూపాయలు ఖర్చయినాయి. మనస్సులో ఆందోళన బయలుదేరింది. కాని ఇంటికి తిరిగివెళ్ళడం అసంభవం. సరే, కలకత్తా వెళ్లుదామని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. ఏదోవిధంగా రైలుఎక్కారు. రైలు హావడాస్టేషన్ చేరింది. రాహుల్జీ అక్కడ దిగారు. కలకత్తా కాశీలాంటి పట్టణమని విని ఉన్నారు. కాని ఇంత పెద్దపట్టణాన్ని తాను ఎప్పుడూ చూడలేదు. ఎక్కడికెళ్ళాలో ఏమిచేయాలో దిక్కుతోచడంలేదు. హావడాస్టేషన్‌లోచేరిన జనాన్నిచూచి విస్తుపోయారు. ఒక స్తంభంవద్దకువచ్చి, దానిని ఆనుకొని నిలబడ్డారు. ఇంతలో దాదాపు సమవయస్కుడైన ఒక కుర్రవాడు అక్కడికి వచ్చాడు. అతడుకూడ తనవలె చదువుకొంటూ, ఇక్కడికి పారిపోయివచ్చినట్లు తెలిసింది. నెలకు అర్ధరూపాయిఇచ్చేట్లు ఇక్కడ తాను ఒకకుటీరాన్ని అద్దెకు తీసుకొన్నానని అతడు చెప్పాడు. రాహుల్జీకి కొంచెంధైర్యం వచ్చింది. ఇద్దరూ హావడావంతెనదాటి ఒకసందులోకి వెళ్లారు. తనస్నేహితుడు వంటచేశాడు. ఇద్దరూకలిసి భోజనంచేశారు.

## ఉద్యోగాన్వేషణ

తమదగ్గరఉన్న డబ్బులు అయిపోతున్నాయి.ఏదైనా పనివెదుక్కునే ఆలోచనలో పడ్డారు. పద్నాలుగు - పదిహేనేళ్ళకుర్రవాళ్ళకు పనిదొరకడం అంత తేలికైన పనికాదు.

వీరు జగన్నాథ్‌ఘాట్‌పైన కూర్చునిఉండగా ఒకసాధువు అక్కడికివచ్చాడు. ఆయన బ్రిటిష్‌ప్రభుత్వానికి, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా మాట్లాడారు. అక్కడచేరినజనం ఆయన మాటలనువిన్నారు. బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఆందోళన సాగుతున్నరోజులుఅవి. ఈ ఇద్దరు కుర్రవాళ్ళకు ఆ విషయం ఎలా తెలుస్తుంది? సాధువుమాటలు విన్నవారిలో ఒకరు, ఇతడు గూఢచారితప్ప వేరుకాదు అన్నారు. గూఢచారో, పిచ్చివాడో అయివుండాలి కాని వేరొకరుకాదనేది నిజం. నిరుద్యోగులైన ఈ ఇద్దరు కుర్రవాళ్ళకు మరో ఇద్దరు తోడైనారు. అందులో ఒకరికి ముప్పయిఏళ్ళు ఉంటాయి. మరొకడు సమవయస్కుడే. వీరంతా ఒకేచోట మకాం పెట్టారు. సమిష్టివంట ఏర్పాటుచేశారు. ఎవరివద్దడబ్బు ఉంటే, వాడు అందరికోసమూ ఖర్చుపెట్టేవాడు. ఉద్యోగం ఎవరికిదొరికినా, సంపాదనమాత్రం అందరికీ వినియోగించాలని నిశ్చయించారు. రెండు జంటలుగా ఉద్యోగంకోసం తిరిగారు. ఒకసారి రాహుల్జీ ఒంటరిగానే ఉద్యోగాన్వేషణ చేశారు. బర్న్‌కంపెనీలో కూలిపని దొరికింది. నాలుగైదు రోజులు రాహుల్జీ కూలిపని చేశారు. ఒకమేస్త్రీ తనఇంట తలదాచుకోడానికి అనుమతించాడు. కాని తన మిత్రులతో సంబంధం తప్పిపోయినందుకు రాహుల్జీ విచారించారు. తన పుస్తకాలు, వంటసామాను అక్కడే వదలిపెట్టి వెళ్ళారు. మళ్ళీ ఉద్యోగంకోసం తిరగవలసివచ్చింది. గోడలపై అతికించిన ప్రకటనలు చదువుతూ రాహుల్జీ వంగభాషవర్ణమాల నేర్చుకొన్నారు.

ఒకరోజున తాను ఒంటరిగా వెళ్ళుతూఉంటే పోస్టు జవాను కనిపించాడు. ఎక్కడైనా పనిచూపిస్తారా అని రాహుల్జీ అతనిని అడిగాడు. సాయంత్రం కూలీబజారుకు రమ్మని చెప్పి, అతడు వెళ్ళిపోయాడు. రాహుల్జీ తిరిగి తన మకాముకువచ్చారు. తనమిత్రులలో ఒకరిని వెంటబెట్టుకొని కూలీబజారుకు వెళ్ళారు. పోస్టుజవానుకోసం గాలిస్తూ ఉండగానే కుండపోతగా వర్షం మొదలుపెట్టింది. తమబట్టలన్నీ తడిసిపోయాయి. రాత్రి చాలా పొద్దుపోయింది. తిరిగి తమ మకాముకువెళ్ళడంకష్టం. అందుచేత పొరుగునఉన్న ఇళ్ళలో తల దాచుకొన్నారు. వారుకూడ కూలీలే. "పరదేశంలో కష్టాలు ఎందుకుపడతారు? మీవయస్సు పిల్లలకు పనిదొరకదు. ఇంటికివెళ్ళిపోండి. ఇంటికి జాబువ్రాస్తే డబ్బు పంపిస్తారుగదా" అని వారు అన్నారు. "తప్పకుండా" అని వీరిద్దరూ బదులుచెప్పారు. "అలాఅయితే ఇక్కడేఉండండి. తిండి ఎలాగాఅని దిగులుపడవద్దు. జాబువ్రాయండి. డబ్బువచ్చినతర్వాత ఇంటికి వెళ్ళిపోండి" అని వారుచెప్పారు. దానిమీదట వీరిద్దరూ అక్కడే ఉండిపోయారు. తోడిమిత్రుని ఇంటికి జాబువ్రాయడానికి రాహుల్జీకూడ సమ్మతించారు. తనరహస్యంమాత్రం బయటపెట్టలేదు. తిరుగుజాబువచ్చేరోజులు సమీపించాయి. ఇక్కడినుండి వేరొకచోటికి వెళ్ళిపోదామని రాహుల్జీ సలహాఇచ్చారు. కాని తోడిమిత్రుడు అంగీకరించలేదు. అందుచేత తాను ఒంటరిగా వెళ్ళిపోయారు.

రాహుల్జీ తిరిగివస్తుండగా రోడ్డుపై ఒకవృద్ధుడు కనిపించాడు. తనఇంటికి రమ్మనికోరాడు. కాని రాహుల్జీ తనతోడి మిత్రులు ఎక్కడఉన్నారో తెలుసుకోవాలని కుతూహలపడ్డారు. సాయంత్రందాకా ఎంతవెదకినా ఎవరూ కనిపించలేదు. అందుచేత వృద్ధునిఇంటికి వెళ్ళారు. రోజూ అతనిగది ఊడ్చడం, ఒకబిందెడు కొళాయినీళ్లు తెచ్చిపెట్టడం, రాహుల్జీపని. వృద్ధుడు ఇంటివద్దఉన్నప్పుడు హుక్కాతయారు చేసి ఇచ్చేవారు. అతనిఅలవాట్లు ఎలావున్నా రాహుల్జీని పుత్రసమానుడుగా చూశాడు. రాహుల్జీకి చదువంటే చాలా ఇష్టమని తెలుసుకొన్నాడు. ఇంగ్లీషు నేర్పడం మొదలుపెట్టాడు. అతడు లోగడ కంట్రాక్టరుగాను, దళారిగాను పని చేసి బాగా డబ్బుగడించాడు. సౌఖ్యం అనుభవించాడు. కాని కొన్నికారణాంతరాలవల్ల అదంతా అయిపోయింది. ఇప్పుడు తనకు తెలిసిన పాతమార్వాడీలు, ఇంగ్లీషుకంపెనీలు ఏదైనా కొద్దిపనిఇస్తే చేస్తున్నాడు. నెలకు ముప్పయి నలభై రూపాయలు గిట్టుబాటు అవుతున్నది. అతనివయస్సు 55ఏళ్లు. మంచిదశకోసం అతడు ఎదురుచూస్తున్నాడు. రాహుల్జీకి ఇంగ్లీషుభాషమీద అభిరుచి ఎక్కువైంది. వృద్ధుడు ఈ విషయం గమనించి, విశుద్ధానందసరస్వతి విద్యాలయంలో చేర్పించాడు. తర్వాత రాహుల్జీతనఇంటికి జాబులు వ్రాశాడు. తిరిగిరమ్మని తాతగారు పదేపదే కోరుతున్నారు. డబ్బుకూడ పంపించారు. తనకుకూడ ఇంటికివెళ్లాలని బుద్ధిపుట్టింది. ఒక రోజున బండిఎక్కాడు.

[5]

# ఇంటికి తిరుగుపయనం

రాహుల్జీ తనతాతగారి ఊరిసమీపంలోని స్టేషన్‌వద్ద దిగారు. రాత్రిపూట అయినందువల్ల అక్కడే పడుకొన్నారు. ఉదయంపూట కొంతమందిమిత్రులను కలుసుకొన్నారు. స్టేషన్ ఉన్న చిన్న బస్తీలో తాను ఇదివరకు చదువుకొన్నారు. కలకత్తాలో నాలుగు నెలలుమాత్రమే గడిపివచ్చిన తనకు వీరంతా అనాగరికులుగా కనిపించారు. అయినప్పటికి పాత మిత్రులను కలుసుకొన్నప్పుడు చాలా సంతోషం కలిగింది. తన తాతగారిఎదుటికి వెళ్ళడానికి రాహుల్జీ ఇప్పుడు సంకోచించలేదు. ఎప్పుడో నాలుగు నెలలక్రితం రెండు శేర్ల నెయ్యి ఒలకబోసినవిషయం, ఎద్దును అమ్మగావచ్చిన ఇరవై రెండు రూపాయలు ఎత్తుకుపోయినవిషయం తాతగారు మరచిఉంటారని రాహుల్జీకి గట్టినమ్మకం. తాతగారు రాహుల్జీనిచూచి చాలాసంతోషించారు. ఆయనను చదివించాలని తాతగారికి చాలాఇష్టం ఉండేది. కాని ఆవిషయమై పట్టుదల చూపకుండా, రాహుల్జీఇష్టానికే వదలిపెట్టారు. రాహుల్జీ సెప్టెంబరు నెలలో ఇక్కడికివచ్చారు. వెంటనే బడిలో చేరిఉంటే మిడిల్ పైపరీక్షకు కూర్చునేవారు. అయితే తాతగారు అలా చేయమని చెప్పనూలేదు. తాను చదవాలని అనుకోనూలేదు.

రాహుల్జీ ఎక్కువకాలం తనతాతగారి ఊరిలోనే గడిపేవారు. ఒకటి రెండుసార్లు తనతండ్రిగారి ఊరికి, బంధువులగ్రామానికి వెళ్ళివచ్చారు. ఇదేకాలంలో ఉమర్‌పుర్ వద్దఉన్న పరమహంసను సందర్శించారు. తాను చనువు

కొన్న నిజామాబాద్ మిడిల్ స్కూలుకు వెళ్ళారు. అప్పట్లో తనతోటివారు పరీక్షలకు సిద్ధమవుతున్నారు. తనకొక విధమైన భావోద్రేకం కలిగింది. కాని రాహుల్జీచేసేది ఏమీలేకపోయింది.

పనీపాటాలేకుండా ఉండటం రాహుల్జీకి నచ్చలేదు. అందుచేత ఎండాకాలంసెలవులతర్వాత తిరిగి నిజామాబాద్ బడిలో ప్రవేశించారు. ఏడాదికిపైగా పుస్తకాలు ముట్టని కారణంగా ఆయన ఎన్నోవిషయాలు మరచిపోయారు. వాటిని తిరిగి నెమరువేసుకోవడానికి కొంతకాలం పట్టింది. రాత్రిపూట చదువుకోవడం ఎప్పటివలె మానివేసినప్పటికీ రెండుమూడు నెలలలో తన తరగతిలో మొదటివాడుగా తేలారు. ఇంతలో తనకు కొద్దిగా జబ్బుచేసింది. తన తండ్రిగారి ఊరికి వెళ్ళారు. అక్కడ తన చెల్లెలు చనిపోయినట్లు తెలిసింది. రాహుల్జీ చాలా విచారించారు. అమ్మమ్మ చనిపోయిన తర్వాత వారిద్దరూ తాతగారిఊరివద్ద ఉండేవారు. వారిమధ్య చిన్న తగవు వచ్చింది. చెల్లెలు తనకు చెప్పకుండానే తండ్రిగారి ఊరికి వెళ్ళింది. చనిపోయేముందు ఆమెను తాను చూడలేదు.

రాహుల్జీ రెండుమూడువారాలు అక్కడ ఉండి తిరిగి నిజామాబాద్‌కు వచ్చారు. ఆ సంవత్సరం తొలకరి ప్రారంభమైనప్పటినుండి ఆయన తాతగారికి, దాయాదులకుమధ్య ఆస్తిపాస్తుల విషయమై తగాదా ఏర్పడింది. కోర్టులో తమ వాదనకు బలంలేదని గ్రహించి, వారు రాహుల్జీ తాతగారి పంటపొలాన్ని దౌర్జన్యంగా కోసివేశారు. ఈ సందర్భంలో

రాహుల్జీ తండ్రిగారు స్వగ్రామంవద్ద తన వ్యవసాయం మాను కొని, ఇక్కడికి రావలసివచ్చింది. ఆయన విసిగి వేసారి, ఎదుటిపక్షం వారితో రాజీపడ్డారు. ఆ స్తి వదులుకోనేట్లు, అందుకుగాను పదకొండువందలరూపాయలు డబ్బు ఇచ్చేట్లు ఒప్పందం కుదిరింది. ఇవన్నీ రాహుల్జీ తెలుసుకొంటున్నారు. కాని వీటిలో తలదూర్చలేదు.

పరీక్ష ఇక మూడునాలుగు నెలలలో జరుగుతుందనగా, జిల్లాలోని అన్ని మిడిల్‌స్కూళ్ల విద్యార్థులకు ఆరవ తరగతిలో నెలవారీ ఉమ్మడిపరీక్ష పెట్టేవారు. ఏస్కూలులో చదువు బాగా సాగుతున్నది? ఏ విద్యార్థి ఎంత చురుకుగా ఉన్నాడు? అని తెల్చుకొనేవారు. జిల్లామొత్తంమీదభాషా విషయంలో రాహుల్జీ, మరొక విద్యార్థిపోటీలు పడేవారు. అయినప్పటికి అనేకపర్యాయాలు రాహుల్జీ ప్రథముడుగా వచ్చారు.

సెలవులలో రాహుల్జీ తనతాతగారి ఊరికివచ్చిచూస్తే, పరిస్థితులు సద్దుబాటు అయినాయి. రెండు కుటుంబాలమధ్య తగాదా పరిష్కారమైంది. అందుకు రాహుల్జీ చాల సంతోషించారు. తాతగారిని తమవద్దనే ఉండమని వారు కోరుతున్నారు. కాని ఏనాడైనా ఎత్తిపొడుపులు తప్పవని తాతగారి భయం. అందుచేత ఆ గ్రామంవదలి తన అల్లుడుగారి ఊరికి వెళ్లగోరుతున్నారు. ఆయన ఇల్లుకూడ ఒకవిధంగా తన దాయాదులస్వాధీనంలో ఉంది. వారి ఇంట్లోనే ఆయన అన్నం తింటున్నారు. రాహుల్జీ ఈ పర్యాయం అక్కడే ఉండిపోయారు. తన మామగారి కుమారునికి అక్షరారంభం

చేయించివచ్చారు. లోగడ తనకు అక్షరారంభం చేయించింది ఆ మామగారే. ఈవిధంగా మామగారిఋణం తీర్చుకొన్నా నని రాహుల్జీ సంతోషించారు.

మిడిల్ వార్షిక పరీక్షకు రోజులు దగ్గరపడ్డాయి. జిల్లా లోని అన్నిస్కూళ్ల మిడిల్ విద్యార్థులకు ఆజంగఢ్ మిషన్ స్కూలులో పరీక్షలు జరిపేవారు. దానికి దగ్గరలోనే నిజమా బాద్ మిడిల్ విద్యార్థులకు ఇల్లు అద్దెకు తీసుకొన్నారు. విద్యార్థులవెంట ఒక ఉపాధ్యాయుడుకూడ వెళ్లాడు. పరీక్ష ముగిసిన తర్వాత రాహుల్జీ తన తండ్రిగారి ఊరికి వచ్చారు. మరొక పర్యాయం ఉమర్‌పుర్ పరమహంసను సందర్శిం చారు. పరమహంస వయస్సు 120 ఏళ్లు అని అందరూ చెప్పు కునేవారు. యాభైఏళ్ల నుండి ఆయనరూపంలో మార్పు రాలే దని వృద్ధులు అనేవారు. పెద్దపెద్ద సంస్కృత పండితులు, ఇంగ్లీషు చదువుకొన్న ఆఫీసర్లు పరమహంసను సందర్శించే వారు. ఆయనపాండిత్యం అపారమైనదని, జీవన్ముక్తుడైన యోగి అని, సిద్ధుడని ప్రశంసించేవారు. కొందరు తమ మనో రథాలు ఈడేర్చుకోవడానికి ఆయనవద్దకు వచ్చేవారు. ఆయన నిరాకరించినప్పటికీ వారు వెళ్ళిపోయేవారుకారు. అప్పు డప్పుడు ఆయన అలాంటివారిపై బెత్తం ఉపయోగించేవారు. బెత్తందెబ్బ తిన్నవాడు తన మనోరథం ఈడేరినట్లు భావించే వాడు. రాహుల్జీ తండ్రిగారుకూడ పరమహంస భక్తుడు. అందువల్ల రాహుల్జీకూడ ఆయనవెంట అక్కడికి వెళ్లేవారు.

# తిరిగి పరారీ

పరీక్షవ్రాసి వచ్చినతర్వాత, రాహుల్జీ రెండువారాల కంటె ఎక్కువకాలం ఇంటివద్ద ఉండలేకపోయారు. "ప్రపంచ పర్యటన చేయి" అనే మంత్రం ఆయనను కలత పెడు తున్నది. మొదట తాను ఇంటినుండి పారిపోవడానికి నెయ్యి ఒలకబోయడం, తాతగారు కోపపడతారనే బెదురు కారణం. అయితే ఈసారి అలాంటి అవసరంలేదు. దారిఖర్చుకు డబ్బు అవసరమని తనకు తెలుసు. తాతగారు తనతండ్రి దాచు కొన్న వందరూపాయలు తీసుకొని, దక్షిణాది యాత్రచేసి వచ్చినవిషయం బాల్యంలోనే రాహుల్జీ విన్నారు. ఈసారి తనకు రెండురూపాయలు నగదు, రూపాయలదండ ఒకటి చేతికి తగిలింది. ఎవరైనా గుచ్చిగుచ్చి అడుగుతారని ఆ దండను అమ్మలేదు. ఎనిమిదినెలలతర్వాత దానిని అలాగే తీసుకువచ్చారు. కాని కలకత్తా చేరడానికి ఆ రెండు రూపా యలు తోడ్పడ్డాయి. కొంతదూరం రైలుటిక్కెట్టు లేకుండానే ప్రయాణం సాగించారు.

రాహుల్జీ వయస్సు ఇప్పుడు పదహారేళ్లు. తాను ఇప్పుడు అమాయకుడైన పల్లెటూరి కుర్రవాడు ఏమీకాదు. రెండేళ్లక్రితం తాను కలకత్తా వచ్చినప్పుడు, ఇప్పుడూ ఎంతో భేదముంది. మొదటియాత్రతో తాను చాలాఅనుభ వం సంపాదించారు. చివరిరోజులలో తనకు ఆశ్రయమిచ్చిన

వృద్ధుడు కలకత్తాలో అదేచోట ఉన్నాడు. అతడు హోటళ్లకు పచ్చిమామిడికాయల సరఫరా చేయడానికి ఒప్పందం కుదుర్చుకొని ఉన్నాడు. రాహుల్జీకి వెంటనే పనిదొరికింది. బజారులో మామిడికాయలు లెక్కపెట్టడం, హోటల్‌కు అప్పగించడంలో ఆయన తోడ్పడేవారు. ఈ పని కొద్దిరోజులకు ముగిసింది. హౌవడా రైల్వేస్టేషన్‌నుండి ఒక ఉన్నతాధికారి పింఛను పుచ్చుకొని విదేశం వెళ్ళుతున్నాడు. అతని గదిలోని సామానును వృద్ధుడు వేలంపాడాడు. ఒకమార్వాడీ డబ్బు అప్పుఇచ్చాడు. లాభంలో కమిషన్ వృద్ధునికి కొంత ముట్టజెప్పాడు. ఆగదినుండి సామాను చేరవేయడంలో రాహుల్జీ తోడ్పడ్డారు. ఎన్నోబట్టలు అమ్మకుండా మిగిలిపోయాయి. రాహుల్జీ వాటిని బజారులోపెట్టి అమ్మవలసి వచ్చింది. ఊరకనేఇచ్చినా తోడుకొనివెళ్ళడానికి ఎవరూ సిద్ధంగాలేరు. రాహుల్జీ ఆపని విరమించారు.

వృద్ధుడు రాహుల్జీకి రైల్వేస్టేషన్‌లో మార్కింగ్‌పని ఇప్పించాడు. ఇందుకు ఇంగ్లీషుభాష పెద్దగానేర్చుకొని ఉండనవసరంలేదు. స్టేషన్‌లో సామాను ఎక్కువగా పడిఉండేది. మార్కువేయకపోతే, సరుకు రవాణాకాదు. అందుచేత ప్రతి వ్యాపారి మార్కుమన్‌దగ్గరికి వచ్చేవాడు. రాహుల్జీమినహా తక్కినవారంతా బెంగాలీలు. వారు వయస్సులోకూడ పెద్దవారు. నాలుగుడబ్బులు ఇచ్చేవారు ఎవ్వరూ తనవద్దకు

రాలేదు. ఆ రాబడికోసం రాహుల్జీ ఎదురుచూడలేదు. ఎందు కంటె భోజనం ఏదోవిధంగా జరిగిపోతున్నది. అదేచోట తన దగ్గరబంధువు ఒకరు కూలిపనిచేస్తున్నట్లు రాహుల్జీకి తెలిసింది. అతడు అప్పుడప్పుడు తనకు పంచదారషర్బతు త్రాగిస్తూ ఉండేవాడు. లక్షలకొద్దీ మణుగుల పంచదార అక్కడినుండి రవాణా అవుతూఉంటే, పంచదార షర్బతు త్రాగుతున్నా రని ఎవరికీ బాధఉండేదికాదు. పంచదార సంచులలో ఒకటి రెండు చినిగిపోయినా లెక్కలోకి వచ్చేదికాదు.

## దుకాణంలో ఉద్యోగం

ఇలా రెండు మూడు వారాలు గడిచేటప్పటికి రాహుల్జీకి విసుగుపుట్టింది. పని తాను బాగా చేస్తున్న ప్పటికీ, మనస్సువిప్పి మాట్లాడుకోవడానికి మిత్రుడు ఎవ్వడూలేడు. భాషాభేదం కారణంగాకూడ తాను ఏకాకి అయినట్లువుంది. అందుచేత ఆపని వదలిపెట్టారు. ఎవరు ఎంత బలవంతంచేసినా తిరిగి వెళ్ళలేదు. రెండు మూడు వారాల తర్వాత ఒక నస్యందుకాణంలో ఉద్యోగం దొరికింది. తాను నౌకరుగా కుదిరినప్పుడు, అక్కడ యజమానులలో ఎవరూ లేరు. జాబులువ్రాయడం, వారానికి ఒకసారి జమాఖర్చులు వ్రాసి కాశీకి పంపడం తనపని. కొద్దిరోజులతర్వాత యజ మానికూడ వచ్చాడు. ఆయనవయస్సు 55 ఏళ్ళు. మధ్యా హ్నంతర్వాత దుకాణానికి వచ్చేవాడు. సాయంత్రం

కాగానే షికారు వెళ్ళేవాడు. మహాఅయితే పెద్దపోస్టాఫీసు దాకా వెళ్ళేవాడు. ఆయనకు ఉదరసంబంధమైన జబ్బు ఉండేది. ఏదో ఒకకంపెనీలో తయారైన సిగరెట్లు కాల్చితే జబ్బునయమవుతుందని రాహుల్జీ సలహాయిచ్చారు. వెంటనే ఆకంపెనీకి వెళ్ళి, సిగరెట్లుపెట్టె ఒకటి కొనితెచ్చారు. ఇవి కాల్చినతర్వాత జబ్బుకొంతనయమైంది. రాహుల్జీని స్వామి భక్త పరాయణుడుగా భావించాడు. షికారుకు వెళ్లేటప్పుడు రాహుల్జీనికూడ వెంటబెట్టుకుపోయేవాడు. కొద్దిరోజులకు రాహుల్జీకి జబ్బుచేసింది. ఆయనను ఆస్పత్రిలో చేర్పించారు. రెండువారాలు ఆస్పత్రిలో ఉండివచ్చారు. కొంత స్వస్థత ఏర్పడిన తర్వాత ఇంటివైపు చూపుమళ్ళింది. తన తండ్రి గారిఊరికి వచ్చారు. తిరిగిరమ్మని నస్యందుకాణం యజమాని జాబులువ్రాశాడు. కాని రాహుల్జీ వెళ్ళలేదు.

—౦—



# రెండో అధ్యాయం

## వైరాగ్యం

రాహుల్జీ తన తండ్రిగారిఊరికి వెళ్లారు. తాతగారు కూడ తనస్వగ్రామం వదలిపెట్టి, ఇక్కడే ఉంటున్నారు. "ఆరునెలల కుక్క, పండ్రెండు నెలల కొడుకు, ఉంటే అలాగే ఉంటారు. పోతే అలాగే పోతారు" అని ఆయన అనేవారు. రాహుల్జీకి ఇప్పుడు పదహారుదాటి పదిహేడులోపడింది. తాతగారు తనస్వగ్రామం వదలి ఇక్కడవుంటున్నారేకాని, ఆయనకు ఏమంత అనుకూలంగాలేదు. ఇది తెలుసుకొని రాహుల్జీకి చాలా విచారంకలిగింది. తినుగుడుపులవిషయంలో ఆయనకు స్వేచ్ఛలేదు. పైపెచ్చు కూతురు అత్తవారిఇంట్లో ఉండవలసి వస్తున్నది. లోకజ్ఞానండున్నవారు ఎవరూ కూతురు అత్తవారి ఇంట్లో కాలక్షేపం చేయరు. ఇదికూడ రాహుల్జీ తాతగారిని బాధిస్తున్నది.

కలకత్తాకు వెళ్ళకపూర్వం రాహుల్జీ పరమహంసను సందర్శించారు. అప్పుడు ఆయనమనస్సులో కొన్నిభావాలు రేకెత్తాయి. అవిఇప్పుడు జాగృతమైనాయి. తిరిగి పరమహంస కుటీరానికివెళ్ళారు. పరమహంస ఎవరికీ ఏవిధమైన ఉపదేశం ఇచ్చేవారుకారు. అయితే హరికిరణ్ దాస్ జ్ఞానోపదేశం చేసేవారు.ఆయనకు భాషాజ్ఞానం అంతంతమాత్రమే.రాహుల్జీ హిందీటీకాఉన్న సంస్కృతగ్రంథాలు చదివేవారు. హరి

కిరణ్ దాస్‌తో సంభాషణలు జరిపేవారు. హిందీభాషలో ఉన్న వేదాంతగ్రంథాలు సమాప్తమైనాయి. ఇతరవిషయాలకు సంస్కృతం నేర్చుకోవడం అవసరమని హరికిరణ్ దాస్ చెప్పారు. రాహుల్జీతండ్రి, తాత ఇద్దరూ ఇంగ్లీషు చదువుకోవాలని చెప్పేవారు. సంస్కృతం నేర్చుకొంటే సన్యాసి అయిపోతాడని వారిభయం.

రాహుల్జీ తనబంధువు నివసిస్తున్న గ్రామానికివెళ్ళి ఆయనతో తనవాంఛను వెల్లడించారు. ఆయన సంస్కృత విద్వాంసుడు. అయినప్పటికీ రాహుల్జీతండ్రి, తాతల మనోభీష్టానికి వ్యతిరేకమైనపని చేయదలచుకోలేదు. కాశీలో ఒక సంస్కృతపండితునివద్ద తగుఏర్పాటుచేస్తానని ఆయన వాగ్దానంచేశారు. ఫలానారోజున తాను కాశీకి వెళ్ళుతానని చెప్పారు. రాహుల్జీ ఒకరోజు ముందుగానే ఆగ్రామానికి వెళ్లారు. అయితే మరునాడే తనపినతండ్రి అక్కడికివచ్చారు. రాహుల్జీని కాశీకితీసుకువెళ్ళకూడదని చెప్పారు. ఆజంగఢ్ లో ఇంగ్లీషు నేర్చుకొమ్మని సలహా ఇవ్వగోరారు. రాహుల్జీ ప్రయత్నం విఫలమైంది.

హరికిరణ్ దాస్ రెండు మూడేళ్ళక్రితం బదరీనాథ యాత్రచేసివచ్చారు. తాను అక్కడచూచిన విషయాలను రాహుల్జీకి గొప్పగా వర్ణించిచెప్పారు. ఆయనచెప్పిన 'ధ్రువకథ' రాహుల్జీకి మార్గంచూపించింది. ఇంగ్లీషు మ్లేచ్ఛభాష కాబట్టి దానిని చదువనక్కరలేదని, సంస్కృతభాషనే నేర్చుకోవాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. ఇప్పుడు కాశీకివెళ్ళడానికి వీలులేదు. తనకు ఉత్తరదేశంవెళ్లాలనే సం

కల్పం ఉన్నట్లు హరికిరణ్ దాస్‌కు తెలియజేశారు. దానిని ఆయన బలపరచారు. ఇలావుండగా ఒకరోజున తనగురువు గులాంగౌస్‌ఖాన్ వచ్చారు. వృద్ధాప్యం కారణంగా ఆయన తన ఉద్యోగం విరమించుకొన్నారు. ఇప్పుడు తనశిష్యునికి హితబోధచేయడానికి ఆయనవచ్చారు. ఆయన తనవెంట రాహుల్జీ మిడిల్‌సర్టిఫికెట్టుకూడ తెచ్చారు. రాహుల్జీ ఆయన హితబోధలేవీ చెవికి ఎక్కించుకోలేదు. మిడిల్‌సర్టిఫికెట్టు తెచ్చినందుకు ఒకటి రెండు రూపాయలు ఆయనను లాభించాయి.

రాహుల్జీ ఇంటివద్దనేఉంటూ అప్పుడప్పుడు పరమ హంస కుటీరానికి, తనబంధువుగ్రామానికి వెళ్ళివస్తున్నారు. ఇంట్లో ఎవరికీ అనుమానంకలగడంలేదు. ఈసంవత్సరం తిరిగి గ్రామంలో ప్లేగువ్యాపించింది. రాహుల్జీ ఏవిధంగానూ చలించలేదు. ఒకనాటిసాయంత్రం తనబంధువుగ్రామానికి వెళ్ళారు. అక్కడ కాళికాదాస్ అనే సాధువును కలుసు కొన్నారు. యోగేశ్ అనే మరోమిత్రుడు అక్కడికివచ్చాడు. వీరిద్దరికి రాహుల్జీ తనసంకల్పాన్ని వెల్లడించారు. ఇద్దరూ ఆయనను ప్రోత్సహించారు. రాహుల్జీ లోగడ రెండుసార్లు జరిపిన యాత్రలోను డబ్బు తోడ్పడింది. కాని ఈసారి కష్టం డలువు చేబట్టారు. తనవద్ద ఒకబెల్లపుఉండమాత్రమేఉంది.

కాలినడకనే రాహుల్జీ బయలుదేరారు. అయోధ్య మీదుగా హరిద్వార్ వెళ్లాలని ఆయన సంకల్పం. మొదట సంస్కృత, వేదాంతగ్రంథాలు చదివి, తర్వాత సన్యాసి అయిపోవాలని ఆయన నిశ్చయించారు. ఉదయం పదిగంట

లప్పుడు ఒకవంతెనదాటుతుండగా, వంతెనక్రింద తన పిన తండ్రిమామగారు పలుదోముకుంటున్నారు. ఆయన రాహుల్జీ తండ్రిగారిగ్రామానికి వెళ్ళుతున్నారు. ఆయన చాలా వృద్ధుడు. రాహుల్జీని గుర్తుపట్టలేకపోయారు. రాహుల్జీ ఈ 'ఆపద' నుండి బయటపడ్డారు. ఆజంగఢ్ పట్టణంమీదుగా వెళ్ళారు. ఇరవై నాలుగుగంటలు పస్తుఉన్నతర్వాత, తనవద్ద ఉన్న బెల్లపుఉండ నోట్లో వేసుకొన్నారు. దారిప్రక్కన ఏవో చెట్లపళ్ళు కోసుకుతిన్నారు. ఈవిధంగా మధ్యాహ్న భోజనం పూర్తిఅయింది.

సాయంత్రం చీకటిపడేటప్పటికి రాహుల్జీ ఒకదట్టమైన తోటవద్దఉన్నారు. అపరిచితమైన ఈ ప్రదేశంలో రాత్రిపూట ఎలాగడపాలో ఆయనకు దిక్కుతోచలేదు. సమీపంలో ఉన్న చెరువులో కమండలువు దాచిపెట్టి,తనపినతండ్రి అత్త గారి ఊరికివెళ్ళారు. అక్కడ తనను బాగా ఆదరించారు. మరునాడు శ్రీరామనవమి. అయినప్పటికీ తనయాత్ర కొనసాగించాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. మరునాడు పగలల్లా కష్టపడి ఒకతాడు పేనుకొన్నారు. ఎందుకంటె కమండలువుతోబాటు తాడుకూడ అవసరం. రేపే తనస్వగ్రామానికి వెళ్లుతానని రాహుల్జీ తెలియజేశారు. ఇంటివారికి అనుమానంకలుగలేదు. ఒకమనిషిని తోడుఇచ్చి పంపారు. దారిలో ఆకలైతే తినడానికి బెల్లంకలిపిన పేలపిండిఇచ్చారు. వెంటవచ్చినమనిషిని వదిలించుకొనేదిఎలాగ? తనస్వగ్రామం అక్కడికి పద్దెనిమిదిమైళ్ళదూరంఉంటుంది. అంతదూరం కాలినడకను వెళ్ళడం ఆమనిషికి సర్దాగాఉండదు. రాహుల్జీ

ఈవిషయం అతనికిచెప్పి వెనక్కి పంపించారు. పేలపిండిలో కొంత తాను ఉంచుకొని, తక్కినదంతా అతనికి ఇచ్చివేశారు. చెరువుదగ్గరికి వెళ్ళిచూస్తే, కమండలువులేదు. రాహుల్జీ పశ్చాత్తాపపడ్డారు. తనవెంట తెచ్చిన తాడును అలాగే ఉంచుకొన్నారు.

రాహుల్జీ పడమటివైపు వెనుదిరిగారు. ఆజంగఢ్-అయోధ్యరోడ్డుమీదికివచ్చారు. మధ్యాహ్నం ఒకస్కూలు వద్ద ఆగారు. మాస్టరును అడిగి తాడు, బొక్కెన ఇప్పించుకొన్నారు. స్నానంచేసి పేలపిండి తిన్నారు. ఒకేధోవతితో స్నానంచేయడానికి వీలుండదు. అందుచేత దానినిచింపి రెండులుంగీలు తయారుచేసుకొన్నారు. తిరిగి ఎండలోనే మాడుతూ ఒకగ్రామంవద్దకు వచ్చారు. అప్పటికి చీకటి పడుతున్నది. రాహుల్జీ ఒక బావివద్దకువెళ్ళి నిశ్చింతగా కూర్చున్నారు. నీళ్ళుతోడుకొనేస్త్రీలు ఆయనకు తాడు, బిందె ఇచ్చారు. రాహుల్జీ స్నానాదులు పూర్తిచేశారు. ఇద్దరు ఆడవాళ్ళు, ఏవూరు? ఎక్కడికెళ్లుతున్నావు? అని ప్రశ్నించారు. వండుకోవడానికి అవసరమైనసామగ్రిఅంతా తెచ్చి ఇచ్చారు. నిప్పురాజేసినతర్వాత రాహుల్జీ బియ్యమూ, పిండీ, ఉప్పూకలిపి దాకలో వేశారు. ఆడవాళ్ళకు ఆశ్చర్యం వేసింది. చివరికి పొట్టలోఅంతా ఒకటి అయిపోతుందిగదా అని రాహుల్జీసమాధానమిచ్చారు. మిగిలిపోయిన బియ్యమూ వగైరాలను మూటగట్టుకుపొమ్మని వారు ఆయనకు చెప్పారు. తాను ఇక్కడికి మూటగట్టుకువచ్చింది ఏదీలేదు కాబట్టి,

ఇక్కడినుండి మూటగట్టుకుపోవలసిన అవసరంలేదని ఆయన ప్రత్యుత్తరమిచ్చారు.

మరునాడు ఉదయమే దారిలో శ్రీరామనవమి యాత్రీకులు వెళ్లేధ్వని వినిపించింది. వారు అయోధ్యనుండి శ్రీరామనవమి ఉత్సవం ముగించుకొని వస్తున్నారు. రాత్రి జరిగినదంతా 'విశ్వంభరునికృప' అని రాహుల్జీ అనుకొన్నారు. ఆయన వైరాగ్యం ఇంకొకమెట్టు ముందుకువెళ్ళింది. తన యాత్రను కొనసాగించారు. అయోధ్యకువెళ్లే ఒకసాధువు వారికి తటస్థించాడు. అయోధ్యచేరినతర్వాత అనేక స్థలాలను సందర్శించారు. ఒకమఠంలో కొందరు గ్రామీణ సాధువులను, గృహస్థులను కలుసుకొన్నారు. వారు మరునాడు తమఇంటికి బయలుదేరగా, రాహుల్జీకూడ వారివెంట నడిచారు. ఒక ముసలిసాధువు తన గ్రామానికి రమ్మని ఆహ్వానించాడు. వీరు సరయూనదిదాటి వెళ్ళారు. రాహుల్జీ రెండురోజులు అక్కడఉన్నారు. ఆయన తిరిగి బయలుదేరేముందు ముసలిసాధువు ఒకగుండ్రని కమండలువు ఇచ్చాడు. ఇది తనకు బాగా ఉపకరించింది. మధ్యాహ్నంపూట, దారిప్రక్కఉన్న మామిడితోటలలో పచ్చిమామిడికాయలు లభించేవి. కమండలువు తనవద్ద ఉన్నందువల్ల రాహుల్జీ ఏగ్రామానికీ వెళ్ళవలసినఅవసరం ఉండేదికాదు. అయితే రాత్రిపూట ఏదో ఒక సాధువుకుటీరంలోనో, సంసారిఇంటనో తలదాచుకొనేవారు.

షాజహాన్పురంసమీపంలో ఒక బ్రాహ్మణుడు రాహుల్జీకి తోడైనాడు. అతడు తీర్థయాత్రలు చేస్తూవస్తు

న్నాడు. ఇద్దరుకలిసి యాత్ర సాగిద్దామనుకొన్నారు. ఆ బ్రాహ్మణుడుకూడ హరిద్వార్, బదరీనాథ్ వెళ్ళుతున్నాడు. మురాదాబాద్ వరకు ఇద్దరు కలిసివెళ్లారు. ఆ బ్రాహ్మణునికి వంటచేయడం, సామగ్రిసేకరించడం బాగా తెలుసు. వీరు రాంపురంవచ్చారు. రాహుల్జీకి కలకత్తాలో ఆశ్రయమిచ్చిన వృద్ధుని బావమరది ఇక్కడఉన్నాడు. రాహుల్జీ అతనిని చూడటానికి వెళ్లారు. తనవైరాగ్యం మాన్పించడానికి అతడు ప్రయత్నించాడు. కాని రాహుల్జీ వైరాగ్యం మానుకొనేస్థితిలో లేరు. కలకత్తాలో తనకు ఆశ్రయమిచ్చిన వృద్ధుడు ఇప్పుడు మురాదాబాద్ లో ఉన్నట్లు తెలుసుకొన్నారు. రాహుల్జీ అక్కడికివెళ్ళి ఆయనను సందర్శించారు. ఆ వృద్ధునికుమారుడు రాహుల్జీవెంటఉన్న బ్రాహ్మణుని భయపెట్టి, ఆరాత్రే వెళ్లగొట్టాడు. అతనికోసం రాహుల్జీ వెదకి నిరాశచెందారు. పరాయివారి కుర్రవాణ్ణే ఎత్తుకుపోతున్నావా? ఈ విషయం పోలీసులకు రిపోర్టుచేస్తాము" అని బెదరిస్తే, ఆ బ్రాహ్మణుడు పారిపోయాడు. తమకు జ్ఞానోపదేశంచేయమని వృద్ధునికుమారుడు రాహుల్జీని కోరాడు. కొద్దిరోజులు ఇక్కడ ఉండమని వృద్ధుడుకూడ పట్టుబట్టాడు. పట్టణంలో ఒక సేఠ్ ఉండేవాడు. అతని అన్నకుకూడ వైరాగ్యం జబ్బు ఆవరించింది. అతడు రాహుల్జీని కలుసుకొని చాలా సంతోషం వెలిబుచ్చాడు. తమ ఇంటివద్దనే ఉండమనికోరాడు. తనవద్ద పది కమండలువులు ఉన్నాయని, పదిమంది సన్యాసులు ప్రోగైతే, అందరూ ఒకేసారి బయలుదేరవచ్చునని చెప్పాడు. రాహుల్జీకి అన్నివిధాల సౌకర్యాలు

కలిగించాడు. ఆయన ఇక్కడే ఉండిపోతారని భావించాడు. కాని సేక్ తమ్ముడికి, అతని తల్లికి ఈ వైరాగ్యం గిట్టేది కాదు. రాహుల్జీ ఇది గ్రహించారు. ఒకరోజున సేక్ తల్లి, అతనితమ్ముడు వచ్చి, "మీరు ఇక్కడినుండి హరిద్వార్ వెళ్లండి. కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాము" అని రాహుల్జీకి వినయపూర్వకంగా చెప్పారు. రాహుల్జీ అందుకు చాలా సంతోషించారు. ఒక కొత్తకమండలువు, హరిద్వార్ దాకా టికెట్టు తనకు చాలునని చెప్పారు.

హరిద్వార్ స్టేషన్‌లో దిగినప్పుడు రాహుల్జీవద్ద పావలా డబ్బులకంటె ఎక్కువ లేవు. అయితే డబ్బు లేకపోతే కొత్తచోట గడిపేది ఎలాగా అనే చింత రాహుల్జీకి ఇప్పుడు లేదు. గంగానదిలో స్నానంచేసి, ఎక్కడో ఒక చోట ఆకలి తీర్చుకొన్నారు. సంస్కృతం నేర్చుకోవాలని తాను హరిద్వార్‌కు వచ్చారు. పండితునికోసం అన్వేషణచేశారు. కాశీనుండి ఇక్కడికి సంస్కృతం నేర్చుకోవడానికి వచ్చానంటే ఎవరూ నమ్మడంలేదు. విష్ణుదత్తుడు అనే పండితుని పేరు వినిపించింది. రాహుల్జీ ఆయనవద్దకు వెళ్లారు. విష్ణుదత్తుడు ఆయనకు కలం, సిరాబుడ్డి ఇచ్చి, ఒక లావైనపుస్తకం ముందు పడవేశాడు. దానిని నకలుచేయమని చెప్పాడు. రాహుల్జీ రోజూ ఎనిమిదిగంటలు చొప్పున కష్టపడి ఆ పుస్తకం నకలు తీస్తున్నారు. సంస్కృతం మొదలుపెట్టేది ఎప్పుడు అని ప్రశ్నిస్తే, ఆ పండితుడు వినిపించుకోవడంలేదు. నీకు ఇష్టంవచ్చిన పుస్తకం చదువుకో అంటున్నాడు. ఆ పండితుని పుస్తకాలలో ఒక్కటీ రాహుల్జీకి ఉపయోగించలేదు. ఎని

మిది రోజులైనతర్వాత ఆపండితుని బండారం బయటపడింది. అతనికి సంస్కృతంతో ఏమీ సంబంధంలేదు. మోస కృత్యంతో డబ్బు సంపాదించడం వృత్తిగా పెట్టుకొన్నాడు. వంటవానికి ఆరు నెలలుగా జీతం ఇవ్వలేదు. పండితునికి ఉన్న ఒకేఒక కూతురుకుకూడ పొట్టనిండ తిండిలేదు. ఆ పిల్లతప్ప ఇంట్లో ఇంకెవరూలేరు.

ఒకరోజు ఉదయం పండితునివద్ద రాహుల్జీ సెలవు పుచ్చుకొన్నారు. తాను వచ్చినపని వృథాఅయినందుకు నిరాశచెందారు. తిరిగి కాశీకి వెళ్లదలచుకొన్నారు. కాని ఇంతదూరంవచ్చి, బదరీనాథ్ చూడకపోతే బాగుండదని పించింది. అయోధ్యనుండి మురాదాబాద్‌కు వెళ్లేదారిలో ఒకమాళవసాధువు తోడైనాడు. ఇద్దరూ మాట్లాడుకొంటూ హృషీకేశ్ చేరుకొన్నారు. ఒక ధర్మసత్రంలో దిగారు. మాళవసాధువు బక్కపలచమనిషి. అయినప్పటికీ రాహుల్జీ కంటెబలిష్ఠుడు. అతడే పొయ్యిరాజేసి, అన్నం వండేవాడు. ఏదైనా కావలసివస్తే అతడే అడుక్కువచ్చేవాడు.

## హిమాలయ యాత్ర

వీరు దేవప్రయాగకువచ్చి అక్కడినుండి జమునోత్రి, గంగోత్రి వెళ్లదలచారు. టెహరీకి వెళ్లేదారి చాలా గహన మైనది. ఎన్నోరోజుల తర్వాత టెహరీ చేరుకొన్నారు. ఇతర తీర్థయాత్రికులతోబాటు వీరుకూడ రాజదర్శనం చేసు కొన్నారు. అక్కడినుండి తమ యాత్రను కొనసాగించారు. యమునానది ఒడ్డుకువచ్చారు. నాటకంలో ఒక కొత్త

దృశ్యం ప్రారంభమైనట్లుంది. ఇద్దరూ అటవీశాఖకు చెందిన కూలీలపేటకు వెళ్లారు. ఒక బ్రహ్మచారి తెల్లని కుక్కను వెంటబెట్టుకొని వచ్చాడు. వీరికి అనేక ప్రశ్నలు వేశాడు. తాను కాశీకి రెండుసార్లు వెళ్ళివచ్చినట్లు తెలియజేశాడు. హిమాలయంతర్వాత తనకు ప్రియమైన నగరం కాశీయేనని చెప్పాడు. తాను అనేక ప్రాంతాలు పర్యటించి వచ్చా నన్నాడు. తనవెంటఉన్న కుక్క రాంపురంనుండి వస్తున్న దని తెలియజేశాడు.

ఆ బ్రహ్మచారి తొడిబడకుండా తన అనుభవాలను వివరించడంచూచి, రాహుల్జీ నివ్వెరపోయారు. నిజమైన యాత్రికుడు ఇతడే ననుకొన్నారు. బ్రహ్మచారి గంజాయి పీలుస్తూ మాళవసాధువునుకూడ ఆహ్వానించాడు. మరునాడు ముగ్గురూకలిసి ప్రయాణంచేశారు. దారిలో బ్రహ్మచారి కుక్క మాయమైంది. అతడు మూడునాలుగుమైళ్ళు వెనక్కి వెళ్ళి, దానికోసం వెదికాడు. కాని కనపడలేదు. దానికి తన గ్రామం గుర్తుకువచ్చి, వెళ్ళిపోయి వుంటుందని నిర్ధారణ చేసుకొన్నారు. వీరు తమ ప్రయాణం కొనసాగించారు. సాయంకాలం జమనోత్రివద్ద పండాలగ్రామం చేరుకొన్నారు. ఆనాడు స్త్రీ - పురుషులు సమిష్టిగా నాట్యంచేస్తారని తెలిసింది. ఇది రాహుల్జీకి వింతగా తోచింది.

మరునాడు యమునగట్టు ఒక కొయ్యవంతెనదాటి, అతికష్టంమీద జమనోత్రి చేరుకొన్నారు. జమనోత్రిచుట్టూ ఎత్తైనకొండలు ఉన్నాయి. ఒక చిన్నసందులో నీరుప్రవహిస్తున్నది. ముగ్గురూ జమనోత్రి తప్తకుండాన్ని చూశారు.

ప్రవైకాటితో కలుగుటు



ఆ వేడినీటిలో అన్నం వండుకుతినడం యాత్రీకులు తమ ధర్మంగా భావించేవారు. అందుచేత వీరుకూడ అంగ వస్త్రంలో బంగాళాదుంపలు మూటగట్టి కుండంలో పడ వేశారు. చిన్న చిన్న రొట్టెలుచేసి, పూరీలు నేతిలో వేసినట్లు, ఆ వేడినీటిలో పడవేశారు. రొట్టెలు పక్వంగాఉన్నట్లు కని పించాయి.

జమనోత్రినుండి మూళనసాధువు వీరితోడు వదలి పెట్టాడు. బ్రహ్మచారి రాహుల్జీని విశేషంగా ఆకర్షించాడు. వీరు అక్కడనుండి బయలుదేరేటప్పుడు మరొకవ్యక్తితోడై నాడు. వీరుముగ్గురూ కొన్నిమైళ్ళునడిచి, ఒకచోట ఆగారు. అక్కడ వంటవండుకుతిన్నారు. కొద్దిమైళ్ళదూరంలో గంగో త్రికివెళ్ళేరెండుదారులు వున్నాయని తెలిసింది. వీరుప్రమాద కరమైనదారిలో పయనించారు. మానవమాత్రుడు ఎవ్వరూ అక్కడ కనిపించలేదు. మానవుల పాదచిహ్నాలుమాత్రమే కనిపించాయి. బ్రహ్మచారి ఒకచోట పాముపడగవలెఉన్న ఒకమొక్కను చూపించాడు. దీనిమొదట్లో పాము వుంటుం దని చెప్పాడు. రాహుల్జీకి అతనిమాటలపై పూర్తినమ్మకం ఏర్పడింది. అన్నంవండుకుతినడానికి ఇంకా వేళకాలేదు. బ్రహ్మచారి తనసంచితీసి, గంజాయిపీల్చాడు. తోడివానికి ఇచ్చాడు. తర్వాత వీరు తిరిగి బయలుదేరారు. పదకొండు గంటలయ్యేటప్పటికి విశాలవృక్షప్రదేశం దాటివెళ్ళారు. మంచుప్రదేశం ప్రారంభమైంది. ఎక్కడా ఎండినపుల్లలు కనిపించవు. ఆకలి దహించివేస్తున్నది. అతికష్టంమీద సగంసగం ఎండినపుల్లలను ప్రోగుచేశారు. నిప్పురాజేద్దా

ఉత్తరకాశీ



మనుకొంటే ఎండినఆకులు లేవు. ఒక బట్టచింపి నిప్పురాజే శారు. కాని మంట మండలేదు. ఒక అగ్గిపెట్టె, ఒకవస్త్రం పూర్తిగా అయిపోయాయి. అప్పటికీ లాభంలేకపోయేసరికి ఆప్రయత్నం విరమించారు. తనవద్ద బెల్లంకలిపిన పేలపిండి ఉందని కోడివాడుఅన్నాడు. ముగ్గురికీ ప్రాణంలేచివచ్చింది. ఆ పేలపిండిని పంచుకొని తిన్నారు.

రెండుగంటలతర్వాత ఒకకొండపైకి చేరుకొన్నారు. ఆక్రితంరాత్రే అక్కడచేరిన ఒకసాధువు, ఈ సమీపంలో క్రూరజంతువులుఉన్నాయని చెప్పాడు. కొన్ని ఎలుగుబంట్లు, వాటిపిల్లలు ఏదో త్రవ్వుకుతింటూవుండగా తాను చూశానని తెలియజేశాడు. వీరుముగ్గురిలోను ఇద్దరివద్ద బలమైన కర్రలు వున్నాయి. రాహుల్జీకూడ ఒకకర్ర సంపాదించారు. ఉన్నత ప్రదేశంనుండి సమతల ప్రదేశానికివచ్చారు. సమీపంలోనే ఒకగ్రామండున్నట్లు తోచింది. నాలుగున్నరగంటలకు ఆ గ్రామం చేరుకొన్నారు. అక్కడ ధర్మసత్రం ఏదీలేదు. ఒక పాడుబడినఇంట్లో మకాంపెట్టారు. ఆకలిదహించివేస్తున్నది. బ్రహ్మచారి గ్రామంలోకి బయలుదేరాడు. పావుగంటలో ఒకశేరు వేయించినగోధుమలు, ఒక బెల్లపుముద్ద తెచ్చాడు. ముగ్గురూ తాత్కాలికంగా ఆకలితీర్చుకొన్నారు. తర్వాత కొంతసేపటికి పాలుదొరికాయి. నేపాల్‌నుండివచ్చి స్థిరపడి పోయిన ఒకగృహస్థుడు యివి అందించాడు.

మరునాడు ఉత్తరకాశీ, ఆపిమ్మట చాలారోజులకు గంగోత్రి వెళ్లారు. అక్కడ సాధువులను కలుసుకొన్నారు. గంగోత్రిలోగడిపినన్నిరోజులు వంటచేసుకోవలసిన అవసరం

లేకపోయింది. రోజూ ఎవరో ఒకరు తిండిపెట్టేవారు. సాధువులు గంజాయి తెగపీల్చేవారు. రాహుల్జీకి ఇదిఇంకా అలవాటు కాలేదు. వీరు కొన్నిరోజులను ఒక చిన్నబస్తీ చేసుకొన్నారు. రాహుల్జీ భిక్షాటనకు బయలుదేరవలసివచ్చింది. ఒకటి రెండు ఇళ్ళవద్దకు వెళ్లారు. ప్రతిఇంటివద్ద ఒకొ్కక్క రొట్టెయిచ్చారు. ఇదే సమయంలో కుక్కలు మొరుగుతూ మీదికివచ్చాయి. రాహుల్జీ అక్కడనుండి వెనుదిరిగారు. తిరిగి ఎప్పుడూ భిక్షాటనకు వెళ్ళలేదు. ఆ బస్తీనుండి వీరు యాత్ర కొనసాగించేముందు రాహుల్జీకి జ్వరంవచ్చింది. నాలుగైదు మైళ్ళదూరం వెళ్ళినతర్వాత, ఇక నడవలేకపోయారు. బ్రహ్మచారి ముందుకువెళ్ళిపోయారు. రాహుల్జీ ఒకరిఇంట్లో బడలికతీర్చుకొన్నారు. మరొకమైలుదూరం వెళ్లారోలేదో, ఆయన తిరిగి అలసటచెందారు. కంబళికప్పుకొని పడుకున్నారు. కొంతసేపటికి దప్పిక వేసింది. సామాను అక్కడే వదలి, నీళ్ళుత్రాగడానికి కొంతదూరం వెళ్లారు. ఈమధ్యలో బ్రహ్మచారివచ్చాడు. రాహుల్జీకోసం ఎదురుచూడకుండా ఆయన కంబళితీసుకుపోయాడు. ఇది రాహుల్జీకి చాలా విచారం కలిగించింది. తర్వాత బ్రహ్మచారి కనపడలేదు.

రాహుల్జీ మరునాడు తనయాత్ర కొనసాగించారు. కొత్తయాత్రీకులవెంట అడవులగుండా బయలుదేరారు. తిర్యగీనారాయణ్ మీదుగా గౌరీకుండకువచ్చి, అక్కడ ఆ రాత్రి ఆగారు. దగ్గరలోనే ఒకమంచి ధర్మసత్రంకనపడింది. అందులో ఎవరో నేపాల్ రాణి మకాం వేసినట్లు తెలిసింది. ప్రజలు దానంకోసం ఎగబడుతున్నారు. రాహుల్జీకూడ

ఆగుంపులో చేరారు. సంకోచిస్తూ, సిగ్గుపడుతూ రాణీని దానంఅడిగారు. దీనత్వంతో రాహుల్జీ ఒకరిని దానం అడగడం ఇదే మొదలు, ఇదే ఆఖరు.

పిమ్మట ఆయన లామ్‌బగడ్ మీదుగా కేదారనాథ్ బస్తీకివచ్చారు. అక్కడ సాధువులను కలుసుకొన్నారు. ఆరాత్రి రామాయణపఠనం జరుగుతున్నది. ఒకరు చదువుతూఉంటే, రాహుల్జీ అర్థంచెప్పారు. కొంతసేపటికి మరికొందరు సాధువులువచ్చారు. ధర్మదాస్ అనునతడు విన్నంతసేపువిని, ఇక తాను అర్థంచెబుతానని బయలుదేరాడు. అర్థంచెప్పేటప్పుడు ఉపనిషత్ శ్రుతులను వల్లించడం మొదలుపెట్టాడు. అతని ఉచ్చారణ చాలా అసహ్యంగా ఉంది. పఠనం సమాప్తమైనతర్వాత అతడు రాహుల్జీని కొన్నిప్రశ్నలు అడిగాడు. సంస్కృతమూ, వేదాంత గ్రంథాలుచదవాలని తనకు ఇష్టంఉన్నట్లు రాహుల్జీ తెలియజేశారు. హృషీకేశ్‌లో అలాంటి ఏర్పాటు చేస్తానని ధర్మదాస్ చెప్పాడు. అతడు పంజాబీవాడు. భారతదేశంలో చాలాచోట్ల పర్యటించాడు. మాట్లాడటంలో చాలా నేర్పరి. తాను సంస్కృతం చదువుకోలేదని రాహుల్జీఎదుట ఒప్పుకొన్నాడు. ఇంత నిష్కపటంగా చెప్పినందుకు రాహుల్జీ సంతోషించారు.

కేదారనాథ్‌బస్తీలో చలి విపరీతం. కరిగివచ్చిన గంగానదిలో మొదటిరోజున రాహుల్జీ స్నానంచేసివచ్చారు. మరునాడుకూడ వెళ్ళుతూఉంటే, ధర్మదాస్ తదితరులు వద్దనిచెప్పారు. జబ్బుపడేప్రమాదంఉందని హెచ్చరించారు.

రాహుల్జీ ఇక్కడ ఉన్నంతకాలం తన నిత్యవిధులను మార్చుకోవలసివచ్చింది. ధర్మదాస్ వద్దఉన్న గ్రంథాలనురాహుల్జీచదివారు. ముఖ్యంగా శివపురాణంచదివి ఆనందించారు. రాహుల్జీ అప్పుడప్పుడు కొండలపై తిరిగివచ్చేవారు. ఒకనాడు నాథూరామ్ అనే మిత్రునితో కలిసి, కొండపై తిరుగుతున్నారు. ఇంతలోనడిమివయస్సుగల ఒకవ్యక్తి, ఇక ముందుకు వెళ్ళితే ప్రమాదమని హెచ్చరించాడు. పాండవులు ఆదారినే వెళ్ళి హిమాలయంలో కూరుకుపోయినట్లు చెప్పాడు.

శ్రావణమాసంలో కేదారనాథ్‌పూజ గొప్పగా జరిపేవారు. ఆసమయంలో ఒకవిధమైన "హిమకమలాల"తో పూజజరిగేది. అయితే హిమాలయంలో కమలాలు దొరకడం రాహుల్జీకి చాలా ఆశ్చర్యం కలిగించింది. మంచుకరగిపోయినతర్వాత, సమీపంలోనేఉన్న ఒకవిశాలమైన సరస్సులో ఆమొక్కలు ఎదుగుతాయని కొందరుచెప్పారు.

రాహుల్జీ కేదారనాథ్‌లో ఉంటూ రెండుమూడువారాలైంది. తన బాల్యమిత్రుడు యాగేశ్ తనను వెతుక్కుంటూ వచ్చాడు. దారిలో తాను ఎన్నెన్నికష్టాలుపడిందీ రాహుల్జీకి వివరించాడు. రాహుల్జీకూడ తనయాత్రనుగూర్చి యాగేశ్‌కు వివరించారు. ధర్మదాస్‌కు యాగేశ్‌ను పరిచయం చేశారు. "మంచిది, ఇద్దరూ హృషీకేశ్ వెళ్ళి సంస్కృతం చదువుకోండి. సాధువులుకండి" అని ధర్మదాస్ చెప్పాడు. సాధువుకాబోయేవిషయమై రాహుల్జీ కొంచెం తటపటాయిస్తున్నా, యాగేశ్ తన సంసిద్ధతను ప్రకటించాడు.

అయితే "అమ్మ జ్ఞాపకంవస్తుంది. పద, ఇంటికిపోదాం" అని రాహుల్జీతో మాత్రం చెప్పేవాడు.

యోగేశ్ వచ్చినతర్వాత, రాహుల్జీ ఒక నెలరోజులకుపైగా కేదారనాథ్‌లో ఉన్నారు. ధర్మదాస్ ఒకరోజున కొత్తబట్టలు, దారిఖర్చు ఇచ్చి వీరిని బదరీనాథ్ పంపించాడు. మార్గమధ్యంలో వీరు ఊషీమఠాన్ని సందర్శించారు. బాణాసుర, ఉషాకన్యలకథ గుర్తుకువచ్చింది. కొంతకాలానికి బదరీనాథ్ చేరుకొన్నారు. అక్కడ మూడు నాలుగురోజులకంటె ఎక్కువ ఉండలేదు. తాము హృషీకేశ్‌కు వెళ్ళాలా వద్దా అనే విషయం తేల్చుకోలేదు. అయినప్పటికీ తమ ప్రయాణం కొనసాగించారు. కాశీకి తిరిగివెళ్ళాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. వీరు ఆఖరురోజున నలభైమైళ్ళునడచి రామనగర్ వచ్చారు.

బరేలీలో రాహుల్జీ విద్వాంసుడైన ఒక సన్యాసిని సందర్శించారు. అతడు కాషాయవస్త్రం ధరించి, ప్రక్కలో ఒక బెత్తం పెట్టుకుకూర్చున్నారు. అప్పుడప్పుడు ఆ బెత్తంతో నేలపై కొడుతున్నాడు. అతడు తనమనస్సును ఏకాగ్రంగా ఉంచేట్లు చేస్తున్నాడు. మనస్సు ఇటూ అటూ పోతే బెత్తంతో నేలపై కొడుతున్నాడు అని ప్రజలు చెప్పారు. అతడు ఎవరితోనూ మాట్లాడేవాడుకాదు. అతనివద్ద కొన్ని చిన్న చిన్న ముద్రితగ్రంథాలు ఉండేవి. అందులో ఒకటి రాహుల్జీకి ఇచ్చాడు. అది సరళ సంస్కృతంలో ఉంది. రాహుల్జీకికూడ బాగా అర్థమైంది. అహింసా మాహాత్మ్యం అందులో వర్ణింపబడింది. హిందీప్రాంతాలలో బౌద్ధధర్మాన్ని

పునఃస్థాపించడంలో ఆ సన్యాసి విశేషపాత్ర వహించాడని తెలిసింది.

రాహుల్జీ బరేలీలో ఉంటూ ఒకవారం రోజులు గడిచింది. యోగేశ్ మరికొన్ని రోజులు అక్కడ ఉండగోరాడు. కాని రాహుల్జీ వినలేదు. ఇద్దరూ పిలిభిట్‌కు బయలుదేరారు. బరేలీలో ఉండగా యోగేశ్ ఒకకుట్రచేశాడు. తాను బరేలీలో ఉంటున్నట్లు ఇంటికి కబురుపంపాడు. అక్కడినుండి ఎవరో వస్తారని ఎదురుచూశాడు. అందుకోసమే బరేలీలో మరికొంతకాలం ఉండగోరాడు. రాహుల్జీని ఇంటికితీసుకు వెళ్లాలని మూడుసార్లు ఇలాంటి ప్రయత్నాలు జరిగాయి. తాను భిక్షహారానుండి వెళ్లుతున్నట్లు తండ్రిగారికి తెలిసి అయోధ్యకు వచ్చారు.ఒకడు ఆయనను మోసగించి అక్కడే ఆపివేశాడు. "మీకుమారుడు ఇక్కడికి వచ్చాడు. నావద్ద గురుమంత్రం పుచ్చుకొన్నాడు.బదరీనారాయణ్‌కు వెళ్ళాడు. తప్పకుండా తిరిగివస్తాడు" అని చెప్పాడు. హరిద్వార్ నుండి రాహుల్జీ ఇతరులకు వ్రాసిన ఒక ఉత్తరం చూచుకొని, ఆయన తాతగారు బయలుదేరారు. ఆయనకూడ బదరీనాథ్‌కువచ్చి తిరిగివెళ్లారు. రాహుల్జీజాడ కనిపించలేదు. ఇప్పుడు మూడో ప్రయత్నం జరిగింది. రాహుల్జీ ఇంకొకరోజు బరేలీలో ఉంటే, యోగేశ్ తండ్రి వారిద్దరిని పట్టుకుపోయేవారు. వారు పిలిభిట్ చేరి ఒక మఠంలో కొద్దిగంటల సేపు ఉన్నారు. వారు వెళ్ళిపోయిన అరగంటకు యోగేశ్ తండ్రి వచ్చాడు. అతడు తిరిగి నిరాశతో స్వగ్రామం వెళ్ళవలసివచ్చింది.

# కాశీకి ప్రయాణం

యోగేశ్, రాహుల్జీలు పిలిభిట్‌లోని ఒక మఠంలో కాస్సేపు విశ్రాంతి తీసుకొన్నారు. త్వరగా కాశీకివెళ్ళి చదువు ప్రారంభించాలని రాహుల్జీ కోరిక. కాని రైలుచార్జి ఎలా సంపాదించాలనేదే ప్రశ్న. లలితాప్రసాద్ అనే ధనవంతుడు పట్టణంలో ఉన్నట్లు తెలిసింది. రాహుల్జీ ఏదో కవిత్వంవ్రాసి, అతనివద్దకు తీసుకువెళ్ళారు. కాశీదాకా రెండు టిక్కెట్లకు డబ్బు దొరుకుతుందని రాహుల్జీ పెద్ద ఆశపెట్టుకొన్నారు. కాని ఆ ధనవంతుడు వట్టిచేతులు చూపించాడు. అతనివద్ద ఒక వృద్ధుడు కొలువుచేస్తూ ఉండేవాడు. ఆ వృద్ధుడు రాహుల్జీకి కొంత సహాయంచేశాడు. రాహుల్జీ, యోగేశ్‌లు ఫైజాబాద్‌వరకు రైలుపై వెళ్ళగలిగారు. అక్కడనుండి కాలినడకనే అయోధ్యమీదుగా కాశీకి బయలుదేరారు.

వారు ఇంకా కుర్రవాళ్ళు. ఒక వ్యక్తి కొద్ది మైళ్ళ దూరంనుండి ఆ దారినే వస్తున్నాడు. అతని శరీరంపై ఒకటి రెండుచోట్ల గాయాలు ఉన్నాయి. అతనిని ఉద్దేశించి "ఎవరినైనా కొట్టి పారిపోతున్నావా?" అని అడిగారు. అతడు జవాబివ్వలేదు. రెండు మూడుసార్లు గుచ్చిగుచ్చి అడిగితే అతడు తంతానని మీదికి వచ్చాడు. ఇక ఎక్కువ మాట్లాడితే అంతపనీ జరిగేదే.

రాహుల్జీ, యోగేశ్‌లు జౌన్‌పుర్ జిల్లాదాటి కాశీకి వచ్చారు. మోతీరాంబాగ్‌లో చక్రపాణి అనే బ్రహ్మచారి ఆశ్రయం ఇచ్చాడు. అతనివద్ద ఎల్లప్పుడూ ఒక చక్కని

ఆవు ఉండేది. అది వర్షానికి తడువకుండా ఒక ఇల్లు, దానికి తవుడు వగైరా నిల్వచేయడానికి ఒక హాలు కట్టించిపెట్టాడు. తనకాలంలో ఎక్కువభాగం ఆ గోసేవకే వినియోగించేవాడు. అది బొమికలు కనపడకుండా బలిసిపోయింది. బ్రహ్మచారి రోజూ గోస్తోత్రంచేసి, దాని కాళ్ళవద్ద తలపెట్టి నమస్కరించేవాడు. అట్లని అది పాలిచ్చేటప్పుడు కాలుకదిపితే ఊరకుండేవాడుకాదు. కర్రపుచ్చుకొని నాలుగైదు అంటించేవాడు. అతడు కురుక్షేత్రంవద్ద ఒక గ్రామంలో జన్మించాడు. సంస్కృతం చదువుకొనే నిమిత్తం చాలాఏళ్ళక్రితం కాశీకి వచ్చాడు. వ్యాకరణంలో లఘుకౌముది కొన్నిపుటలు మాత్రమే చదివాడు. వట్టి మందబుద్ధి. బ్రహ్మచారివద్ద అయిదుగురు విద్యార్థులు ఉండేవారు. అతడు ధనవంతుడేమీ కాదు. తన జీవితం ఏదోవిధంగా గడిచిపోతున్నది. పట్టణంలో అతనికి కొంత ఆదాయం వచ్చేది. దానిద్వారా సంస్కృతవిద్యార్థులకు తోడ్పడేవాడు. వారు తన ఆవుకు మేత నీళ్ళు పెడతారని ఆశించి ఆవిధంగా చేయడంలేదు. కొందరు విద్యార్థులు తనవద్ద ఉన్నారంటే అదే సంతృప్తి.

బ్రహ్మచారిఇంట వారంరోజులు ఉన్నారో లేదో, రాహుల్జీ తండ్రిగారు వచ్చారు. కాశీకి తిరిగివద్దామనే నిశ్చయంతోటే రాహుల్జీ ఇంటికివెళ్ళారు. ఇంటివారందరూ తమ తప్పును గుర్తించారు. సంస్కృతం చదువుకోవడానికి ఎట్టి ఆటంకం కలిగించకూడదనుకొన్నారు. కాని కాశీలో చదవడంకంటె, సమీపగ్రామంలో తన బంధువువద్ద చదువుకోవడం మంచిదని చెప్పారు. అది యాగేక్ జన్మస్థలం.

రాహుల్జీ లోగడ ఇక్కడ కొంతకాలం ఉండివెళ్ళారు. శుభ ముహూర్తాన ఆ గ్రామంలో చదువు ప్రారంభించారు. లఘు కౌముదితోబాటు హితోపదేశంకూడ మొదలుపెట్టారు. ఈ విధంగా రెండు నెలలన్నర చదివారో లేదో తిరిగి బుర్రలో పురుగుతొలిచింది. ప్రయాగలో తిరణాల నెపంమీద రాహుల్జీ, మరో ముగ్గురు కుర్రవాళ్ళు బయలుదేరారు. అందులో యోగేశ్, విశ్వనాథ్ అనే మరో కుర్రవాడు ఉన్నారు. రైలుపట్టాలమీద, కాలినడకనే సారనాథ్ వెళ్ళారు. జైనమందిరంలో శిల్పాలను చూశారు. నగ్నంగా ఉన్న కొన్ని విగ్రహాలనుచూచి, ఇవి ఏమిటి? అని ప్రశ్నించారు. జైనవిగ్రహాలని అక్కడ ఉన్నవ్యక్తి సమాధానం చెప్పాడు. రాహుల్జీ పురాతత్వవస్తువులను, శిల్పకళను ప్రత్యక్షంగా చూడటం ఇదే మొదలు.

వీరు కాశీలో ఆగకుండానే గంగాపురం వెళ్ళారు. ప్రొద్దుగూకిన తర్వాత చునార్ చేరుకొన్నారు. అందుచేత కోటలోని భర్తృహరి సమాధిని చూడలేకపోయారు. ప్రయాగవెళ్ళడం వారి లక్ష్యం. ఆ ప్రకారమే అక్కడకు వెళ్ళారు. తిరణాల చూశారు. కుస్తీ, విమానంపై ఎక్కి తిరగడం ఆకర్షణీయమైన విషయాలు. కాని తమవద్ద డబ్బు లేదు. ప్రయాగనుండి ఎవరిగ్రామాలకు వారు వెళ్ళిపోయారు.

రాహుల్జీ క్రీ. శ. 1911 మార్చి నెలనుండి కాశీలో నిశ్చితంగా ఉన్నారు. ఇదేకాలంలో మరో దీర్ఘయాత్ర చేయాలని ప్రయత్నించారు. తన తాతగారి గ్రామంలో ఒకరు కాలినడకనే కలకత్తాకు వెళ్ళివచ్చినట్లు విన్నారు.

తానుకూడ ఆ విధంగా యాత్రచేయ సంకల్పించారు. కాశీలో తన గురువు తమ్ముడు దశరథ్, తానూ ఒకరోజు మాయమైనారు. పగటిపూట దారి ప్రక్క చేలలో పచ్చిబఠానీలు, శెనగలు కోసుకుతింటూ, రాత్రిపూట ఏదో ఒక గ్రామంలో తలదాచుకొంటూ దుర్గావతిదాకా వచ్చారు. ఆకలిబాధతో కాళ్ళు తేలిపోతున్నాయి. తన సహచరుడు దశరథ్‌కు కాళ్ళు వాచాయి. చాలాదీనంగా, "ఇక్కడనుండి వెనక్కి పోదాం" అన్నాడు. ఆ ప్రకారమే ఇద్దరు కాశీకి తిరిగి వచ్చారు.

సంస్కృత విద్యార్థులకు మోతీరాంబాగ్‌లో చక్కని ఏర్పాట్లు ఉండేవి. రాహుల్జీ అన్నిపాఠాలు ఒకరివద్ద నేర్చుకొనేవారుకాదు. వ్యాకరణం ఒకరివద్ద, వేదం మరొకరివద్ద నేర్చుకొనేవారు. ఎండాకాలం సెలవులలో విద్యార్థులంతా తమ స్వగ్రామాలకు వెళ్ళితే, ఆయన కాశీలోనే ఉండేవారు. ఇంటిపట్ల విరక్తే ఇందుకు మూలకారణం. ఒకరోజు రాహుల్జీ, అర్జున్ అనే మరో విద్యార్థి నవ్వులాటలోనే ముష్టియుద్ధానికి దిగారు. రాహుల్జీకి కాలు బెణికింది. పడవమీద ఆయనను రామనగర్ తీసుకువెళ్ళారు. వైద్యుడు రాహుల్జీ చెయ్యిపట్టుకొని ఒకవిధంగా లాగాడు. ఇక సరిఅయింది పో అన్నాడు. నిజంగానే సరిఅయింది.

మోతీరాంబాగ్‌లో మూడునాలుగు నెలలు ఉండటం, యజుర్వేదం, శివభక్తుల సంసర్గంవల్ల రాహుల్జీలో మరో మార్పువచ్చింది. అది వైష్ణవమతాన్ని వ్యతిరేకించే శివభక్తి. కాశీలో వైష్ణవులు (రామానుజీయ, నింబార్కీయ మొద

లైనవారు) తరచుగానే కనిపించేవారు. కాని తనతండ్రిగారి మెడలో ఒకబైరాగికట్టిన మాలనుచూచి రాహుల్జీ కోపపడేవారు. వైష్ణవమతానికి వ్యతిరేకంగా బూతులు వ్రాసినపుస్తకాలకోసం వెదికేవారు. "చక్రాంకిత మత నిరూపణ," మరో ఒకటి రెండు ఇలాంటి పుస్తకాలను చాలా శ్రమపడి సంపాదించారు. రాహుల్జీ మాటిమాటికి వత్తిడి చేయగా, ఆయన తండ్రిగారు తనకంఠహారాన్ని తెంచి పారవేశారు.

ఎండాకాలం సెలవులలో రాహుల్జీ రఘువంశం, వాల్మీకి రామాయణం, ఇతర సరళకావ్యాలు చాలాశ్రద్ధగా చదివేవారు. సంస్కృతభాష చదవడమంటే చీకటికొట్లో వెదకినట్లు ఉండే దశ దాటింది. సెలవులుముగిసినతర్వాత విద్యార్థులంతా వచ్చారు. కలకత్తా వ్యాకరణ ప్రథమపరీక్షకు కూర్చోమని రాహుల్జీకి తనగురువు సలహా ఇచ్చాడు. అందుకు ఆయన అంగీకరించారు.

## మంత్రతంత్రాలపై ఆసక్తి

నేపాల్‌లో మంచి మంత్రతంత్రవేత్తలు ఉన్నారని రాహుల్జీ విన్నారు. అందులో ఆయనకు కొంత అభిరుచి ఉంది. పూర్ణానంద అనే నేపాల్‌వాసి కాశీలోఉన్నట్లు తెలుసుకొన్నారు. ఆయనతో పరిచయం కలిగించుకొన్నారు. తంత్రసంబంధమైన పుస్తకాలుదొరికాయి. వాటినిచదివారు. రాహుల్జీకి కలిగిన మొదటిలాభం ఏమంటే, మనస్సును ఏకాగ్రంగా ఉంచినందువల్ల సంస్కృతభాషా

జ్ఞానం అభివృద్ధిఅయింది. ఒకపుస్తకంలో రాగితో బంగారు తయారుచేసేపద్ధతి వ్రాయబడిఉంది. రాహుల్జీ దానిని ప్రయోగించి చూడదలచారు. ఒక దుకాణానికివెళ్ళి, కావలసిన సామగ్రిఅంతా తెచ్చుకొన్నారు. తన బాల్యమిత్రుడైన యాగేశ్ గ్రామానికివెళ్ళి, అక్కడ ప్రయోగంచేశారు. కాని బంగారం తయారుకాలేదు.

కాశీకి తిరిగివచ్చి చదువు మొదలుపెట్టినతర్వాతకూడ రాహుల్జీకి తంత్రాలపై విశ్వాసం అలాగేఉంది. పూర్ణానంద్ 'అనంగరంగ' అనే హస్తలిఖితగ్రంథం ఇచ్చారు. అది నేపాలీభాషలోఉంది. అది కామశాస్త్రం. లోడీ పరిపాలించే కాలంలో సంస్కృతభాషలో వ్రాసిన గ్రంథానికి అనువాదం అది. అందులో ఎన్నో వనమూలికలు వ్రాయబడిఉన్నాయి. ఆ గ్రంథాన్ని రాహుల్జీ హిందీలోకి అనువదించుకొన్నారు. ఆయన తొలిఅనువాదం ఇదే. ఆ పుస్తకంలో వ్రాసినట్లు సుగంధతైలం తయారుచేయాలని రాహుల్జీ ప్రయత్నించారు. అతి కష్టంమీద తయారుచేశారు. కాని అంతకంటె మంచి తైలంసగంవెలకే బజారులో దొరికేది.

రాహుల్జీ మంత్రతంత్రవేత్తఅని విద్యార్థులలో పేరు మోశారు. ఒకపెద్ద జ్యోతిష్కునివద్ద అతనిప్రాంతానికే చెందిన విద్యార్థి ఒకడు ఉండేవాడు. రాహుల్జీ మంత్రశక్తి తెలుసుకొనేఅవకాశం ఆ విద్యార్థికి కలిగింది. దక్షిణ రూపంగా కానీ కానీ చొప్పున ప్రోగుచేసుకొన్న సొమ్ము ఖర్చుపెట్టి అతడు భాగవతం కొన్నాడు. అలా తెచ్చిన రెండు మూడురోజులకే దానిని ఎవరో కొట్టేశారు. ఆవిద్యార్థి

షోడశ శ్రీ హస్తత్రిపురసుందరి



చాలాచింతిస్తూ రాహుల్జీవద్దకువచ్చాడు. రాహుల్జీ గంభీర ముద్రదాల్చి, ఒక దేవతపేరు సూచించారు. ఆ దేవత వేదికపై ఉన్న ఇటుక ఒకటితీసి, ఈమంత్రం సవాలక్షపర్యాయాలు జపించమన్నారు. తానేదో భయంకరకార్యం ఒకటి చేయబోతున్నట్లు ఇరుగుపొరుగువారికి తెలియజేయమని చెప్పారు. తనగదికి తాళంవేయకుండాఉంచి, అప్పుడప్పుడు లోపలికి, వెలుపలికి పోతూఉండమని సలహాఇచ్చారు.

ఆ విద్యార్థి రాహుల్జీ చెప్పినట్లుచేశాడు. సాయంత్రం చాలా సంతోషంతో పరుగెత్తుకువచ్చి, తమదయవల్ల వస్తువు దొరికిందని చెప్పాడు. "నేను గదికి తాళంవేయకుండానే బయటికివెళ్ళాను. సాయంత్రంవచ్చి చూచుకొంటే, లోపల పుస్తకం పడిఉంది. నేను జపంకూడ మొదలుపెట్టలేదు. ఇటుకతీసినవెంటనే ఈవింత జరిగింది. పేరు చెప్పకూడదు. కాని ఆమనిషి జాడ తెలిసింది. వానికి రెండుసార్లు వాంతులు అయినాయి. ఇక నాపుస్తకాన్ని అరిగించుకోలేకపోయాడు. నేను మీమేలు మరవను. మంత్రబలంఅంటే ఇది!..." అన్నాడు.

ఆ విద్యార్థికి చదువుతో నిమిత్తంలేదు. అతనికి కావలసింది ఛత్రపుభోజనం, సుఖంనిద్ర. అతనిద్వారా తనపేరు దూరందాకా వ్యాపిస్తుందని రాహుల్జీ భయపడ్డారు. తనపేరు ఎక్కడా చెప్పవద్దని నొక్కిచెప్పారు. కాని అతడు ఒకరోజున వచ్చి, చాలా వినయంగా "మాజ్యోతిష్కుని సోదరికి సంతానంలేదు. ఎన్నోవ్రతాలుచేశారు. ఔషధాలు సేవించారు. కాని ఆమె గొడ్రాలుగానేఉంది. మీరేదైనాత్రతం

సూచించండి" అన్నాడు. "నన్ను గూర్చి వారికికూడ చెప్పావూ?" అని రాహుల్జీ ప్రశ్నించారు. "మాటజారింది. ఇక నన్ను ఏమిచేయమంటారు?" అని అతడు బదులు చెప్పాడు. ఇంటికివచ్చి వెళ్ళమని ప్రాధేయపడ్డాడు. గొడ్రాలికి సంతానం కలిగేట్లు చేసేవిషయమై తంత్రగ్రంథాలలో అనేకప్రయోగాలుఉన్నట్లు రాహుల్జీఎరుగుదురు. ఆ విద్యార్థి పోరుపడలేక రాహుల్జీ వారి ఇంటికివెళ్ళారు. గురువు పరోక్షంలో మంత్రవిద్యను ప్రయోగించడం ప్రమాదకరమని ఆ స్త్రీకి చెప్పి రాహుల్జీ తప్పించుకువచ్చారు.

రాహుల్జీ పూర్ణానందను అప్పుడప్పుడు కలుసుకొంటూ ఉండేవారు. మంత్రతంత్రాలపై ఆయనకృషి, శ్రద్ధ ఇంకా అధికమైంది. ఏదో ఒక పెద్దప్రయోగం చేయ సంకల్పించారు. ఒకరోజున పూర్ణానందవద్దకువెళ్ళి, మంత్ర సిద్ధికిగాని, దేవతాసిద్ధికిగాని ప్రయోగం ఒకటి చెప్పమని కోరారు. ఆయన కోర్కెను పూర్ణానంద మన్నించాడు. రాహుల్జీ ఒకగదిలో ఒంద్రుమట్టితో నేలపై షట్కోణం గీశారు. దానిమధ్య 'ఓ', ఆరుమూలలా 'శ్రీం, హ్రీం, క్లీం, ఫట్, స్వా, హా' వ్రాశారు. రోజూ పెందలకడే గంగా స్నానంచేసివచ్చి, చక్రపూజ చేసేవారు. పూర్ణానందచెప్పిన 'శ్రీం, హ్రీం, క్లీం' మంత్రాన్ని జపించేవారు. ఇలా తొమ్మిది లక్షలసార్లు జపించినతర్వాత, సింహవాహనం ధరించి దుర్గ సాక్షత్కరిస్తుందని, 'ఏమికావాలో కోరుకో' అని అడుగుతుందని, అప్పుడు ధనం, బలం, బుద్ధి, విద్య ఏది కావాలోఅది కోరుకొమ్మని పూర్ణానందచెప్పాడు. రాహుల్జీ

అధిక శ్రమవల్ల అధికఫలితం పొందగోరారు. రాత్రి కొన్ని గంటలు నిద్రపోవడంతప్ప, తక్కినకాలమంతా పూజకే వినియోగించేవారు. అయిదారు రోజులవరకు ఏమీజరగలేదు ఏడోరోజుకూడ గడచిపోతున్నది. సింహవాహినిజాడ లేదు. ఎనిమిదోరోజు ప్రొద్దుగూకింది. రాహుల్జీకి గుండెదడపుట్టింది. ఆ రోజు పూజాసామగ్రి చాలా సేకరించారు. భక్తిభావంతో, గద్గదస్వరంతో జగదంబను స్తుతించారు. "కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి"ని భావావేశంతో చాలాసార్లు వల్లించారు. జపంలో మిగిలిన భాగం కూడ పూర్తిఅయింది. మనస్సు భగవతీగుణచింతనలో, చెవులు కాలిఅందెలరవళి వినడంలో నిమగ్నమైనాయి. కళ్ళు ఎప్పుడెప్పుడని దశదిశల పరికిస్తున్నాయి. పూర్తిగా చీకటి పడిపోయింది. జగదంబదర్శనం కాలేదు. రాహుల్జీ మనస్సులో ప్రతిక్రియ ప్రారంభమైంది. ఆత్మహత్య చేసుకోవాలని నిశ్చయించారు. వెంటనే రెండుజాబులువ్రాసి, జంధ్యానికి కట్టుకొన్నారు. తనశవాన్ని మణికర్ణికవద్ద దహనం చేయాలని ఒక లేఖలో ఉంది. దౌర్భాగ్యుడైన కుమారుని కోసం చింతించవద్దని తన తండ్రిగారికి వ్రాసిన లేఖలోఉంది. పూజకోసంతెచ్చిన ఉమ్మెత్తపండ్లలో రెంటిని రాహుల్జీ ఏరుకొన్నారు. వాటి విత్తనాలుతీసి, పటికబెల్లంతోబాటు నూరారు. ఈ లేహ్యాన్ని తిని, గదిబయట పండుకున్నారు. ఆయనకు వాంతులైనాయి. మరునాడు ప్రొద్దెక్కేటప్పటికి కొందరు ఆయనను గట్టిగా పట్టుకొనిఉన్నారు.

అదే రోజున తన బాల్యమిత్రుడు యోగేశ్ కూడ

వచ్చాడు. అతడు రాహుల్జీని చెరువువద్దకు తీసుకువెళ్లాడు. ఒంట్లో వేడిమి భరించలేక రాహుల్జీ చెరువులోకి దూకారు. చూచినవాళ్ళు భయపడ్డారు. యోగేశ్ వెంటనే దూకి రాహుల్జీని బయటికి తెచ్చాడు.

రాహుల్జీ మంత్రసాధనలో తనప్రాణాలతో చెలగాట మాడారు.

## కాశీప్రయాణం

ఆయన ఆరోగ్యపరిస్థితి కొంత మెరుగైనప్పటికి, పుస్తకాలు చదవలేకపోయారు. పుస్తకంలోని అక్షరాలు పలుచనిసిరా అలికినట్లు కనిపించేవి. అందుచేత యోగేశ్ వెంట స్వగ్రామం వెళ్లారు. కొన్నివారాలైనా కంటిచూపు ఆవిధంగానే ఉంది. కలకత్తావ్యాకరణ ప్రథమపరీక్షకు దరఖాస్తుఫారం పూర్తిచేసి పంపే గడువుకూడ దాటిపోయింది. అక్షరాలు గుర్తుపట్టగలిగినప్పుడు రాహుల్జీ తిరిగి కాశీకి వెళ్ళారు.

ఇప్పుడు ఆయనలో కొంతమార్పు వచ్చింది. అయితే మంత్ర - తంత్రాలపట్ల, దేవీ - దేవతలపట్ల విశ్వాసం పూర్తిగాసడలలేదు. ఇరుగుపొరుగునఉన్న పండితులు ఆ విశ్వాసానికి ఇంకా దోహదం చేస్తున్నారు. కాని రాహుల్జీ తిరిగి తనప్రాణాలతో చెలగాటమాడదలచుకోలేదు. సాధువులు, సన్యాసులుకూడ ఇంగ్లీషు నేర్చినవారిని గౌరవిస్తూ ఉండటం రాహుల్జీ గమనించారు. ఆభాష నేర్చుకోవడానికి కొంతకాలం వెచ్చించదలచారు. ఒక యువకబ్రహ్మచారి

కుర్రవాళ్ళను మోసగించి తీసుకువెళ్ళే ముఠా



ఆయనకు ఆరోతరగతివరకు ఇంగ్లీషు పాఠాలన్నీ బోధించాడు. తంత్ర-మంత్రాలు, పూజలు వదలినందువల్ల ఆయనకు తగినంత వ్యవధిఉండేది. ఆ కాలాన్ని సంస్కృతం, ఇంగ్లీషుపుస్తకాలు చదువుకోవడానికే కాకుండా, హిందీ పుస్తకాలు, వార్తాపత్రికలు చదువుకోవడానికికూడ వినియోగించేవారు. అగర్వాల్ కులానికి చెందిన శ్రీప్రకాశ్ విదేశంనుండి తిరిగివచ్చినతర్వాత ఆయనను కులబహిష్కారం చేశారు. ఆ విషయమై కేసునడిచింది. ఆ కేసువివరాలు పత్రికలలో ప్రచురిస్తూఉంటే, ప్రజలు ఎగబడి చదివేవారు.

ఆ రోజులలో కుర్రవాళ్ళను మోసగించి పట్టుకుపోయి డబ్బులకు అమ్మివేసేముఠా ఒకటి కాశీలో ఉండేది. ఒకనాడు రాహుల్జీకి దారిలో ఒకవ్యక్తి ఎదురై, "నీకు ఉద్యోగం కావాలా?" అని అడిగాడు. ఆయనకు తియ్యని కబుర్లు చెబుతూ ఒక ఇంటివద్దకు తీసుకువెళ్లాడు. రాహుల్జీ లోపలికి వెళ్ళిచూడగా, ఇంకా అనేకమంది పల్లెటూరి యువకులు అక్కడఉన్నారు. అందులో తన వయస్సుగల కుర్రవాడు ఒకడు ఉన్నాడు. జరిగినమోసాన్ని రాహుల్జీ గ్రహించారు. "నిన్ను డబ్బులకు అమ్మివేస్తున్నారు. సముద్రం అవతలకు పంపిస్తారు" అని ఆ కుర్రవానిని హెచ్చరించారు. ఈ మాటలు మోసగానికి వినిపించాయి. అతడు మండిపడి రాహుల్జీవద్దకు రాబోయాడు. రాహుల్జీ వీధిలోకి పారిపోయారు. మోసగాడు ఆయనపై రాళ్ళువిసిరాడు. కాని రాహుల్జీ తప్పించుకొన్నారు. ఆ కుర్రవానిని ఎలాగైనా కాపాడాలని ఆయన సంకల్పం. సెంట్రల్ హిందూ కాలే

జిలో చదువుతున్న తనజిల్లా విద్యార్థులు ఇద్దరికి ఈ విషయం తెలియజేశారు. ముగ్గురూవచ్చి రోడ్డుపైనిలుచున్నారు. మోసగాళ్ళు ఇది గ్రహించి, వారిపై ఇటుకలు విసిరారు. దౌర్జన్యంగానైనాసరే, ఆ కుర్రవానిని మోసగాళ్ళ బారి నుండి కాపాడాలని కాలేజివిద్యార్థులు చేసిన ప్రయత్నం విఫలమైంది. బిసెంటమ్మగారు విద్యార్థులను శాంత పరచడమే ఇందుకుకారణం.

క్రీ. శ. 1912 వ సంవత్సరం ప్రారంభంలో రాహుల్జీ లఘుకౌముది పూర్తిచేసి, సిద్ధాంతకౌముది మొదలుపెట్టారు. అప్పటికి సరళనాటకాలు, కావ్యాలు, ఇతరులవద్ద, కొన్ని స్వయంగా చదివి పూర్తిచేశారు. యువకబ్రహ్మచారివద్ద ఇంగ్లీషు నేర్చుకొంటున్నారు. హిందీ స్వయంగానే చదువుతున్నారు. తన అనుచరులు కొందరు కొత్తగా తెరువబడిన దయానందస్కూలులో చేరారు. రాహుల్జీకూడ ఆ స్కూలులో చేరదలచుకొన్నారు. అర్ధఫీజు చెల్లించడానికి సిఫారసు సంపాదించారు. ఒకరోజున పరీక్షపెట్టి రాహుల్జీని ఏడవతరగతిలో చేర్చుకొన్నారు. అప్పటికి రాహుల్జీ సంస్కృతంలో కాలేజిచదువుతో సమానమైన చదువు చదివారు. గణితంలో బీజగణితం కొత్తది. కాని అందులోకూడ రాహుల్జీకి మంచిపేరు వచ్చింది. ఇంగ్లీషువ్యాకరణం ఆయనకు అంతబాగా రాలేదు. మాస్టరుగట్టిగా హెచ్చరించవలసి వచ్చింది.

తన బాల్యమిత్రుడు యాగేశ్ కూడ ఈ స్కూలులో చేరాడు. వీరిద్దరూకలిసి ఒక గది తీసుకొన్నారు. గదిలో

చేరిన మరునాడే యాగేశ్ గడియారాన్ని ఎవరో ఎత్తుకు పోయారు. అతడు చాలా చింతించాడు. కాశీనుండి ప్రయాగ వెళ్ళిపోయాడు. రాహుల్జీ తనబసను వేరొక చోటికి మార్చారు.

ఇదే రోజులలో రాహుల్జీకి ఒక సింధీ నవయువకుడు తటస్థపడ్డాడు. అతని ఒంటిపై చొక్కా చిరిగిపోయి ఉంది. దారిలో వెళ్ళుతూ రాహుల్జీని పలుకరించాడు. తాను ఇంటి నుండి పారిపోయివచ్చినట్లు చెప్పాడు. రాహుల్జీ అతనికి తన చొక్కా ఇచ్చివేశారు. రెండురోజులతర్వాత చూస్తే, ఆ నవయువకుడు అర్ధరూపాయి కిరాయిపై ఇల్లుతీసుకొని, పకోడీలదుకాణం పెట్టాడు. ఆర్థికంగా స్వతంత్రజీవనం గడుపు తున్నాడు. ఇది రాహుల్జీకి చాలా సంతోషం కలిగించింది. నవయువకుడు రాహుల్జీకి తన కృతజ్ఞత తెలిపాడు. తనతండ్రి ధనవంతుడని, అతని డబ్బుయావత్తూ విలాసాలకు ఖర్చు పెట్టి, ఇక్కడకు పారిపోయివచ్చానని చెప్పారు.

## పర్సా మఠాధిపత్యం

రాహుల్జీ ఒకనాడు తన గురువులలో ఒకరైన పండిత ముఖరాంజీ ఇంటికి వెళ్లారు. ఈ సందర్భంలో ఒక విద్యార్థి వచ్చి, తనను వేరొక ఇంటికి పిలుచుకుపోయాడు. అక్కడ ఇద్దరుముగ్గురు సాధువులు ఉన్నారు. ఇంగ్లీషులోఉన్న ఒక దావాతీర్పు రాహుల్జీచేతికి ఇచ్చారు. దానిని చదివి, సారాంశం చెప్పమని కోరారు. రాహుల్జీకి కొంత అగమైంది. కాని చాలా ఇంగ్లీషుపదాలు అర్థంకాలేదు. తీర్పు సారాంశం

మాత్రం చెప్పారు. తమకు అనుకూలంగాతీర్పు వచ్చిందని ఆసాధువులు ఎగిరి గంతులువేశారు. అందులో ఒక మహాంతి కూడ ఉన్నాడు. అతడు ఛత్రాజిల్లాలో ఒక పెద్దమఠాధిపతి. అతడు మఠాధిపత్యం ఒక శిష్యునిపేర వ్రాసిఇచ్చారు. దానికి ఇతరులు ఆక్షేపణ చెప్పారు. దావాలో మహాంతికి అనుకూలంగా తీర్పువచ్చింది. అయితే తీర్పు వచ్చేనాటికి మహాంతి శిష్యుడు మరణించాడు.

మహాంతి యోగ్యుడైన వేరొకవ్యక్తికి మఠాధిపత్యం అపజెప్పదలచారు. ఇందుకు కాశీలో అన్వేషణజరిపారు. ఒక రెండుపేర్లు సూచింపబడ్డాయి. కాని మహాంతికి ఎవరూ నచ్చ లేదు. చివరికి రాహుల్జీపేరును ఒకపండితుడు సూచించాడు. వైష్ణవశిష్యుడుగాఉండటానికి తయారుకావలసిందనికోరాడు. లోగడ ఆపండితుని ఇంటివద్దనే రాహుల్జీ దావాతీర్పు చదివి వినిపించారు. ఇప్పుడు రాహుల్జీ వైష్ణవమత విరోధికాదు. అయినప్పటికీ చదువు పాడవుతుందని ఆయనభయం. ఆయన ఇప్పుడు ఇంగ్లీషు, సంస్కృతం చాలాశ్రద్ధగా చదువు తున్నారు. మఠాధిపత్యం స్వీకరించినప్పటికి చదువుకు ఆటంకం ఉండదని, పైపెచ్చు ఉపాధ్యాయులను ఇంటివద్దకే రప్పించుకొని చదువుకోవచ్చునని ఆ పండితుడు సలహాఇచ్చాడు. ఈవిషయమై రాహుల్జీ దీర్ఘంగా ఆలోచించారు. ఆర్థిక దృష్ట్యాగాకుండా, తనఇంటికి, ఇంటివారికి దూరంగా ఉండాలనేదృష్ట్యా, రాహుల్జీ ఛత్రాజిల్లాకు వెళ్ళ నిశ్చయించారు. రెండుమూడు రోజులతర్వాత తన నిర్ణయాన్ని తెలియజేశారు. మహాంతి చాలా సంతోషించాడు.

శంకు చక్ర ముద్రలు



తాను ఎక్కడకు వెళ్ళిందీ ఇంటివారికి కొంతకాలం వరకైనా తెలియనివ్వకూడదని రాహుల్జీ ముందుగా నిశ్చయించుకొన్నారు. మహంతితో మాట్లాడి ఇందుకు కావలసిన అన్ని ఏర్పాట్లు చేసుకొన్నారు.

క్రీ. శ. 1912 సెప్టెంబరు నెలలో రాహుల్జీ రైలులో ఛప్రాజిల్లాకు వెళ్ళారు. ఆయన ఛప్రాస్టేషన్‌నుండి పర్సామఠానికి వెళ్ళడంలో ఎలాంటిఇబ్బందీ కలుగలేదు. మహంతి తగిన ఏర్పాట్లన్నీ చేశారు. పర్సామఠం చేరుకొన్నతర్వాత, పురోహితులు శుభముహూర్తంచూచి, రాహుల్జీని సాధువు చేశారు. మరణించిన రామఉదారదాస్ పేరుతోనే ఆయనను పిలిచారు. ఈతతంగం జరిపేటప్పుడు, ఇత్తడితో తయారు చేసిన శంఖచక్రముద్రను ఎర్రగాకాల్చి, రాహుల్జీ బాహుమూలాలలో వేశారు. కొత్తగావచ్చిన పోస్టుజవాను లేఖలపై మెల్లమెల్లగా ముద్రవేసినట్లు ఆచారి శంఖుచక్ర ముద్రలు వేశాడు. ఇది జరుగుతున్నప్పుడు రాహుల్జీ ఒకవైపు మొగం తిప్పుకొన్నారు. ఇలా చేస్తారని ముందే తెలిసిఉంటే కాశీనుండి ఇక్కడకు వచ్చేవారేకాదు

మఠంలో రాహుల్జీ సాధువుగా కాకుండా, సుకుమారుడైన రాజకుమారుడుగా ఉన్నారు. కాళ్ళుపట్టేవాడు, కోటు విస్పేవాడు, గొడుగుపట్టేవాడు-ఇలానౌకర్లు ఎంతోమంది ఉన్నారు. సాలీనా పంద్రెండువేలరూపాయల నగదు, అంతే విలువగల ధాన్యం ఆదాయంవచ్చే మఠం ఇది.

రాహుల్జీకి మహంతితో స్నేహం ఎక్కువైంది. అతడు ఎన్నో సంప్రదాయాలను రాహుల్జీకి ఎరుకపరచాడు. 'కత్తి'

అనడానికి బదులు 'చాకు' అనాలనికూడ నేర్పించాడు. రాహుల్జీకి తనస్వగ్రామంలో ఉన్నప్పుడు ఒకటి రెండుసార్లు గుర్రమెక్కి తిరిగారు. కాని ఇక్కడ అయిదువందలగుర్రాలు ఉన్నాయి. వీటితో పోల్చితే అక్కడిగుర్రాలు గాడిదలకు కూడ సరిరావు. మఠానికివచ్చిన వారంరోజులకు రాహుల్జీ గుర్రపుస్వారిచేశారు. సమీపంలో ఒక తిరుణాలకు కూడ వెళ్ళివచ్చారు.

కొద్దిరోజులకు అంతా పాత అయిపోయింది. రాహుల్జీకి చదువుపై దృష్టి మరలింది. "సరస్వతి" (హిందీ) "డాన్" (ఇంగ్లీషు) పత్రికలకు చందాకట్టారు. హిందీ పుస్తకాలు, సంస్కృతకావ్యాలు, నాటకాలు తెప్పించుకున్నారు. ఈవిధంగా శూన్యస్థితిలో కొంతమార్పు వచ్చింది. రాహుల్జీ అప్పుడప్పుడు గ్రామసీమకుకూడ వెళ్ళివచ్చేవారు. మఠానికి సంబంధించిన జమీందారీ గ్రామాలలో రైతులుఎంత దుస్థితిలో ఉన్నారో ఆయనకు అవగతమైంది. మహంతికి మఠం జమాఖర్చులు చూచేశక్తి, వీలు లేనందువల్ల రాహుల్జీయే చూచేవారు. లెక్కలువ్రాసేవారు. చేసే అవకతవకలు ఆయనకుబోధపడినాయి. అయితే వీటిలో తలదూర్చే ఇష్టం రాహుల్జీకి లేదు. ఆయనకు కావలసింది చదువు.

## తండ్రి పట్టుదల

ఇలా మూడు నెలలు గడిచిందోలేదో తన తండ్రిగారు మరొక దగ్గరబంధువును వెంటబెట్టుకొని వచ్చారు. ప్రమాదంనుండి తప్పించుకొనే మార్గమేమిటని రాహుల్జీ ఆలోచిం

చారు. అప్పట్లో మహాంతికూడ అక్కడలేరు. తన తండ్రి గారు, బంధువు మాటలలో మునిగిఉండటం కనిపెట్టి, ఎక్కడికైనా పారిపోవాలని రాహుల్జీ నిశ్చయించారు. మరునాడు ఉదయమే గుర్రపుబండిని కొంతదూరంలో సిద్ధంచేయమని బండివానితో చెప్పి ఉంచారు. ఏదో వంకపెట్టుకొని తన బంధువుదగ్గరనుండి తప్పించుకున్నారు. గుర్రపుబండిలో కూర్చుని రైలుస్టేషన్ దాకా వచ్చారు. జిల్లానుండి బయటికి, తాను ఎవరికీ తెలియని చోటికి వెళ్ళాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. గుర్రపుబండి వెనక్కు తిప్పుకొని పొమ్మని బండివానితో చెప్పారు. రైలు ఇంక కొంతసేపటికి గానిరాదు. అందుచేత కాలినడకను ఛప్రా వెళ్లారు. అక్కడ నుండి రైలులో ప్రయాణం చేయదలచారు. కాని పర్సా నుండి డబ్బు తెచ్చుకోవడం మరచారు. ఛప్రాలో తనకు ఠాకుర్ ప్రసాద్ అనే వ్యక్తిమాత్రమే పరిచయం. అతనివద్దకు వెళ్ళి డబ్బుఅడిగారు. అతనికి ఏదో అనుమానం కలిగింది. కొంచెంసేపు ఆగమన్నాడు. రాహుల్జీ తిరిగి వస్తుండగా, దారిలో తన తండ్రిగారు కనిపించారు. ఆయన పదకొండు మైళ్ళదూరం కాలినడకనే రొప్పుకుంటూ వచ్చారు. కన్నీరు కార్చుతూ ఏదో మాట్లాడబోయారు. జనం పోగవుతారని రాహుల్జీకి బిడియంవేసింది. "మీరు అల్లరిచేయవద్దు. నేను ఉదయమే పర్సాకువస్తాను," అని తండ్రిగారితో చెప్పారు.

ఉదయమే ఇద్దరూ పర్సాకు వెళ్ళారు. అప్పటికి మహాంతికూడ వచ్చాడు. స్వగ్రామంవెళ్ళి, పదిరోజుల లోపల తిరిగిరమ్మని అతడు రాహుల్జీకి చెప్పాడు. "పది రోజు

లలో నన్ను పంపించేమాట వట్టిది. అక్కడకు వెళ్ళగానే నా కళ్ళకుగంతలు కడతారు," అని రాహుల్జీ ఎంతచెప్పినా మహాంతి వినలేదు. 'మాటఇచ్చాను కాబట్టి, తప్పేదిలేదు' అని మహాంతి అన్నాడు. ఇద్దరు మనుష్యులను తోడుఇచ్చి పంపాడు.

వీరు 'మఫ్రా' స్టేషన్‌వద్ద దిగారు. పల్లెటూరిలో సరి అయిన సౌకర్యాలు లేనందువల్ల తనకుమారుడు దేశదిమ్మరి అయిపోయాడని రాహుల్జీ తండ్రిగారి అభిప్రాయం. అందు చేత పట్టణంలో రాహుల్జీకి మంచిదుస్తులు కుట్టించారు. సున్నం, జర్దాతో సహా ఖిల్లీలకు అవసరమైన సామగ్రి అంతాకొన్నారు. ఇదిచూచి రాహుల్జీ లోలోపల నవ్వు కొన్నారు.

స్వగ్రామం వెళ్ళినతర్వాత, రాహుల్జీని చూచి తాతగారు చాలా సంతోషించారు. నాయనమ్మ, పిన్నమ్మ కూడ సంతోషించారు. తనకుకూడ సంతోషం కలిగింది. పూర్వఘటనలన్నీ తనకు గుర్తుకువచ్చాయి. వారంరోజుల తర్వాత, తనవెంబడివచ్చిన మనుష్యులలో ఒకడు తిరిగి పర్సా బయలుదేరాడు. రాహుల్జీ తన పరిస్థితిని మహాంతికి చెప్పి పంపారు. పర్సావెళ్ళినమనిషి పదిరోజులలోనే తిరిగి వచ్చాడు. కాని రాహుల్జీని అతనివెంట పంపించడానికి ఎవరూ సుముఖంగాలేరు. అందుచేత అతడు వచ్చినదారి పట్టాడు. ఇంటివారికి చాలాసంతోషమైంది. వారంరోజుల తర్వాత రాహుల్జీ అజంగఢ్ స్టేషన్‌కు పారిపోయారు. కాని రైలు రాకముందే, ఆయన తండ్రిగారు అక్కడకువచ్చారు.

జ్ఞానం కూడ ఒక తృష్ణ



రాహుల్జీ తన ఓటమిని అంగీకరించి, స్వగ్రామానికి తిరిగి వచ్చారు. దారిలో తండ్రిగారు ఆయనను అనేకవిధాల బుజ్జగించారు. రాహుల్జీకి ఆయనపై కోపంరాలేదు. జ్ఞానం కూడ ఒకతృష్ణ అని ఆయనచేత ఒప్పించడం సాధ్యంకాదనుకొన్నారు.

## తిరిగి పర్సామఠంలో

ప్రయాగలో చదువుకొంటున్న యాగేశ్ సెలవులలో స్వగ్రామంవచ్చాడని తెలిసింది. రాహుల్జీ అతనిని కలుసుకొన్నారు. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. 'హోలీ' పండుగనాడుకూడ ఇద్దరూ ఆగ్రామంలో ఉన్నారు. యాగేశ్ తిరిగి ప్రయాగవెళ్ళవలసిఉంది. ఆ రోజున అతని వెంట తానుకూడ బయలుదేరవచ్చునని రాహుల్జీ ఉపాయం వెదకారు. రాత్రిపూట ఇద్దరూ యాగేశ్ తాతగారి గ్రామంలోఉన్నారు. యాగేశ్ వెళ్లే రైలుబండి కొంచెం ముందుగా బయలుదేరింది. రాహుల్జీ ఇంకోబండిలో ఇంకో వైపువెళ్లారు. భట్నీస్టేషన్వద్ద దిగి తనవేషం మార్చుకొన్నారు. ఆయన తన స్వగ్రామంలో గృహస్థవేషంలో ఉన్నారు. ఇప్పుడు తల, నూనూగుమీసాలు గొరిగించి సాధువైనారు.

రాహుల్జీ తిన్నగా పర్సామఠంవెళ్ళారు. మహంతి చాలా సంతోషించాడు. ఇక ఆయనను పిలుచుకురావడం అసాధ్యమని తండ్రిగారు ఊరకున్నారు. మఠవ్యవహారాలన్నీ నీవే చూచుకొమ్మని రాహుల్జీకి మహంతిచెప్పాడు. గుమాస్తాలు, పట్వారీలు మహంతికళ్ళలో దుమ్ముకొట్టి, ఎంతో

డబ్బు కాజేసేవారు. అందువల్ల మఠానికి వచ్చేఆదాయం తరిగి, ఖర్చుపెరిగింది. ఈపరిస్థితిని చక్కదిద్దడానికి రాహుల్జీ ప్రయత్నించారు. సాధువులు 15 మందిదాకాఉండేవారు. వారికి చదువుకోవాలనే కుతూహలం బొత్తిగా లేదు. ఎప్పుడూ అక్కరకురాని కబుర్లు ఏవో చెప్పుకుంటూ ఉండేవారు. రాహుల్జీ మఠంలోఉండగా ఓర్ఘూఅనేవ్యక్తితోమాత్రమే కావ్యచర్చ జరిపేవారు. జగన్నాథపండితునిగూర్చి వారు ఒకనాడు చర్చజరిపారు. షాజహాన్ కానుక ఇస్తానని చెప్పి నప్పుడు జగన్నాథపండితుడు ఇలా అన్నాడట :-

"న యాచే గజాలిం న వా వాజిరాజి,
న విత్తేషు చిత్తం మదీయ కదాపి,
ఇయం సుస్తనీ మస్తకన్యస్త హస్తా
లవంగీ కురంగీ దృగఙ్గీ కరోతు"

నేటికి మూడువందలఏళ్ళకు పూర్వం ఈ బ్రాహ్మణ మహావిద్వాంసుడు ఒక మహమ్మదీయ వనితను వివాహం చేసుకొన్నాడు. ఇది రాహుల్జీపై ఎలాంటి ప్రభావం కలిగించినట్లు లేదు. అప్పట్లో ఆయనభావాలు ఇంకోవిధంగా ఉండేవి.

## దక్షిణ దేశయాత్ర

పర్సామఠంలోఉండటం రాహుల్జీకి చీదరింపుపుట్టింది. అతని చుట్టూఉన్న సమాజమే ఇందుకు కారణం. బాల్యంలో తనకు కంఠస్థమైన "ప్రపంచపర్యటన చేయి," అనే వాక్యం మాటిమాటికి గుర్తువస్తున్నది. దేవాలయం నిర్మించే పెద్ద మేస్త్రీవద్ద మూడురూపాయలు ఇప్పించుకొని, క్రీ. శ. 1923

జులై నెలలో ఎవరికీ చెప్పకుండానే రైలుబండి ఎక్కారు. హాజీపురంలో రెండురోజులు ఉండి, బనారసీవెళ్ళారు. సాయంత్రం సమీపగ్రామంలో తల దాచుకొన్నారు. తర్వాత కొంతదూరం రైలులోను, మరికొంతదూరం కాలినడకను వెళ్లారు. గంగానదిదాటి క్యూల్‌లో రైలుకోసం ఆగారు. ఆయన వేష, భాషలు టిక్కెట్ కలెక్టరును ఆకర్షించాయి. అతడు రాహుల్జీకి చాలా మర్యాదలు చేశాడు. ఇంతలో రైలుబండివచ్చింది. రాహుల్జీ అందులో ఎక్కికూర్చున్నారు.

ఆయన ఎక్కినపెట్టెలో ఒక వకీలు ఉన్నాడు. కోర్టు సెలవులలో అతడు పూరీ, రామేశ్వరం, ద్వారకయాత్ర చేస్తున్నాడు. తనవెంట రమ్మని రాహుల్జీని కోరాడు. విధిలేక రాహుల్జీ అంగీకరించారు. తిండిఖర్చులు వకీలే భరించాడు. రాహుల్జీని టిక్కెట్టు అడిగినవాడు లేడు. అయితే ఖుర్దానుండి పూరీదాకా టిక్కెట్టు తీసుకొన్నారు. వీరికి ఒక పండా తోడైనాడు. వీరు పూరీ జగన్నాథ దేవాలయాన్ని సందర్శించారు. దేవాలయంపైభాగానఉన్న బూతుబొమ్మలు వారికి నచ్చలేదు. రాహుల్జీ పూరీలో రెండుమూడురోజులు ఉన్నారు. ఇక్కడనుండి తాను కాలినడకను యాత్రసాగిస్తానని చెప్పారు. కాని వకీలు ఒప్పుకోలేదు.

ఇద్దరూ మద్రాసు మెయిల్ ఎక్కారు. దారిలో కొత్తదృశ్యాలు అనేకం కనిపిస్తున్నాయి. స్త్రీ, పురుషుల వేషాలలో మార్పును గమనిస్తున్నారు. తాము ఒక కొత్త ద్వీపఖండంలోకి వెళ్లుతున్నట్లుంది. ముఖ్యంగా ఆంధ్రస్త్రీల వేష భాషలు రాహుల్జీకి వింతగా కనిపించాయి. తాము

ఉదయం పది గంటలకు మద్రాసు చేరుకొన్నారు. ఈ పెద్ద పట్టణంలోని భవనాలు చాలా భాగం ఒంటి అంతస్థువిగా ఉండటం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది. స్త్రీలు ముదురు రంగు చీరెలుధరించి ఉన్నారు. ఈ ప్రాంతంలో ఘోషా పద్ధతి లేకపోవడం రాహుల్జీకి వింతగా తోచింది.

రాహుల్జీ సాయంత్రం సైదాపేటకు రైలు టిక్కెట్టు తీసుకుని, వకీలు ప్రక్కన కూర్చున్నారు. తాను వేరుగా కాలినడకనే యాత్ర చేయాలని రాహుల్జీ ఉద్దేశం. వకీలు కారణంగా ఇది నెరవేరలేదు. ఇంతలో టిక్కెట్టు కలెక్టరు వచ్చి ఆయన టిక్కెట్టుచూశాడు. ఈ బండి సైదాపేటవద్ద ఆగదని చెప్పాడు. ఇలా ఏదో ఒక ఆటంకం జరగాలని రాహుల్జీ కోరుకొంటున్నారు. వకీలు టిక్కెట్టు కలెక్టరుతో ఏదో వాదిస్తున్నాడు. రాహుల్జీ ఈ సందడిలో తప్పించుకుని రెండో ప్లాట్ఫారంవద్దకు వచ్చారు. సైదాపేటకువెళ్ళే బండి ఎక్కారు. స్టేషన్లోదిగి ఆరాత్రి ఒక సత్రం బయట అరుగుమీద పండుకున్నారు. ఉదయమే ఒక బంగాళా ఆవరణలో ప్రవేశించి, నూతిదగ్గర స్నానంచేశారు. ఇది కాపురం ఉన్న బంగాళాఅని, అనుమతిలేకనే ఇందులోకి వెళ్ళకూడదని ఆయనకు తెలియదు. అయినప్పటికీ ఎలాంటి ఇబ్బంది కలుగలేదు. ఆ ఇంటివారు ఆయనకు భోజనం పెట్టి పంపించారు. తిరుపతికి దారి చూపించారు. రాహుల్జీ తిరుపతి దాకా కాలినడకనే వెళ్లారు. దేవస్థానం చూచి, ఆ రాత్రి ఉత్తరాది మఠంలో తల దాచుకున్నారు. దక్షిణదేశ తీర్థస్థానాలలో, ముఖ్యంగా తమిళప్రాంతంలో ఉత్తరాది

ఆచార్యులు, సాధువులు ఎక్కువగా ఉన్నట్లు ఆయనకు తెలిసింది. వారిపేర్లు వ్రాయించుకొన్నారు. మఠంలో స్త్రీలు ఉండటం ఉత్తరాదిలోవలె ఇక్కడ నిషిద్ధం కాదని రాహుల్జీకి తెలిసింది. ఉత్తర భారతదేశంలో బ్రాహ్మణులు కానివారందరినీ 'శూద్రులు'గా లెక్కించరు. భోజన, ప్రణామాలు మినహాయిస్తే, అందరూ సమానులుగా భావింపబడతారు. ఇక్కడ మద్రాసుబ్రాహ్మణులు ఇతరులను చాలా నీచులైన 'శూద్రులు'గా లెక్కిస్తున్నట్లు రాహుల్జీ గమనించారు.

## తిరుమళిలో అధ్యయనం

ఆయన రోజుకు ఒక దేవాలయం చొప్పున సందర్శిస్తూ, తిరుమళికి వెళ్ళారు. ఉత్తరదేశం నుండి వచ్చి, ఇక్కడ స్థిరపడిపోయిన హరిప్రపన్నాచార్యుని కలుసుకొన్నారు. తమిళ బ్రాహ్మణుల జాత్యహంకారానికి తాను ఎలా గురైందీ ఆచార్యుడు రాహుల్జీకి వివరించాడు. అతడు ఉత్తరాది నుండి వట్టి చేతులతో వచ్చాడు. పుష్ప కైంకర్యం ద్వారా మొదట్లో నెలకు యాభై రూపాయలకు పైగా ఆదాయం వచ్చేది. కాని ఈరోజున స్వంతంగా రెండు ఇళ్లు, ఒక గులాబితోట, ఎన్నో ఎకరాల మాగాణి సంపాదించాడు. ఇదిగాక కొన్ని వేల రూపాయలు వడ్డీకి ఇచ్చాడు. ఇదంతా 'స్వామికృప' అని హరిప్రపన్నాచార్యుడు అన్నాడు. యిక్కడే తన ఇంట్లో భోంచేస్తూ, సంస్కృతం చదువుకొమ్మని రాహుల్జీని కోరాడు.

రాహుల్జీకి ఇంతకంటె కావలసింది ఏముంది? స్థాని కంగాఉన్న సంస్కృత పాఠశాలలో చేరారు. టి. వెంకటా చార్య, రంగా, శ్రీనివాస ఆయనతోడి విద్యార్థులుగా ఉన్నారు. రాహుల్జీ తనకు అపరిచితమైన కావ్య, నాటకా లెన్నింటినో ఇక్కడే చదివి పూర్తిచేశారు.

ఇక్కడఉన్న నాలుగు నెలలూ రాహుల్జీకి సంతృప్తి గానే ఉంది. ఒకనాడు తన తోడివిద్యార్థి నివసించే వీధిలో పెండ్లి జరిగింది. వరుడు తన అక్కకూతురును వివాహ మాడినాడు. దక్షిణాదిలో ఇలాంటి సంప్రదాయం ఉన్నట్లు రాహుల్జీ ఇదివరకే విన్నారు. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా చూశారు. ఈ సంప్రదాయం ఆయనకు నచ్చలేదు. కోడలు నిద్రలేవకముందే, అత్తగారే ఇంటిపనులన్నీ చూస్తూ ఉండ టం రాహుల్జీ గమనించారు. అత్తగారికి వృద్ధాప్యంలో కూడ విరామంలేకుండా చేయడం ఘోర మనిపించింది. ఈ విషయమై కొందరిని ప్రశ్నించగా, అత్తగారు కోడలుగా ఉన్నప్పుడు ఇలాంటిసుఖం అనుభవించిందని చెప్పారు. దక్షిణాదిలో అత్తగారు సాధారణంగా తన రక్తబంధువుల పిల్లనే కోడలుగా తెచ్చుకొంటుందని, అందువల్ల కోడలికి, కోడలుపిల్లలకు సేవచేయడం ఆమెకు ఇష్టంగానే ఉంటుం దని తెలిపారు.

తాను ఇక్కడ ఉన్నట్లు రాహుల్జీ పర్నామహంతికి, తన బాల్యమిత్రుడు యాగేశ్‌కు ఉత్తరాలు వ్రాశారు. జాబు అందగానే మహంతి పాతికరూపాయలు మనియార్డరుచేస్తూ,

అవసరమైతే ఇంకా డబ్బుపంపుతానని బదులు వ్రాశారు. దక్షిణాది తీర్థాలలో బాగా పర్యటించి రమ్మని కోరారు.

కడుపులోచల్ల కదలకుండా దక్షిణాది బ్రాహ్మణులు సుఖజీవనం చేయడం, ఉత్తరాది బ్రాహ్మణులు ఇతరుల వలెనే పొలాలలో శ్రమించడం రాహుల్జీకి విడ్డూరంగా కనిపించింది. మహమ్మదీయుల పరిపాలనరాకపూర్వం ఉత్తరాది బ్రాహ్మణులు వీరివలెనే సుఖజీవనం గడిపేవారు. అగ్రహారాలు మొదలైనవి ఊడిపోయినతర్వాత వారు కాయకష్టానికి అలవాటుపడ్డారు. ఆదినుండి హిందువుల పరిపాలనకిందఉన్న దక్షిణాదిలో బ్రాహ్మణులు పూర్వంవలెనే సుఖజీవనం గడుపుతున్నారు. అలాగే విద్యావంతులుగాకూడ ఉన్నారని రాహుల్జీ అభిప్రాయం.

రాహుల్జీ తిరుమలనుండి మరొకపర్యాయం తిరుపతికి వెళ్ళారు. పంక్తిభోజనం వడ్డిస్తారని తెలిసి దేవాలయసభామండపంలోకివెళ్ళి కూర్చున్నారు. వంటవాడు వచ్చి మర్యాదగానే ఆయనను మండపంవెలుపల సాధువులపంక్తిలో కూర్చుండబెట్టాడు. రెండుచోట్లలో హెచ్చుతక్కువలు అనే భేదం లేదని రాహుల్జీకి తెలుసు. కాని వంటవానిప్రవర్తనను సహించలేక బయటికి వెళ్ళిపోయారు. ఇది దేవస్థాన ప్రముఖులకు తెలిసింది. జరిగినతప్పుకు క్షమాపణ చెప్పుకొన్నారు. రాహుల్జీ సభామండపంలోనే కూర్చుని భోంచేశారు.

తిరుపతిలో ఉండగా, తాను ఉత్తరాదిని కార్యక్షేత్రంగా చేసుకోవాలని, దక్షిణాదిని తన కార్యక్షేత్రంగా చేసుకోకూడదని రాహుల్జీ నిశ్చయించారు. పద్మామహాంతికి

టెలిగ్రాం ఇచ్చిన వెంటనే డబ్బు పంపించాడు. రాహుల్జీకి తిరుపతిలో ఉత్తరాదినుండివచ్చిన ఒక సాధువు కనిపించాడు. అతడు ఒకేచోట ఉండేవాడుకాదు. రాహుల్జీ అతని వెంట ప్రతిరోజూ సాయంత్రం అడవులలో సంచరించి వచ్చేవారు. ఇద్దరూ ఒకొక్కప్పుడు రాత్రి తొమ్మిదిగంటలకు తిరిగి వచ్చేవారు. అడవిలో పులిఉందని తెలిసినప్పటికీ రాహుల్జీ భయపడలేదు.

రాహుల్జీ తిరుపతిలో పది పదిహేనురోజులుఉండి, తిరిగి దక్షిణదేశయాత్ర కొనసాగించారు. పక్షితీర్థం, శివకంచి, విష్ణుకంచిమీదుగా రామేశ్వరం వెళ్ళారు. రామేశ్వరంలో దేవాలయనిర్మాణం ఆయనకు అచ్చెరువుగొలిపింది. దేవాలయనిర్మాణంలో ఉత్తరభారతీయులు ఎంతో వెనుకబడినట్లు తోచింది. రాహుల్జీ రామేశ్వరంనుండి కొందరు సాధువులవెంట ధనుష్కోటికి బయలుదేరారు. మార్గమధ్యంలో ఒక యువకబ్రహ్మచారి తోడైనాడు. తనది ఉత్తరదేశంలో మధుర అని చెప్పాడు. తానుకూడ ధనుష్కోటికి వెళ్ళుతున్నట్లు తెలియజేశాడు. తిరిగివచ్చేటప్పుడు ఒక ముఖ్యమైనవిషయం చెప్పాడు. తాను ప్రస్తుతం దక్షిణదేశంలో స్థిరపడిపోయానని, 'పామన్' అనేచోట ఉంటున్నానని వెల్లడించాడు. అతనివృత్తి వైద్యం. కొద్దిరోజులు అక్కడ గడిపి పొమ్మని రాహుల్జీని కోరాడు. అందుకు ఆయన సమ్మతించారు.

పామన్ జనాభాలో ఎక్కువమంది ముస్లింలు. బ్రహ్మచారికూడ ఒక ముస్లింఇంట్లో ఉంటున్నాడు. అతనివద్ద

రెండే మందులు ఉండేవి. అందులో ఒకటి శంఖభస్మం. వీటి తోనే అతడు అన్నిరోగాలూ కుదిర్చేవాడు. రోజుకు ఇరవై రూపాయలదాకా సంపాదించేవాడు. కాని ఈ ఆదాయం రేపటికి మిగలకూడదని అతని పట్టుదల. గంజాయి విపరీ తంగా కాల్చేవాడు. అతని వైద్యవిధానం నేర్చుకోవాలని రాహుల్జీకి కుతూహలం కలిగింది. ఇది ప్రత్యక్షానుభవం ద్వారా నేర్చుకోవలసిందేగాని నోటిమాటలద్వారా ఉప యోగం ఉండదని అతడు చెప్పాడు. సామగ్రి తెప్పించి, ముఖ్యంగా భస్మం తయారుచేయడం నేర్పించడానికి సిద్ధమై నాడు. కాని అప్పటికే మూడు నాలుగువారాలు గడచి పోయాయి. రాహుల్జీ ఇక అక్కడ ఉండలేకపోయారు. బ్రహ్మ చారి ఆయనను రామనాడుదాకా సాగనంపి వెళ్ళాడు.

## హంపీ సందర్శన

రాహుల్జీ ద్వారకకు వెళ్ళుతూ బెంగుళూరునగరాన్ని, విజయనగర (హంపీ) శిథిలాలను సందర్శించారు. రాహుల్జీ అప్పటికి భారతదేశచరిత్ర చదివారు. కాని ఆయనకు చారి త్రకదృష్టి ఇంకా ఏర్పడలేదు. తాను వైష్ణవమత వ్యతిరేక మైన పుస్తకాలు చదివేటప్పుడు, త్రిపుండ్ర, ఊర్ధ్వపుండ్ర తగాదాకూడ ఉన్నట్లు ఆయన గ్రహించారు. విజయనగర ఆలయాలలో ఒకరకమైన ఊర్ధ్వపుండ్రలు ఆయనకు కని పించాయి. ఊర్ధ్వపుండ్రలకంటె త్రిపుండ్రలు సనాతనమైనవని ఆయన అభిప్రాయం. రాహుల్జీ పంపాసరోవరాన్ని కూడ సందర్శించారు.

పిమ్మట హోసపేటనుండి రైలులో బయలుదేరారు. ముఖ్యమైన నగరాలలోను, తీర్థస్థానాలలోను ఒకటి రెండు రోజులు ఆగుతూ క్రీ. శ. 1914 జనవరిలో అహమ్మదాబాద్‌కు వెళ్ళారు. మామకూతురును మేనల్లునికి ఇచ్చి పెండ్లి చేసే సంప్రదాయం ఇక్కడిదాకా ప్రాకినట్లు రాహుల్జీ గమనించారు. తాను అహమ్మదాబాద్‌లో ఉండగా గుజరాతి పుస్తకాలు కొన్ని చదివారు. పర్సామఠంనుండి డబ్బు వస్తుందని కొద్దిరోజులు ఎదురుచూశారు. కాని అది రాకముందే ఆయన ప్రయాణమైవెళ్ళారు. తన సహచరుల సలహాను అనుసరించి ఆయన కథియవార్, ద్వారకవైపు వెళ్ళకుండా డాకోర్ హోలీపండుగ చూచి ద్వారకకు వెళ్ళనిశ్చయించారు.

మగధరాజు జరాసంధునితో శ్రీకృష్ణుడు యుద్ధంచేసి ఓడిపోయి, మధురనుండి ద్వారకకు పరుగెత్తివచ్చినందువల్ల, 'రణఛోడ్' (రణరంగంనుండి పారిపోయినవాడు) అనేపేరుతో అతని నల్లనివిగ్రహాన్ని డాకోర్‌లో ప్రతిష్ఠించిఉండటం రాహుల్జీ చూశారు. శ్రీకృష్ణుడు తాను ద్వారకవదలి డాకోర్‌కు వస్తానని ఒక సామాన్యగృహస్థునితో చెప్పగా, అతడు అతనిని డాకోర్‌కు తీసుకువెళ్ళాడట.

డాకోర్‌కురాగానే రాహుల్జీ పర్సామఠానికి తంతి ఇచ్చారు. మరునాడు మనియార్డరువచ్చింది. వెంటనే పర్సాకు రావలసిందిగా కబురుకూడ వచ్చింది.

డాకోర్‌నుండి పర్సామఠం చాలా దూరంలోఉంది. రాహుల్జీ రత్లాం, భోపాల్, బీనా, కట్నీ, ప్రయాగ, కాశీల

మీదుగా అక్కడకు వెళ్ళారు. కాశీలో చదివేటప్పుడు సహాధ్యాయిగా ఉన్న వనమాలికూడ పర్నామఠానికివచ్చి, మహంతి శిష్యుడైనాడు. ఇది రాహుల్జీకి చాలాసంతోషం కలిగించింది. కాని ఈ మఠవాతరణం ఏమీ బాగాలేదు. చదువుకోవాలనే కుతూహలం ఎవరిలోను కనిపించదు. ఇది రాహుల్జీకి విచారం కలిగించింది.

రాహుల్జీ ఒకనాడు మహంతితోకలసి జానకీనగరంలో జమీందారీవ్యవహారాలు చూడటానికై వెళ్లారు. జమీందారు ఒక చిన్నరాజు. స్త్రీ, పురుషులు కొట్లాడుకొంటే జరిమానా వేసేవాడు. మామూలు కొట్లాటలను పోలీసుస్టేషన్ దాకా పోనిచ్చేవాడుకాదు. ఇరుపక్షాలనుండి లంచంపుచ్చుకొని కేసు మాఫీచేసేవాడు. ఇలా ప్రతిసంవత్సరం చాలా డబ్బు గడించేవాడు. ఇది పూర్వకాలంనుండివస్తున్న పద్ధతే అని రాహుల్జీ అనుకొనేవారు. కాని పూర్తిగా న్యాయం చేకూర్చడానికి ప్రయత్నించేవారు. జానకీనగరంలో ఒక బలవంతుడు మరోబలహీనునిపై అత్యాచారం చేసినట్లు రాహుల్జీ దృష్టికి వచ్చింది. సాక్ష్యంద్వారా అత్యాచారం ఋజువైంది. రాహుల్జీ ఆ బలవంతునికి జరిమానా విధించారు. కాని జమీందారు బంట్లు అతని పక్షంచేరి, జరిమానా మాఫీచేయించడానికి ప్రయత్నించారు. ఈవిషయంలో రాహుల్జీ స్వభావం వారు ఎరుగుదురు. అందుచేత మహంతికిచెప్పి జరిమానా మాఫీచేయించుకొన్నారు. ఇది రాహుల్జీకి నచ్చలేదు. కోపగించుకొని జానకీనగరంనుండి పర్నాకువచ్చారు.

పర్నాలో ఉండడమంటే, తనకాలాన్ని వ్యర్థపుచ్చ

డనేనని రాహుల్జీ భావించారు. వనమాలితో కలిసి భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి ఆలోచించారు. తన బాల్యమిత్రుడు యోగేశ్ గుణాలు సహాధ్యాయి వనమాలిలో కూడ ఉన్నాయి. కొత్తచోట్లు, కొత్తదృశ్యాలు చూడటం ఇద్దరికీ ఇష్టమే. రాహుల్జీ అంటే ఇద్దరికీ అనురాగం మెండు. చదువుకోవడమంటే ఇద్దరికీ అంత ఇష్టంలేదు. ఈ ఒక్క విషయంలో ఆ ఇద్దరికీ అభిరుచి ఉన్నట్లయితే, నారితో రాహుల్జీ జీవితాంతం కలసిమెలసి ఉండేవారు.

రాహుల్జీ పర్సాలో ఉండగా, ఆయనపినతండ్రి మహాంతిదగ్గర అప్పుకోసం వచ్చాడు. తాను జోక్యం కలిగించుకోనని రాహుల్జీ స్పష్టంగా చెప్పారు. జానకీనగరంలో తనకు జరిగి పరాభవమే ఇందుకు కారణం.

రాహుల్జీ ఏనాడైనా వెళ్ళిపోతారని మహంతి భయం. అందుచేత ఒక సేవకునితో బాటు, ఒకసిపాయి, ఇద్దరు సాధువులను కాపలా ఉంచాడు. రాహుల్జీకి సంకెళ్ళు వేయలేదు కాని, వాస్తవంలో ఆయన ఖైదీగానే ఉన్నారు. ఇక్కడనుండి ఎప్పుడు వెళ్ళిపోదునా అని రాహుల్జీ ఆలోచిస్తున్నారు. తన వెంట రావడానికి వనమాలికూడ సిద్ధంగా ఉన్నాడు. ఇద్దరూ ఒకేసారి వెళ్ళిపోవడం అసంభవం అనిపించింది. అందుచేత తాను ముందుగా వెళ్ళి, పదిపన్నెండు మైళ్ళ దూరంలోగల మహారాజగంజ్ లో ఉంటానని, తర్వాత నీవు రమ్మని రాహుల్జీ వనమాలితో చెప్పారు. ఒకనాటిరాత్రి వర్షం కురుస్తుండగా, రాహుల్జీ తప్పించుకొని వెళ్ళిపోయారు. మరునాడు వనమాలికూడ వచ్చి ఆయనను కలుసుకొన్నాడు.

ఇద్దరూ కలిసి అక్కడకు సమీపంలోని ఇంకో మఠానికి వెళ్లారు. మహంతి అక్కడకుకూడ వచ్చి ఎంతో ప్రాధేయ పడ్డాడు. పర్సాలో ఉండే కాలమంతా వృథాఅయిపోతుందని, అందుచేత అయోధ్యకు వెళ్ళి చదువుకొంటామని రాహుల్జీ చెప్పారు. రెండురోజులతర్వాత అయోధ్యకు బయలుదేరారు.

## అయోధ్యలో చదువు

రైలుబండిఎక్కేటప్పుడు ఇద్దరూ వేర్వేరు పెట్టెలలో కూర్చున్నారు. ఇద్దరిలో ఒకరికి టిక్కెట్టులేదు. డొమిన్‌గఢ్ స్టేషన్‌లో దిగిచూడగా, వనమాలి రాలేదు. రాహుల్జీ స్టేషన్ మాస్టరును పరిచయంచేసుకొన్నారు. అతని తోడ్పాటుతో మానిక్‌పూర్‌నుండి లకడ్‌మండి దాకా రైలులోవెళ్ళారు. చేతిలోడబ్బులేదు. అయోధ్యకు కాలినడకనే వెళ్ళారు. రెండోరోజున వనమాలికూడవచ్చాడు. తర్వాత ఇద్దరూ వారం రోజులు పట్టణంలో తిరిగారు. ఇక చదువు మొదలుపెట్టాలని రాహుల్జీ నిశ్చయించారు. గోలాఘాట్‌వద్ద వేదాంత పాఠశాల ఉందనీ, ఒకమద్రాసు విద్వాంసుడు బోధిస్తున్నాడని తెలిసింది. రాహుల్జీకూడ అందులోచేరారు. విద్యార్థులు డజనుమంది కంటె ఎక్కువలేరు. మరొకచోట ఒకపండితుడు సామవేదం చెబుతున్నాడని తెలిసింది. రాహుల్జీ ఆయనవద్ద స్వరసహితంగా సామవేదం చదివారు. కాని ఆ పండితుని స్వరం గార్దభస్వరంవలె ఉండేది. అందువల్ల శ్రవణానందం లభించేదికాదు. అయితే అతడు చాలా ప్రేమతో వేదం చెప్పేవాడు.

పట్టణంలో మతసంబంధమైన చర్చలు జోరుగా సాగుతూఉండేవి. ఆర్యసమాజంవారు, సనాతనులు, క్రైస్తవులు, మహమ్మదీయులు సభలుజరిపి, ఒకరిమతాన్ని ఒకరు ఖండిస్తూ ఉపన్యాసాలు ఇచ్చేవారు. ఈ ఉపన్యాసాలు పత్రికలలో పడుతూఉండేవి. వేదాంత పాఠశాలవిద్యార్థులు ఒకచోట సభపెట్టి, ఉపన్యాసాలు ఇవ్వడం నేర్చుకొనేవారు. రాహుల్జీని ఒకరోజు మాట్లాడమన్నారు. తాను మాట్లాడుతున్నది ఏమిటోకూడ తెలియకుండా ఆవేశంతో ఉపన్యసించారు. అయినప్పటికీ ఆయనను సభికులు ప్రశంసించారు.

వేదాంతపాఠశాలను కొన్నికారణాలవల్ల మూసివేయ నిశ్చయించారు. అందుచేత రెండో పాఠశాల తెరచారు. తాత్కాలికసమితికి గోవిందదాస్ ప్రధానకార్యదర్శిగా, రాహుల్జీ సహాయకార్యదర్శిగా ఎన్నికైనారు. ఈ పాఠశాలకు చాలామంది తోడ్పడ్డారు. ఇదేసమయంలో యూరోపులో యుద్ధం చెలరేగింది. పత్రికాప్రపంచంలో రాహుల్జీకి పరిచయంగలగడానికి ఈయుద్ధం ఒక కారణమైంది. కలకత్తానుండి 'వంగవాసి' అనే వారపత్రిక వెలువడేది. అది చదివి వార్తలు తెలుసుకునేవారు. ఇంగ్లీషువాళ్ళపైనఉండే ద్వేషంకొద్దీ, వాళ్ళు ఓడిపోవాలని కోరుకునేవారు.

అయోధ్యకు కొద్దిదూరంలో దేవకాళివద్ద ఏటేటా నవరాత్రి ఉత్సవాలు జరుగుతాయి. ఈ సందర్భంలో జంతు

బలి విశేషంగా జరుగుతుంది. కాళీదేవికి బలి ఇస్తానని మొక్కుకొన్నందువల్ల తన కొడుకు బ్రతికాడని, తన మగని ప్రాణం దక్కిందని స్త్రీలవిశ్వాసం. ఆ విశ్వాసంతోనే వారు కాళీదేవికి జంతుబలి ఇస్తారు. కాని కొందరు వైరాగులు జంతుబలిని ఆపివేయాలని ప్రయత్నించారు. ఈ ముఠాలో రాహుల్జీకూడ చేరారు. కాళీదేవిగుడివద్దకువెళ్ళి పెద్ద పెద్ద ఉపన్యాసాలు ఇచ్చారు. ఎవరూ వినకపోయేసరికి, శాపాలు, చివరికి బూతులకు దిగారు. పండాలకు కోపంవచ్చి, వీరి మీద విరుచుకపడ్డారు. ఈ కొట్లాటలో రాహుల్జీకికూడ నాలుగు అంటించారు.

## ఆర్యసమాజంతో సంబంధం

రాహుల్జీ అయోధ్యలో ఉండగా, ఆర్యసమాజాన్ని ఖండించే పుస్తకాలే చదివారు. అందువల్ల ఆర్యసమాజం పట్ల ఆయనకు ద్వేషభావం ఉండేది. ఒకసారి స్వామీ దయానందుని 'సత్యార్థప్రకాశిక' పేరు విన్నారు. రాహుల్జీ దీనిని 'మిథ్యార్థ ప్రకాశిక' అనుకొనేవారు. ఒక పండితుడు ఆర్యసమాజాన్ని విమర్శించేటందుకే తనవద్ద 'సత్యార్థ ప్రకాశిక'ను ఉంచుకొన్నారు. రాహుల్జీ అతనివద్దనుండి ఆ పుస్తకం తీసుకుని చదివారు. ఆ గ్రంథం తర్కయుక్తంగా ఉన్నట్లు గ్రహించారు. కొందరు ఆర్యసమాజీయుల ప్రవ

త్రనవల్లకూడ రాహుల్జీ ఆర్యసమాజంపట్ల తనకుగల భావాన్ని మార్చుకున్నారు.

అయోధ్యలో వనమాలి రాహుల్జీతో కలసిలేరు. కాని ఇద్దరూ అప్పుడప్పుడు కలుసుకొంటూ ఉండేవారు. అయోధ్యనివాసం రాహుల్జీకి అరుచి కలిగించింది. ఆయన వయస్సు ఇప్పుడు 21 ఏళ్ళు. ఆయన మనః ప్రవృత్తిలోకూడ మార్పువచ్చింది. ఒక ఇరుకుగోతిలోనుండి విశాలమైన జలాశయంలోకి వెళ్ళాలని రాహుల్జీ తహతహలాడారు. చాలారోజులతర్వాత తన సమీప బంధువుకు ఒక ఉత్తరం వ్రాశారు. దానినిచూచుకొని, అతడు రాహుల్జీ తండ్రిగారికి ఆయనజాడ తెలిపారు.

—o—

# మూడో అధ్యాయం

## కొత్త వెలుగు

రాహుల్జీ వనమాలివద్ద సెలవుతీసుకొని తన తండ్రి గారివెంట స్వగ్రామం వెళ్ళారు. తన కుమారుని నెత్తిమీది నుండి వైరాగ్యభూతం వదలిపోయిందని రాహుల్జీ తండ్రి గారికి ఇప్పుడు నమ్మకం ఏర్పడింది. రానున్న పెనుతుఫానుకు ఈ శాంతి నిమిత్తమాత్రమని ఆయనతండ్రిగారికి ఏమి తెలుసు? రాహుల్జీకి బాల్యంలో చేసిన పెండ్లి స్థిరమైనదని ఆయన భ్రమపడ్డారు.

రాహుల్జీ దక్షిణాది తీర్థయాత్ర చేస్తున్నప్పుడే ఆయన తాతగారు చనిపోయారు. తన మనుమనికోసం ఆయన ఎన్నో కలలు గన్నారు.కాని అవి సఫలం కాలేదు. మనుమని చూడాలని పరితపిస్తూనే ప్రాణం వదిలారు.

రాహుల్జీ యుద్ధవార్తలు చదవడంకోసం యాగేశ్ గ్రామానికి వెళ్ళేవారు. పత్రికలలో ఏమి వ్రాసినప్పటికి, జర్మనీ జయిస్తున్నదని అందరూ అనుకొనేవారు. రాహుల్జీ యాగేశ్ గ్రామానికి వెళ్ళకపోతే, యాగేశ్ రాహుల్జీ గ్రామానికి వచ్చేవాడు.ఇంటివారికి అనుమానంగానే ఉంది. కాని వారు ఏమీ చేయలేనిస్థితిలో ఉన్నారు.

ఒకరోజున మంచంమీద పడుకొని, ఇద్దరూ ఆర్య సమాజంవారు వ్రాసిన గీతాలు ఏవో పాడుకొంటూ

ఉన్నారు. రాహుల్జీ బంధువు ఒకడు అక్కడకువచ్చి, "నేను పోరుగూరిలో ఆర్యసమాజంవారి సభ చూశాను. వారు ఇక్కడకు రాలేదా?" అని అడిగాడు. "ఇక్కడ అవసరం ఏమిఉంది?" అని రాహుల్జీ ఎదురుప్రశ్న వేశారు. "అదే, విధవా వివాహాలు జరుపుతున్నారు. అవి కొనసాగితే ఎన్నో ఇళ్ళలో దీపాలు ఆరతాయి," అని అతడు అన్నాడు.

అతడు నడికారుమనిషి. బీదరికం కారణంగా అతనికి పెండ్లి కాలేదు. అతడు చెప్పిన మాటలలో కొంత సత్యం ఉందని రాహుల్జీ అనుకున్నారు. ఎందుకంటె తన స్వగ్రామంలో ఇరవై బ్రాహ్మణకుటుంబాలు ఉంటే తొమ్మిది కుటుంబాలకు చెందిన తొలిసంతానాలకు పెండ్లిండ్లు కాలేదు. పెండ్లి విషయంలో చీకు చింత లేని కుటుంబాలు రెండు మూడు మాత్రమే ఉండేవి. తక్కిన అన్ని కుటుంబాలలోను వయస్సువచ్చిన మగవారంతా అవివాహితులుగానే ఉండేవారు. అందరికీ పెండ్లి అయితే, సంతానం కోకొల్లలుగా పెరిగేది.

రాహుల్జీ తండ్రిగారికి బాల్యంలోనే సంసారభారం నెత్తినపడింది. ఉమ్మడికుటుంబంలో ఎన్నో కలతలు తల ఎత్తుతూ ఉండేవి. ఆయన తల్లి ఇంటిమీద కాకిని వాల నిచ్చేదికాదు. ప్రతి ఒక్కరినీ కటువుగా మాట్లాడేది. అందు చేత అందరికీ చెడ్డ అయిపోయింది.

రాహుల్జీకి వైరాగ్యం, వేదాంతం పిచ్చి క్రమంగా తగ్గిపోతున్నది. విషయజిజ్ఞాస, యాత్రచేయాలనే కోర్కె ఎప్పటివలె ఉంది. ప్రయాగతిరణాల దగ్గరపడింది. అక్కడకు

వెళ్ళుదామని యోగేశ్‌తో ఆలోచించారు. ఇంటివారికి తనపై ఇప్పుడు పెద్ద అనుమానం లేదు. ఒకనాడు పాతిక రూపాయలు చేతికి తగిలాయి. రైలుఎక్కి యోగేశ్ కంటె నాలుగు రోజులుముందు ప్రయాగకువెళ్లారు. అక్కడ చాలా చోట్ల మతసంబంధమైన సభలు జరుగుతున్నాయి. రాహుల్జీ తొలిసారిగా పండిత మదనమోహన మాలవీయ ఉపన్యాసం విన్నారు.

తిండికి సరిపడ సంపాదించుకొంటూ, చదువు కొనసాగించాలని రాహుల్జీ సంకల్పం. ఒకనాడు 'ఇండియన్ ప్రెస్'కు వెళ్ళారు. ఏదైనా పనిఇమ్మని అడిగారు. రెండు రోజులు ముందుగావచ్చిఉంటే, ప్రూఫ్‌రీడర్ ఉద్యోగం దొరికేదని, అయితే ఇప్పుడు అదికూడ పూర్తి అయిందని వారు చెప్పారు. యోగేశ్ బంధువు ఒకాయన హైకోర్టులో పని చేసేవాడు. రాహుల్జీ అతనివద్దకు వెళ్ళి ఆలోచించారు. ఆగ్రాలో "ముసాఫిర్ విద్యాలయానికి" వెళ్ళి చదువుకోమని, అక్కడ అన్ని సౌకర్యాలు ఉన్నాయని అతడు చెప్పాడు.

## ఆగ్రా విద్యాలయంలో ప్రవేశం

ఆ ప్రకారమే రాహుల్జీ ఆగ్రా వెళ్ళారు. విద్యాలయం మేనేజరును కలుసుకొని, దరఖాస్తు ఇచ్చారు. "ఇంతవరకు ఏమి చదువుకొన్నావు?" అని మేనేజరు అడిగాడు. విద్యాలయంలో చేరడానికి రాహుల్జీకి తగు యోగ్యతలు ఉన్నట్లు ధ్రువపడింది. "నీవు ఇక్కడ చదివి ఆర్యసమాజ ప్రచారం చేయగలవా?" అని మేనేజరు అడిగాడు.

"మీరు నన్ను అందుకు యోగ్యుడుగా చేస్తే, అలాగే" అని రాహుల్జీ చెప్పారు. సరే, విద్యాలయంలో చేరమని మేనేజరు కోరాడు. విద్యాలయం తెరచి అప్పటికి మూడు నెలలు అయిపోయింది. విద్యార్థులు పదిమందిదాకా ఉన్నారు. వారు ఎన్ని ఇబ్బందులకైనా ఓర్చి వైదికమత ప్రచారం చేయదలచారు. స్వాతంత్ర్యపోరాటంలో ఇదికూడ ఒక భాగమేనని వారి అభిప్రాయం. రాహుల్జీ ఇలాంటి విద్యార్థులను కలుసుకోవడం ఇదే మొదలు.

ఈ విద్యాలయంలో రెండేళ్ళకోర్సు ఉండేది. కనీసం ఉర్దూ మిడిల్ ప్యాసైనవారిని చేర్చుకొనేవారు. వారికి సంస్కృతం, అరబ్బీభాషలతోబాటు క్రైస్తవ, మహమ్మదీయ, హిందూ ప్రధానసంప్రదాయాలలోని బలహీనతలు, సిద్ధాంతాలనుగూర్చి, ఆర్యసమాజంయొక్క ముఖ్యసిద్ధాంతాలనుగూర్చి శిక్షణ ఇచ్చేవారు. ప్రతిరోజూ సాయంత్రం వీటిపై వక్తృత్వపోటీలు జరిగేవి. ఉపన్యాసాలు ఇచ్చేపద్ధతి నేర్పేవారు. ఈ విద్యాలయంలో బోధించే సంస్కృతం కంటె ఎక్కువే రాహుల్జీ లోగడ చదువుకొన్నారు. అందుచేత తాను ఆలస్యంగా చేరినప్పటికి, అరబ్బీ మాత్రమే నేర్చుకోవలసి వచ్చింది.

విద్యాలయ ఆవరణలో వక్తృత్వపోటీలు ఏర్పాటు చేసేవారు. రాహుల్జీ తనపై లేవదీసిన ఆక్షేపణలకు అంత ఎక్కువగా సమాధానం ఇవ్వకుండా, ప్రతిద్వంద్విపై ఆక్షేపణలవర్షం కురిపించి, అతనిని ఇరుకులోపెట్టేవారు. ఆక్షేపణల

సంఖ్య పెరిగి ప్రతిద్వంది, అన్నిటికీ సమాధానం ఇవ్వలేక పోయేవాడు.

ఆ రోజులలో అలహాబాద్‌నుండి 'హిందూస్తాన్' అనే ఉర్దూపత్రిక వెలువడుతూ ఉండేది. ఆ పత్రిక సంపాదకులలో చాలామంది జైలుకు వెళ్ళారు. ఆ పత్రిక బ్రిటిష్‌పరిపాలనను నిర్భయంగా ఖండిస్తూ ఉండేది. దేశస్వాతంత్ర్యంకోసం ఎన్నో త్యాగాలుచేసిన మహాపురుషుల చరిత్రలను ముసాఫిర్ విద్యాలయంలోని ఉపాధ్యాయులు వినిపించేవారు. విద్యాలయంలో పాఠాలు బోధించడం పూర్తిఅయినతర్వాత, మిగిలిన కాలాన్ని విద్యార్థులు సద్వినియోగం చేసుకొనేవారు. ఇతర పుస్తకాలు, పత్రికలు బాగా చదివేవారు.

ఈ విద్యాలయంలో చేరినతర్వాత రాహుల్జీకి ఒక నూతన అనుభవం కలిగింది. చీకటిలో తడువులాడుతున్న మనిషిని వెలుగులోకి తెచ్చి నట్లనిపించింది. ప్రపంచంలో కొన్నిపనులు చేయడానికై జీవించడం అవసరమని, మృత్యువునుకూడ మధురతమంగాఎంచే ఆదర్శాలు ఉన్నాయని రాహుల్జీకి అర్థమైంది. ఆయన రోజూ మధ్యాహ్నంపూట 'ముసాఫిర్' ఆఫీసుకువెళ్ళి అనేక పత్రికలు చదివేవారు. ఆయన వ్రాసిన ఒక లేఖ ఒకటి తొలిసారిగా ఆ పత్రికలో పడింది. పత్రికా కార్యాలయంలోకి సమీక్షార్థం వచ్చిన అనేక మతగ్రంథాలను రాహుల్జీ శ్రద్ధగా చదివేవారు. విద్యార్థులందరూ వారంలో ఎక్కువరోజులు వీధిఉపన్యాసాలు ఇవ్వడానికి వెళ్లేవారు. ప్రత్యేకంగా అస్పృశ్యుల సముద్ధరణకు పాటుపడేవారు.

వైష్ణవమతంపట్ల రాహుల్జీకి ఉదాసీనభావం ఏర్పడింది. మతాకర్షణ కాకుండా, పై పెచ్చు యాత్రచేయాలనేకోర్కె, ఇంటినుండి విముక్తిపొందాలనేభావం అందుకు దోహద మైనాయి. ఆర్యసమాజ సంపర్కంవల్ల రాహుల్జీబుద్ధి మిక్కిలి వికసించింది. కులకట్టుబాట్లను ఆర్యసమాజంవారు పరిమితం గానే ఖండించేవారు. ఇది ఒక అసహ్యమైన జబ్బు అని రాహుల్జీకి అనిపించేది. వర్ణవ్యవస్థపై రాష్ట్రంలో రెండు పార్టీలు ఏర్పడినాయి. గుణ, కర్మ, స్వభావాలను అనుసరించాలనే బ్రాహ్మణపార్టీ స్వభావాన్ని గూర్చి ఎక్కువ నొక్కి చెప్పేది. బ్రాహ్మణులను అణగద్రొక్కి, అస్పృశ్యులను పైకి తీసుకురావాలని వేరొకపార్టీ చెప్పేది.

ఆగ్రాలో ఉండగా రాహుల్జీ విదేశయాత్ర ముఖ్యంగా ఆసియాఖండయాత్ర జరపాలనికూడ కలలు కనేవారు. వైదిక మతప్రచారం చేయడం ఆయన ఉద్దేశం. ఇందుకు తగు సన్నాహాలు చేయదలచారు. తనలాంటి భావాలుకల విద్యార్థులు మరో ఇద్దరు ముగ్గురు ఉండేవారు. వారిలో రామగోపాల్ ఒకడు. రాహుల్జీకి ఎలాంటి బాదరబందీ లేదు. కాని రామగోపాల్కు భార్య ఉంది. ఆమెను చదివిస్తే, ఉపాధ్యాయినిగా జీవించగలదని రాహుల్జీ సలహా ఇచ్చేవారు. తమ భవిష్యత్ కార్యక్రమాలలో మిషనరీ విద్యాలయంకూడ ఒకటి. చదువుకొన్న నవయువకులకు అందులో ఆరేడు సంవత్సరాలు తర్ఫీదు ఇవ్వదలచారు. ఎవరు ఏ దేశయాత్ర చేయ సంకల్పించారో, వారు ఆ దేశభాష, సంస్కృతి, మతాన్ని గూర్చి ప్రత్యేకంగా చదువుకోవచ్చుననుకొన్నారు.

ఇంతలోనే తనతండ్రి చిక్కు శల్యావస్థలో ఉన్నట్లు రాహుల్జీకి జాబు వచ్చింది. స్వగ్రామం వెళ్ళి ఆయనను కలుసుకొన్నారు. రాహుల్జీని చూచి, ఆయన చాలా సంతోషించారు. తనకు ఇక మందూ మాకు అక్కరలేదని వైద్యుని వెనక్కు పంపించారు. కొద్దిరోజులతర్వాత రాహుల్జీ తిరిగి ఆగ్రాకు వెళ్ళడానికి అనుమతించారు.

క్రీ. శ. 1915 జూలై - ఆగస్టునాటికి, రాహుల్జీ విద్యలోను, ఉపన్యాసాలు ఇవ్వడంలోను తగినంత అభివృద్ధి సాధించారు. ఇప్పుడు ఆగ్రాలోనే కాకుండా, ఇతర పట్టణాలలోకికూడ ఉపన్యాసాలు ఇవ్వడానికి బయలుదేరేవారు. ఒకసారి జబ్బలపూర్ లో ఆర్యసమాజ-ముస్లిం మత మీమాంసను ఏర్పాటుచేసి, పెద్దపెద్ద పండితులను, ఉపన్యాసకులను ఆహ్వానించారు ఆర్యసమాజంతరఫున సంస్కృతగ్రంథాల నుండి ప్రమాణాలు చూపించడానికై రాహుల్జీకూడ ఆ సభలో పాల్గొన్నారు.

బెంగాల్ విభజన అనంతరం ప్రజలలో పెద్ద ఆందోళన బయలుదేరింది. బ్రిటిష్ప్రభుత్వ దమనవిధానం నానాటికి ఎక్కువైంది. ఢిల్లీలో వైస్రాయిపైన బాంబు విసిరారు. రాహుల్జీ ఆగ్రాలో ఉండగా, అవధ్బిహారీ, మాస్టర్ అమీర్ చంద్, బాలముకుంద్లను ఉరితీశారు. తమ ఆప్తులను హత్యచేసినదానికంటె ఎక్కువగా రాహుల్జీ తదితరులు దుఃఖించారు. గ్రంథమధనం, బుధజనసంసర్గంకూడ వారిని ఉత్తేజపరచాయి. తను రాజకీయాలు, మతమూ కలగాపులగంగా ఉన్నప్పటికీ, దేశ స్వాతంత్ర్యం కోసం

ఉన్నిళ్ళూరాను. కాని వీరిని ఉద్యమంలోకి ఆకర్షించే వారెవరూ లేకపోయారు.

విద్యాలయంలోని విద్యార్థులకు ఒక ముసలమ్మ వంటచేసిపెట్టేది. వీరిలో కొందరు ఆమెను ఊరకనే విసిగించేవారు. ఒకనాడు ఆమె రొట్టెలు తయారుచేయదలచింది. పిండి ఎంత పడుతుందో అంచనావేసుకొని తెచ్చింది. ఆమెను ఏడిపించాలని విద్యార్థులు నిశ్చయించారు. వంటగదిలోనే కూర్చున్నారు ఆమె రొట్టె తయారుచేసి, ప్రక్కన పెట్టీ పెట్టగానే విద్యార్థులు తినివేయ మొదలుపెట్టారు. రొట్టె పిండి పూర్తిఅయినా విద్యార్థులు అక్కడనుండి కదలలేదు. ఇక విధిలేక ముసలమ్మ నౌకరునుపంపి మళ్ళీ పిండి తెప్పించుకొన్నది. అది పిసికి మొదటిరొట్టె తయారు చేసేలోగానే వీరికి యథాప్రకారం ఆకలివేసింది. రెండోసారి తెచ్చిన పిండికూడ అయిపోయింది. మళ్ళీ నౌకరు పిండి తెచ్చేలోగా వీరు ఆకలితో అలమటిస్తున్నారు. 'ఎన్ని తింటారో తినండి' అని ముసలమ్మ అన్నది. 'ఎన్ని పెడతావో పెట్టు' అని విద్యార్థులు అన్నారు. నాలుగోసారి పిండితెచ్చిన తర్వాత, దానితో రొట్టెలు తయారుచేసి, ఇక నా చేతకాదు అని ముసలమ్మ చెప్పింది. విద్యార్థులు ఆ రొట్టెలుతిని వెళ్ళిపోయారు.

ఒకసారి విద్యార్థులు బృందావన గురుకుల వార్షికోత్సవం చూడటానికి వెళ్ళారు. అక్కడ ఉన్న తత్రేణికి చెందిన ఆర్యసమాజ ఉపదేశకులను, ప్రొఫెసర్ల ఉపన్యాసాలు విని ఆనందించారు. గురుకులంవద్దనే అరణ్యం ఉండేది. భవ

నాలు గొద్దిగా ఉన్నా, పరిశుభ్రంగా ఉండేవి. అక్కడి బ్రహ్మచారులనుచూస్తే ఋషియుగం జ్ఞాపకం వచ్చేది. ఈ సంస్థలో చదువుకొనే అదృష్టం తనకు ఎందుకు పట్టలేదని రాహుల్జీ అనుకొన్నారు.

రాహుల్జీ ఆగ్రాలో ఉండగా, పంజాబు వీరుల స్వాతంత్ర్య పోరాటం, లాహూరు కుట్రకేసుకు సంబంధించిన వార్తలు పత్రికలలో చదివేవారు. లాహోరు కుట్రకేసులో ముద్దాయిలకు ఉరిశిక్ష విధించినట్లు తెలిసి చాలా ఆందోళన చెందారు. అవసరమైతే ఆయుధం చేబూని వారిని విడిపించడం ధర్మమనుకొన్నారు. కాని ఆ రోజులలో జాతీయతను గూర్చి రాహుల్జీ అభిప్రాయం వేరు. జాతీయత, మతమూ వేరు అని భావించేవారు కాదు. మతం అంటే ఆర్యసమాజం, స్వామీ దయానందుని వైదికమతం అని ఆయన అభిప్రాయం. క్రైస్తవ, మహమ్మదీయ, యూదు, బౌద్ధమతాలే కాకుండా, హిందూమతంలోని అనేక సంప్రదాయాలను కూడ అంగీకరించేవారు కాదు. ఇవన్నీ వేద, విజ్ఞాన ప్రకాశంలో త్వరలోనే లీనమయ్యే మతాలని భావించేవారు. తర్కం ద్వారా ప్రతిద్వందిని తన పంథాలోకి ఆకర్షించాలని ఆయన అభిప్రాయం. బలప్రయోగమునేది మతాలలోని బలహీనతగా లెక్కించేవారు. అందుచేత క్రైస్తవ, మహమ్మదీయ మతప్రచారకులను కలుసుకొన్నప్పుడల్లా చాలా ప్రేమతో మాట్లాడేవారు.

ఆగ్రాలో శామ్యూల్ అనే బాప్టిస్టు మిషన్ స్కూలు హెడ్మాస్టరు ఉండేవారు. ఆయన తండ్రి బ్రాహ్మణుడుగా

ఉంటూ క్రైస్తవమతం స్వీకరించారు. ఆయన తల్లి తన కుమారుని శామ్యూల్ అనకుండా, శ్యామలాల్ అనే పిలిచేది. ఆమె జగన్నాథ దేవాలయానికి వెళ్ళదలచుకొన్నా, ఆకోర్కె నెరవేరేదికాదు. ఇందుకు తన కుమారుడు సానుభూతి కనబరచేవాడు. అయితే కోడలు వ్యతిరేకించేది. ఆమె అడ్డం చెప్పక పోయినట్లయితే, తాము తిరిగి బ్రాహ్మణులు అయ్యేవారం అని ముసలామె చెప్పేది. ఈ పరిస్థితి రాహుల్జీకి చాలా ఘోరంగా కనిపించింది. ఒకే కుటుంబంలో తల్లీ - కుమారులు హిందూ, క్రైస్తవ మతాలను ఎలా అనుసరించగలరో ఆయనకు బోధపడేదికాదు. ఆర్యసమాజం సర్వోత్తమమైనదని, విజ్ఞానశాస్త్రంవలె అదికూడ ప్రపంచమంతటా వ్యాపిస్తుందని ఆయన నమ్మకం. అయితే కులభేదం, అంటరానితనం ఇందుకు ఆటంకంగా ఉండేవి. ఇది రాహుల్జీకి గిట్టేదికాదు. ఆరోజులలో ఆయన ఆర్యసమాజంలో అతివాదభావాలను బలపరచేవారు. ఆర్యసమాజంవాడు ఎవడైనా తాను హిందువునని చెప్పుకోవడం సిగ్గుచేటనేవారు.

## లాహోర్ ప్రయాణం

రాహుల్జీ లాహోర్‌లో సంస్కృతవిద్యను అభ్యసించాలని నిశ్చయించారు. అయితే అక్కడకు వెళ్ళేముందు కొన్నిచోట్ల పర్యటించ దలచుకొన్నారు. కోట అనే గ్రామానికి వెళ్ళి, హోలీ ఉత్సవంచూశారు. పిమ్మట సికందరాబాద్, ఢిల్లీ, గుడ్‌గాం, సోహ్నా, స్థానేశ్వరాలను సందర్శించారు. స్థానేశ్వరంలో ఆర్యసమాజ ప్రచారం చేస్తున్న

తన సహాధ్యాయి రామగోపాల్‌ను కలుసుకొన్నారు. రాహుల్జీ ఆమోదంపొందే రామగోపాల్ ఇక్కడకు వచ్చాడు. తన భార్యను చనిపించి, ఆపిమ్మట వైదిక మత ప్రచారంకోసం వేసుకొన్న కార్యక్రమాన్ని అమలు జరప నిశ్చయించాడు. రామగోపాల్, రాహుల్జీలు ఇద్దరూ షాహాబాద్‌వరకు కలసివచ్చారు. పిమ్మట రాహుల్జీ లాహోర్‌కు, రామగోపాల్ స్థానేశ్వరానికి వెళ్ళారు.

లాహూర్‌లో ఖుష్‌హాల్‌చంద్ 'ఖుర్సంద్' రాహుల్జీకి ఆశ్రయం ఇచ్చాడు. వారంరోజులలోపలనే రాహుల్జీ డి. ఎ. వి. కాలేజిలో సంస్కృతవిశారద తరగతిలోచేరారు. కొద్దికాలంలోనే ఆయనకు స్కాలర్‌షిప్ లభించింది. కాలేజి హాస్టలు 'వైదికఆశ్రమం'లో ఆయనను చేర్చుకున్నారు. రాహుల్జీ హాస్టలు వంటపనివారికి రోజూ 1గంటసేపు చదువు నేర్పేవారు. తద్వారా నెలకు పది పండ్రెండురూపాయలు ముట్టేవి. అది పైఖర్చులకు సరిపోయేది.

సంస్కృతవిద్యార్థులలో తులసీరామ్ అనే వ్యక్తి ఉండేవాడు. అతడు పంజాబు నివాసి. ఏదో కూలిపనికోసం తూర్పు ఆఫ్రికాకుచెందిన కెన్యాకు వెళ్ళాడు. అక్కడ ఆర్య సమాజంతో సంబంధం ఏర్పడింది. అతనికి విద్యపై ఆసక్తి ఎక్కువైంది. కెన్యాలో పని వదలిపెట్టి చదువుకోసం లాహోర్‌కువచ్చాడు. అతని పట్టుదలను రాహుల్జీ ప్రశంసించారు.

వేసవిసెలవులలో రాహుల్జీ వేరొకచోట కాలక్షేపం చేయదలచారు. ఈశానంద్ అనే విద్యార్థి తన స్వగ్రామం రమ్మని ఆహ్వానించాడు. అక్కడ గురుకులం ఉండేది.

ఇద్దరూ ఆ గ్రామానికి వెళ్ళారు. గురుకులం సరిఅయిన స్థితిలో లేదు. ఆ సంస్థస్వాధీనంలో చాలా భూములుండేవి. కాని తగినంత పంట పండించేవారు కాదు. సమీపంలో అడవి ఉండేది. ఒకనాడు రాహుల్జీ అడవికి వెళ్ళారు. అడవి ఆవులు, ఎద్దు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉండటం చూశారు. ఒకటి రెండు ఆవులను అడవిలో వదలిపెడితే పెద్దమంద తయారై పోయిందని స్థానిక ప్రజలు చెప్పారు.

గురుకులంలో ఒక పండితుడు తన కష్టగాథను రాహుల్జీకి ఇలా వినిపించాడు: క్షంతవ్యం కాని నేరాలకు, పాపాలకు బలోపేతమైన ఈ సమాజమే కారణం. ఒకే వ్యక్తి ఇలాంటి సమాజాన్ని ఎలా ఎదిరించగలడు? నా కూతురుకు భర్త పోయాడు. ఈ వయస్సులో బ్రహ్మచర్యవ్రతం పాటించడం కష్టమని నాకు తెలుసు. ఆవిధంగా ఆశించడం ఆత్మవంచనే అవుతుంది. నాకు ఆర్యసమాజభావాలు ఉన్నప్పటికీ, పూర్వ సంప్రదాయాలను ఉల్లంఘించలేకపోయాను. నా కూతురుకు పునర్వివాహం చేయలేకపోయాను. ఫలితం ఏమైంది అంటే నా కూతురు నాలుగైదు ఏళ్ళలో మూడు నాలుగుసార్లు గర్భస్రావం చేసుకొన్నది. కామవాంఛ స్వాభావికమైనది. తండ్రిని కావడంచేత, నాకు హృదయం ఉండటంచేత, ఆమెకు ప్రాణదండన విధించలేకున్నాను. ఇలా చేయమని నన్ను సమాజం బలవంతపెడితే న్యాయకర్తఅయిన భగవంతుడు ఈ పాపాన్ని కూడ నా నెత్తిన వేస్తాడని భయపడుతున్నాను.

వితంతువుల్లో ఎవరికైనా ఇచ్చి వివాహంచేసే ధైర్యం

లేకపోతే వేరొకజిల్లాలో చేయండి అని రాహుల్జీ ఆపండితు నికి సలహా ఇచ్చారు.

ఈశానంద్, రాహుల్జీలు గురుకులంనుండి ముజఫ్ఫర్ నగర్ వెళ్ళి, అక్కడ కొన్నిరోజులు ఉన్నారు. లాహోర్ వెళ్లాలని అనుకొంటూఉండగానే,ఆయన సహాధ్యాయి ఒకరు ఆగ్రాకు రమ్మని ఉత్తరం వ్రాశారు. అందుచేత ఆగ్రాకు వెళ్ళి అతనిని కలుసుకున్నారు. ఇద్దరూ వైదికమతప్రచార కార్యక్రమంగూర్చిచర్చించారు.ప్రతిపనీ డబ్బుతోనే సాధ్యం అవుతుంది కాబట్టి చందాలు ప్రోగుచేయదలచారు.రాహుల్జీ ఆగ్రా, యశ్వంతనగర్, ఇటావా, కాన్పూర్‌లమీదుగా లక్నో వెళ్లారు. ప్రతిచోటా ఆర్యసమాజంలో మకాంపెట్టి, ప్రముఖ వ్యక్తులతో సంభాషణలు జరిపారు. లక్నోలో బౌద్ధవిహారం ఉన్నట్లు తెలిసింది. బౌద్ధభిక్షువులు చాలా పట్టుదలతో మతప్రచారం చేసినట్లు రాహుల్జీ అదివరకే విన్నారు. నలందావంటి మతప్రచారకులను తయారుచేసే కేంద్రాలు అవసరమనే భావం రాహుల్జీ ప్రభృతుల హృద యాలలో బాగా నాటుకుపోయింది. అందుచేత రాహుల్జీ ఒకనాటి సాయంకాలం బౌద్ధవిహారాన్ని చూడదలచారు. స్వామీ బోధానందతో భగవంతునిగూర్చి, వేదాలను గూర్చికాకుండా, బౌద్ధ సాహిత్యం, త్రిపిటకం తదితర విషయాలనుగూర్చికూడ సంభాషణలు జరిపారు. బెంగాలీలో ముద్రించిన కొన్నిబౌద్ధగ్రంథాల చిరునామా, 'జగజ్జ్యోతి' అనే మాసపత్రిక చిరునామా వ్రాసుకొన్నారు. కొద్దిసేప

ట్లోనే ముగిసిన ఈ ఘటన తనజీవితంలో ప్రముఖపాత్ర వహించగలదని ఆయనకు ఎలా తెలుసు?

తర్వాత రాహుల్జీ చందాలు ప్రోగుచేయడంకోసం చాలాచోట్లకు వెళ్లారు. ఆర్యసమాజం ఏర్పాటుచేసిన సభలలో మాట్లాడారు. రాయబరేలీలో హిందీభాష, సాహిత్యం గూర్చి ఒకఉపన్యాసం ఇచ్చారు. పలువురు ఆయన ఉపన్యాసాన్ని ప్రశంసించారు. కాశీకి బయలుదేరేముందు తనబాల్యమిత్రుడు యాగేశ్ కు ఒకఉత్తరంవ్రాశారు. అది చూచుకొని యాగేశ్ రాహుల్జీ తమ్ముడు శ్యామలాల్ ను వెంటపెట్టుకొని కాశీకి వచ్చాడు. స్వగ్రామంవచ్చి కొద్దిరోజులు ఉండి వెళ్ళవలసిందిగా వారిద్దరూ పట్టుబట్టారు. అందుకు రాహుల్జీ అంగీకరించక తప్పలేదు.

స్వగ్రామం వెళ్ళిన తర్వాత రాహుల్జీ తండ్రిగారు ఎక్కడికీ కదలనిచ్చేట్లు కనపడలేదు. గ్రామంలోని పెద్దలంతా వచ్చి ఇక్కడే ఉండాలని, తండ్రి ఆజ్ఞను పాటించాలని హితవు చెప్పారు. పారిపోవాలనే ఉద్దేశాన్ని బయల్పరచడం బాగులేదని రాహుల్జీ అనుకున్నారు. ఇంకోపర్యాయం విముక్తి చెందితే, ఈజిల్లాలోనే అడుగుపెట్టగూడదని నిశ్చయించుకొన్నారు. తన తండ్రిగారికి గృహకృత్యాలలో తోడ్పడసాగారు. వారంరోజులు గడచినతర్వాత, ఒంటరిగా పొరుగూరికివెళ్ళేఅవకాశం చిక్కింది. అక్కడనుండి కాశీకి పారిపోయారు. కాశీలో చాలారోజులు ఉండటం ప్రమాదమని తోచింది. అందుచేత మీర్జాపూర్ వెళ్ళి, మతప్రచారం మొదలుపెట్టారు. కాని రాహుల్జీ తండ్రి

గారికి ఎలాగో ఈవిషయం తెలిసింది. ఆయన రెక్కలు కట్టుకుని మీర్జాపూర్‌లో వాలారు. ఇద్దరూ ఒకరి అభిప్రాయాలను మరొకరికి తెలుపుకొన్నారు. కాని రాహుల్జీ తండ్రిగారు వెనక్కి వెళ్ళిపోవడానికి ఇష్టపడలేదు. ఒకసాధు కుటీరంలో ఉంటూ రాహుల్జీపై నిగా ఉంచసాగారు.

రాహుల్జీ మీర్జాపూర్‌లో ఆర్యసమాజానికి చెందిన ఒక యువకునిఇంట మకాం పెట్టారు. అక్కడ ఉన్నన్నిరోజులు, సాయంత్రంపూట మతప్రచారం చేసేవారు. ఆయన ఉపన్యాసాలలో జాతీయభావాలు మిళితమై ఉండేవి. వీటిపై ప్రభుత్వగూఢచారులు రిపోర్టులు పంపారు. మీర్జాపూర్‌లో రాహుల్జీ అభిరుచికి తగిన పుస్తకాలేవీ దొరకలేదు. హిందీ నవలలు మాత్రం లభ్యమైనాయి. రాహుల్జీ హిందీనవలలు చదవడం ఇదే మొదలు, ఇదేతుది. నెలరోజుల తర్వాత తన సహాధ్యాయి నుండి ఒక ఉత్తరం వచ్చింది. మహేశ్‌పురంలో ఒక వైశ్యుడు ఆర్యసమాజ విద్యాలయస్థాపనకై కొన్ని వేలరూపాయలు ఇవ్వదలచాడని, కనుక ఇక్కడకు వచ్చి, వెంటనే పని ప్రారంభించాలని ఆ ఉత్తరంలో కోరాడు. తాను కలలుకంటున్న విద్యాలయస్థాపన ఇంత స్వల్పధనంతో, తనకున్న అల్పజ్ఞానంతో నెరవేరదని రాహుల్జీ అనుకొన్నారు. అయినప్పటికీ తన సహాధ్యాయి మాటను కాదనలేక, మహేశ్‌పురం వెళ్ళదలచారు.

రాహుల్జీ తాను మీర్జాపూర్ నుండి బయటికి వెళ్ళే విషయం తెలియనివ్వలేదు. ముఖ్యంగా తన తండ్రిగారికి తెలిస్తే ప్రమాదమని ఆయన నిశ్చితాభిప్రాయం. అందుచేత

మొదలుకుండా రైల్వేస్టేషన్‌కు పారిపోయారు. బండి ఇంక కొంతసేపటికిగాని రాదని తెలిసి ఆయన భయపడ్డారు. ఇక్కడనుండి తప్పించుకొంటే, మళ్లీ తనను వెదకిపట్టుకోవడం అసాధ్యం అనుకొన్నారు. అయితే ఏది జరుగుతుందని భయపడ్డారో అదే జరిగింది. టిక్కెట్లు ఇవ్వకముందే తన తండ్రిగారు ప్లాట్‌ఫారం వద్ద కనిపించారు. పది పండ్రెండు మైళ్ళదూరం నడిచి ఆయన ఇక్కడకు వచ్చారు. రాహుల్జీని చూడగానే గోడుగోడుమని విలపించారు. అక్కడచేరిన ప్రజలందరూ రాహుల్జీని మందలించారు. విధిలేక ఆయన కాశీకి రెండుటిక్కెట్లు తీసుకొన్నారు. బండిదిగిన తర్వాత స్టేషన్‌లో ఒకరిబాధను ఒకరికి చెప్పుకొన్నారు. నేను మీకు ఏవిధంగానూ ఉపయోగపడనని రాహుల్జీ స్పష్టంగా తెలియజేశారు. "ఇక నేను నీకు అడ్డంరాను. అయితే నేను కూడ స్వగ్రామం వెళ్ళకుండా, ఇక్కడే కాశీలో జీవితం గడుపుతాను," అని ఆయన తండ్రిగారు చెప్పారు.

రాహుల్జీ తండ్రిగారు తాను చెప్పిన మొదటిమాటను పూర్తిగా పాటించారు. ఆయన అంతిమ దర్శనం ఇదే.

యాభై ఏళ్ళవయస్సు పూర్తిఅయ్యేదాకా తిరిగి ఈ జిల్లాలో అడుగుపెట్టబోనని రాహుల్జీ ప్రతిజ్ఞచేశారు.

## విద్యాలయ స్థాపనకు యత్నం

రాహుల్జీ కాశీస్టేషన్‌లో టిక్కెట్టు తీసుకోవడానికి వెళ్ళగా, ఛప్రాజిల్లా యాత్రికులు కొందరు కనిపించారు. ఆయనకు పర్సామఠం జ్ఞాపకంవచ్చి, మనస్సు ఒక క్షణ

కాలం అక్కడకు ఈడ్చింది. కాని తన గురుతర కర్తవ్యం తన ఎదుట నిలచింది. టిక్కెట్టుతీసుకొని బండి ఎక్కాడు.

మహేశ్ పురంలో తాను రామదీన్ ఇంటికి వెళ్ళ వలసి ఉంది. రామదీన్ ధనవంతుడైనవాడట్లు. అతని ఇంటి జాడ తేలికగానే తెలిసింది. తుపాకి గురిపెట్టడానికి తగినంత బెజ్జం ఆ ఇంటితలుపుకు ఉంది. ఆ గ్రామంలో మరికొన్ని ఇళ్ళతలుపులకుకూడ ఈ విధంగానే బెజ్జాలు ఉన్నట్లు రాహుల్జీ గమనించాడు. దొంగలనుండి ఆత్మరక్షణకు ఈ విధమైన ఏర్పాటు చేసుకొన్నట్లు తెలిసింది.

ఆర్యసమాజానికి తోడ్పడదలచిన వైశ్యశిఖామణి రామదీన్. అతడు తన తండ్రికి ఏకైక సంతానం. అతనికి వడ్డీవ్యాపారంతోబాటు బట్టలవ్యాపారంకూడ ఉంది. అతడు ఆర్యసమాజంచే ఆకర్షింపబడ్డాడు. విగ్రహారాధన, శ్రాద్ధం మానివేశాడు. అతనికి పురాణాలమీద నమ్మకం పోయింది. తనభార్యకు చదువునేర్పించి, ఆమెకుకూడ జంధ్యం వేయించాడు. అబద్ధం చెప్పడంకంటె మించినపాపం లేదని, సత్యానికిమించిన ధర్మంలేదని అతడు గ్రంథాలలో చదివాడు. దీనిని ఆచరణలో పెట్టాలని నిశ్చయించాడు. కొనుగోలుదారు ఎవరైనా బట్టల దుకాణంవద్దకు వచ్చి, ధర అడిగితే, తనకు గిట్టుబాటు అయిన ధర చెప్పేవాడు. బేరానికి అవకాశం ఇచ్చేవాడు కాదు ఈ పద్ధతివల్ల మొదట్లో కొంతచిక్కు ఏర్పడింది. కాని బస్తీలోకంటె తక్కువధరకు ఇక్కడ బట్టలు అమ్ముతున్నాడనే భావం ప్రజలకు కలిగింది. అందుచేత వ్యాపారం బాగా అభివృద్ధి

చెందింది. వడ్డీకి అప్పు ఇవ్వడం ద్వారా, వ్యాపారం ద్వారా సంపాదించిన సొమ్ము పాపపుసొమ్ము అనే విషయం రామ దీన్‌కు తెలియదు.

అతడు కొద్ది కాలానికి సన్యాసి అయి, స్వామీ బ్రహ్మనంద అని పేరు పెట్టుకొన్నాడు. అతని కుమారులే గృహకృత్యాలు చూచుకొంటున్నారు. ఆర్యసమాజ విద్యాలయానికి నాలుగు వేలరూపాయలు ఇచ్చేట్లు అతడే తన కుమారులను ప్రోత్సహించాడు. ఆ సొమ్ము వడ్డీకి ఇచ్చి, తద్వారా లభించే డబ్బు ప్రతినెల విద్యాలయానికి ముట్ట జెప్పాలని వారు నిర్ణయించారు.

ఇంత స్వల్పధనంతో విద్యాలయం నడపడం కష్టమని రాహుల్జీ అభిప్రాయం. అందుచేత రామదీన్ సలహా తీసుకొన్నారు. ఇద్దరూ చందాలకై ఇతర ప్రదేశాలకు వెళ్లారు. ప్రజలు డబ్బు, ధాన్యం వాగ్దానం చేశారు. రాహుల్జీ పత్రికల ద్వారాకూడ విజ్ఞప్తిచేశారు. ఇది చదివి కొంతమంది ప్రముఖులు మహేశ్‌పురం వచ్చారు. అందులో యోగేశ్ కూడ ఒకరు. వేసవికాలానికి ముందే మహేశపురంలో వైదిక విద్యాలయం ప్రారంభమైంది. అధ్యాపకులలో ఎవరికీ జీతం లేదు. తిండి, బట్ట ఇచ్చేవారు. ముసాఫిర్ విద్యాలయంలో వలెనే ఇక్కడకూడ విద్యాబోధ సాగింది.

మహేశపురం గ్వాలియర్ సంస్థానం సరిహద్దులో ఉన్న గ్రామం. ఇక్కడ ఒక అబ్బాయికి పెళ్ళి నిశ్చయమైంది. వధువు గ్రామం సంస్థానంలో ఉండేది. రాహుల్జీ ఒక పెద్ద ఒంటెపై ఆ పెళ్ళికి వెళ్ళారు. వరుని వయస్సు తొమ్మిది

పదేళ్లకంటె మించదు. పెళ్ళితతంగం ముగిసినతర్వాత ఒక దుస్సంఘటన జరిగింది. ఒంటెలను ఒక తోటలో కట్టివేసి ఉంచారు. కొందరు అల్లరిపిల్లలు పొట్టిఒంటెలపై ఎక్కి కూర్చోవడానికి ప్రయత్నించారు. దగ్గరలోఉన్న రాహుల్జీ ఒంటెకు కోపంవచ్చింది. కట్లు తెంపుకొని ఒక కుర్రవాని వెంట పడింది. వాడు చెట్లమధ్య అటూఇటూ పరుగెత్తుతున్నాడు. ఒంటె వానిని వదలిపెట్టడం లేదు. పెళ్ళివారిలో అధికభాగం భోజనానికి వెళ్ళారు. మిగిలిన కొద్దిమంది ఏమి చేయాలో దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. చెట్లులేకపోయినట్లయితే ఒంటె ఆ కుర్రవానిని ఎప్పుడో పట్టుకొనేది. కుర్రవాడు అలసిపోయాడు. నేలపడిపోయేట్లు ఉన్నాడు. ఇదే సమయంలో పెళ్ళివారిమధ్యనుండి ఒక కుర్రవాడు ఒంటెవైపు ఇటుకముక్క విసిరాడు. ఒంటె కంటికి దెబ్బతగిలి ఆగిపోయింది.

రాహుల్జీ మహేశపురంలో ఉండగా, రష్యా విప్లవాన్నిగూర్చి పత్రికలద్వారా తెలుసుకొన్నారు. అప్పటివరకు ఆయన సామ్యవాదాన్నిగూర్చి హిందీలోగాని, ఉర్దూలోగాని ఏ పుస్తకమూ చదివి ఉండలేదు. రష్యాలో శ్రమకుతగిన ఫలితం పంచి ఇచ్చేపద్ధతి ప్రచారంలో ఉన్నట్లు స్థూలంగా తెలిసింది. ఇది ఆయనపై నూతనప్రభావం కలిగించింది. సామ్యవాదంలోని విశిష్టతను ప్రజలకు ఎరుక పరచేవారు. ఆర్యసమాజ సిద్ధాంతాలను, సామ్యవాదంతో సమన్వయంచేయడానికి ప్రయత్నించేవారు.

స్వామీ బోధానంద ఇచ్చిన చిరునామాకువ్రాసి,

సింహళ, బర్మీలిపిలో ఉన్న బౌద్ధగ్రంథాలు, దేవనాగరలిపిలో ఉన్న 'కచ్చాన్' వ్యాకరణం తెప్పించుకున్నారు. 'కచ్చాన్' వ్యాకరణంద్వారా సింహళ, బర్మీలిపులు నేర్చుకోవడం తేలిక అయింది.

క్రీ. శ. 1917 లో వర్షాకాలం తర్వాత విద్యాలయాన్ని కాల్పీకి తరలించారు. ఒక అధ్యాపకుడు ఇంటికి వెళ్ళిపోయాడు. యాగేశ్ రాహుల్జీ కడగొట్టుతమ్ముడు శ్రీనాథుని తీసుకొనివచ్చాడు. శ్రీనాథునికి ఇది చదువుకొనే వయస్సు. కాని విద్యాలయంలో మతప్రచారకులకే స్థానం ఉంది. అందుచేత రాహుల్జీ అతనిని వేరొకచోటికి పంపించారు. రైలుచార్జీలకుగాను అతని చేతికడియాలు అమ్మివేశారు. అయితే శ్రీనాథుడు అక్కడ ఉండలేదు. కొద్దిరోజులకే స్వగ్రామం వెళ్ళిపోయాడు.

కాల్పీలో సంతజరిగేరోజున రాహుల్జీ ప్రభృతులు మతప్రచారం చేసేవారు. కాన్పూర్ జిల్లాలో ప్లేగుప్రబలి, చాలామంది చనిపోతున్నట్లు ఆర్యసమాజంవారి దృష్టికి వచ్చింది. వారు తమప్రాణాలనుసైతం లెక్కచేయకుండా రోగులకు సేవచేశారు. ఇందులో రాహుల్జీ ప్రముఖపాత్ర వహించారు.

ఒక మిత్రుని ప్రోత్సాహంపై రాహుల్జీ పర్నామఠం లోని వనమాలిపేర ఉత్తరం వ్రాశారు. మూడోరోజున అక్కడనుంచి టెలిగ్రాంవచ్చింది. సర్వజనుసుఖిస్తున్నది కాబట్టి వెంటనే పర్నామఠానికి రమ్మని మహంతి రాహుల్జీని కోరారు. టెలిగ్రాం అందిన కొద్దిరోజులకు వినకంగా ఒక

ఉత్తరం కూడా వ్రాశాడు. మఠానికి చెందిన ఆస్తులను కాపాడటం, వృద్ధాప్యంలో ఉన్న మహాంతికి తోడ్పడటంలో తప్పులేదని రాహుల్జీ భావించారు. వైష్ణవుని వేషంధరించి కాశీ మీదుగా పర్సామఠానికి వెళ్ళారు. సర్వేలో మహాంతికి అనేక విధాల తోడ్పడ్డారు. తాను వచ్చినపని పూర్తిఅయింది కాబట్టి వెళ్ళుతానన్నారు. మహాంతి ఎంతో ప్రాధేయపడినా వినలేదు. వనమాలిని మహాంతిగా చేయమని, తాను ఇంకా చదువుకోదలచానని చెప్పారు. మహాంతి అనుమతిపొంది జబల్‌పూర్ వెళ్లారు. అక్కడ వేద-మధ్యమపరీక్షకు కూర్చు న్నారు. మొదటితరగతిలో ఉత్తీర్ణులైనారు.

రాహుల్జీ తిరిగి కాల్పీకి వచ్చారు. రష్యా కార్మిక విప్ల వాన్నిగూర్చి వార్తలు అందుతున్నాయి. అందుకుసంబం ధించిన ప్రతి చిన్నవార్త రాహుల్జీకి ఆసక్తి కలిగించేది. తనలో తాను ఒక సామ్యవాదజగత్తును సృష్టించుకొన్నారు. క్రీ. శ. 1918 తొలిరోజులలోనే ఈవిషయమై ఒకపుస్తకం వ్రాయదలచారు. అయితే విద్యాలయం మూతపడినందువల్ల ఆపనిసాగలేదు. నాలుగేళ్ళతర్వాత ఆపుస్తకాన్నే మరో రూపంలో — అంటే సంస్కృతశ్లోకాలలో వ్రాయదల చారు. కాని అదికూడ కొన్ని సర్గలవరకే వ్రాయగలిగారు. చివరికి క్రీ. శ 1923- 24లో హజారీబాగ్ జైలులో 'ఇర వయ్యో శతాబ్దం' పేరుతో ఆపని పూర్తిఅయింది.

విద్యాలయాన్ని మహేశపురంనుండి కాల్పీకి తరలిం చిన తర్వాతకూడ ఆర్థికపరిస్థితి చక్కబడలేదు. ఖర్చులు తగ్గించుకొన్నా లాభంలేకపోయింది. అధ్యాపకులు చాలా

మంది వెళ్ళిపోయారు. రాహుల్జీ విద్యాబోధ చేయడంతో బాటు ఇతరప్రాంతాలకు వెళ్ళి ఉపన్యాసాలిచ్చేవారు. విద్యాలయానికి నిధులు ప్రోగుచేసేవారు. మహాంబాలో క్రైస్తవ, సనాతన మతచర్చావేదిక ఏర్పాటు చేయబడింది. ఒకమిత్రుని ప్రోత్సాహంపై రాహుల్జీ ఆసభలో పాల్గొన్నారు. సంస్కృతంలోనే చర్చజరగాలని సనాతనులు వాదించారు. సంస్కృతం, హిందీ-రెండుభాషలలో జరగడం సబబని రాహుల్జీ చెప్పారు. క్రైస్తవ మతోపన్యాసకులలో పేరుగాంచినవ్యక్తి ప్రత్యర్థిగావచ్చాడు. కాని రాహుల్జీ ప్రశ్నలవర్ష కురిపించి, అతనిని ఉక్కిరి బిక్కిరి చేశారు. ప్రత్యర్థికి ఆవేశంవచ్చి, "నేను తప్పుచేస్తున్నట్లయితే, హుక్కానీరుత్రాగించి, అయినను చెప్పుదెబ్బలుకొట్టండి" అని సభికులను ఉద్దేశించి అన్నాడు. రాహుల్జీ ప్రతిభను సభవారు ప్రసంసించారు.మరునాడుకూడ సభ కొనసాగింది. హాలంతా జనంతో నిండిపోయింది. సభలో క్రైస్తవ మహిళలుకూడ తగినంతమంది ఉన్నారు. రాహుల్జీ ప్రత్యర్థి మహిళలను ఉద్దేశించి, "వాగ్వాదాలు జరిగే సందర్భంలో ఎవరి నోటినుండి అయినా అశ్లీలపు శబ్దం వెలువడవచ్చు. అందుచేత ఇక్కడ ఉండటానికి ఇష్టంలేని మహిళలు వెళ్ళిపోవడం మంచిది" అన్నాడు. ఈమాటలు రాహుల్జీ హృదయానికి ములుకుల వలె తాకాయి. అయినప్పటికి నిబ్బరంగా ఇలా అన్నారు: "మనం మన తల్లులు,అప్పచెల్లెండ్ర ఎదుటకూడ నోరు పారవేసుకోకుండా ఉండలేమంటే, ఇది సిగ్గుపడవలసిన విషయం. మహిళలు ఎవ్వరూ సభనుండి వెళ్ళిపోనక్కరలేదని నేను

భావిస్తున్నాను." చర్చలు వినడానికి అవకాశం దొరికినందుకు మహిళలు చాలా సంతోషించారు. రెండుమూడు గంటలసేపు వాగ్వాదాలు జరిగాయి. క్రితంరోజువలె నేడు కూడ రాహుల్జీదే పైచేయి అయింది.

రాహుల్జీ తిరిగి కాల్పీకి వచ్చారు. విద్యాలయాన్ని నడపడం ఇక అసాధ్యమని తోచింది. దీనిని ఆపివేసి, 'శాస్త్రి' పరీక్షకు చదవాలని నిశ్చయించారు.

## చదువు - రాజకీయాలు

విద్యాభ్యాసానికై రాహుల్జీ కాన్పూరుకు వచ్చారు. కాని అక్కడ తగు సౌకర్యాలు లేనందువల్ల అయోధ్యకు వెళ్ళారు. పండిత వల్లభాశరణ్ ఆయనకు ఆశ్రయం ఇచ్చారు. లోగడ తనకు ఆశ్రయం ఇచ్చిన బ్రహ్మచారి ఇప్పుడు గృహస్థుడైనాడు. ఇక్కడ పరీక్షకు తయారవుతూ ఉండగా, పర్సామఠంనుండి ఉత్తరంవచ్చింది. తిరిగి సర్వే ఇబ్బంది ఎదుర్కొన్నట్లు అందులో తెలిపారు. ఆ పని పూర్తిచేసి, లాహోరులో పరీక్షకు చదువవచ్చునని రాహుల్జీకి తోచింది. వెంటనే పర్సామఠానికి వచ్చారు. సర్వేఅధికారిని కలుసుకొని, సమస్యలను పరిష్కరించారు. మఠానికి వేలాదిరూపాయల నష్టంవచ్చినా లెక్క చేయకుండా జానకీనగరం రైతుల హక్కులను కాపాడారు. ఇందుకు రైతులు ఆయనను వేనోళ్ళ కొనియాడారు.

ఆ రోజులలో చంపారన్‌లో గాంధీజీపేరు బాగా ప్రచారంలో ఉంది. జానకీనగరం రైతులు బళ్ళలో పదులు

వేసుకొని, మారుబేరానికై చంపారన్ వెళ్లేవారు. కొన్ని రోజుల క్రితంవరకు చంపారన్ రోడ్డుమధ్యలో బళ్ళను నడప నిచ్చేవారు కాదు. ఇప్పుడు రైతులు ఎలాంటి ఆటంకం లేకుండా బళ్ళను రోడ్లలుకు పోగలుగుతున్నారు. దీనికంతటికీ గాంధీజీయే కారణం. రాహుల్జీ జానకీనగరం వెళ్ళినప్పుడు మంచి పాటగాళ్ళను ప్రోగుచేశారు, గాంధీజీ జీవితచరిత్రను పద్యాలలో వ్రాసి, వారిచేత పాడించారు. ముజఫ్ఫరపురంలో సంఘసంస్కరణనుగూర్చి ఉపన్యాసం ఇచ్చారు. సభకు సర్వే అధికారి అధ్యక్షత వహించారు.

సర్వేపని పూర్తి కాగానే మహంతి రాహుల్జీపై తిరిగి వత్తిడి తెచ్చాడు. మఠం వ్యవహారాలన్నీ నీవే చూచు కొమ్మని కోరాడు. కాని రాహుల్జీ ఇందుకు అంగీకరించ లేదు. వనమాలిని మహంతిగా చేయమని తిరిగి సలహా ఇచ్చారు. రాహుల్జీవెంట ఎప్పుడూ నౌకర్లు ఉండేవారు. అందువల్ల అక్కడనుండి తప్పించుకుపోవడానికి వీలయ్యేది కాదు. ఒకనాడు ఒకేఒక నౌకరును వెంటబెట్టుకొని ఛప్రాకు వెళ్ళారు. ఏదో పనిచెప్పి, అతనిని పర్సాకు పంపించారు. అతడు వెళ్ళగానే లాహోర్‌కు రైలుటిక్కెట్టు తీసు కొన్నారు.

రాహుల్జీ లాహూర్ డి. ఏ. వి. కాలేజిలో తన పాతమిత్రులను కలుసుకొన్నారు. వారంతా పైపరీక్షలకు చదువుతున్నారు. రాహుల్జీ ఒకచోట బస కుదుర్చుకొన్నారు. పర్సానుండి తాను తెచ్చిన బట్టలు విలువైనవి. వాటిలో కొన్నిటిని అమ్మివేశారు. కొన్ని ఇతరులకు పంచిపెట్టారు.

మరికొన్ని తనవద్దనే ఉంచుకొన్నారు. రాహుల్జీ చదువు కోవడంతోబాటు జాతీయ, అంతర్జాతీయ పరిణామాలను పత్రికలద్వారా జాగ్రత్తగా గమనిస్తున్నారు. సామ్య వాదాన్నిగూర్చి చదవడానికి తనకు ఏ.....ంటి గ్రంథమూ లభ్యం కాలేదు. కొన్నాళ్ళదాకా బాగా చదువుకొని, ఆ తర్వాత ప్రాగ్దేశాలలో, ముఖ్యంగా చైనా, జపాన్‌లలో వైదికమతప్రచారం చేయాలని ఆయన ఉద్దేశం.

యుద్ధం జరిగేరోజులలోకూడ టెర్రరిస్టు విప్లవకారుల కార్యకలాపాలు ఆగిపోలేదు. పైపెచ్చు ఎక్కువైనాయి. కేవలం బెంగాల్‌వరకే పరిమితమైఉన్న టెర్రరిస్టు విప్లవ కారుల కార్యక్షేత్రం నేటి ఉత్తరప్రదేశ్,పంజాబ్ రాష్ట్రా లకుకూడ వ్యాపించింది. ప్రభుత్వం రౌలట్ అధ్యక్షతను టెర్రరిస్టు కార్యకలాపాల దర్యాప్తుకై ఒక కమిటీని నియ మించింది. ఆ కమిటీ సమర్పించిన రిపోర్టుపై, ప్రజలు నోళ్లు నొక్కివేయడానికి, అతివాద రాజకీయ సంఘటనను తుడిచి పెట్టడానికి రౌలట్ చట్టం తయారుచేయబడింది. ప్రజా ప్రతి నిధులు వ్యతిరేకించినప్పటికి ప్రభుత్వం విజయగర్వంతో ఆ చట్టాన్ని ప్యాస్ చేసింది.

రాహుల్జీ ఒకవైపున చదువుకొంటూ రెండోవైపున తన మిత్రులతో కలసి రాజకీయ పరిణామాలపై గంటల తర బడి చర్చలు జరిపేవారు. సంస్కృతంలోతప్ప మరే భాష లోను మాట్లాడకూడదనిచేసిన ప్రతిజ్ఞను వదలుకొన్నారు. క్రీ. శ. 1919 ఏప్రిల్ నెలలో పరీక్షలు ముగిశాయి. కాని పరీక్షకులు పందెంవేసుకొని విద్యార్థులనందరినీ ఫెయిల్

చేశారు. ఆ సంవత్సరం డి. ఎ. వి. కాలేజిలో 'శాస్త్రి' పరీక్షలు ఒక్క విద్యార్థికూడ ఉత్తీర్ణుడు కాలేదు.

రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా ఏప్రిల్ 6 వ తేదీన భారత దేశమంతటా ఆందోళన జరపాలని గాంధీజీ పిలుపు ఇచ్చారు. ఆ రోజున లాహూర్‌లో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. హిందూ-మహమ్మదీయ భేదం లేకుండా ప్రజలు ఊరేగింపులో పాల్గొన్నారు. వేసవి రోజులైనందువల్ల, వీధులలో అక్కడక్కడ చలివేంద్రలు పెట్టారు. హిందూ-మహమ్మదీయులిద్దరూ ఒకేగ్లాసుతో నీరు త్రాగారు. ఊరేగింపు అనంతరం పెద్దసభ జరిగేది.

చరిత్రాత్మకమైన ఈ దృశ్యాలను చూచి, రాహుల్జీ ఆ మరునాడు లాహూర్‌నుండి హరిద్వార్, జ్వాలాపురం మొదలైనప్రదేశాలకు వెళ్ళారు. తిలహార్ వద్ద తనమిత్రుడు అభిలాషచంద్రను కలుసుకొన్నారు. అతడు బ్రిటిష్‌ప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో పాల్గొంటున్న యోధుడు. గూఢచారులబారినుండి తప్పించుకు తిరుగుతున్నాడు. రాహుల్జీ వెళ్ళినరోజున, అతని ఇంట్లో ఏవో దేవతలపటాలు, సారాయి సీసాలు కనిపించాయి. గూఢచారుల కళ్ళలో దుమ్ము కొట్టడానికి అభిలాషచంద్ర ఈ ఎత్తు వేశాడని తెలిసింది. అతడు కొద్దిరోజులక్రితమే వివాహంకూడ చేసుకొన్నాడు. స్వాతంత్ర్యయోధునికి ఇలాంటి బాదరబందీ మంచిదికాదని రాహుల్జీకి అనిపించింది.

రాహుల్జీ అభిలాషచంద్ర ఇద్దరూ ఒకనాడు అక్కడ సమీపంలోఉన్న నదిగట్టుకు వెళ్ళారు. సాయంత్రంపూట

ఎర్రని చక్రవాక పక్షులజంట కనిపించింది. అవి నదిగట్టున మేస్తున్నాయి. రాహుల్జీ చక్రవాకపక్షిపేరు వినడమేగాని, ఎప్పుడూ చూడలేదు. అభిలాషచంద్ర ఆయనకు చక్రవాక పక్షులను చూపించాడు. "ఈ పక్షులజంట రాత్రిపూట విడిపోతుందా? ఒకటి నదికి ఆవలిగట్టున, ఇంకొకటి ఈవలి గట్టున ఉండిపోతుందా?" అని రాహుల్జీ ప్రశ్నించారు. అభిలాషచంద్ర ఏదో సమాధానం చెప్పారు.

మూడురోజులతర్వాత రాహుల్జీ తన మిత్రునివద్ద సెలవు తీసుకున్నారు. ఇద్దరూ తిలహార్ రైలుస్టేషన్కు వచ్చారు. అప్పుడే అమృతసర్లో తుపాకి కాల్పులు జరిపినట్లు వార్తవచ్చింది. తిలహార్ ముసాఫిర్ బంగళాలో ఒక స్వాతంత్రయోధుని బంధించినట్లు తెలిసింది. రాహుల్జీ అభిలాష చంద్రతోకలసి అక్కడకు వెళ్లారు. అభిలాష చంద్ర ఆయోధుని అప్పటికే ఒకటి రెండుసార్లు కలుసుకున్నాడు. రాహుల్జీని అతనికి పరిచయం చేశారు. ఆ యోధుడు రాహుల్జీ ధైర్యాన్ని పరీక్షింపదలచారు."మీపేరు చెప్పండి. పోలీసులకు తెలియజేస్తాను" అన్నాడు. రాహుల్జీ నిర్భయంగా చెప్పారు. ఆ యోధుడు స్వీయకవితను వినిపించాడు. "తెల్లవాళ్ళ రక్తంతో నా పితృదేవతలకు తర్పణ చేస్తాను" అని ఒక చరణంలో ఉంది.

రాహుల్జీ కాన్పూర్ మీదుగా హమీర్పురం వచ్చారు. అక్కడ మహిళాశ్రమంలో తన మిత్రుని భార్య చదువుతూ ఉండేది. ఆమెను జలంధర్ విద్యాలయంలో చేర్పించడానికి రాహుల్జీ వచ్చారు. ఆమెభర్త వ్రాసిన ఉత్త

రం చూపించారు. రాహుల్జీ తనకు ఇదివరకే పరిచితులైనప్పటికి ఆమె సిగ్గుపడింది. ఆయనవెంట వెళ్ళడానికి సంకోచించింది. అందువల్ల ఆయన తిరిగి కాన్పూర్ వెళ్ళారు.

పంజాబ్‌లో మార్షల్ - లా ప్రకటింపబడిన రోజులు అవి. రాష్ట్రమంతటా అట్టుడికినట్లు ఉంది. రాహుల్జీ కాన్పూర్ రాగానే, ఆయన మిత్రుని భార్యకూడ హమీర్‌పురంనుండి అక్కడకు వచ్చింది. ఇద్దరూ జలంధర్ వెళ్లాలని ప్రయత్నించారు. కాని రైలుటిక్కెట్లు అన్నిచోట్లకూ ఇవ్వడం లేదు. టిక్కెట్లుదొరికితే జనం రద్దీ ఎక్కువగా ఉంది. ఎంతోకష్టంమీద జలంధర్ చేరుకొన్నారు. రాహుల్జీ తన మిత్రుని భార్యను కన్యావిద్యాలయంలో చేర్పించారు. లాహోర్‌లోని పాతస్నేహితులను ఇక్కడ కలుసుకున్నారు. వారితో కొద్దిరోజులుగడిపారు. సంతరామ్ అనే మిత్రుని సోదరులు, చుట్టాలు ఏళ్ళతరబడిగా విదేశవ్యాపారం చేసేవారు. వారిలో కొందరికి టర్కీ, టిబెట్టుభాషలు, ప్రజల ఆచార వ్యవహారాలు బాగా తెలుసు. ఇవన్నీ విన్నతర్వాత తానుకూడ విదేశయాత్ర జరపాలని రాహుల్జీ అనుకున్నారు.

కొద్దిరోజుల తర్వాత లాహోర్‌కు టిక్కెట్లు ఇవ్వడం మొదలుపెట్టారు. రాహుల్జీ లాహోర్‌కు వచ్చారు. అక్కడ కూడ తుపాకి కాల్పులు జరిగాయి. మరణించినవారిలో మునీరామ్ అనే యువకవిద్యార్థి ఒకడు. మార్షల్ - లా ఇంకా అమలులో ఉంది. అక్కడక్కడ ప్రభుత్వ ఉత్తర్వులను అతిక్రమించారు. ప్రజలు ఎప్పుడు బయటికి వెళ్లాలో, ఎప్పుడు నిద్రపోవాలో, దుకాణదార్లు ఏధరకు సరుకులు

అమ్మాంలో, ఈ ఉత్తర్వులను ఉల్లంఘిస్తే ఏ యే శిక్షలు విధింపబడతాయో వ్రాసిఉంది. బ్రిటిష్ సైన్యం జరుపుతున్న అత్యాచారాలను ప్రజలు కథలుగా చెప్పుకొంటున్నారు. శతాబ్దాలుగా మనదేశవాసులు అనుసరిస్తున్న శాంతియుత జీవనం నిర్వీర్యమైనదని, దీనికంటె అశాంతియుత జీవనమే మేలని రాహుల్జీకి అనిపించింది.

## చిత్రకూట సందర్శన

'శాస్త్రి' పరీక్షలో రాహుల్జీతోబాటు తక్కినవిద్యార్థు లంతా ఫెయిల్ అయినారు. మళ్ళీ రెండు నెలలకుగాని కాలేజి తెరవరు. రాహుల్జీ అంతవరకు లాహోర్‌లో ఉండ లేకపోయారు. 'కర్వీ'కివచ్చి చదువుకొనసాగించదలచారు. 'కర్వీ'లో సంస్కృతపాఠశాల ప్రధానోపాధ్యాయుని కలుసుకొన్నారు. అక్కడ ఉన్నత పరీక్షలకు కూర్చోవడానికి తగిన సౌకర్యాలులేవు. అయినప్పటికి 'న్యాయ మధ్యమ, మీమాంస ప్రథమ పరీక్ష'లకు కూర్చోదలచారు.

'కర్వీ'కి సమీపంలో చిత్రకూటపర్వతంఉంది. వాల్మీకి కాలంనాటి చారిత్రక ప్రదేశం ఇది. దీని ప్రకృతిశోభను తిలకించాలని రాహుల్జీకి అనిపించింది. కొన్నిసార్లు అక్కడకువెళ్ళి వచ్చారు. కొందరు సాధువులు పర్వతసమీపంలో ఒక గ్రామం నిర్మించుకొన్నారు. వారి కుటీరాలనుచూచి తులసీదాసు తన కావ్యంలో ఋష్యాశ్రమ వర్ణన చేశాడేమోనని రాహుల్జీ అభిప్రాయం. ఆయన ఒకసారి రాజాపురం వెళ్ళి, తులసీదాసు స్వహస్తంతో వ్రాసినట్లు చెప్పబడే రామాయ

ణాన్ని చూశారు. అక్కడ ఉండే పూజారి ఆ గ్రంథాన్ని రాహుల్జీకి చూపిస్తూ, ఎవరో సాధువు దీనిని దొంగతనంగా ఎత్తుకుపోతూఉంటే పట్టుకొన్నారని, అతడు భయపడి దీనిని నదిలో పారవేశాడని చెప్పాడు. నీటిలోతడిసిన గుర్తులు ఇప్పటికీ కానవస్తున్నాయని ఆగ్రంథం పుటలు తిరగవేసి చూపించాడు. చిత్రకూటపర్వతానికి సమీపంలో ఒక కుటీరం ఉండేది. రాహుల్జీ అక్కడకు ఒకసారి వెళ్ళారు. ఏకాంత జీవితం గడపాలనే ఉద్దేశంతో ఒక యోగి ఈ కుటీరాన్ని నిర్మించుకొన్నాడు. కాని కొంతకాలానికి అతని ఉద్దేశం మారిపోయింది. శ్రీరాముని కాలంలోని ఋషులవలె సహా యోగి అయినాడు. ఆ ఇంటిముందు బట్టాబాతాలేని పిల్లలు చిరిగిన గుడ్డలుకట్టుకొన్న స్త్రీలు తిరుగుతున్నారు.

రాహుల్జీ 'కర్వీ'లో ఉండగా, ఒక సాధువు హస్తలిఖిత గ్రంథం ఒకటి తెచ్చాడు. గ్రంథపరిచయం మినహా, తక్కిన దంతా ఉన్నదిఉన్నట్లు వ్రాసిఇమ్మని కోరాడు. దానినిరామానంద భాష్యంఅనేపేరుతో ప్రచురించుకొంటామని చెప్పాడు. రాహుల్జీ ఆ గ్రంథాన్ని చక్కగా పరిశీలించారు. అది తులసీదాసు రచించిన వేదాంత భాష్యమని, అద్వైతాన్ని ఖండిస్తూ ద్వైతవాదాన్ని ప్రతిపాదించిన గ్రంథమని ఆయన అభిప్రాయపడ్డారు. తాను ఆర్యసమాజ భావాలను స్వీకరించడంతో శంకరుని అద్వైతాన్ని వదలిపెట్టారు. ద్వైత వాది అయినారు. అందుచేత ఈ భాష్యంలోని విషయాలు ఆయనకు నచ్చాయి. అయితే తులసీదాసు పేరు తొలగించి రామానందుని పేరుతో దానిని ప్రచురించడం సరికాదను

కొన్నారు. అందుచేత గ్రంథాన్ని కాపీచేసి ఇవ్వడానికి అంగీకరించలేదు. తర్వాత ఎవరో ఆపనిచేసి పెట్టారు.

'కర్వీ'లో పరీక్షకు కావలసిన విషయాలన్నీ చెప్పే వారు లేకపోయినందువల్ల రాహుల్జీ కాశీకి వెళ్లారు. రెండు నెలలవరకు ఒక ఉత్కళ పండితునివద్ద చదువుకొన్నారు. అయితే కాశీలో తనజాడ తెలిసే ప్రమాదం ఉందని మొదటి నుండి భయపడుతూనే ఉన్నారు. ఆయన ఒకరోజు ఆర్య సమాజ వార్షికోత్సవానికి వెళ్ళారు. వెనక వరుసలో కుర్చీ మీద తనకు సుపరిచితుడైనవ్యక్తి కూర్చుని ఉన్నాడు. "ఊరికివస్తావా?" అని అతడు ప్రశ్నించాడు. ఇక తాను పట్టు బడతానని రాహుల్జీ అనుకొన్నారు. త్వరలోనే 'కర్వీ'కి వచ్చారు.

రాహుల్జీ న్యాయమధ్యమ పరీక్ష వ్రాయడానికి ప్రయాగ వెళ్లారు. మీమాంస ప్రథమపరీక్ష వ్రాయడానికి జబల్‌పూర్ వెళ్లారు. న్యాయమధ్యమ పరీక్షలో ఫెయిల్ అయినారు. మీమాంస ప్రథమ పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు.

మార్చి నెలాఖరులో రాహుల్జీ తన మిత్రులతో కలసి అటవీయాత్రచేసి వచ్చారు. ఈపర్యాయం దీర్ఘయాత్ర జరపాలనేకోర్కె జనించింది.

## తిరిగి యాత్రా సంకల్పం

'కర్వీ' నుండి బయలుదేరేముందు రాహుల్జీ జ్వర గ్రస్తుడుగా ఉన్నారు. ఆయనచేతిలో డబ్బులేదు. అయినప్ప

టికీ ఆయన దొంగచాటుగా రైలులో వెళ్ళలేదు. ఢిల్లీలో లాహోర్ కు వెళ్ళేమెయిల్ లో కూర్చున్నారు. టిక్కెట్టు కలెక్టరు ఆయనను ఆపివేశాడు. కాని ఎందుకో మళ్ళీ వదలి పెట్టాడు.

కొద్ది సంవత్సరాలనుండి బుద్ధునిపట్ల ఆయన హృదయంలో భక్తిభావం ఏర్పడింది. బుద్ధుని జీవితగాథలు చదివే కొద్దీ, ఆయనజీవితంతో సంబంధం కలిగిన స్థలాలను చూడాలనిపించేది. రాహుల్జీ సారనాథ్‌లో దిగి అశోక స్తంభాన్ని చూశారు. అక్కడనుండి ఛప్రాజిల్లాకువచ్చారు. పర్సామఠంలో ఒకటి రెండురోజులు ఉన్నారు. మఠానికి వారసుడుగా ఉండటానికి ఆయన ఇదివరకే నిరాకరించారు. అందుచేత మహంతి నిరాశచెందాడు. తన అన్నకుమారుని వారసుడుగా చేసుకోవడానికి నిశ్చయించారు. ఇంతకంటె వనమాలిని వారసుడుగా చేసుకోవడం బాగుంటేదని రాహుల్జీ అభిప్రాయం. అయినప్పటికీ ఈవిషయంలో జోక్యం కలిగించుకోలేదు.

రాహుల్జీ కాలినడకనే బుద్ధ నిర్వాణ స్థలానికివెళ్ళారు. అక్కడ కొత్తగా చితాభస్మం కనిపించింది. మహావీర మహాస్థవిరుడు ఇటీవలనే చనిపోయాడని, అతనికి ఇక్కడ దహనసంస్కారం జరిగిందని తెలిసింది. మహావీరస్వామిని కలుసుకోలేక పోయినందుకు రాహుల్జీకి విచారం కలిగింది. శతాబ్దాల తర్వాత, భిక్షుసంఘంలో చేరిన మొదటి ఉత్తర భారతీయుడు అతడే. మహావీరుడు కుమారసింహుని బంధువు. 1857 స్వాతంత్ర్యయుద్ధంలో కుమారసింహునికి తోడ్పడ్డాడు.

తరువాత ఇతర వీరులవలెనే అతడుకూడా మారువేషంతో తిరుగుతూ సింహళానికి వెళ్ళాడు. అక్కడ జబ్బుపడితే, ఒక భిక్షువు అతనికి శుశ్రూషచేశాడు. మహావీరునికి అతని ద్వారానే బౌద్ధమతం పరిచయమైంది. అక్కడే భిక్షువు అయినాడు. తిరిగి ఒకసారి తనదేశానికి వచ్చాడు. బౌద్ధమతాన్నిగూర్చి ప్రచారం చేయదలచాడు. కుసీనగరంలో మఠాన్ని స్థాపించాడు. తన జీవితశేషాన్ని ఇక్కడే గడిపాడు.

మహావీరుని నారసుడు ద్వారం తెరచి, నిద్రలోఉన్న బుద్ధుని విశాలమూర్తిని రాహుల్జీకి చూపించాడు. రాహుల్జీ ఆర్యసమాజభావాలు కలవారైనప్పటికి, బుద్ధుని మూర్తికి తలవంచి నమస్కరించారు. "నేను దేవుని విగ్రహాన్ని పూజించడంలేదు. ఒకఋషికి నాశ్రద్ధాంజలి సమర్పిస్తున్నాను," అని చెప్పారు.

తర్వాత ఆరాత్రి ఒక గ్రామంలో ఉండి, మరునాడు దేవరియా రైలుస్టేషన్‌కు వచ్చారు. అక్కడనుండి గోరఖ్‌పూర్‌కు వెళ్ళారు. స్టేషన్‌నుండి బయటికి వస్తుండగా టిక్కెట్టు కలెక్టరు, "మీాది ఏవూరూ? అని ప్రశ్నించాడు. కాని టిక్కెట్టు అడగలేదు. "నేను సంచారంచేసే సాధువును" అని రాహుల్జీ చెప్పాడు. ఆయన గూఢచారి శాఖాధికారి అని టిక్కెట్టు కలెక్టరు భావించాడు. "నేను మిమ్మును గుర్తించలేదని అనుకోవద్దండి," అని వినయపూర్వకంగా చెప్పాడు.

రాహుల్జీ ఒడ్డుపొడవు, వేషభాషలుచూచి అతడు ఆవిధంగా అనుకొన్నాడు.

రాహుల్జీ గోరఖ్‌పూర్‌లో ఒకవైష్ణవమఠంలోమకాం పెట్టారు. మరునాడు నవగఢ్‌రోడ్డు స్టేషన్‌మీదుగా భగవాన్‌పురం వెళ్లారు. అది నేపాల్ సరిహద్దున ఉన్న మొదటి గ్రామం.ఎండ తీవ్రంగా ఉన్నందువల్ల రాహుల్జీ ఒక వనంలో కాస్సేపు విశ్రమించారు. చల్లబడిన తర్వాత లుంబినీకి బయలుదేరారు.

లుంబినీవనంలో ఒక మందిరం ఉంది. దానిముందు మేకపోతులు,కోడిపుంజులు తదితర ప్రాణులను బలిఇచ్చారు. వాటిరక్తం బాగా కనిపిస్తున్నది. మందిరంలోపలి విగ్రహం అస్పష్టంగాఉంది. మందిరంవెనక అశోక శిలాస్తంభం ఉంది. దానిపై కొన్ని పంక్తులు చెక్కబడిఉన్నాయి. భూతదయను గూర్చి నొక్కిచెప్పిన గౌతమబుద్ధుని జన్మస్థానంలో పశుబలి, నెత్తురుమడుగు చూచి రాహుల్జీ హృదయానికి దెబ్బ తగిలింది. అక్కడ ఎవరూలేరు. కొంచెంసేపు కూర్చుని ఈ స్థలంయొక్క గత చరిత్రనుగూర్చి ఆలోచించారు. ఉత్తరాన దూరంగా హిమాలయ శ్వేతశిఖరాలు కనిపిస్తున్నాయి. అవి రాహుల్జీని ఆహ్వానిస్తున్నట్లుంది.ఇక్కడనుండి వెళ్ళుదామని ఆయన అనుకొన్నారు. కాని ప్రొద్దుగూకే సమయం ఇది. అందుచేత తిరిగి భగవాన్‌పురంవచ్చి ఆరాత్రి అక్కడ గడిపారు.

ఉదయనే లేచి కపిలవస్తుకు వెళ్లారు. అది చాలా విశాలమైన నగరం. చాలా పూర్వకాలంనాటి చిహ్నాలు—

ఇటుకలు, చెరువులు, కందకాలరూపంలో కనిపిస్తున్నాయి. ఈ నగరంలో బుద్ధుని బాల్యగృహం ఏదో, శుద్ధోదనుని రాజనగరు ఏదో గుర్తుపట్టడానికి వీలులేకుండా ఉంది. ఇందు లోనే బుద్ధుని చరణధూళికూడ ఉందనుకొని రాహుల్జీ సంతృప్తి చెందారు. ఆరాత్రి ప్రక్కగ్రామంలో తలదాచు కొన్నారు.

మరునాడు తన ప్రయాణం కొనసాగించారు. ఒక మామిడివనంలో ఒక మందిరం కనిపించింది. అందులో సీతా రామలక్ష్మణుల విగ్రహాలుఉన్నాయి. మహంతి రాహుల్జీకి ఆతిథ్యం ఇచ్చాడు. అతడు భారతదేశంలో ముఖ్యమైన తీర్థ స్థానాలు చూచివచ్చాడు. సంభాషణద్వారా ఇద్దరికీ స్నేహం ఎక్కువైంది. మహంతికి వారసు డెవరూ లేరు. సంప్రదాయాన్ని బట్టి రాహుల్జీ అతనికి వారసుడయ్యే అవ కాశం ఉంది. అతడు తన ఆస్తి పాస్తులన్నీ రాహుల్జీకి చూపించాడు. తనగురువు, తాను మొదట్లో ఇక్కడ ఏలా తిష్ఠవేసిందీ తెలియచేశాడు. దొంగలబారినుండి ఆత్మరక్ష ణకు ఉపయోగిస్తూవచ్చిన తుపాకినికూడ రాహుల్జీకి చూపిం చాడు. తనకు వారసుడవు కమ్మని రాహుల్జీని కోరాడు. ఆయనకు అలాంటి ఇష్టంలేదు. కాని పూర్తిగా నిరాకరించ లేకపోయారు. అందువల్ల రాహుల్జీ ఇక్కడే ఉండిపోతారని మహంతి భావించాడు. ఇది రాహుల్జీ గమనించారు. ఉత్తర దేశయాత్ర ముగించుకొని వస్తానని చెప్పి, ఒకరోజున వెళ్ళి పోయారు.

రాహుల్జీ నేపాల్ పర్యటన చేయదలచారు. కాని

వీరగంజ్ మార్గంలో పోలీసులు బయటివారిని లోపలికి రానివ్వడంలేదు. రాహుల్జీ వంతెనదాటి ఒకమకంలోకి వెళ్ళారు. ప్రముఖవ్యక్తులకుమాత్రమే ప్యాస్‌పోర్టు ఇస్తున్నట్లు తెలిసింది. రాహుల్జీ రెండు మూడురోజులు అక్కడ ఉండి, పరిస్థితులను గమనించారు. నేపాల్‌కు వెళ్లేమార్గం కనిపించలేదు. అందుచేత తూర్పుభాగంలో పర్యటన ప్రారంభించారు.కొంతదూరం కాలిబాట, మరికొంతదూరం రైలు మార్గం పట్టి నడిచారు. ప్రతిచోట ఆయనకు తగు ఆతిథ్యం లభించింది. తిండికి ఎలాంటి ఇబ్బందీ కలుగలేదు.

సీతామఢిలో ఒకసాధువు తోడైనాడు.అతడు అస్సాం నుండి వస్తున్నాడు. ఇద్దరూ సమవయస్కులు - చోక్వాత్, మిటిహానీ మఠాలను సందర్శించారు.మిటిహానీలో సంస్కృత పాఠశాల ఉండేది. రాహుల్జీ విద్యార్థులను కలుసుకొన్నారు. వారు తమ ఇబ్బందులను ఆయనకు వివరించారు. నేపాల్ ఉన్నతాధికారులను కలుసుకొన్నప్పుడు, ఈ విషయం వారి దృష్టికి తెస్తానని రాహుల్జీ చెప్పారు. ఆయన తన సహచరునితో కలసి ఇంకా అనేక మఠాలను సందర్శించారు. శ్రీరాముడు ధనుస్సును విరిచి,సీతను వరించాడని చెప్పబడే స్థలాన్ని కూడ చూశారు. దానిని 'ధనుషా' అని పిలుస్తారు.

ఒకనాడు వీరిద్దరూ మధ్యాహ్నంపూట ఎండలో ప్రయాణం కొనసాగించారు. బాగా అలసిపోయారు. కొండ ప్రక్కన ఒక కుటీరం కనపడింది. ఇద్దరూ అక్కడ పడుకొన్నారు. ఒళ్ళుమరచి నిద్రపోయారు. కొంచెంసేపుఅయిన తర్వాత మెలుకువ వచ్చింది. లేచిచూస్తే. ఒక సాధువు

కనిపించాడు. నడుముకు అంగవస్త్రంచుట్టి, చీపురుతో కసువు జిమ్ముతున్నాడు. వారు మేల్కొన్నట్లు గ్రహించి, దగ్గరికి వచ్చాడు. "ఇక్కడ అన్ని వస్తువులూ ఉన్నాయి. ఎవరైనా సాధువు, అభ్యాగతుడు వస్తే, వండుకుతినడానికి వీలుకల్పించే ఉద్దేశంతో నేను ఇంటితాళం వేయడంలేదు. నేను ఆవులు మేపడానికి బయటికి వెళ్ళుతూఉంటాను. ఒక్కొక్కప్పుడు ఆలస్యంగా ఇంటికివస్తాను. మీరు అన్నం ఎందుకువండుకు తినలేదు?" అని ప్రశ్నించాడు. వారు జరిగినసంగతి తెలియజేశారు. అలసిపోయినవారికి నిద్రేహాయి కలిగిస్తుందన్నారు.

మరునాడు ఉదయం ఆ సాధువు మొక్కజొన్నలు ఇచ్చి, వాటిని వండుకుతినమని చెప్పాడు. రాహుల్జీ ఎంత కష్టపడి వండినా అదిఅపక్వాన్నంగానే ఉండిపోయింది. ఆకలి వేస్తున్నందువల్ల, ఇద్దరూ తినకతప్పలేదు. పాలు, పెరుగుతో రాహుల్జీ కడుపునిండా తిన్నారు. కాని ఆయన సహచరుడు అరగడుపుతో లేచాడు.

కొండలో కాపలా పెట్టారని, రహదారి చీటీ లేకపోతే ముందుకు వెళ్ళనివ్వరని తెలిసింది. అందుచేత తాము వెనుదిరిగిపోవలసివచ్చింది. జనకపురంనుండి ఇద్దరూ విడిపోయారు. రాహుల్జీ ముజఫ్ఫర్ పుర్ జిల్లాలోని బరాహీమఠానికి వచ్చారు. అక్కడ మహంతి ఇచ్చిన ఆతిథ్యం స్వీకరించారు. వెళ్ళేటప్పుడు మహంతి రాహుల్జీని ఏనుగపై పంపించారు. దారిఖర్చుకు కొంతడబ్బు ఇచ్చారు. కూర్చోవడం చేతకాక రాహుల్జీ ఏనుగపైనుండి క్రిందబడ్డారు. కాని దెబ్బ

తగులలేదు. కొంతదూరం వచ్చినతర్వాత ఏనుగను వాపసు పంపించారు.

రాహుల్జీ దర్భాంగా, దానాపుర్, పాట్నాలమీదుగా నలందా వెళ్ళారు. మ్యూజియంను తిలకించారు. బోధగయకు వెళ్లేటప్పుడు ఇద్దరుసాధువులు తోడైనారు. అప్పట్లో రాహుల్జీకి బుద్ధునిపట్ల భక్తి ఎక్కువైంది. బుద్ధుని దయానందుని కంటె మిన్నగా భావించసాగారు. బుద్ధుడు దయానందుని వలె వైదిక ధర్మప్రచారకుడని, భగవంతునిమీద విశ్వాసం గల ఋషిఅనే తప్పు అభిప్రాయం ఆయనకు ఉండేది. ఎండకాలం అయినందువల్ల బోధగయలో విదేశబౌద్ధభిక్షువులెవరూ కనిపించలేదు. రాహుల్జీ భాగల్పూర్మీదుగా ముర్షిదాబాద్వచ్చారు. బెంగాలులో కొంతదూరం కాలినడకను పర్యటించారు. నదియాలో బీహారు సంస్కృతవిద్యార్థులను కలుసుకొన్నారు. వారు రాహుల్జీని అక్కడే ఉండి చదువుకొమ్మని కోరారు. రాహుల్జీ ఒక భజనాశ్రమానికి వెళ్లారు. అర్థశేరుబియ్యంకోసం దాదాపు యాభైమంది విధవరాండ్రు, 'హరేరామ', 'హరేరామ' అని పాడుతూ ఉండటం గమనించారు.

మరునాడు ఉదయం తిరిగి దక్షిణదేశపర్యటనకు ఉపక్రమించారు. కలకత్తా, పూరీ, రాజమండ్రిమీదుగా తిరుపతికి వచ్చారు. అక్కడ సంస్కృతకళాశాల తెరచినట్లు విని, చూడటానికివెళ్ళారు. ప్రధానాచార్యుడైన దేశికాచార్యుని కలుసుకొన్నారు. ఈ కళాశాలలో వేదాంత మీమాంసచదువుకొమ్మని దేశికాచార్యులుసలహాఇచ్చారు.

కాని కొన్ని కారణాలవల్ల ఆయన సిద్ధపడలేదు. తిన్నగా తిరుమశికి వెళ్లారు.

ఏడేళ్ళతర్వాత తిరుమశిలో హరిప్రపన్నాచార్యుని కలుసుకొన్నారు. రాహుల్జీ 'కర్వీ'లో ఉండగా, త్వరగా రమ్మని తిరుమశినుండి ఉత్తరం వచ్చింది. కాని రాహుల్జీ వెళ్ళలేదు. ఆయనను మహంతిగా చేయాలని హరి ప్రపన్నాచార్యుని సంకల్పం. రాహుల్జీ సకాలంలో రానందువల్ల వేరొకరిని తన వారసుడుగా చేసుకొన్నారు. ఇందుకు రాహుల్జీ సంతోషం వెలిబుచ్చారు. విద్యనేర్చుకోవడం తన ఉద్దేశమని చెప్పారు.

ఈ ఏడేళ్ళకాలంలో మఠపరిస్థితి బాగా అభివృద్ధి చెందింది. మద్రాసునుండి ప్రతినెల నూటయాభైరూపాయలకుపైగా విరాళం వస్తున్నది. హరిప్రపన్నాచార్యుడు ఇరవై ముప్ఫైవేలరూపాయలు వడ్డీకి ఇచ్చాడు. ఎన్నో ఎకరాల మాగాణి భూమి ఖరీదు చేశాడు.

రాహుల్జీ వేదాంతమూ, మీమాంస చదవడం ప్రారంభించారు. రామానుజ ద్వైత సిద్ధాంతం రాహుల్జీ సిద్ధాంతం అయింది. ఎందుకంటె అది ఆర్యసమాజ సిద్ధాంతాలకు దగ్గరగా ఉంది.

హరిప్రపన్నాచార్యునికి తన వారసునిమీద ఎందుకో అసహ్యభావం కలిగింది. రాహుల్జీని తన వారసుడుగా భావించసాగాడు. కాని రాహుల్జీ అదివరకే రహస్యావిష్ణవాన్ని గూర్చి విన్నారు. ఆయన మనస్సులో ఒకనూతన ప్రపంచం రూపు దిద్దుకొన్నది. ఈ పరిస్థితిలో మహంతుల, జమీం

దార్ల ఆస్తిపాస్తుల భవిష్యత్తునుగూర్చి రాహుల్జీ హరి ప్రపన్నాచార్యునితో చర్చించేవారు. వాస్తవ పరిస్థితిని అతనిముందు పెట్టినప్పటికీ భయపడేవాడు.

రాహుల్జీ ఒక వృద్ధునివద్ద "అష్టాదశ రహస్యాలు" చదివేవారు. ఇవి రామానుజ సిద్ధాంతానికి సంబంధించినవి. ఈ రహస్యగ్రంథాలు సూత్రరూపంలో మణిప్రవాళ భాషలో ఉండేవి. ఈ భాషలో నూటికి ఎనభై పాళ్లు సంస్కృత శబ్దాలు ఉంటాయి. తక్కినవి తమిళ శబ్దాలు. రహస్యగ్రంథాలలో ఇలాంటి భాష ప్రయోగింపబడింది. ఇవి ప్రారంభించడానికి ముందు రాహుల్జీ తమిళవాచకాలు కొన్ని చదివారు. అందువల్ల భాషను అర్థంచేసుకోవడం తేలికైంది. రహస్యగ్రంథాలు గోప్యమైనవి. అయినప్పటికీ అవి తమిళ, తెలుగు అక్షరాలలో ముద్రింపబడి ఉండేవి. రాహుల్జీ ఉత్తరదేశం వెళ్ళిన తర్వాత ఈ పుస్తకాలను పోగొట్టుకొన్నారు. వాటిని తిరిగి ఒకసారి చూడటానికి వీలు లేకపోయింది.

తిరుమళిలో ఉండగా రాహుల్జీ ఉత్తరదేశం నుండి కూడ పత్రికలు తెప్పించుకొని చదివేవారు. భారతరాజకీయ పరిణామం, సామ్యవాదం ద్వారా ప్రపంచంలో మార్పులను గూర్చి తన మిత్రులతో చర్చిస్తూ ఉండేవారు. జమీందార్ల, మహంతుల ఆస్తిపాస్తులు పోతాయని హరిప్రపన్నాచార్యుడు నిశ్చయించుకొన్నారు. కలియుగంలో వచ్చిన తక్కిన మార్పులవలె ఇదికూడ సంభవమని తన మనస్సును సమాధానపరచుకొన్నారు. రాహుల్జీకి ఆర్యసమాజ

భావాలు ఉన్నట్లు అతనికి తెలియదు. తెలిసిఉంటే చాలా బాధపడేవాడే. మీమాంస, వేదాంతం, రహస్యగ్రంథాలు చదవడం పూర్తి అయినతర్వాత రాహుల్జీ తిరుమలనుండి కూర్గుదేశానికి బయలుదేరారు.

## కూర్గులో నాలుగునెలలు

రాహుల్జీ మద్రాసు మీదుగా మొదట మైసూరుకు వెళ్ళారు. అక్కడ ఆర్యసమాజంవారిని కలుసుకొన్నారు. వారు మతప్రచారంతోబాటు హిందీ ప్రచారంకూడ చేస్తూ ఉండేవారు. రాజకీయ ఆందోళనలో ఇదికూడ ఒక భాగంగా భావించే రోజులవి. టౌన్‌హాలులో మూడు నాలుగు రోజులపాటు ఉపన్యాసాల కార్యక్రమం ఏర్పాటుచేయబడింది. ఆర్యసమాజ సిద్ధాంతాలనుగూర్చి రాహుల్జీ హిందీలో ఉపన్యసించారు. ఆయన తర్వాత వేరొకరు సంస్కృతంలో ఉపన్యసించవలసి ఉండేది. కాని ఉపన్యాసకుడు జబ్బుపడ్డాడు. అందువల్ల రాహుల్జీని ఉపన్యసించమన్నారు. ఆయన ఉపన్యాసం విని సభాధ్యక్షుడు చాలా ప్రశంసించాడు.

మైసూరునుండి రాహుల్జీ ఒక లారీలో కూర్గుదేశానికి వెళ్ళారు. మదికేరిలో దిగి తన మిత్రులజాడ తెలుసుకున్నారు. వారు ఒక బంగళా అద్దెకుతీసుకొని అందులో ఉండేవారు. బంగళా చుట్టూ కాఫీ, టీ తోట ఉంది. రాహుల్జీ మొదటిసారి ఇక్కడ కాఫీ త్రాగారు. మదికేరికి రాగానే ఆయన కన్నడం నేర్చుకోవడం ప్రారంభించారు. ఆయనకు అదివరకే తెలుగు అక్షరాలు పరిచయమైనాయి. అందుచేత కన్నడ

అక్షర పరిచయం తేలికైంది. మూడు నాలుగు రోజుల తర్వాత ఒకసభలో పాల్గొన్నారు. కన్నడ ఉపన్యాసాల సారాంశం ఆయన చెప్పగలిగారు.

రాహుల్జీ ఇక్కడ దాదాపు నాలుగు నెలలు ఉన్నారు. పర్వతప్రాంతాలలో పర్యటించడం, ప్రజల జీవితాన్ని అధ్యయనం చేయడంతో బాటు రాజకీయ పరిణామాలను కూడ గమనిస్తూ ఉండేవారు. తన మిత్రులతో రాజకీయాలను గూర్చి చర్చిస్తూ ఉండేవారు. చూస్తూఉండగానే కూర్గులో కూడ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభమైంది. స్కూళ్ళు కాలేజిల విద్యార్థులు బయటికివచ్చి ఆందోళనలో పాల్గొన సాగారు.

మతసంబంధమైన భావాలతోబాటు రాజకీయభావాలు కూడ రాహుల్జీలో మొలకెత్తాయి. అయినప్పటికి కూర్గును త్వరగా వదలిపెట్ట దలచుకోలేదు. తన తండ్రిగారు చనిపోయినట్లు యూగేశ్ నుండి ఉత్తరం వచ్చింది. రాహుల్జీ స్తబ్ధులై పోయారు. కాని కన్నీరు కార్చలేదు. తన మిత్రులు అక్కడే కూర్చునిఉన్నారు. తన తండ్రిగారు మరణించారనే వార్త వారికి మామూలుగానే వినిపించారు. వారిలో ఒకరు వెంటనే, "ఏమిహృదయం, తండ్రిగారు చనిపోతే రెండు కన్నీటి బిందువులైనా రాల్చలేదు," అన్నారు. రాహుల్జీ అతనికి సాధువేషంలో కనిపించలేదు. లేకపోతే ఈమాట అనేవాడు కాదు.

రాజకీయ జీవితంలో ప్రవేశించాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. మదికేరి మిత్రులవద్ద సెలవు పుచ్చుకొన్నారు.





# నాలుగో అధ్యాయం

## రాజకీయాలలో ప్రవేశం

అప్పట్లో సహాయ నిరాకరణోద్యమం జోరుగా సాగుతున్నది. వేలకొలది విద్యార్థులు కాలేజిలు, స్కూళ్లు వదలిపెట్టారు. ఎంతోమంది వకీళ్ళు, బారిస్టర్లు తమ ప్రాక్టీసును బందుచేశారు. గాంధీజీ తిలక్ - స్వరాజ్యనిధి కోటి రూపాయలు ప్రోగుచేశారు. రాహుల్జీ తాను రాజకీయజీవితంలో ప్రవేశించాలని నిశ్చయించారు. కాని ఎక్కడ అనే ప్రశ్న ఉదయించింది. తన జిల్లాకు వెళ్ళితే ప్రతిజ్ఞ భంగమవుతుంది. అందుచేత ఛప్రాజిల్లాకు వెళ్ళదలచారు. ఆ జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శికి ఒక లేఖ వ్రాశారు. తాను అక్కడకు వచ్చి, రాజకీయాలలో పాల్గొంటానని తెలియజేశారు.

రాహుల్జీ బెంగుళూరు నుండి బొంబాయికి బయలుదేరారు. సహాయ నిరాకరణోద్యమం ఫలితంగా కొద్దిరోజుల క్రితం షోలాపూర్‌లో కాల్పులు జరిగాయి. రాహుల్జీ ఆ ప్రదేశాన్ని చూడటానికై అక్కడ దిగారు. బొంబాయిలో రెండు మూడు రోజులు ఉన్నారు. చౌపతీలో జరిగిన సభలలో పాల్గొన్నారు. ఒకసభలో హిమాలయం నుండి కన్యాకుమారి అగ్రం వరకుగల భారతభూమిని తెల్లని ఖద్దరుతో కప్పివేయాలని ఒక ఉపన్యాసకుడు ఉద్బోధించాడు. ప్రజలు పెద్దపెట్టున కరతాళధ్వనులు చేశారు.

మదికేరిలో ఉండగానే రాహుల్జీ ఖద్దరులాల్చీ కుట్టించుకున్నారు. దారిలో ఒకచోట ఖద్దరుధోవతి కొనుక్కున్నారు. కమండలువు పట్టుకొని ఛప్రాజిల్లా కాంగ్రెస్‌కమిటీ ఆఫీసుకు వెళ్లారు. జిల్లాలో తిలక్ - స్వరాజ్య నిధిసేకరణ కార్యక్రమం అప్పటికే పూర్తిఅయింది. ఇక చర్ఖా-ఖద్దరు, మద్యపాన నిషేధ ఉద్యమాలు మిగిలాయి. తన కార్యక్రమాన్ని పల్లెటూరిలో అమలుజరపాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. పర్సా వెళ్లుతానని కాంగ్రెస్‌కమిటీ ఆఫీసులో తెలియజేశారు.

రాహుల్జీ పర్సా మఠంలోమకాంపెట్టారు. వనమాలి కూడ కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొన్నట్లు తెలిసింది. స్థానికంగా కొందరు నవయువకులు సేవాసమితిలో ఉండి కొంత కృషిచేశారు. కాని ఇప్పుడు ఆ ఉత్సాహం చల్లారిపోయింది. రాహుల్జీ వారిలోతిరిగి చైతన్యం రగుల్కొల్పారు. పర్సాలో సభ జరిపారు. దగ్గరఉన్న బస్తీకివెళ్ళి కొందరు యువకులను కూడదీశారు. గంజాయి, కల్లు - సారా, జంతుబలికి వ్యతిరేకంగా ప్రచారంచేశారు. దీనివల్ల కొంత ఫలితం కనిపించింది. జిల్లా కాంగ్రెస్ కమిటీవారు రాహుల్జీని ఛప్రాకు తీసుకువెళ్ళారు. అక్కడ ఒక కల్లుదుకాణంవద్ద రాహుల్జీ సత్యాగ్రహం చేశారు.

మరునాడు వరదవచ్చింది. ఛప్రా వీధులన్నీ చిన్న చిన్న నదులరూపం ధరించాయి. మట్టితోకట్టిన ఇళ్ళన్నీ కూలిపోయాయి. రాహుల్జీ వరదబాధితుల సేవలో చురుకుగా పాల్గొన్నారు. పొరుగుగ్రామాలనుకూడ వరద

ముంచెత్తింది. ప్రజలను సురక్షిత ప్రాంతాలకు చేరవేయడానికై కాంగ్రెస్‌వారు కొన్ని పడవలు సంపాదించారు. రాహుల్జీకూడ ఒకపడవలో పల్లెటూరికి వెళ్లారు. ప్రజలను రైల్వేస్టేషన్‌వద్ద చేరవేయడం మొదలుపెట్టారు. ఇందుకోసం వేరొకవ్యక్తికి ఒక పడవ అప్పగించబడింది. అతడు దానిని తన స్వంతఆస్తిగా భావించాడు. తన ఇంట్లో మనుష్యులను, ఇతరసామానును చేరవేసి, చివరిసారిగా తప్పుడు చేరవేస్తున్నాడు. గ్రామంలో ఎంతోమంది పిల్లలు, స్త్రీలు, వృద్ధులు ఇళ్ళకప్పులపై ప్రాణాలను అరచేతిలో పట్టుకొని ఉన్నారు. గోడలు ఏ నిమిషంలోనైనా కూలిపోయేట్లు ఉన్నాయి. ఇలాంటి భయంకర పరిస్థితిలో ప్రజల ప్రాణాలను కాపాడటానికి ఇచ్చినపడవను ఒకవ్యక్తి తన స్వార్థానికి ఉపయోగించు కొంటున్నాడు. రాహుల్జీకి చాలాకోపం వచ్చింది. హృదయహీనుడైన ఆవ్యక్తిని నానా చీవాట్లుపెట్టారు. ఆ పడవను స్వాధీనపరచుకొని, వేరొకవ్యక్తికి అప్పగించారు. వరదనీరు తగ్గిన తర్వాత కూడ ప్రజలబాధలు తగ్గలేదు. రాహుల్జీ వరదబాధితులకు అనేకవిధాల సహాయపడ్డారు.

## సత్యాగ్రహ సన్నాహం

జలియన్ వాలాబాగ్ హత్యాకాండ తర్వాత దేశ రాజకీయపరిస్థితి మారింది. గాంధీజీ సత్యాగ్రహసన్నాహాలు ప్రారంభించారు. బీహారు ప్రాంతంలో వలంటీర్ల-బోర్డు ఏర్పడింది. ఇది చట్టవ్యతిరేకమని ప్రభుత్వం ప్రకటించింది. ప్రభుత్వచర్యను ఖండిస్తూ ఛప్రాలో జిల్లాకాంగ్రెస్‌కమిటి

ఆధ్వర్యాన సభజరిగింది. ప్రముఖ కాంగ్రెస్ కార్యకర్తలు వలంటీర్లుగా తమ పేర్లు నమోదు చేయించుకొన్నారు. పోలీసులు అరెస్టులు ప్రారంభించారు. కాని కొద్దిమందిని మాత్రమే అరెస్టుచేసి, తక్కినవారి పేర్లు నోట్ చేసుకున్నారు. అరెస్టు కావడానికి పూర్వం రాహుల్జీ జిల్లాలో పర్యటించి, ప్రజలలో జాగృతి కలిగించారు. తిరిగి తన స్వస్థానం చేరుకొన్న తర్వాత, అరెస్టువారంటు వచ్చింది. క్రీ. శ. 1915 లోనే విప్లవకారుల జీవిత చరిత్రలు చదివి ఉండటంచేత, అరెస్టుఅంటే రాహుల్జీ భయపడలేదు. ఆయనను క్రీ.శ.1922 జనవరి నెలాఖరులో అరెస్టుచేసి ఛప్రాజైలుకు పంపించారు. జైలులోఉండగా "బోల్షివిజం - ప్రపంచశాంతి" అనే గ్రంథాన్ని ఆయన చదివారు. పదిరోజులతర్వాత కేసు విచారణ జరిగింది. రాహుల్జీ ప్రభుత్వ నేరారోపణను ఒప్పుకొన్నారు. ఆయనకు ఆరునెలలశిక్ష విధించబడింది. తర్వాత ఆయనను బక్సర్ సెంట్రల్ జైలుకు పంపించారు.

ఆ జైలులో అప్పటికి మూడువందల యాభై మందికి పైగా రాజకీయ ఖైదీలు ఉన్నారు. వీరిలో చాలామంది రాజకీయజీవితం గడపడానికి అన్నివిధాల సిద్ధంగాలేరు. ఏకాంతంగా ఉండటం వీరికి ఇష్టంలేదు. అదృష్టవశాత్తు వీరినందరినీ ఒకేచోట ఉంచారు. వీరంతా పగటిపూట బయట చెట్లకిందనో, ఎండలోనో గడిపేవారు. రాత్రిపూట గదులలో చదరంగం ఆడుకొనేవారు. లేదా ఏవో మత గ్రంథాలు చదువుకొనేవారు. ఒక రాజకీయఖైదీ కుస్తీకి తగిన ఏర్పాట్లు చేశాడు. ప్రతిరోజు ఉదయం రెండు మూడు

గంటలు కుస్తీ జరిగేది. కొందరు కవిత్వగోష్ఠులు జరిపేవారు. నాటకాలుకూడ ఆడేవారు. రాహుల్జీ చదువు కోవడానికే ఎక్కువకాలాన్ని వినియోగించేవారు. రష్యావిప్లవం తనలో కలిగించిన భావాలకు కావ్యరూపం ఇవ్వ సంకల్పించారు. 'విశ్వబంధు ప్రదీప్' అనే పేర ఒక సంస్కృత పద్యకావ్యం ఆరుసర్గలదాకా వ్రాసి మానివేశారు. అదే విధంగా 'కురాన్ సారం' అనే పుస్తకాన్నికూడ సంస్కృతంలో ప్రారంభించి, దాదాపు పూర్తిచేశారు. కాని రెండోసారి జైలుకు వెళ్ళి నప్పుడు, దానిని హిందీలోకి మార్చారు.

రాజకీయ ఖైదీలలో ఎక్కువమందికి రాజకీయాలపట్ల అభిరుచి ఉండేదికాదు. చదువరులలో అధిక సంఖ్యాకులు మత గ్రంథ పారాయణంచేస్తూ ఉండేవారు. స్వరాజ్యం రానే వసుందనీ, అప్పుడు ఈ లోకాన్ని గూర్చి ఆలోచించ వలసిన అవసరం తీరిపోతుందని వారి అభిప్రాయం. అందు చేత పరలోకాన్ని గూర్చి ఆలోచించడం ఉచితమని వారు భావించేవారు. మహేంద్రసింహ అనునతని చేతిలో ఎల్లప్పుడూ జపమాల ఉండేది. జగత్ నారాయణలాల్ అను నవయువ కుడు అర్థశాస్త్ర ఉపాధ్యాయుడైనప్పటికి, తాను రామతీర్థ, రామకృష్ణపరమహంసలవలె తయారు కావాలని కోరే వారు. షఫీ దావూదీ అందరూ గాఢనిద్రలో ఉన్నప్పుడు బిగ్గ రగా నమాజు చదివేవారు.

జైలు సిబ్బంది నూటికినూరుపాళ్ళు దొంగలుగా ఉండే వారు. ఖైదీలకోసం తెచ్చిన కూరగాయలలో మంచిమంచి వన్నీ ఎత్తుకుపోయేవారు. డాక్టరు ఆస్పత్రివస్తువులన్నీ

తనగుత్త సొమ్ముగా భావించేవాడు. ఒకనాడు రోగులకోసం తెచ్చిన ఒక కోడిపెట్టను కోటుజేబులో దాచుకొని బయటికి వచ్చాడు. జైలుగేటువద్దకు రాగానే సూపరింటెండెంటు ఎదురయ్యాడు. మాట్లాడటంకోసం ఇద్దరూ అక్కడ కాస్సేపు ఆగవలసివచ్చింది. అదేసమయంలో డాక్టరు కోటుజేబులో ఉన్న కోడిపెట్ట అరవడం మొదలుపెట్టింది. సూపరింటెండెంటు అతనిని వేళాకోళంచేసి వదలిపెట్టాడు.

రాహుల్జీ పూర్తిగా ఆరునెలలు జైలుజీవితం గడిపిన తర్వాత విడుదలైనారు.

## జిల్లాకాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నిక

చౌరీచౌరాకాండ నెపంతో గాంధీజీ సత్యాగ్రహాన్ని ఆపివేశారు. తత్ఫలితంగా ఇతరజిల్లాలలోవలె ఛప్రాజిల్లాలో కూడ నిస్పృహ వ్యాపించింది. కాని రాజకీయ స్వాతంత్ర్యం సాధించడం ప్రజల ధ్యేయం. అందుచేత రాహుల్జీ ప్రభృతులు జైలునుండి విడుదలకాగానే, ఇందుకు కార్యక్రమం నిర్ణయించుకొన్నారు. వీరు సభలలో మాట్లాడకూడదని ప్రభుత్వం నిషేధించింది. నోటీసు అందకపూర్వమే ప్రజలకు కొన్ని విషయాలు చెప్పాలని వీరి ఉద్దేశం. ఒక గ్రామంలో రాహుల్జీ, ఆయన సహచరుడు మాట్లాడుతుండగా, సబ్ ఇన్స్పెక్టర్ వచ్చి, నోటీసు అందజేశాడు.

కొత్తఎన్నికలలో రాహుల్జీ జిల్లాకాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నికైనారు. జిల్లాకాంగ్రెస్ నిర్మాణాన్ని పటిష్ఠ

వంతం చేశారు. చాలా తాలూకాలలో తిరిగి జాగృతి కలిగింది.

ఆ సంవత్సరం కాంగ్రెస్ మహాసభ గయలో జరపదలచారు. బోధగయలోని మహాబోధిమందిరం బౌద్ధులది కాబట్టి, అది వారికి చెందేట్లు చేయాలని రాహుల్జీ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలో తీర్మానం ప్రతిపాదించారు. చాలా వాదోపవాదాలు జరిగినతర్వాత, రాష్ట్రకమిటీ ఈ తీర్మానాన్ని ఆమోదిస్తూ, దీనిని మహాసభముందు పెట్టడానికి అంగీకరించింది.

గాంధీజీ సత్యాగ్రహాన్ని ఆపివేసి, జైలుకు వెళ్ళిన తర్వాత, కాంగ్రెస రెండుగా చీలిపోయింది. ఒకపక్షానికి రాజగోపాలాచారి నాయకుడు. రెండోపక్షానికి మోతీలాల్ నెహ్రూ, విఠలభాయిపటేల్ నాయకులు. రాహుల్జీ రెండో పక్షాన్ని బలపరచారు. ఆయనసహచరుడు నారాయణబాబు తిలక్‌వాది. రాహుల్జీకి ఇష్టమైనవాదం సామ్యవాదం. కాని ఈ విషయంలో ఆయనఅభిప్రాయం అస్పష్టంగా ఉండేది.

గయ మహాసభలో తన తీర్మానం చర్చకు వస్తుందని రాహుల్జీ చాలా ఆశించారు. తన వాదనను బలపరచడానికి ఇతరచోట్లనుండి బౌద్ధభిక్షువులను రప్పించారు. ఈ సందర్భంలో పెద్దసభ జరిగింది. పాళీ, ఇంగ్లీషు, సంస్కృతభాషలలో ఇచ్చిన ఉపన్యాసాలన్నిటినీ రాహుల్జీ అనువదించారు. ఆయనను 'అనంతభాషజ్ఞుడ'ని పెద్దలు ప్రశంసించారు. కాని కాంగ్రెస్ మహాసభలో రెండుపక్షాల కుమ్ములాటఫలితంగా రాహుల్జీ తీర్మానం చర్చకు రాలేదు. బౌద్ధభిక్షువు

లతో తాను జరిపినచర్చలు రాహుల్జీని బౌద్ధమతానికి మరింత సన్నిహితం చేశాయి.

రాహుల్జీ కాంగ్రెస్‌లో రెండోపక్షానికిచెందినవారై నందువల్ల, జిల్లాకమిటీ కార్యదర్శిపదవికి రాజీనామా ఇచ్చారు. ఆయన రాజీనామాను మొదట్లో ఆమోదించ లేదు. కాని ఆయన పట్టుబట్టి ఆమోదించేట్లు చేశారు. ఈ పదవినుండి విముక్తి పొందడంతోటే, తిరిగి దేశపర్యటన జరపాలని రాహుల్జీ అనుకొన్నారు. తన సహచరుల అను మతిపొంది నెలన్నర సెలవుతీసుకొన్నారు. నేపాల్‌కు బయలు దేరారు.

# నేపాల్‌లో నెలన్నర

కాలేజివదలిపెట్టిన ఒకయువకుని తోడుతీసుకొని రాహుల్జీ కాలినడకను యాత్రచేశారు. నేపాల్‌లోకూడ తనకు పరిచితులు ఉంటారని రాహుల్జీ అనుకోలేదు. కాని గయకాంగ్రెస్ మహాసభ సందర్భంలోవచ్చిన ఒకసాధువు థాపాథల్లీలో కనిపించాడు. అతడు మూడేళ్ళనుండి ఒక రాజకుమారుని అతిథిగాఉండేవాడు. రాహుల్జీని చూచిఅతడు చాలా సంతోషించాడు. ఆయనకు, ఆయన సహచరునికి అవసరమైన ఏర్పాట్లన్నీ చేశాడు. రాహుల్జీ కొద్దిరోజులు అక్కడ ఉండిపోయారు. ఒకనాడు ఏదోమందిరాన్ని చూడ టానికి వెళ్ళారు. కొండగట్టునుండి రైతులు ఒక విధమైన నల్లని వస్తువును చేలలో వేయడానికి తీసుకు పోతున్నట్లు గమనించారు. ఆ వస్తువు మెత్తని రాతిబొగ్గు అని రాహుల్జీకి

తట్టింది. రెండు మూడు గడ్డలను తనవద్ద ఉంచుకొన్నారు. తన బసకు వచ్చి పరీక్షచేయగా, అది మెత్తని రాతిబొగ్గు అని తేలింది. అదే సాయంత్రం రాజకుమారుడు తనను చూడ టానికి వచ్చాడు. సంభాషణల సందర్భలో రాహుల్జీ ఈ విషయం అతనికి తెలియజేశారు. అతని ఎదుటనే పరీక్ష చేసి చూపారు. రాజకుమారుడు విస్మయం చెందాడు. అప్పటివరకు రైతులు ఆ వస్తువును చేలకు ఎరువుకింద ఉప యోగించేవారు.

శివరాత్రి ఉత్సవానికి భారతదేశంనుండి చాలామంది సాధువులు వచ్చారు. వారిలో స్వామీ సచ్చిదానందకూడ ఒకరు. ఆయనను ప్రభుత్వఅతిథిగృహంలో ఉంచారు. రాహుల్జీ కొన్ని ముఖ్యమైన ప్రదేశాలను సందర్శించి, తిరిగి వచ్చేటప్పుడు అక్కడకు వెళ్లారు. జంతుబలి వేదవిరుద్ధమని స్వామీ సచ్చిదానంద ప్రచారం చేస్తున్నట్లు మహారాజు కూడా జంతుబలిని వ్యతిరేకిస్తున్నట్లు తెలసింది. రాహుల్జీ ఇప్పటికీ ఆర్యసమాజభావాలను ఆమోదిస్తున్నప్పటికీ, జంతుబలి వేదవిరుద్ధంకాదని సప్రమాణంగా నిరూపించారు.

అంతకుముందు ఆయన పాటన్‌కువెళ్ళి, బౌద్ధ విహా రంలో వజ్రదత్తుని కలుసుకొన్నారు. నేపాల్ బౌద్ధ పరం పరనుగూర్చి అతడు రాహుల్జీకి పరిచయం చేశాడు. అతని వయస్సు అరవై ఏళ్ళకు పైగా ఉంటుంది. పాటన్‌లో అతడు ప్రసిద్ధవైద్యుడు. అతని కుమారుడుకూడా వైద్యుడే. మొదటి భార్య చనిపోయినందువల్ల వజ్రదత్తుడు రెండో వివాహం చేసుకొన్నాడు. అందువల్ల తండ్రికి, కొడుకుకు పడేదికాదు.

నేపాల్ బౌద్ధులలో విధవా వివాహం సర్వసాధారణ విషయం. అందుచేత ప్రౌఢులు, వృద్ధులు అయినవారికి భార్యా వియోగం కలిగితే, తిరిగి వివాహం చేసుకోవడం కష్టమనిపించదు.

నేపాల్ నుండి తిరిగి వచ్చేటప్పుడు రాహుల్జీకి ప్యాస్ పోర్టు తేలికగానే లభించింది. ఆయన తన సహచరినితో బాటు కొంతదూరం ప్రయాణంచేశాడు. రాహుల్జీకి కొద్దిగా జర్వం తగిలింది. అందుచేత నడవలేకపోయాడు. అతని సహచరునికి ఈవిషయం తెలియలేదు. అతడు ముందుకు వెళ్ళిపోయాడు. రాహుల్జీవద్ద చిల్లి గవ్వలేదు. తనవద్ద రెండు వంటపాత్రలుమాత్రమే ఉన్నాయి. ఒక ఖాళీబండి వెళ్ళుతూ ఉంటే, దానిలో కూర్చున్నారు. ఆరాత్రి అడవిలో మకాం పెట్టవలసి వచ్చింది. అక్కడ చిరుతపులులు, ఏనుగులు ఉండేవి. వాటి ప్రమాదంనుండి రక్షించుకోవడానికి బండీవాళ్ళు బళ్ళకు చుట్టూ కోటలాగా బందోబస్తు చేశారు. మధ్యలో ఎడ్లను ఉంచారు. లోపలిభాగంలో పెద్దగా నిప్పు వెలిగించారు. నిప్పువద్దకు చిరుతపులి రాదని వాళ్ళ విశ్వాసం.

మరునాడు బళ్ళు తిరిగి ప్రయాణం కొనసాగించాయి. దారిలో అతని సహచరుడు కనిపించాడు. ఇద్దరూ రాక్సౌల్ లో దిగారు. రాహుల్జీ ఇదివరలో అక్కడ వంటపాత్రలు ఖరీదుచేశారు. ఆ దుకాణాదారుని కేపాత్రలు తిరిగి విక్రయించారు. రెండురూపాయల చిల్లర చేతికి అందింది. రాహుల్జీ తిన్నగా ఛప్రా వచ్చారు.

# హజారీబాగ్ జైలులో

అదివరలో తాను పాట్నాలో ఉపన్యాసం ఇచ్చి నందుకు, తనపైన వారంటు పుట్టినట్లు రాహుల్జీకి తెలిసింది. రెండు మూడేళ్ళు జైలులో కూర్చోవటం కంటె తప్పించుకోవడం మంచిదని అతని సహచరులు సలహా ఇచ్చారు. నేపాల్‌లో ఉండగానే వారంటు విషయం తెలిసిఉంటే, రాహుల్జీ టిబెట్టు వెళ్లేవారు. కాని తీరా ఛప్రాకు వచ్చిన తర్వాత రహస్యంగా వెళ్ళడం ఆయనకు నచ్చలేదు. అందుచేత అరెస్టు కావడానికి నిశ్చయించుకొన్నారు. రాజగోపాలాచారి ఉపన్యాసం ఇచ్చేచోటికి తాను హాజరవుతానని, పోలీసులువచ్చి అరెస్టు చేయవచ్చునని సూచించారు.

కాని పోలీసులు ఆ సభలో ఆయనను అరెస్టు చేయడానికి ఇష్టపడలేదు. పాట్నాకువస్తే, అక్కడ అరెస్టు చేస్తామని చెప్పారు. రాహుల్జీ అందుకు సిద్ధపడ్డారు. ఆరాత్రే ఇద్దరు సిపాయిలు ఆయనను పాట్నాకు తీసుకువెళ్ళి, జైలులో ఒంటరిగా పెట్టారు. జైలరు రాహుల్జీపట్ల చాలా మర్యాదగా ప్రవర్తించాడు. భారతదేశచరిత్ర వ్రాయమని ఆయనను ప్రోత్సహించాడు. రాహుల్జీ వ్రాయడం మొదలు పెట్టారు. కాని సగం పూర్తిఅయ్యేటప్పటికి, రెండేళ్ళు మామూలుశిక్ష పడింది. కొద్దిరోజులతర్వాత ఆయననుబక్సర్ జైలుకుబదిలీచేశారు. జైలు సూపరింటెండెంటు రాహుల్జీవద్దకు వచ్చినప్పుడు, సలాంకొట్టలేదు. అందువల్ల అతడుమండిపడ్డాడు. తర్వాత జైలరు రాహుల్జీవద్దకు వచ్చి, ఆయనకు నచ్చజెప్ప

ప్రయత్నించాడు. అయినప్పటికీ రాహుల్జీ సలాంచేయ నిరాకరించారు.

వెనకటిసారి తాను జైలులో ఉండగా 'కురాన్-సారాన్ని' సంస్కృతంలో వ్రాశారు. దానిని ఇప్పుడు హిందీ లోకి అనువదించారు. వారంరోజులతర్వాత మామూలు ఖైదీలందరినీ హజారీబాగ్ జైలుకు మార్చారు. అక్కడ జైలరు రాహుల్జీ పుస్తకాలను తనఖీచేశాడు. ఆయనవద్ద సింహళ లిపిలో పాళీ మజ్ఝినికాయ్ కనపడింది. అది బౌద్ధ మతగ్రంథం. లిపి, భాష, విషయమూ తెలియనందువల్ల, దానిని జైలరు ఇవ్వలేదు. ఇందుకు రాహుల్జీ నిరాహారదీక్ష పూనారు. జైలరు వచ్చి బెదరించాడు. అయినా రాహుల్జీ లెక్కచేయలేదు. ఇతరఖైదీలు ఆపుస్తకంలోని విషయాలను జైలరుకు తెలియజేశారు. కొంతసేపైన తర్వాత దానిని రాహుల్జీకి ఇచ్చాడు. ఇతర పుస్తకాలను సెన్సారింగ్‌కు పంపడానికి రాహుల్జీ ఆక్షేపణ తెలుపలేదు.

జైలు లైబ్రరీలో పుస్తకాలు ఏవీలేవు. ఖైదీలు తమ వద్ద కాగితాలు, కలం, పెన్సిలు ఏదీ పెట్టుకోవడానికి వీలు లేదు. జైలరు మొదట రాహుల్జీపై కోపపడ్డాడు. కాని ఆయన చదువుపట్ల శ్రద్ధాసక్తులుగలవ్యక్తి అని, ఇతరులను విసిగించరని తెలిసిన తర్వాత మెత్తబడ్డాడు. రాహుల్జీ కోరిక పై అతడు ఒక బలపం సప్లయిచేశాడు. దానితో ఆయన లెక్కలు చేసుకొనేవారు. ఇలా కొన్ని నెలలు గడిచాయి. తర్వాత జ్యోతిశ్శాస్త్రం మొదలుపెట్టారు. తనవద్ద కొద్దిగా డబ్బుఉంటే, దానితో పుస్తకాలు తెప్పించుకొన్నారు.

కాగితాలు, కలం, సిరా తెప్పించుకోవడానికి అనుమతి ఇవ్వబడింది. శంకరాచార్య అనే పండితుడు తనతోపాటు జైలులో ఉండేవారు. రాహుల్జీకి ఆయన గణితవిద్య బాగా నేర్పించారు. ఈ సందర్భంలో ఎందరో పాశ్చాత్య గణిత పండితుల, వేదాంతవేత్తల కథలు వినిపించేవారు. ఇద్దరూ భారతదేశ రాజకీయ, సాంఘిక పరిణామాలనుగూర్చి చర్చించేవారు.

శంకరాచార్య కొద్దిరోజుల తర్వాత జైలునుండి విడుదలైనారు. రాహుల్జీ 'ఇరవై రెండో శతాబ్దం' అనే గ్రంథ రచన ప్రారంభించారు. రాత్రిపూట వ్రాత మొదలు పెడితే, తెల్లవారిందాకా తదేకధ్యానంతో పనిచేసేవారు. పగటిపూట వ్రాతపని తగ్గించి, ఎక్కువకాలం చదువుకొనేవారు. అప్పుడప్పుడు ఖైదీల స్వీయచరిత్రలను అడిగి తెలుసుకొనేవారు.

జైలరు పరమకిరాతకుడు. ధనికులైన ఖైదీలు జైలుకు వస్తే, వారిచేత నూనెగానుగ ఈడ్పించేవాడు. ఈపని చేయలేక వారు ఇంటివద్దనుండి డబ్బు తెప్పించుకొని, జైలరుకు లంచం ఇచ్చేవారు. భాగల్పూర్ నుండి కొందరు అంతఃకలహంలో శిక్షింపబడి జైలుకువచ్చారు. వారిలో ఒకవ్యక్తి పహిల్వాన్‌వలె ఉండేవాడు. అతనిచేత జైలరు నూనెగానుగ ఈడ్పించాడు. అతడు లేవలేని స్థితిలోఉన్నా వదలలేదు. గాయం తగులకుండా విపరీతంగా దెబ్బలుపడ్డాయి. చివరికి అతడు చనిపోయాడు.

ఈ జైలులోనే రాహుల్జీ ఒక ఇంగ్లీషుపుస్తకం ఆధా

రంగా బాలలకోసం కథరూపంలో జ్యోతిషాన్నిగూర్చి ఒక చిన్నపుస్తకంవ్రాశారు. ఒక సహచరుడు జైలునుండి విడుదల అయిపోతూ ఉంటే, దానిని అతనికి ఇచ్చారు. కాని అది రాహుల్జీకి తిరిగి లభ్యంకాలేదు. ఇరవైరెండో శతాబ్దం' తర్వాత ఆయన ఒక పెద్దజ్యోతిషగ్రంథరచన, ఖగోళ చిత్రాలు తయారు చేయడానికి ఉపక్రమించారు. కొన్ని సంస్కృతగ్రంథాలు, ఇంగ్లీషు గ్రంథాలు తెప్పించుకొన్నారు. పారిభాషిక శబ్దాలు కొన్ని పాతవి తీసుకొని, కొన్ని కొత్తవి సృష్టించారు. జ్యోతిషగ్రంథంవ్రాయడం మొదలుపెట్టారు. ఇందులో గ్రహగణితం, నక్షత్రాలు, పాగమంచు, తోకచుక్క మొదలైన విషయాలనుగూర్చి చాలావరకు వ్రాశారు. దీనితోబాటు మూడు పెద్దపెద్ద ఖగోళచిత్రాలు తయారుచేశారు. రెంటిలో ఉత్తర, దక్షిణ గోళార్థాలలోని వేలాది నక్షత్రాలను చూపించారు.మూడో దానిలో పాట్నా అక్షాంశంపై కనిపించే నక్షత్రాలు ఉన్నాయి. తొంభైకిపైగాగల నక్షత్రమండలాలలో నలభై వరకుమాత్రమే సంస్కృతంలో పేర్లు లభ్యమైనాయి. అలాంటప్పుడు భారతదేశ దక్షిణాంతంలోకూడ కనిపించని అనేక నక్షత్రాల పేర్లు ఎలా లభ్యమవుతాయి? వాటిపేర్లను రాహుల్జీ సృష్టించారు. ఇంగ్లీషులో చిన్న, పెద్ద ఆకారంలో గల నక్షత్రాలను లెక్కపెట్టడంలో అంకెలేగాకుండా గ్రీకు, తదితర అక్షరాలను ఉపయోగిస్తారు. రాహుల్జీ వాటి స్థానంలో బ్రాహ్మీ మొదలైన అక్షరాలను ప్రయోగించారు. గ్రంథంలో చాలాభాగం అనువాదం. ఇది ప్రథమ

యత్నం. ఇది వ్రాసేటప్పుడు రాహుల్జీ తాను జైలులో ఉన్నాననే విషయంకూడ మరచిపోయారు. తాను పంచాగం వ్రాస్తున్నట్లు జైలుసిపాయిలు భ్రమపడ్డారు. ఒకనాడు ఒక జమేదారువచ్చి, లగ్నాలనుగూర్చి ఏదో సమాచారం అడిగాడు. తనకు తెలియదని రాహుల్జీ చెప్పినా అతడు నమ్మలేదు. గణిత జ్యోతిష్యానికి, ఫలిత జ్యోతిష్యానికి భేదం ఉందని అతనికేం తెలుసు?

జ్యోతిషగ్రంథం పూర్తిఅయినతర్వాత రాహుల్జీ ఉబుసుపోకకోసం సాహసోపేత యాత్రలకు సంబంధించిన నాలుగు నవలలను హిందీలోకి స్వేచ్ఛానువాదం చేశారు.అవి 'బంగారుమడాలు' అనే పేర ప్రచురింపబడ్డాయి. రాహుల్జీ హజారీబాగ్ జైలులో దాదాపు రెండేళ్ళు శిక్ష అనుభవించారు. తనకు తెలియకుండానే ఈదీర్ఘకాలం గడచిపోయింది. ఇంత తదేకధ్యానంతో రాహుల్జీ ఇదివరకు ఎప్పుడూ చదవనూలేదు, వ్రాయనూలేదు.ఆయన శాస్త్రీయ దృక్పథం మరింత విస్తృతమైంది. ఆర్య సమాజభావాలు రూపుమాసి బౌద్ధమతంవైపు ఆయన దృష్టిమరలింది. కాని దేవుడు ఉన్నాడనే నమ్మకం ఇప్పటికీ ఉంది.

క్రీ. శ. 1925 ఏప్రిల్ 1౧వ తేదీన రాహుల్జీ హజారీబాగ్ జైలునుండి విడుదలై ఛప్రాకు వచ్చారు.

## జిల్లా రాజకీయాలలో క్షీణదశ

జిల్లాలో రాజకీయ వాతావరణం సద్దుమణగింది. జిల్లాబోర్డు కాంగ్రెస్ స్వాధీనంలో వుంది. కాని నాయకులు

తమస్వార్థంకోసం ఒకరితో ఒకరు కలహించుకొంటున్నారు. చాలామంది పార్టీపని వదలిపెట్టారు. ఇది చూచి రాహుల్జీకి ఏహ్యాభావం కలిగింది. నాయకులను చీవాట్లుపెట్టారు. కాని ఇది వారికి చిలిపిచేష్టగా కనిపించింది. రాహుల్జీ జిల్లాలో చాలాచోట్ల పర్యటించారు. అక్కడక్కడ హిందూ-ముస్లిం కలహాలుకూడ ప్రారంభమైనట్లు గమనించారు తాను మీర్ గంజ్‌కు వెళ్ళినరోజున ఇలాంటి కలహం జరిగింది. రాహుల్జీ జోక్యం కల్పించుకొని చాలామంది ముస్లింల ప్రాణాలను కాపాడారు.

కొత్తఎన్నికలలో ఆయన జిల్లాకాంగ్రెస్ ఉపాధ్యక్షు పదవిని స్వీకరించారు. సహాయ నిరాకరణలో పాల్గొన్న పోలీసు సబ్ఇన్‌స్పెక్టర్ రామానందసింహ్ కార్యదర్శిగా ఎన్నికైనారు. జిల్లాకాంగ్రెస్ పనిభారం అంతా వీరి నెత్తినే పడింది.

రాజకీయాలు సద్దుమణగిఉన్నట్లు గమనించి, పోలీసులు తిరిగి అత్యాచారాలు మొదలుపెట్టారు. భోరా సబ్ ఇన్‌స్పెక్టరు అత్యాచారాలనుగూర్చి రాహుల్జీ దృష్టికి వచ్చింది. వెంటనే తానూ, రామానందసింహ అక్కడకు వెళ్ళి దర్యాప్తు జరిపారు. లంచం ఇవ్వలేదని పోలీసులు ఒక వ్యక్తి అరచేతిపై మంచంకోడుపెట్టి, మనుష్యులచేత తొక్కించినట్లు నిజమైంది. ఇలాంటివే ఇంకాఎన్నో అత్యాచారాలనుగూర్చి రాహుల్జీ ఒక రిపోర్టు తయారుచేసి, జిల్లా మేజస్ట్రేటుకు ఇచ్చారు. కాని అతడు ఎలాంటిచర్యా తీసుకోలేదు.

జిల్లాలోను, బయటా జాతీయ ఆందోళన పూర్తిగా మందగించింది. ముఖ్యమైనపని ఏదీ జరిగేదికాదు. అందువల్ల కాన్పూర్ కాంగ్రెస్‌మహాసభ తర్వాత, కొద్ది నెలలు దేశ పర్యటన జరపాలనికూడ రాహుల్జీ నిశ్చయించుకొన్నారు.

## తిరిగి హిమాలయ యాత్ర

రాహుల్జీ కాన్పూర్ కాంగ్రెస్‌మహాసభ ప్రతినిధి, అఖిలభారత కాంగ్రెస్ కమిటీ సభ్యుడు. విషయనిర్ణయసభ బహిరంగసభలలో నిర్జీవమైన ఉపన్యాసాలు విన్నారు. మహాసభ సమాప్తం కాగానే, మరొక మిత్రునితో కలిసి మీరట్ పట్టణానికివెళ్ళారు. ఇద్దరూ ఎడ్లబండిమీద బయలుదేరి హస్తినాపురం, పరీక్షిత్‌గఢ్ మొదలైన ముఖ్యప్రదేశాలను చూశారు. మీరట్‌లో మొదట హరినామ్‌దాస్‌ను కలుసుకొన్నారు. ఆయన బౌద్ధభిక్షువై, నేడు ఆనంద కౌసల్యాయన్ అని పిలువబడుతున్నారు. రాహుల్జీ పూర్వ మిత్రుడు అభిలాషచంద్ర ఈ జిల్లాలోనే ఉండేవాడు. అతనికి కబురుచేసి మీరట్‌కు రప్పించుకొన్నారు. విప్లవకారుడుగా జీవితం ప్రారంభించిన అభిలాషచంద్ర నేడు మెకానికల్ ఇంజనీర్‌గా ఉన్నాడు. అతని దాంపత్య జీవితం కూడ బాగులేదు. ఇది రాహుల్జీకి చాలా విచారం కలిగించింది.

ఆయన మీరట్‌నుండి క్రీ.శ. 1926 జనవరి నెలాఖరులో ఢిల్లీకివెళ్ళారు. ఎర్రకోట, జుమ్మామసీదు, కుతుబ్‌మీనార్ మొదలైన ముఖ్య ప్రదేశాలను తిలకించారు.

హజారీబాగ్ జైలుసహచరుడుగా ఉన్న శంకరాచార్య గుర్రపుబండిపై పోతూఉండగా రాహుల్జీ గుర్తుపట్టారు. వెళ్లి ఆయన పాదాలకు ప్రణమిల్లారు. ఆయన బసలో ఒకరోజు గడిపారు.

తర్వాత రాహుల్జీ లాహోర్ వెళ్లారు. ఆర్యసమాజం తరఫున జరిగినసభలలో పాల్గొన్నారు. పిమ్మట ఖైబర్ కనుమయాత్ర చేశారు. విదేశపర్యటనకోసం దరఖాస్తు పెట్టుకొన్నారు. తాను బీహారు రాజకీయాలలో పాల్గొన్నట్లు పోలీసులకు తెలుసు. అందుచేత ప్యాస్‌పోర్టు ఇవ్వలేదు. రాహుల్జీ శ్రీనగర్‌లో కొద్దిరోజులు గడిపారు. ఒక మిత్రుని తోడ్పాటుతో లడక్ యాత్రకు అనుమతి సంపాదించారు. కర్గిల్‌లో లాలా రాంరఖామల్ తోడైనాడు. ఇద్దరూ గుర్రాలపై యాత్ర చేశారు. రాంరఖామల్ హేమిస్ దాకా వచ్చి వెనక్కి వెళ్ళి పోయాడు.

రాహుల్జీకి హేమిస్‌లో లామా ఆశ్రయమిచ్చాడు. తనకు మెస్మరిజం తెలుసునని ఒకరోజున లామాతో చెప్పారు. దానిని చూపించవలసిందిగా అతడు కోరాడు. రాహుల్జీ ఒక దుబాసీని,ఒక చిన్నకుర్రవానిని లామా గదిలోకి పిలిచారు. కుర్రవాని బొటనవ్రేలిగోటిపై ఒక విధమైన కాటుకచుక్క పెట్టారు. దీనిలో నీ ప్రతిబింబాన్ని చూస్తూ ఉండమని కుర్రవానికి చెప్పారు. తర్వాత తాను వేర్వేరే ఇతర వస్తువుల, ప్రదేశాల, వ్యక్తులనుచూడమని కోరారు. కుర్రవాడు తాను బొంబాయినగరం, సముద్రం, ఓడ, బోధగయమందిరం చూస్తున్నట్లు చెప్పాడు. చివరికి హేమిస్

మఠంలో లామావద్ద కూర్చున్న వ్యక్తులనుగూర్చి అడిగారు. కుర్రవాడు పరిచితులతోబాటు, అపరిచితుల పేర్లు, ఆకారం కూడ చెప్పగలిగాడు. లామాకు అమితాశ్చర్యం కలిగింది.

లధక్ తహశీల్దారు రాహుల్జీకి ఇద్దరు మనుష్యులను తోడు ఇచ్చారు. వీరుముగ్గురూ గుర్రాలపై ఎక్కి ఖర్దోంగ్ యాత్ర చేశారు. పద్దెనిమిదివేల అడుగుల ఎత్తుదాకా వెళ్ళారు. ఈ యాత్ర గొప్పగా వర్ణించారు. దీనిని పుస్తక రూపంలో ప్రకటించవలసిందిగా రాజేంద్రబాబు సలహా ఇచ్చారు. కాని ఆపని నెరవేరలేదు.

రాహుల్జీ ఖర్దోంగ్ కనుమ పైభాగంవరకు గుర్రంపై వెళ్ళారు. కాని తిరిగి వచ్చేటప్పుడు, గుర్రాన్ని ఇతరులకు అప్పగించి, కాలినడకనే వచ్చారు. ఖర్దోంగ్ కనుమ ఎక్కడం కంటె దిగడం కష్టం. గుర్రంపై స్వారిచేస్తూ దిగడం మరింత కష్టం. రాహుల్జీ ఒక్కొక్కచోట వెనక్కివంగిన మంచుగోడ మీదనుండి దిగవలసి వచ్చింది. చాలాచోట్ల నాలుగుకాళ్ళ జంతువువలె నడవవలసి వచ్చింది.

ఖర్దోంద్ యాత్ర పూర్తిచేసిన తర్వాత, నుబ్రాలో రిజోంగ్ లామాను కలుసుకొన్నారు. బౌద్ధమతాన్ని గూర్చి నూతనవిషయాలు తెలుకోవాలని రాహుల్జీ ఉద్దేశం. దుబాసి ఆయనను లామాకు పరిచయం చేశాడు. లామా స్వయంగా చిత్రకారుడు. అతడు గోడలపై గీసిన గులాబి పువ్వులు చాలా అందంగా ఉన్నాయి. టిబెట్టుభాష, సాహిత్యాలను గూర్చి ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకొన్నారు. కంజూర్ లోకి అనువదింపబడిన మహాయాన మహాపరినిర్వాణ

సూత్రాన్నిగూర్చి లామా కొంత వివరించాడు. అతడు చెప్పినదానిని దుబాసీ రాహుల్జీకి అనువదించి చెప్పాడు. లడఖ్‌లో జరగవలసిన సాంఘిక సంస్కరణలనుగూర్చి రాహుల్జీ కొన్ని సూచనలు చేశారు. లడఖ్‌లో బహుభర్తలను వివాహం చేసుకొనే సంప్రదాయముంది. స్త్రీలకు భర్తలు దొరక్కపోతే ఇతరమతాలవారిని వివాహమాడుతున్నారు. అందుచేత ఈ సంప్రదాయాన్ని తొలగించి, ప్రతిపురుషుడు వేరువేరుగా పెండ్లిచేసుకొనే సంప్రదాయం ప్రవేశపెట్టాలని రాహుల్జీ సూచించారు. తానుకూడ ఇలాంటి అభిప్రాయమే కలిగిఉన్నట్లు లామా తెలియజేశాడు.

రెండుమూడురోజులతర్వాత రాహుల్జీ హామిస్ వెళ్ళారు. ఏటేటాజరిగే మతసంబంధమైన నాట్యాలు, నృత్యాలను చూశారు. పశ్చిమ హిమాలయయాత్రకు కావలసిన సమాచారం సేకరించుకొన్నారు. తర్వాత మన్ పంగ్‌గోంగ్ అనే సరస్సును సందర్శించారు. అది యాభై మైళ్ళదాకా వంకరటింకరగా వ్యాపించిన సరస్సు. ఇందులో సగానికిపైగా టిబెట్ సరిహద్దులోపల ఉంది. నీళ్ళు స్వచ్ఛంగా కనపడతాయి. అయితే ఇందులోచేపలు బొత్తిగాలేవు. నీళ్ళలోవిషం ఉందని, అందువల్ల చేపలు బతకవని ప్రజలు చెప్పారు. శీతకాలంలో నీళ్ళు గడ్డకడతాయి. అప్పుడు మనుష్యులు దానిపై దారి ఏర్పాటు చేసుకొంటారు.

హాన్లేమఠానికి సంబంధించిన 'యాక్' పశువుల మందను రాహుల్జీ చూశారు. వీటిని మేపే సిబ్బందిపై ఒక సాధువు పెత్తనంచేసేవాడు. రాహుల్జీ అక్కడికి వెళ్ళినప్పుడు,

కొందరు స్త్రీలు కుండలలో 'యాక్' జంతువుల పెరుగుపోసి జిలకొడుతున్నారు. వెన్న, మజ్జిగ వేర్వేరు అయిపోయిన తర్వాత, వారు కొద్దిగా వేడినీరుపోశారు. మళ్ళీ జిలకొట్టి వెన్న తీశారు. మజ్జిగ అంతా ఏం కానీ? అందుచేత దానిని నిప్పుపై పెట్టి మరగకాచారు. అది మంచుగడ్డవలె తయారైంది. దానిని ముక్కలుచేసి, పేలపిండిలో కలుపుతారు. తర్వాత ఎండబెడతారు. ఇది తినడానికి పుల్లగా ఉంటుంది. ఎంత దప్పికనైనా ఇది చల్లార్చుతుంది.

మరునాడు రాహుల్జీ ఒక మనిషిని వెంటతీసుకొని గుర్రంపై ఇంకొక కనుమ ఎక్కారు. పశ్చిమటిబెట్‌కు చెందిన ఒక గ్రామంలో ప్రవేశించారు. వెంటవచ్చిన మనిషి రాహుల్జీని గ్రామపెద్ద ఇంటివద్ద వదలి వెళ్ళిపోయాడు. గ్రామపెద్ద ఎక్కడికో వెళ్ళాడని, త్వరలో వచ్చేసూచనలు లేవని అతని భార్య చెప్పింది. రాహుల్జీ ఆ రాత్రి, మరునాడు కూడ అక్కడే ఉన్నారు. కాని గ్రామపెద్ద రాలేదు. ఒక కూలి మనిషిని తీసుకొని తిరిగి ప్రయాణం కొనసాగించారు. కొంత దూరం వెళ్ళినతర్వాత, ఒక వ్యాపారి గొర్రెపోతులపై సరకులు వేసుకుని వస్తున్నాడు. అతడు రాహుల్జీ ఎటు వెళ్ళాలో చక్కగా సూచించాడు. ఆ రాత్రి ఒక గ్రామంలో కాలక్షేపం చేశారు. మరునాడు అక్కడ ఇంకొక కూలి కుర్రవానిని తీసుకొని బయలుదేరారు. వాగులు దాటడంలో ఆ కుర్రవాడు రాహుల్జీకి చాలా తోడ్పడ్డాడు. కొద్దిరోజులతర్వాత ఆయన సుమ్నమ్ చేరుకొన్నారు. అక్కడి స్త్రీల తెల్లని శరీర ఛాయ, అసాధారణమైన మధురకంఠం రాహుల్జీని ఆకర్షిం

చాయి. సంస్కృతసాహిత్యంలోని కిన్నరకంఠులు గుర్తుకు వచ్చారు. సుమ్నమ్ ప్రజలు బౌద్ధమతస్థులు, అన్నతమ్ములందరూ కలసి ఒకే స్త్రీని వివాహం చేసుకొనే సాంప్రదాయం వీరిలో ఉంది. కొద్దిసంవత్సరాలనుండి రాజు బహు భర్తృ వివాహాన్ని నిషేధించారు. అయినప్పటికీ ఇది పూర్తిగా తొలగిపోలేదు.

రాహుల్జీ సుమ్నమ్‌లో దాదాపు రెండురోజులుగడిపి, దక్షిణ సెట్లజ్‌కు బయలుదేరారు. చినీ, సహారన్, రామపురాలమీదుగా సిమ్లాకు వెళ్ళారు. ఆర్యసమాజభవనంలో విశ్రాంతి తీసుకొన్నారు. రాహుల్జీ రాజకీయరంగంనుండి విడివడి అప్పటికే చాలాకాలమైంది. అందుచేత ఛప్రాజిల్లాకు తిరిగి వెళ్ళదలచారు. ఒక్కరోజులో సిమ్లాఅంతా కలియ దిరిగి మీరట్‌కు బయలుదేరారు. అక్కడ ఒకమిత్రునిఇంట రెండుమూడురోజులు గడపి, ఛప్రాకువెళ్ళారు.

## స్టేట్ కౌన్సిల్ ఎన్నికలు

రాహుల్జీ స్టేట్ కౌన్సిల్ ఎన్నికల (1926)లో కాంగ్రెసుపార్టీతరఫున గట్టిగా కృషిచేశారు. రాష్ట్రంనుండి ఎన్నికైన పార్టీసభ్యుల ప్రథమ సమావేశం పాట్నాలో జరిగింది. ఆ సమావేశానికి రాహుల్జీకూడ హాజరైనారు. రైతుల యోగక్షేమానికి సంబంధించిన విషయాలపై వారితో మాట్లాడి, సంతకాలు చేయించుకొన్నారు. చాలామంది సంతకాలుచేశారు. కాని వెనుక ముందాడుతూ సంతకాలు చేసినవారే ఎక్కువమంది. రైతుల యోగక్షేమాలకోసం

సగందూరం వెళ్ళడానికిసైతం చాలామంది కాంగ్రెసు వాదులు సిద్ధంగా లేరని రాహుల్జీకి తెలిసిపోయింది.

ఆ సంవత్సరం కాంగ్రెసుమహాసభ గౌహాతిలో జరిగింది. ఆ సభలో రాహుల్జీకూడ పాల్గొన్నారు. సభ జరిగే టప్పుడు, స్వామీశ్రద్ధానందను హత్యచేసినట్లు వార్త వచ్చింది. సభ్యులలో కొంత ఉద్రేకం కనపడింది. మహాసభ చర్చలు రాహుల్జీకి నీరసంగా అగుపించాయి. కౌన్సిల్లో పాల్గొనడానికి కాన్పూర్ కాంగ్రెసు సమ్మతించినందువల్ల మహాసభలో వాదోపవాదాలుకూడ ఏమీ జరగలేదు.

రాహుల్జీ తిరిగి ఛప్రాకు వచ్చారు. గాంధీజీ పర్యటనకు ఏర్పాట్లు చేయవలసిఉంది. ముఖ్యకార్యకర్తలలో రాహుల్జీ ఒకరు. అయినప్పటికీ గాంధీజీ వెంటఉండటానికి ఆయనబొత్తిగా ఇష్టపడలేదు. పెద్దవారివెంట వెళ్ళితే తాను ఉక్కిరి బిక్కిరిఅయిపోతానని చెప్పారు. రాజేంద్రప్రసాద్ ఆయనను బలవంతంగా గాంధీజీవద్దకు తీసుకువెళ్లారు. రాహుల్జీ ఆయనను రెండు మూడు నిమిషాలు చూశారు.

జిల్లాబోర్డు ఎన్నికలలో కాంగ్రెసు వ్యతిరేకపక్షం విజయంపొందింది. భూస్వాములు, కులతత్వవాదులు ఎన్నికైనారు. కాంగ్రెసుకు ఏ కార్యక్రమమూ లేకపోయింది. రాహుల్జీ 'ఇరవైరెండో శతాబ్దం'లో వెలిబుచ్చిన సామ్యవాదభావాలు అలాగే ఉండిపోయాయి. వాటిని ప్రచారం

చేసేవారుగాని, అందుకు అనుకూలమైన వాతావరణంగాని లేకపోయింది. బౌద్ధమతాన్ని గూర్చి ఇంకా ఎక్కువ అధ్యయనం చేయాలని రాహుల్జీ అనుకొన్నారు. సారనాథ్‌కు వెళ్ళి బౌద్ధభిక్షువు శ్రీనివాసును కలుసుకొన్నారు. రాహుల్జీ అభిప్రాయం తెలుసుకొని ఆయన చాలా సంతోషించారు. లంక విద్యాలంకార విహారంలో సంస్కృత అధ్యాపకుడు అవసరమని, అక్కడకు వెళ్ళితే అన్నిపనులూ నెరవేరుతాయని చెప్పారు. మూడు నెలల తర్వాత రాహుల్జీ లంకకు వెళ్ళ నిశ్చయించారు.

——

# అయిదో అధ్యాయం

## లంకకు పయనం

క్రీ. శ. 1927 మే నెలలో రాహుల్జీ కలకత్తా మీదుగా లంకకు బయలుదేరారు. లంకలోని విద్యాలంకార విహారంలో తాను సంస్కృతం బోధించడానికి అదివరకే ఏర్పాటుజరిగింది. తిండి, బట్ట పుస్తకాలు, ముఖ్యంగా పాలీ గ్రంథాలు దొరికితే చాలునని రాహుల్జీ చెప్పారు.

కొలంబోకు సమీపంలో విద్యాలంకార విహారం ఉంది. రాహుల్జీకి విహారం అధిపతి, అధ్యాపకుల, విద్యార్థులు స్వాగతమిచ్చారు. విహారంలోని వాతావరణం రాహుల్జీకి బాగా నచ్చింది. క్రింది తరగతినుండి పైతరగతిదాకా విద్యార్థులు, అధ్యాపకులూ, అందరూ సంస్కృతం చదువుతున్నారు. కాని వీరి పఠనపద్ధతి ఉత్తరభారతదేశంలోవలె వ్యాకరణం బట్టీ పట్టడంతో ప్రారంభమవుతున్నది. రాహుల్జీ ఈ పద్ధతిలో మార్పు ప్రవేశపెట్టారు. స్వల్ప పరిశ్రమతోటే విద్యార్థులు సంస్కృతం అర్థంచేసుకొనేట్లు చేయగలిగారు.

విద్యాలంకార విహారం లంకలోని రెండు ప్రధాన బౌద్ధకేంద్రాలలో ఒకటి. విద్యార్థులు, అధ్యాపకుల సంఖ్యలో కొలంబో విద్యోదయ విహారంపెద్దది. అదికొలంబో పట్టణంలో ఉండటమే ఇందుకు కారణం. విద్యాలంకార విహారంలో దాదాపు 150 మంది, విద్యోదయ విహారంలో

500 మంది విద్యార్థులుఉండేవారు. అందులో కొంతమంది విహారంలోనే ఉంటూ చదువుకొనేవారు. తక్కినవారు చుట్టుపట్ల చిన్న విహారాలనుండి మధ్యాహ్నంపూట వచ్చి చదువుకొనేవారు. జీవితమంతా చదువుకోసమే కాబట్టి, తొందరపడటం ఎందుకని భిక్షువులు నిదానంగా విద్య నేర్పేవారు. రాహుల్జీకి ఈ పద్ధతి నచ్చలేదు. ముఖ్యంగా తన కాలం వ్యర్థం అయిపోతుందని ఆయన భయం. అందుచేత వడివడిగా పాఠాలు బోధించేవారు.

లంకలోఉన్న పందొమ్మిది నెలలకాలం రాహుల్జీ అధ్యయన-అధ్యాపనకృషి విస్తారంగా జరిగింది. తాను విహారంలో ప్రవేశించిన ఆరునెలలకు జర్మనీ ప్రొఫెసర్ రుడాల్ఫ్ వోటో రాహుల్జీని కలుసుకొని సంభాషించారు. ఏ విశ్వవిద్యాలయంలోను చదువకుండానే భారతీయ సంస్కృతిని గురించి రాహుల్జీ అపారమైన జ్ఞానం సంపాదించి ఉండటం ఆయనకు అమితాశ్చర్యం కలిగించింది.

“తెప్పవలె ఒడ్డున చేర్పించడానికి నీకు ధర్మోపదేశం చేశానేకాని నెత్తిమీద మోసుకొని తిరగడానికి కాదు.” అనే బుద్ధునివాక్యం రాహుల్జీని మిక్కిలి ఆకర్షించింది. ఇన్ని రోజులనుండి నేను ఏవస్తువుకోసం వెదకుతున్నానో అది లభించిందనుకొన్నారు. ఏదో గ్రంథాన్ని బట్టికాని, సంప్రదాయాన్ని బట్టి కాని, పెద్ద తరహాగా చెప్పిన మాటనుబట్టి కాని ఒక నిర్ణయానికి రావద్దని, ఎల్లప్పుడూ స్వయంగానే ఒక నిర్ణయానికి రావాలని బుద్ధుడు ఇచ్చిన ఉపదేశం రాహుల్జీని మేల్కొలిపింది. తాను భగవత్ శబ్దాన్ని గూర్చి విద్యార్థు

లకు వివరించవలసివచ్చినప్పుడు ఆయన ఇరుకున పడేవారు. ఆయనలోఉన్న ఆర్యసమాజ భావాలు, పుట్టుకతోవచ్చిన భావాలు అన్నీ వదలిపోయాయి. ఈ సృష్టికి కర్తఅనేవాడు ఒకడుఉన్నాడనేభావం మాత్రమే మిగిలింది. అయితే భగవంతుడు, బుద్ధుడు - వీరిలో ఎవరో ఒకరిని ఎన్నుకోవలసి వచ్చింది. కొద్దినెలలతర్వాత, భగవంతుడు కాల్పనిక వస్తువని, బుద్ధుడు యథార్థవక్తఅని తేల్చుకొన్నారు. కాని కొద్దివారాలవరకు ఆయనలో ఒక విధమైన అశాంతి ఏర్పడింది. చిరకాలంనుండి వస్తున్న ఒకపెద్ద ఆలంబనం జారిపోయినట్లు అనిపించింది. అయితే కొద్దికాలానికి ఈ భ్రాంతులన్నీ పటాపంచలైనాయి. రాహుల్జీ తన బుద్ధినే మార్గదర్శకంగా ఎంచుకొన్నారు. ఇప్పుడు డార్విన్ పరిణామవాదంపై ఆయనకు నమ్మకం కుదిరింది. మార్క్సిజంలోని సత్యం ఆయన హృదయానికి హత్తుకుపోయింది.

రాహుల్జీ ప్రతి ఆదివారం కొలంబోకు వెళ్ళేవారు. అక్కడఉన్న రాయల్ ఏషియాటిక్ సొసైటీ గ్రంథాలయంలో తనకు అవసరమైన పుస్తకాలు తీసుకొని చదివేవారు. కొద్దికాలమైనతర్వాత అక్కడనుండే విహారానికి పుస్తకాలు తెప్పించుకోవడం మొదలుపెట్టారు. కొలంబోలో రాహుల్జీకి జగత్ రామ్ అనే పండితుడు పరిచయమైనాడు. లంకలోకెల్లా అతడు పెద్ద జ్యోతిష్కుడు. మొదట్లో అతడు భారతీయుడు. ఏదో సర్కస్ బృందంలో పనిచేస్తూ, ఒకసారి లంకకువచ్చాడు. అతనికి అదివరకే జ్యోతిష్యంలో కొంత ప్రవేశం ఉండేది. ఈ విద్యకు లంకలో మిక్కిలి

గౌరవం ఉండటం గమనించాడు. జ్యోతిష్కుడుగా లంక లోనే స్థిరపడిపోయాడు.

క్రీ.శ. 1927 డిసెంబరులో మద్రాసులో కాంగ్రెసు మహాసభ జరిగింది రాజేంద్రప్రసాద్ మహాసభ అనంతరం లంకకువచ్చారు. ఆయనకు రాహుల్జీ ముఖ్యమైన ప్రదేశాలు చూపించారు. వీరు "సీతా - ఎలియా"ను కూడ చూశారు. రావణుడు సీతను తెచ్చిఉంచినట్లు చెప్పబడే రమణీయ ప్రదేశం అది. అక్కడ కొండలలోఉన్న అశోకవృక్షాలను ఒకవ్యక్తిచూచి, ఇదే జానకీదేవి అశోకవనం అన్నాడు. కొన్ని అశోక పత్రాలనుకోసి తనవద్ద దాచుకొన్నాడు. రాహుల్జీ ఆ కొండలపై గడ్డిమొక్కలకిందఉన్న నల్లనిమట్టిని అతనికి చూపించారు. బంగారులంక దహనమై ఇలా మారి పోయిందని చమత్కరించారు. తర్వాత వీరు లంక పూర్వ రాజధాని అనురాధపురాన్ని చూచివచ్చారు.

రాహుల్జీ లంకలోఉండగా ఆయన పూర్వస్నేహి తుడు విశ్వనాథ్ (భదంత ఆనందకౌసల్యాయనే) వచ్చాడు. సాధువైనతర్వాత విశ్వనాథ్ తనపేరును మార్చుకొన్నాడు. భగవంతునిగూర్చి వీరిద్దరూ లంకలో ఏకాభిప్రాయానికి వచ్చారు. లంకనుండి టిబెట్ వెళ్ళి బౌద్ధమతాన్నిగూర్చి సమగ్రంగా తెలుసుకోవాలని రాహుల్జీకి అనిపించింది. అయితే టిబెట్కు రహస్యంగా వెళ్ళవలసిఉండేది.

లంకలోనే రాహుల్జీ సాహిత్యజీవితం ప్రారంభమైం దని చెప్పవచ్చు. అక్కడఉంటూ హిందీ పత్రికలకు ఆయన ప్రతివారం వ్యాసాలు వ్రాసేవారు. కందయ్య అను విద్యార్థి

తనకు ఫ్రెంచిభాష నేర్పించేవాడు. అతనికి రాహుల్జీ సంస్కృతం బోధించేవారు. స్వయంగా టిబెట్ భాషకూడ నేర్చుకోవడం మొదలుపెట్టారు. కొద్దినెలలతర్వాత మంగళూరుజిల్లానుండి అనంతరామ్‌భట్ అనే సంస్కృత పండితుడు లంకకు వచ్చాడు. అతనిని సంస్కృత అధ్యాపకుడుగా తీసుకోవలసిందని రాహుల్జీ సూచించారు. తాను స్వదేశానికి వెళ్ళేముందు—అంటే 1928 సెప్టెంబరు 5వ తేదీన విద్యాలయంవారు ఆయనకు 'త్రిపిటకాచార్య' అనే బిరుదు ఇచ్చి సన్మానించారు.

## లంకనుండి తిరుగుప్రయాణం

పాళీత్రిపిటక, తదితర అనేక గ్రంథాలను రాహుల్జీ లంకలో ఉండగానే సేకరించారు. వాటిని రైలుద్వారా పాట్నాకు పంపించారు. క్రీ. శ. 1928 డిసెంబరు ఒకటో తేదీన భారతదేశానికి బయలుదేరారు. తనమిత్రుడు భదంత ఆనంద కౌసల్యాయన్ లంకలోనే ఉండిపోయాడు.

రాహుల్జీ వచ్చేటప్పుడు మధురమీనాక్షీ మందిరాన్ని సందర్శించారు. పదిహేనేళ్ళక్రితం తాను ఈ మందిరంలోని విగ్రహాలనుచూచి నప్పుడు ఆకర్షణీయంగా ఉన్నాయి. కాని ఇప్పుడు అవి వికారంగాకనిపించాయి. రాహుల్జీ శ్రీరంగంలో రెండురోజులుఉండి పూనా వెళ్ళారు. పిమ్మట కార్లేలోని గుహావిహారం, నాసిక్ గుహలు చూశారు. ఎల్లోరా వెళ్ళడానికై ఔరంగాబాద్ వచ్చారు. స్టేషన్‌నుండి బయటికి రాగానే పోలీసులు ఆయనవెంట పడ్డారు. తన పుట్టు—

తెలుగు తెలిసిన వారు

పూర్వోత్తరాలు పూర్తిగా చెప్పనిరాకరించడమే ఇందుకు కారణం. ఆయనను తహశీల్దారుదగ్గరకు తీసుకుపోయారు. అతడు విచారణచేసి, రాహుల్జీని వదలిపెట్టాడు.

తర్వాత రాహుల్జీ ఒక బస్సులో ఎల్లోరాకు వెళ్ళారు. ఎల్లోరానుపూర్తిగా చూడాలంటే కొన్నిరోజులు పడుతుంది. అక్కడ ఎన్నో విశాలమైన గుహాలుఉన్నాయి. అవి ఒకొక్కటి ఒక మహల్ అని చెప్పవచ్చు. అవి భారతీయ శిల్పకళకు, వాస్తుకళకు సర్వోత్కృష్టమైన నమూనాలు. రాహుల్జీ మొదట కైలాసమందిరంలో ప్రవేశించారు. కొండను తొలిచి, శిఖరంతోకూడిన ఒక విశాలమందిరం నిర్మింపబడిఉంది. దాని గోడలపై వేలకొలది అందమైన శిల్పాలు ఉన్నాయి. ఒకచోట రామాయణదృశ్యం, మరొకచోట ఇతర పౌరాణికదృశ్యం కనిపిస్తాయి. ఈ అద్భుత కళను ఎంతసేపైనా చూడాలని రాహుల్జీకి అనిపించింది. ఆయనవెంట యూరోపు యాత్రికుడు సూధర్ ఉన్నాడు. ఇద్దరూ చీకటిపడేదాకాతిరుగుతూ గుహాలను చూశారు. సూధర్ కాంబోడియాలోని అంకోట్‌వాట్‌విశాలమందిరాన్ని చూచివచ్చాడు. ఎల్లోరాముందు అది దిగదుడుపు అని అతడు చెప్పాడు.

మరునాడు వీరు ఖుల్దాబాద్‌లో ఔరంగజేబ్‌సమాధి, దేవగిరిలో యాదవుల గిరిదుర్గంచూచి ఔరంగాబాద్ వచ్చారు. ఆరాత్రి ఇద్దరూ ముసాఫిర్ బంగాళాలోఉండి, మరునాడుఅజంతాకు బయలుదేరారు. అప్పటివరకు తాము

పటాలలో చూచినచిత్రాలు, శిల్పాలు ప్రత్యక్షమైనాయి. వాటినిచూచిఇద్దరూ చాలా ఆనందించారు.

పిమ్మట సాంచీస్తూపాలను చూడదలచారు. కాని సూధర్ రాహుల్జీ వెళ్ళినరైలులో వెళ్ళలేదు. వేరేపనిమీద దారిలో ఆగిపోయాడు. రాహుల్జీ సాంచీలోదిగి, ఇరవై ఒక్క శతాబ్దాలపూర్వం నిర్మించిన స్తూపాలను, వాటిపై చెక్కిన శిల్పాలను చూశారు. తిరిగివచ్చేటప్పుడు స్టేషన్‌వద్ద సూధర్ ఎదురైనాడు. రాహుల్జీ మరొకసారి సాంచీకివెళ్ళి, స్తూపాలను అతనికి చూపించారు. తర్వాత సూధర్ అమెరికా వెళ్ళాడు. ఇద్దరూ మళ్ళీ ఎప్పుడూ కలుసుకోలేదు. కాని చాలాకాలంవరకు ఇద్దరిమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు సాగాయి.

రాహుల్జీ కనోజికివెళ్ళి, అనేక చారిత్రక ప్రదేశాలను చూశారు. ఒకచోట బుద్ధవిగ్రహం తెగగొట్టబడిఉంది. దానిని ప్రజలు ఏదో ఒక దేవతపేరుతో పూజిస్తూ ఉండటం రాహుల్జీ గమనించారు పిమ్మట బౌద్ధుల పవిత్రస్థానమైన సంకిస (సంకాస్య)కు వెళ్ళారు. బుద్ధుడు తన ధర్మామృతాన్ని మాతృదేవికి అందించడానికై దేవలోకానికి వెళ్ళాడట. ఆమెకు ఉపదేశమిస్తూ, ఏడాదిలో మూడు నెలలు అక్కడే గడిపాడు. తర్వాత మృత్యులోకంలోకి వచ్చేటప్పుడు సంకాస్యాలో దిగాడట. అశోకుడు ఇక్కడ ఒక రాతిస్తంభాన్ని స్థాపించాడు.

రాహుల్జీ కౌశాంబి తదితర నగరాలమీదుగా కాశీకి వెళ్ళారు. తాను అనువదించిన 'అభిధర్మకోష్'ను ఎవరైనా

ముద్రిస్తారేమో తెలుసుకోవాలని, తద్వారా కొంతడబ్బు కూడ వస్తుందని ఆయన అనుకొన్నారు. ఇది చాలా ముఖ్యమైన గ్రంథమని చివరికి ఒక ప్రచురణకర్తకు తోచింది. ముద్రించినతర్వాత పదిపదిహేను కాఫీలుమాత్రం పంపిస్తానని అతడు చెప్పాడు. తర్వాత రాహుల్జీ ఆచార్య నరేంద్ర దేవ్‌ను కలుసుకొన్నారు. విద్యాపీఠం తరఫున 'అభిధర్మ కోష్' ను ప్రచురించడానికి అంగీకరించారు. రాహుల్జీకి కొంత డబ్బుకూడ ఇచ్చారు.

తర్వాత రాహుల్జీ పాట్నాకు వెళ్లారు. తాను లంక నుండి పంపిన పుస్తకాలు చేరినట్లు ధ్రువపడింది. టిబెట్ యాత్ర చేయాలనే సంకల్పంతోనే రాహుల్జీ భారతదేశానికి తిరిగివచ్చారు. అందుచేత తనస్నేహితులవద్ద సెలవు తీసుకొని బయలుదేరారు. ఆయన మొదట నేపాల్‌కు వెళ్ళారు. శివరాత్రి సమయంలో ఇతరదేశాలనుండి ప్రజలు అక్కడకు వెళ్ళుతారు. శివరాత్రి తర్వాత విదేశీయులు నేపాల్‌నుండి వెళ్ళిపోవలసి ఉంటుంది. అందుచేత రాహుల్జీ అజ్ఞాత జీవితం గడపదలచారు.

## నేపాల్‌లో అజ్ఞాతవాసం

మహాబౌద్ధలో దుక్పాలామా ఆయనకు ఆశ్రయమిచ్చాడు. టిబెట్ వెళ్ళడానికి అన్నివిధాల తోడ్పడతానని మాట ఇచ్చాడు. అతడు రాత్రింబగళ్లూ సమాధిలో ఉండేవాడు. రాహుల్జీ అతనిప్రక్కనగదిలో ఉండేవారు. పగటిపూట ఎక్కడకూ కదలకుండా, రాత్రిపూట తిరిగేవారు.

"వజ్రచ్ఛేదికా ప్రజ్ఞాపారమిత" అనే మహాయాన బౌద్ధ మతగ్రంథం లామావద్ద ఉండేది. పుస్తకం యావత్తూ కర్రపైన చెక్కబడి, అక్షరాలు ఉల్టాగా ఉండేవి. లామా శిష్యులు, శిష్యురాండ్రు సిరారాసి చేతితో తయారుచేసిన కాగితంపైన దానిని ముద్రిస్తూ ఉండేవారు. లామా ఆపుస్తకాన్ని ప్రసాదరూపంలో పంచుతూ ఉండేవారు. పగలంతా లామా శిష్యులు, శిష్యురాండ్రుస్తూపంవద్దను వెళ్ళి, ముద్రణకృషి చేస్తూ ఉండేవారు. లామాగదిలో రాహుల్జీ ఒంటరిగా కూర్చుని, ఇంగ్లీషుద్వారా టిబెట్ భాష నేర్చుకొంటూ ఉండేవారు.

కొద్దిరోజులతర్వాత లామాసోదరి రాహుల్జీకి పరిచయమైంది. ఆమె అవివాహిత. ఆమె మూడో అంతస్తులో ఉండేది. రాహుల్జీ మధ్యఅంతస్తులో ఉండేవారు. ఆయన ఒకరోజున సబ్బుముక్క తీసుకొని ముఖం కడుక్కోడానికి వెళ్ళారు. లామాసోదరివచ్చి ఆ సబ్బుముక్క ఎత్తుకుపోయింది. ఆమెకు ఒకరిద్దరు ప్రేమికులు ఇదివరకే ఉన్నారు. రాహుల్జీ మూడో అంతస్తులోకి వెళ్ళి, తన సబ్బుముక్క ఇమ్మని అడిగారు. కాని ఆమె ప్రేమకలాపం మొదలుపెట్టింది. రాహుల్జీ బిడియపడి కిందికి వచ్చారు. లంకలో ఉండగా ఆయనను ఇలాగే ఒకయువతి ప్రేమించింది. రాహుల్జీ సహజంగానే లజ్జ, బిడియంగల వ్యక్తి అయినందువల్ల, అందుకు అవకాశం ఇవ్వలేదు. లామాశిష్యులు, శిష్యురాండ్రు స్త్రీ-పురుష భేదంలేకుండా రాత్రిపూట ఒకేచోట నిద్రించేవారు. గర్భం కాకపోతేసరి, మరేమి జరిగినా లెక్కపెట్టేవారుకాదు.

రాహుల్జీ ఇక్కడ ఉన్నారనేవిషయం ఎవరిద్వా

రానో కార్మండూలోని బౌద్ధ గృహస్థుడు ధర్మాసాహుకు తెలిసింది. తనవద్దకు రమ్మని అతడు కబురుచేయగా, రాహుల్జీ అక్కడకు వెళ్లారు. ధర్మాసాహు టిబేట్‌నుగూర్చి అనేకవిషయాలు తెలియజేశాడు. రెండురోజులతర్వాత రాహుల్జీ కిందోల్ విహారానికి వెళ్లారు. దస్‌రతన్‌సాహు అను నతడు ఆయనను రహస్య ప్రదేశంలో ఉంచాడు. ఒక నాడు ఉదయం ఇద్దరూ ఎల్మో అనే గ్రామానికి వెళ్లారు. దస్‌రతన్ తనకు పరిచితులైనవారి ఇంటివద్ద రాహుల్జీని వదిలిపెట్టాడు.

ఎల్మో గ్రామంలో అనీబుట్టి అనే నడివయస్సుగల బౌద్ధురాలు ఉండేది. డుక్పాలామాశిష్యురాండ్రలో ఆమె కూడ ఒకతె. అనీ బుట్టి కొద్దినెలలో లామావద్ద ఉండి వచ్చింది. గ్రామంలో ఆమెకు స్వంతభవనం ఉంది. కొద్ది ఏళ్ళక్రితం ఆమెభర్త చనిపోయాడు. ఇంట్లో మరెవ్వరూ లేరు. ఆమెకు ఎలాంటి చీకు చింతలేదు. ఆమె ఎల్లప్పుడూ మతమూ, పూజలలో నిమగ్నురాలై ఉండేది. అనీబుట్టి స్వగ్రామంవచ్చిన తర్వాత, రాహుల్జీ ఆమె ఇంటికి వెళ్లారు. ఆయనకు ఆమె ఉచిత మర్యాదలు చేసింది. ఒక యువకునితో బాటు తాను అదే ఇంట్లో ఉంటే ఇతరులు అనుమానిస్తారని భావించింది. అందుచేత వేరొకస్త్రీని రోజూ తన వద్ద పడుకొమ్మని చెప్పింది. భోటియాభాష నేర్చుకొనేందుకు రాహుల్జీ ఇక్కడ మకాంపెట్టారు. కాని ఆయన అనీబుట్టితో మాట్లాడే అవకాశం అంతగా లభించలేదు. గ్రామంలో ఇతరులతో సంబంధం పెట్టుకొంటే, తన

రహస్యజీవితానికి భగం కలుగుతుందని రాహుల్జీ భయం. కొద్దిరోజులతర్వాత లామాశిష్యులు స్థానికంగా ఉన్న పెద్ద మఠంలో విడిసినట్లు తెలిసింది. రాహుల్జీ అక్కడకు వెళ్ళి, ఒక కుర్రవానితో సంబంధం పెట్టుకొన్నారు. భాషా విషయంలో అతడే తనకు గురువైనాడు.

రాహుల్జీ ఒకనాడు కొందరిచేతులుచూచి, వారి భవిష్యత్తునుగూర్చి ఏదో చెప్పారు. ఆయనకు హస్త సాముద్రికం తెలుసునని ఊరంతా ప్రాకిపోయింది. జనం మందలు మందలుగావచ్చి, ఆయనకు చేతులుచూపించడం మొదలుపెట్టారు. తనకు ఈ గ్రామంలో మొదట పరిచయమైన ఇంటిఆమె కోడలుకూడవచ్చి చేయి చూపించింది. ఆ యువతిని వెంటబెట్టుకువచ్చిన ఒక బౌద్ధురాలు రాహుల్జీని పదే పదే ప్రార్థించింది. ఈమెను గొడ్రాలుగా భావించి అత్తమామలు ఈమెభర్తకు రెండో పెండ్లి చేయదలచారని, అందుచేత చేయిచూచి, ఈమెకు పుత్రయోగం ఉందోలేదో చెప్పమని కోరింది. రాహుల్జీ ఆ యువతి చేయిచూచి, ఈమెకు పుత్రయోగం ఉందని, పుత్రుడు కలిగకపోతే, అది ఈమెతప్పుకాదని, మగని తప్పు అవుతుందని చెప్పారు. ఆ యువతికి చాలా సంతోషమైంది.

రాహుల్జీ ఇక్కడ ఉంటూ రెండు నెలలకుపైగా గడచిపోయింది. టిబెట్‌కు వెళ్ళేవిషయంలో తనకు అన్నివిధాల తోడ్పడతానని డుక్పాలామా ఇచ్చిన హామీని నిలబెట్టుకోలేదు. అతడు అనేకగ్రామాలు పర్యటిస్తూ, రాహుల్జీకి ఇచ్చిన హామీని మరచిపోయాడు. చివరికి రాహుల్జీయే ఒక

కూలిమనిషిని వెంటదీసుకొని, అతనిని వెదక్కొంటూ వెళ్ళారు. అతడు ఎప్పటివలె నవ్వుతూ పలుకరించాడు. రాహుల్జీని టిబెట్‌కు తీసుకువెళ్ళతానని చెప్పాడు. వాహనం దొరకనందువల్ల ఇద్దరూ కాలినడకనే బయలుదేరారు. దుక్పాలామా స్థూలకాయుడు. వగర్చుకొంటూ నడిచాడు. ఇద్దరూ ఒక గ్రామానికి వచ్చారు. ఆ గ్రామంలో దుక్పా లామా శిష్యులు ఉన్నారు. వారంతా త్రాగుడుకు బాగా అలవాటుపడినవారు. ప్రసాదం పంచిపెట్టేటప్పుడు రాహుల్జీకికూడ సారా ఇచ్చారు. కాని ఆయన త్రాగ నిరాకరించారు.

## టిబెట్‌లో పదిహేను నెలలు

కొద్దిమైళ్ళతర్వాత ఒక కర్రవంతెనదాటి వీరు టిబెట్ సరిహద్దులోపలికి వెళ్ళారు. జేనం బస్తీలో మంచిఇల్లు చూచి, లామాకు బస ఏర్పాటు చేశారు. దారిలో తోడైన ఒక మంగోలు బౌద్ధభిక్షువు, రాహుల్జీ అక్కడ మకాం పెట్టారు. లామాకు ప్రజలు ఎన్నో కానుకలు ఇచ్చారు. తిండిపదార్థాలు అపరిమితంగా వచ్చిపడ్డాయి. లెక్కలేనన్ని గ్రుడ్లు తెచ్చి ఇచ్చారు. వాటిని తినేవారే కరువైనారు. ఈ ప్రాంతానికి మేజిస్ట్రేటు ఈ బస్తీలోనే ఉండేవాడు టిబెట్ పరిపాలకుడుగా అవివాహితుడైన దలైలామా ఉండేవాడు. ఒక్కసైన్యం మినహాయించి, ప్రభుత్వశాఖలన్నిటిలో ఒక బౌద్ధభిక్షువు ఆఫీసరుగా ఉండేవాడు. ప్రతిచోటా ఇద్దరు ఆఫీసర్లు ఉండేవారు. అందులో ఒకడు తప్పనిసరిగా బౌద్ధభిక్షువై

ఉండేవాడు. ఒకనాడు మేజస్ట్రేట్‌నుండి లామాకు ఆహ్వానం వచ్చింది. రాహుల్జీనికూడ రమ్మన్నారు. కాని ఆయన వెళ్ళ లేదు. రెండు మూడురోజులు గడిచింది. కాని లామా తిరిగి వచ్చేట్లు కనిపించలేదు. అతడు అక్కడ కొద్దినెలలు మకాం పెట్టవచ్చుననుకొన్నారు. తాను వేరొకచోటికి వెళ్ళాలంటే ఒకవిధమైన అనుమతిపత్రం అవసరం. మంగోలు బౌద్ధ భిక్షువు అలాంటి పత్రం ఒకటి ఎలానో సంపాదించాడు. ఇద్దరూ గౌరీశంకర్ శిఖరంవైపుగా వెళ్ళారు.

కాని కొద్దిసేపట్లోనే రాహుల్జీ అలసిపోయారు. వారు పన్నెండు పదమూడువేల అడుగుల ఎత్తున యాత్ర చేస్తు న్నారు. ప్రాణవాయువు కొరతవల్ల ఊపిరి ఆడటంలేదు. పైగా వీపులపై బరువుకూడ ఉంది. మంగోలు బౌద్ధభిక్షువు పొట్టివాడు. అతడు ఉత్సాహంగానే ఉన్నాడు. రాహుల్జీ చాలా అలసిపోయారు. ఆయనకు ఏడుపు వచ్చినంత పని అయింది. మూడుగంటలు నడచినతర్వాత ఒక మఠం కని పించింది. అక్కడ కాస్సేపు విశ్రాంతి తీసుకొన్నారు. కొద్ది దూరంలోనే ఒక గ్రామం ఉన్నట్లు తెలిసింది. కుశోక్ అనే లక్ష్మీ తీర్థయాత్రికుడు వీరికి తోడైనాడు. ముగ్గురూ కలిసి సాయంత్రానికల్లా ఆగ్రామం చేరుకొన్నారు. మరునాడు కుశోక్ తనయాత్ర కొనసాగించాడు. మంగోలు భిక్షువు కూడ అతనివెంట వెళ్ళడానికి సిద్ధమైనాడు. రాహుల్జీ నడిచే స్థితిలోలేరు. తాము ఆయన సామానుమోస్తామని వారు చెప్పారు. అందుచేత ఆయనకూడ వారివెంట బయలు దేరారు. దారిలో మంచు పడుతున్నది. ఒకచోట ఎలాగో

టీ తయారుచేసుకొని త్రాగారు. ఆరాత్రి అక్కడే పడుకున్నారు. ఉదయమేలేచిచూస్తే, అడుగుమందాన మంచు పడింది. ఇంకా పైకివెళ్ళితే మంచుఎక్కువ అవుతుందని, అందుచేత లక్ష్మియాత్ర మానివేద్దామని మంగోలుభిక్షువు చెప్పాడు. అయితే కుశోక్ తనయాత్ర కొనసాగించ నిశ్చయించాడు.

తర్వాత వీరిద్దరూ తాను బయలుదేరిన గ్రామానికి తిరిగివచ్చారు. ఆ గ్రామపెద్దఇంట్లో దిగారు. కుశోక్, అతని మనుష్యులు దారితప్పి తిరిగివచ్చినట్లు తెలిసింది. దట్టమైన మంచులో వారికి దారికనపడలేదట. మరునాడు వీరు ఒక కూలి మనిషిని సంపాదించారు. సామానంతా అతని వీపుపై పెట్టి, తిరిగి యాత్ర కొనసాగించారు. రాహుల్జీకూడ వీరి వెంట వెళ్ళారు. దారిలో ఒక గ్రామపెద్దఇంట మకాం పెట్టారు. ఆఇంట్లో పాతికేళ్ళ యువకుడు, నలభైఏళ్ళకు పైబడిన స్త్రీ ఉన్నారు. టిబెట్ప్రజలు ఏడాదికి, రెండేళ్ళకు ఒకసారి స్నానంచేస్తారు. నెల రెండునెలలకు ఒకసారి జుట్టుకు నూనె రాసుకొంటారు. రాహుల్జీ వెళ్ళినరోజున గృహపత్ని శృంగారదినం జరుపుతున్నారు.జుట్టుదువ్వి, సంప్రాదాయానుసారం రెండుప్రక్కల ముడులువేసుకొనే దినం ఇది. యువకుడే నలభైఏళ్ళపైబడిన తన గృహపత్నిని సింగారిస్తున్నాడు. అతడు తన తల్లిని అలంకరిస్తున్నట్లు కనపడింది. వీరు తల్లి-కొడుకులా? అని రాహుల్జీ కుశోక్ను అడిగారు. "ఊరుకోండి వీరిద్దరూ భార్యాభర్తలు" అని అతడు సమాధానం చెప్పాడు. టిబెట్లో పెద్దఅన్నకు పెళ్ళి అయితే,

ఆమె తక్కిన అందరికీ భార్య అవుతుందని, పెళ్ళి అయిన తర్వాతకూడ ఎందరో భర్తలు పుడుతూఉంటారని రాహుల్జీ పుస్తకాలలో చదివారు. కాని ఈరోజున ప్రత్యక్షంగానే చూశారు. గ్రామంలో ఒక ధనికుని భార్యకు సంతానంలేదని అందువల్ల ఆమెకు తాయెత్తు కట్టాలని కుశోక్ రాహుల్జీని కోరాడు. రాహుల్జీ అతనివెంట ధనికునిఇంటికి వెళ్లారు. ధనికునిభార్య రాగికేసు తీసుకురావడానికై లోపలికి వెళ్ళింది. "యాభైఏళ్ళకు పైబడిన ఈ ముసలమ్మకేనా సంతానం కావలసింది?"అని రాహుల్జీ అడిగారు. "మనదేమి పోయింది? మనకు సత్తుపిండి, వెన్న దొరుకుతుంది" అని కుశోక్ జవాబిచ్చాడు. రాహుల్జీ తాయెత్తు వ్రాసి ఇచ్చారు. మరునాడు గ్రామపెద్ద వీరికి ఒక కూలిమనిషిని తోడుచేసి పంపాడు.

దొంగలు, దోపిడీగాండ్రువున్న దుర్గమారణ్యంలో వీరు అరచేత ప్రాణాలుపెట్టుకొని, గుర్రాలపై యాత్ర కొనసాగించారు. వీరు సముద్రమట్టానికి 17, 18 వేల అడుగుల ఎత్తున పయనిస్తున్నారు. వీరికి దక్షిణంవైపు హిమాలయ శ్వేతశిఖరాలు వేలాదిగా ఉన్నాయి. కొన్నిగంటల తర్వాత వీరు టింగరీ విశాలమైదానంలోకి వచ్చారు. టింగరీలో మాజీమేజస్ట్రేట్ నివసిస్తున్నాడు. అతడు కుశోకునికిపరిచితుడు. ఇద్దరూ అతని ఇంటికి వెళ్లారు. అతడు చిరునవ్వు నవ్వుతూ స్వాగతమిచ్చాడు. సాయంత్రం ఇప్పటి మేజస్ట్రేట్ కూడ ఆ ఇంటికి వచ్చాడు. టీ త్రాగి తిరిగి వెళ్ళిపోయారు. చీకటి పడిన తర్వాత మాజీమేజిస్ట్రేట్ తన వీణ తీసుకొని నృత్య గోష్ఠికి బయలుదేరాడు. ఏదైనావస్తువు అవసరమైతే నౌక

ర్లతో చెప్పించుకొమ్మని భార్యతో చెప్పాడు. టిబెట్‌లో అన్నదమ్ములందరికీ ఒకే భార్య ఉంటున్నందువల్ల, ఆడ పిల్లల సంఖ్య మగపిల్లల సంఖ్యకంటె తక్కువ కానందువల్ల చాలామంది స్త్రీలు ఆజన్మ బ్రహ్మచారిణులుగా ఉండిపోవ లసి వస్తున్నది. స్త్రీలలో అధికభాగం తలబోడి చేయించు కొని సాధునిలు అయిపోతున్నారు. కొందరు భిక్షుణిల మఠంలో ఉండిపోతున్నారు. ఎందరో స్త్రీలు తల్లి దండ్రుల ఇంటనే ఉంటున్నారు. బీదఇంటి పిల్లలు ధనికులఇంట ఊడి గం చేస్తున్నారు. రాహుల్జీ మకాంపెట్టిన ఇంట్లో ముగ్గురు పనికత్తెలు ఉండేవారు. రాహుల్జీ, కుశోక్ వంటగదిలో పడుకో వలసివచ్చింది. చలికాలమైనందువల్ల ఇబ్బంది కలుగలేదు. కాని ఆగదిలోనే పనికత్తెలుకూడా పడు కున్నారు.

మరునాడు ఉదయం రాహుల్జీ, కుశోక్ తమ యాత్ర కొనసాగించారు. మధ్యాహ్నానికి ఒక గ్రామం చేరు కొన్నారు. టీ త్రాగడానికై ఒక ఇంటికివెళ్ళారు. కుశోక్ ఆ ఇంటి స్త్రీలతో కబుర్లకు దిగాడు. బడలిక తీర్చుకోవ డానికి మంచిఅదను దొరికిందని రాహుల్జీ అనుకొన్నారు. కాని సాయంత్రం నాలుగుగంటలు అయ్యేసరికి కుశోక్ తిరిగి బయలుదేరాడు. టిబెట్‌లో పల్లెటూళ్ళమధ్య దూరం అయి దారు మైళ్ళకు తక్కువ ఉండదు. చీకటి పడేలోగా ఇంకొక గ్రామానికి వెళ్ళలేమని, అందుచేత ఇక్కడే ఉందామని రాహుల్జీ చెప్పారు. కుశోక్ కూడ అందుకు అంగీకరించాడు. టీ కాచి ఇచ్చిన ఇంట్లోనే ఒకమూల పడుకోవచ్చునని

ఇద్దరూ అనుకొన్నారు. కాని ఆ ఇంటివారు ధర్మసత్రంలోకి వెళ్ళిపడుకొమన్నారు. ఇద్దరూ అక్కడకు వెళ్ళి, ఆలోచించారు. దొంగలుపడి, తమకు ప్రాణహాని కలిగించవచ్చునని తోచింది. అందుచేత ఒకముసలమ్మ ఇంటికి వెళ్ళి, ఆ రాత్రి తలదాచుకొన్నారు. మరునాడు ఉదయమే బయలుదేరి మెమో అనే గ్రామానికి వెళ్ళారు. ఒక పెద్దధనికునిఇంట మజ్జిగ సేవించారు. వెళ్లేటప్పుడు—ఇంటివారు పదిశేర్ల సత్తుపిండి ఇచ్చారు. అప్పటికే తమవద్ద కావలసినంత సామాను ఉన్నందువల్ల, దానిని తీసుకో నిరాకరించారు.

అక్కడనుండి చకోర గ్రామానికి వెళ్లారు ఒక కొండపై పురాతన రాజభవన ప్రాకారాలు కనిపించాయి. అక్బర్, జహంగీర్ల కాలంలో టిబెట్‌లో ప్రతి నాలుగు గ్రామాలకు ఒకరాజు ఉండేవాడు. ఆ కాలంలోనే కొండలపై ఇలాంటి భవనాలు కట్టించారు. క్రీ. శ. 1642 లో మంగోలులు ఈ చిన్న చిన్న రాజులను అంత మొందించారు. టిబెట్ నంతటినీ జయించి దలైలామాకు అప్పగించారు. అప్పటి నుండి టిబెట్‌పై దలైలామా పరిపాలన ప్రారంభమైంది. దలైలామా చనిపోయి, వేరొకచోట అవతారమెత్తుతాడని ప్రజల విశ్వాసం. అతడు ఎక్కడ అవతారమెత్తిందీ వెదకి, ఆకుర్రవానినే దలైలామాగా చేస్తారు.

రాహుల్జీ కుశోకేలు ఈ గ్రామంలో కొద్దిరోజులు గడిపి, తిరిగి ప్రయాణం కొనసాగించారు. అద్దెగుర్రంకోసం ఒక గ్రామంలో కాస్సేపు ఆగారు. ఒక కుటీరంలో యువతీ-యువకులిద్దరు నివసిస్తున్నారు. వారు కాయకష్టంచేసేవారు.

కాని వారిపరిస్థితి బాగాలేదు. యువకుడు మొదట సైన్యంలో పనిచేశాడు. అతనికి అన్న, ఇద్దరికీ భార్య ఉన్నారు. అయితే తాను వేరొక యువతిని ప్రేమించాడు. ఆమెను ఇంట్లో తెచ్చిపెట్టుకొన్నాడు. ఇది స్వంతభార్యకు సరిపడలేదు. ఆ యువతిని వెళ్ళగొట్టింది. సముష్టి ఆస్తిని పంచుకోవడానికి వీలులేదు. అందుచేత ఆయువతీ-యువకులు కాయకష్టంచేసుకొని జీవిస్తున్నారు. రాహుల్జీకి అద్దెగుర్రాన్ని పురమాయించడానికి ఆ యువకుడు గ్రామమంతా కలియదిరిగాడు. కాని ప్రయోజనం లేకపోయింది. కొందరు వ్యాపారస్తులు గాడిదలపై సరకులు వేసుకుని బ్రహ్మపుత్రనదివైపు వెళ్ళుతున్నట్లు తెలిసింది. వారు రాహుల్జీ సామానుకూడ గాడిదలపై చేరవేయటానికి అంగీకరించారు.

కొద్దిరోజులకు వ్యాపారస్తులు బ్రహ్మపుత్ర నదిగట్టుకు చేరుకున్నారు. వీరు తమ సరకును ఒకచర్మపు నావపై ఎక్కించవలసి ఉంది. అది త్వరలో అక్కడకు వచ్చే సూచనలులేవు. రాహుల్జీకూడ అక్కడే ఆగిపోయారు. వ్యాపారస్తులలో ఇద్దరు బౌద్ధభిక్షువులు ఉన్నారు. సుఖాలు అనుభవించడమే వారి జీవితోద్దేశం. వారు సారాయిత్రాగేవారు. స్త్రీలకోసం వెంపర్లాడేవారు. ఒకభిక్షువు రాత్రిపూట పడుకోవడానికై సమీపగ్రామంలోకి వెళ్లేవాడు. పదహారేళ్ళ అమ్మాయి నదివద్ద బట్టలు ఉతుక్కోవడానికి వచ్చింది. బౌద్ధభిక్షువులలో ఒకడు ఆమెతో కాస్సేపు సరసమాడాడు. ఇద్దరూ ఒకగుడారంలోకి వెళ్ళిపోయారు. ప్రాంతీయ మేజస్ట్రేట్ కోసం ఇక్కడ ఒక ఇల్లు కడుతున్నారు. స్త్రీ-పురుష

కూలీలు వెట్టికి రాళ్ళు మోస్తున్నారు. వీరిలో ఎక్కువమంది పెళ్ళిఈడు వచ్చినవారు. యువకులు సరసాలాడుతూనే యువతులబట్టలు లాగివేసేవారు. వారిని దిగంబరులుగా చేసేవారు. స్త్రీ-పురుషులు దిస మొలలతో ఒకేచోట స్నానం చేసేవారు. టిబెట్‌లో స్త్రీ-పురుష సంబంధాలు చాలా తేలిక అయిపోయినట్లు రాహుల్జీకి అనిపించింది.

చర్మపు నావలకోసం రోజుల తరబడివేచి చూశారు. చివరికి ఒకరోజున అవి వచ్చాయి. మరునాడే అవి బయలు దేరతాయని తెలిసింది. రెండురోజులప్రయాణం ఉంటుంది. అందుకని రాహుల్జీ గొర్రెమాంసం (ఎండుది) కొనుక్కొని, ఉడకబెట్టారు. దానిని ముక్కలుచేసి ఒకసంచిలో భద్రపరచుకున్నారు. మాంసపురసాన్ని ఒక గిన్నెలో అట్టిపెట్టుకున్నారు. వ్యాపారస్తులలో ఒకడు ఇదంతా గమనిస్తున్నాడు. అతనికి మాంసపురసం ఇస్తే, త్రాగ నిరాకరించాడు. అతనికి ఇది అసహ్యం కలిగించింది. టిబెట్‌లో ఎండుమాంసాన్ని ఉడకబెట్టకుండానే తింటారు. నావలు బయలుదేరేటప్పుడు, రాహుల్జీకి చోటు ఇవ్వలేదు. ఆయన ఎంత మొర పెట్టుకున్నా వ్యాపారి వినలేదు. చివరికి తన సామాను ఎత్తించుకుని ఇవతలికి వచ్చారు. ఒక గంటసేపటికి మళ్ళీ ఆయనను రమ్మని చెప్పారు. రాహుల్జీతోబాటు కుశోక్ కూడ నావలో ప్రయాణం చేశాడు.

లర్చేలో కంచరగాడిదలను అద్దెకు తీసుకున్నారు. కొద్దిరోజుల ప్రయాణం తర్వాత నర్థంగ్ చేరుకున్నారు. పదకొండో శతాబ్దంలో నిర్మించిన ఒక పురాతన మఠం

ఇక్కడ ఉంది. భారతదేశంలో బౌద్ధమతం జీవించి ఉన్నప్పుడు కట్టిన మఠం ఇది. కంజూర్ (బుద్ధవచనాల అనువాదం), తంజూర్ (శాస్త్ర అనువాదం)కు చెందిన 338 పెద్ద పెద్ద గ్రంథాల ముద్రణాలయం ఇక్కడే ఉంది. రాహుల్జీ షిగర్చేనగరం చేరుకుని, ఆ రాత్రి అక్కడ గడిపారు.

తాను త్వరగా లాసా చేరుకోవాలని రాహుల్జీ ఉద్దేశం. అప్పటివరకు తనజాడ ఇతరులకు తెలియనివ్వకూడదనుకున్నారు. ఇక కుశోక్‌ను తనవెంట ఉంచుకోదలచలేదు. కొందరువ్యాపారస్తులవెంట తనప్రయాణం కొనసాగించారు. ఒకనదిదాటి టిబెట్ రాజధాని లాసాకు వచ్చారు. ఎరుపు రంగుతో దలైలామా ప్రాసాదం కనిపించింది. రాహుల్జీ మొదట ధర్మ్మ సాహు దుకాణంవద్దకు వెళ్ళారు. అతని కుమారులు పూర్ణమాన్, జ్ఞానమాన్ హృదయపూర్వక స్వాగతమిచ్చారు. రాహుల్జీ అయిదు నెలలుగా వార్తాపత్రికలు చూడలేదు; అందువల్ల వాటిని తెప్పించుకొని తిరగవేశారు. దలైలామాకు అర్పించడానికై సంస్కృతంలో 15 శ్లోకాలు వ్రాశారు. కాని వీటిని భోటియా భాషలోకి అనువదించవలసివచ్చింది. అయిదారుమైళ్ళదూరంలో గరీఘాంగ్ అనే అనువాదకుడు ఉన్నట్లు తెలిసింది. రాహుల్జీ ఒక గుర్రంపై అతనివద్దకు వెళ్ళారు. కొందరి సహాయంతో అతడు సంస్కృతశ్లోకాలను అనువదించి ఇచ్చారు. ఇద్దరూ కాస్సేపు సంభాషణ జరిపారు. రాహుల్జీ ఇచ్చిన కాగితాన్ని గరీఘాంగ్ దలైలామాకు అందేట్లు చేశాడు. ఏదో ఒకగోజువ

రాహుల్జీని తనవద్దకు పిలిపించుకొంటానని దలైలామా కబురుచేశాడు.

ఇక తాను రహస్యంగా ఉండనవసరంలేదని రాహుల్జీ నిశ్చయించుకున్నారు. టిబెట్‌లోకెల్లా పెద్ద విహారమైన డేపుంగ్‌కు వెళ్ళారు. అందులో ఏడువేలమంది బౌద్ధభిక్షువులు ఉండేవారు. ఇది ఒక పట్టణంవలె కనిపించింది. అనుమతిస్తే, ఇక్కడే ఒకగదిలో ఉందామనుకున్నారు. కాని ఇక్కడ చోటుదొరకడం అంత తేలికకాదు. మఠం అనేక లాడ్జీలుగా విభజింపబడి ఉంది. ప్రతిలాడ్జిని ఒక్కొక్క దేశ విద్యార్థులకు కేటాయించారు. ఇందుకు ఆ యా దేశాలు ఆర్థికసహాయం చేశాయి. మఠంలో భారతదేశానికి స్థానం కేటాయించలేదు.

రష్యావిప్లవానంతరం, ఇక్కడకు వచ్చే విద్యార్థుల సంఖ్య తగ్గిపోయింది. రాహుల్జీ ఛుషింగ్‌షాలో ఉంటూ అధ్యయనం ప్రారంభించారు. నేపాల్ మందిరాలలో లభ్యమయ్యే తొమ్మిది సంస్కృతగ్రంథాలను (వ్యాకరణాలు) తెప్పించుకొన్నారు. టిబెట్ భాషానువాదంలో చదవడం మొదలుపెట్టారు. భోట్-సంస్కృతకోశం తయారుచేద్దామనే ఉద్దేశంతో దాదాపు 16 వేల శబ్దాలను సేకరించారు. చలికి తట్టుకోలేక రాహుల్జీ చేతివ్రేళ్లు పగిలి, నెత్తురు కారసాగింది. ఒకనాడు ఆయన వ్రాసుకొంటూ ఉండగా కలం ధార ఆగిపోయింది. సిరా మంచుగా మారి కలానికి అడ్డుపడటమే ఇందుకు కారణం. రాహుల్జీ ఫౌంటెన్‌పెన్ ఉపయోగించసాగారు.

లాసాకు సమీపంలో సేరా అనే మరో బౌద్ధవిహారం ఉంది. దానిలో అయిదు వేలమందికిపైగా బౌద్ధభిక్షువులు ఉండేవారు. డేపుంగ్, సేరా విహారాలు నలందావంటి విశ్వ విద్యాలయాలు. కాని వీటిలో ఉండే భిక్షువులందరూ చదువు కోవడానికి రాలేదు. మామూలు విద్యార్థులసంఖ్య ఇరవై, పాతిక శాతంకంటె మించదు. నిజమైన విద్యార్థులు నూటికి పదిమంది మాత్రమే ఉంటారు. తక్కినవారు వట్టి భిక్షువులు. వీరు వంటపని మొదలు వ్యాపారందాకా చేస్తూఉండేవారు. క్షణంలో కలహానికి దిగేవారు. కత్తి తీసుకొని రంగంలోకి వచ్చేవారు. మత్తుపదార్థాలు సేవించేవారు. ఒకరోజున ఒక భిక్షువు పోలీస్ కానిస్టేబుల్‌తో తగాదాపడ్డాడు. రాయి విసిరి అతనిని చంపివేశాడు.

బుద్ధుడు దేవలోకంలో తనతల్లికి ఉపదేశమిచ్చి, భూలోకానికి వచ్చిన రోజని చెబుతూ, నవంబరు 22 న లాసాలో పెద్ద ఉత్సవం జరుపుతారు. అంతకు కొద్దిరోజుల ముందే ఇళ్లు శుభ్రంచేస్తారు. నవంబరులో చలికాలం వస్తుంది. మేతలేక పశువులు చిక్కిపోతాయి. అందుచేత అక్టోబరు నెలలోనే పశువులనుచంపి, ఎనిమిది నెలలకు సరిపడ మాంసం సిద్ధంచేసుకొంటారు. గొర్రెలచర్మం ఒలిచి, వాటిని అలాగే వ్రేలాడగడతారు. కొద్దిరోజులకు మాంసం ఎండిపోతుంది. యాక్ (చమరీమృగం) మాంసం ముక్కలు ముక్కలుచేసి త్రాళ్ళకు వ్రేలాడదీస్తారు. యాక్ తోక తెలుపుగా ఉంటుంది. దానికి ఒకపిడి తగిలిస్తారు. అదే మన పవిత్ర చామరం.

తనకున్న సంస్కృతజ్ఞానం లంకలోవలె టిబెట్‌లో కూడ తోడ్పడగలదని రాహుల్జీ అనుకొన్నారు. కాని ఇక్కడ సంస్కృతాన్ని అడిగేవారే లేరు. టిబెట్‌లోకూడ మంత్రాలను సంస్కృతంలో జపించేవారు. అయితే భోట్ భాషను సంస్కృతంకంటె తక్కువగా భావించేవారుకాదు. బౌద్ధ సాహిత్యానికి సంబంధించినంతవరకు, భోట్ భాషతో పోల్చి చూస్తే సంస్కృతభాష నేడు చాలా దరిద్రదశలో ఉందని రాహుల్జీ అభిప్రాయం. టిబెట్ గ్రంథాలు పదివేలదాకా సంస్కృతంనుండే అనువదింపబడిన మాట వాస్తవమే. అయితే ఇప్పుడు రెండున్నరవందలకంటె ఎక్కువ గ్రంథాలు సంస్కృతంలో లభ్యం కావు.

టిబెట్‌లో చదువుకోవడానికి వచ్చిన మంగోలు భిక్షువులపట్ల రాహుల్జీకి మిక్కిలి గౌరవభావం ఏర్పడింది. వారు బాగా కష్టపడి విద్యాధ్యయనం చేసేవారు, మేధావులు. గతపన్నెండేళ్ళుగా రాహుల్జీ సోవియట్‌రష్యాను అభిమానిస్తున్నారు. ఇంతవరకు తాను మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ గ్రంథాలుగాని, సామ్యవాదానికి సంబంధించిన మరో మౌలిక గ్రంథంగాని చదివే అవకాశం దొరకలేదు. అయినప్పటికీ విశ్వశ్రేయస్సును సామ్యవాదమే సాధించగలదని ఆయన దృఢంగా విశ్వసించేవారు. మతంపట్ల ఆయనకు ఉన్న ఆశలు సన్నగిల్లాయి. అయితే మతాన్ని వ్యతిరేకించలేరు. బౌద్ధమతంపట్ల ఆయనకు ఎంతో శ్రద్ధ ఏర్పడింది. తద్వారానే ఆయన నాస్తికుడైనారు. డే-ఫుంగ్. సే-రా మఠాలకు వచ్చిన మంగోలు విద్యార్థులలో ఎక్కువమంది

సామ్యవాదప్రాంతానికి చెందినవారే. వారు విప్లవానికి పూర్వం తమదేశాన్ని వదలిపెట్టారు. వారు సోవియట్ వ్యవస్థ అంటే అభిమానం ప్రదర్శించేవారు. గేషే తన్-దర్ అనే మంగోలు విద్వాంసుడు సే-రా మఠంలో అయిదేళ్ళు చదివాడు. ఉన్నతపరీక్షలో అందరికంటె ప్రథముడుగా వచ్చాడు.

టిబెట్‌లో స్త్రీలకు సర్వాధికారం ఉంటుంది. జనరల్ షో-గంగ్ జీవితమే ఇందుకు చక్కని ఉదాహరణ. జనరల్ అంటే సైనికశాస్త్రంలో పారంగతుడని భావించకూడదు. ధనికకుటుంబానికి చెందినవాడు అయినందువల్ల అతడు జనరల్ అయినాడు. అతడు డార్జిలింగ్‌నుండి వచ్చిన ఒక యువతిని ప్రేమించాడు. ఆమె పెద్ద అందగత్తె ఏమీకాదు. అతనికి ఇంట్లో సోదరుడు అంటూ ఎవడూ లేడు. భార్య ఉండేది. తనభర్త ఇంకొకరిని ఉంచుకొన్నాడనే విషయం ఆమెకు తెలిసింది. వెంటనే అతనిని ఇంటినుండి వెళ్ళగొట్టింది. జనరల్ ఒక చిన్న అద్దెకొంపలో మకాంపెట్టాడు. అయినప్పటికి తనభార్య ఆహారపదార్థాలు పంపిస్తూఉండేది. అతడు ఒకఉపాయం పన్నేవాడు. బట్టలు అవసరమైతే, చిరిగినబట్టలు వేసుకొని, ఆమెకు కనపడేట్లు తిరిగేవాడు. ఆమె చాలా దయగలది. అతనికి బట్టలు పంపించేది. ఈ విషయం మామూలు పౌరులందరికీ తెలిసిపోయింది. దీనిపై ఒక అజ్ఞాతకవి పాటలుకూడ అల్లాడు. వీటిని పసిపిల్లలు బజారులో పాడుకొనేవారు. జనరల్ నౌకరు ఒకసారి రాహుల్జీవద్దకువచ్చి, జనరల్ మిమ్ములను కలుసుకోదలచా

డని చెప్పాడు. ఏదో జ్యోతిష్యంకోసం కబురుచేశాడని రాహుల్జీ అనుకొన్నారు. అందువల్ల అతనివద్దకు వెళ్ళలేదు.

టిబెట్‌లో అన్నిటికంటె పురాతనమఠం సమ్-యేని రాహుల్జీ సందర్శించారు. నలందా ఆచార్యుడు శాంతిరక్షితుడు దీనిని ఎనిమిదోశతాబ్దంలో నిర్మించాడు. పదకొండు, పన్నెండు శతాబ్దాలవరకు టిబెట్‌మఠాలు సమతలభూమిపై నిర్మింపబడేవి. ఆ తర్వాత మఠనిర్మాణానికి దుర్గమపర్వత స్కంధాలు అనుకూలంగా ఉంటాయని భావించారు. సమ్‌యే మఠం సమతలభూమిపై నిర్మింపబడింది. నాలుగువైపుల ప్రహరీగోడలు, లోపల నాలుగుమూలల నాలుగు స్తూపాలు ఉన్నాయి. మధ్యలో ప్రధానదేవాలయం, అందులో బుద్ధునివిగ్రహం, మఠనిర్మాత, భారతదేశంలో ప్రఖ్యాత తత్త్వవేత్త అయిన ఆచార్య శాంతరక్షితుని విగ్రహం, అతని శిష్యుడు భోట్‌భిక్షువు అయిన వైరోచనుని విగ్రహం, ఆచార్యుని గృహస్థశిష్యుడు సమ్రాట్ ఠి-స్రోంగ్ విగ్రహం ఉన్నాయి. ఇందులో ప్రధానమైనది బుద్ధుని విగ్రహమే. ఆచార్య శాంతరక్షితుడు డెబ్భయిఏళ్ళ వయస్సులో టిబెట్‌కు వచ్చాడు. సమ్-యేలోనే తనువు చాలించాడు. అతని విగ్రహంనోట ఒకదంతం మిగిలినట్లు కనబడుతుంది. తనకళ్ళఎదుట అద్దంలోపల ఆచార్య శాంతరక్షితుని కపాలాన్ని చూచినప్పుడు రాహుల్జీకి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ కపాలంనుండే "తత్వసంగ్రహం" వంటి మహా వేదాంత గ్రంథం బయటికి వచ్చింది. రాహుల్జీ కొద్దిసేపటివరకు తన్మయుడై చూశారు. ఆచార్యుడు మరణించిన తర్వాత, అతని

భౌతికకాయాన్ని తూర్పుకొండపై ఒకస్తూపంలో ఉంచారు. కొద్దిసంవత్సరాల క్రిందటే శిథిలమై ఆ స్తూపం పడిపోయింది. ఆచార్యుని అస్థికలు చెల్లాచెదరైనాయి. వాటిని తెచ్చి ఇక్కడ ఉంచారు. ప్రధానమైన దేవాలయంతోబాటు ఇక్కడ మరో పన్నెండు దేవాలయాలు, నివాసాలు ఉన్నాయి. ఈ దేవాలయాలను లింగ్-ద్వీపాలంటారు. గ్య - గర్ లింగ్‌లో ఉంటూ ఎంతోమంది భారతీయ పండితులు సంస్కృతగ్రంథాలను భోట్ భాషలోకి అనువదించారు. పదకొండో శతాబ్దం మధ్యభాగంలో సమ్-యేలో సంస్కృత గ్రంథాలు లెక్కకుమీరి ఉండేవి. విక్రమశిలలోకూడ ఇన్ని గ్రంథాలు లభ్యమయ్యేవి కావు. నేడు అక్కడ సంస్కృత గ్రంథంపేరు వినపడదు. భారతీయపండితుడు దీపంకర్ శ్రీ జ్ఞాన్ సమ్-యేలో కొంతకాలం ఉన్నాడు. అతని మరణానంతరం సమ్-యేకు నిప్పంటుకున్నది. తర్వాత దానిని నూతనపద్ధతిలో నిర్మించారు. ఆ అగ్నిప్రమాదంలోనే అనేక గ్రంథాలు కాలిపోయినవని రాహుల్జీ అభిప్రాయం.

క్రీ. శ. 1405 లో నిర్మించిన గన్‌దన్ మఠాన్నికూడ రాహుల్జీ సందర్శించారు. అది ఒకపర్వతంపై నిర్మింపబడి ఉంది. దానిపైకి ఎక్కడం చాలాకష్టం. పైపెచ్చు అక్కడ మంచినీటి సౌకర్యంలేదు. క్రిందినుండే నీళ్ళు తెచ్చుకోవలసి వస్తుంది. అజంతా, కార్లే, కనేరీవంటి పురాతన బౌద్ధవిహారాలు నిర్మించినవారు నీటివిషయమై ఎక్కువశ్రద్ధ తీసుకొన్నారు. కాని ఈ విహారనిర్మాత చోంగ్-ఖపా మంచి నీటివిషయం మరచిపోవడం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగిం

చింది. అయిదువందలఏళ్ళ క్రితం చోంగ్-ఖపా స్వహస్తాలతో లిఖించిన పుస్తకాలు ఒకపెట్టిలో భద్రపరచబడి ఉన్నాయి. గన్‌దన్‌లో ఒక డసంగ్ (కాలేజి)కూడ ఉంది. ఇందులో మూడువేలమంది భిక్షువులు ఉన్నారు.

రాహుల్జీ ఇక్కడ రెండురోజులు ఉండి, తిరిగి లాసాకు వెళ్లారు. ధనాభావంవల్ల, తాను అనుకొన్న పనులన్నీ పూర్తిచేయలేకపోయారు. అందుచేత భారతదేశానికి పయనమైనారు. లంకనుండి తనమిత్రులు పంపిన డబ్బుతో పుస్తకాలు, చిత్రపటాలు, ఇతరవస్తువులు ఎన్నో ఖరీదుచేశారు. వాటిని 18 కంచరగాడిదలపై వేసుకొని క్రీ. శ. 1930 ఏప్రిల్ నెలలో కాలింపాంగ్‌కు బయలుదేరారు.

రాహుల్జీకి 'కంజూర్' గ్రంథం లభించింది. కాని 'తంజూర్' గ్రంథం లభించలేదు. దీనిని అచ్చువేయించుకోవడానికై నర్‌థంగ్ బయలుదేరారు. రు 400 పెట్టి కాగితం, సిరా ఖరీదుచేశారు. పదకొండో శతాబ్దంలో నర్‌థంగ్‌లో ఒక బౌద్ధవిహారం నిర్మింపబడింది. దానిని రాహుల్జీ సందర్శించారు. అక్కడ రెండువందలమంది భిక్షువులు ఉండేవారు. నర్‌థంగ్‌లోకూడ గాంధీజీపేరు వినిపించింది. గాంధీజీ సిద్ధపద్మసంభవుని (రిన్-పో-ఛే) అవతారమని ఒక టిబెట్ భిక్షువు అన్నాడు. నర్‌థంగ్‌లో 'కంజూర్,' 'తంజూర్' గ్రంథాలు రెండూ అచ్చువేయించారు. ఇందుకు ఇరవైరెండువందల రూపాయలవరకు ఖర్చయినాయి.

లాసానుండి ఉత్తరప్రాంతం వెళ్ళివచ్చిన ఒక లామా రాహుల్జీని కలుసుకొన్నాడు. అక్కడ బోల్షివిక్ రాజ్యం

స్థాపింప బడిందని, అందువల్ల దొంగలభయంలేదని చెప్పాడు. లామాలను బొల్షివిక్కులు వ్యతిరేకించడమూ లేదు, అభిమానించడమూ లేదన్నాడు. ఆ ప్రాంతానికి బోల్షివిక్ వ్యవస్థ ప్రాకింది. మతవిషయాలలో టిబెట్ లామాలే నాయకత్వం వహించేవారు. అయితే ఆ ప్రాంతీయులు రష్యా బోల్షివిక్కులు కాదు, చైనా బోల్షివిక్కులు.

దాదాపు రెండు నెలలు ప్రయాణంతర్వాత, రాహుల్జీ కాలింపాంగ్ చేరుకొన్నారు. కాలింపాంగ్ అయిదువేల అడుగుల ఎత్తునఉన్న శీతలప్రదేశమైనప్పటికి, పదిహేను నెలలకాలం హిమాలయంలో గడపివచ్చిన రాహుల్జీకి చాలా వేడిగానే కనిపించింది. ఆయన వెంటవచ్చిన ధర్మకీర్తి సైబీరియా వాస్తవ్యుడు. అతడు ఇంత వేడిమిని తన జీవితంలోనే చూడలేదు. త్వరగా లంకకు వెళ్ళడమే మంచిదని, లేకపోతే అతనికి జబ్బుచేస్తుందని రాహుల్జీ అనుకొన్నారు. అందుచేత ఒకరోజుమాత్రమే కాలింపాంగ్‌లో ఉన్నారు.

మరునాడు మోటారులో సిలీగుడికి బయలుదేరారు. కొండలలో మోటారుకుదుపులకు ప్రయాణీకులు వాంతి చేసుకోవడం మామూలు. ఇక ధర్మకీర్తి అవస్థ చెప్పనక్కరలేదు. అతడు ఎండవేడిమినికూడ భరించలేకపోయాడు. అతడు మోటారులో పయనించడం ఇదే మొదలు. వీరుసాయంత్రానికి సిలీగుడి చేరుకొన్నారు. ధర్మకీర్తి చాలా డస్సిపోయినట్లు కనిపించాడు. వెనక్కితిరిగి వెళ్ళుతానని రాహుల్జీతో చెప్పాడు. రాహుల్జీ అతనికి దారిఖర్చు ఇచ్చి, మోటారులో కాలింపాంగ్‌కు వాపసు పంపించారు. తాను అదే

రాత్రి రైలుఎక్కి కలకత్తాకు వెళ్ళారు. పెద్దబజారులో సత్యాగ్రహులపై లాఠీచార్జి జరిగింది. ఇదిచూచి రాహుల్జీకి చాలా ఆవేశం కలిగింది. కాని తాను ఎన్నో కష్టనష్టాలకు ఓర్చి టిబెట్‌నుండి అనేక గ్రంథాలు తెచ్చిన విషయం గుర్తుకు వచ్చింది. వాటిని లంకకు చేర్చేదాకా తన ఆవేశాన్ని అణచుకోవడమే మంచి దనుకొన్నారు. సింధియా కంపెనీ ఓడలు కలకత్తానుండి లంకకు వెళ్ళుతూ ఉంటాయి. రాహుల్జీ తన గ్రంథాలను సురక్షితంగా లంకకు చేర్చమని ఓడయజమానులకు అప్పజెప్పారు. తాను క్రీ. శ. 1930 జూన్ 20 వ తేదీన లంక విద్యాలంకార విహారం చేసు కొన్నారు.

---

# ఆరో అధ్యాయం

## లంకకు రెండోసారి

రాహుల్జీ లంకలో విద్యాలంకార విహార అధిపతిని, భదంత్ ఆనంద కౌసల్యాయన్‌ను కలుసుకొని, చాలా సంతోషించారు. లంకలో అదివరకు రాహుల్జీని రామోదారస్వామి అని పిలిచేవారు. ఇక్కడనుండి వెళ్ళకపూర్వమే రాహుల్జీ తన గోత్రాన్ని కూడా జోడించి, రామోదార సాంకృత్యాయన్ అని పేరు పెట్టుకొన్నారు. కాని బౌద్ధమత దీక్ష పొందేటప్పుడు విద్యాలంకార విహార అధిపతి ఈ పేరును మార్చుకోవలసిందిగా కోరారు. తాను రాహుల్ పేరును సూచించగా, విహార అధిపతి అంగీకరించాడు. ఈ విధంగా రామోదార సాంకృత్యాయన్, రాహుల్ సాంకృత్యాయన్ అయినారు. ఆయనను ఒకరోజున భిక్షుసంఘసభ్యుడుగా చేర్చుకొన్నారు. ఆ రోజున పెద్ద సభ జరిగింది. సంఘసభ్యుడుగా చేరే వ్యక్తి యోగ్యతలను ఈ సందర్భంలో పరీక్షిస్తారు. ఆ వ్యక్తి నేర్చిన విద్య ఏ పాటిది? అతడు శారీరక, మానసిక వ్యాధులనుండి విముక్తి అయినాడా లేదా? అని కూడ పరిశీలిస్తారు. ఆ తర్వాతనే సంఘసభ్యుడుగా చేర్చుకొంటారు. ఇంతకుపూర్వమే రాహుల్జీ త్రిపిటకం చదివారు. బుద్ధునికాలంనాటి భారతదేశం ఏ విధంగాఉండేదో తనమనో ఫలకంపై చిత్రించుకోవడానికి ప్రయత్నించారు.ఆ కాలంనాటి

గణతంత్రరాజ్యాలనుగూర్చి, వాటినమూనాపై ఏర్పడిన భిక్షు సంఘాలనుగూర్చి బాగా తెలుసుకొన్నారు. భారత దేశం బయట టిబెట్‌వంటి బౌద్ధ దేశంలో పదిహేను నెలలు ఉండి వచ్చారు. అందువల్ల భిక్షుసంఘసభ్యుడుగా చేరినరోజు, జరిగిన సభాకార్యక్రమమంతా ఆయనపై ఎంతో ప్రభావం కలిగించింది.

లంకలోని గృహస్థులు, భిక్షువులు రాహుల్జీని మిక్కిలి గౌరవించేవారు. ఆయన భిక్షుసంఘంలో చేరినతర్వాత ఆ గౌరవం ఇనుమడించింది. రాహుల్జీ టిబెట్ యాత్రనుగూర్చి పత్రికలలో వ్రాసేవ్యాసాలను ప్రజలు ఆసక్తితో చదివేవారు. మతోపదేశంఇవ్వడానికై ఆయననుఆహ్వానించేవారు. రాహుల్జీ ప్రతి నెల రెండుఉపన్యాసాలు ఇచ్చేవారు. విద్యాలంకార విహారంలో ఉన్నప్పుడు, విద్యాబోధతోబాటు హిందీలో బుద్ధుని జీవితచరిత్ర వ్రాయదలచారు. తన స్వంతమాటలలో స్వతంత్ర జీవితచరిత్రవ్రాయడానికి బదులు, త్రిపిటకం నుండి విషయక్రోడీకరణచేసి, అదేమాటలలో వ్రాస్తేబాగుంటుందనుకొన్నారు. తాను చదివేటప్పుడు తీసుకొన్ననోట్సు నుండి ఇందుకు సామగ్రి సేకరించడం తేలిక అయింది. రాహుల్జీ వడివడిగా "బుద్ధచర్య" వ్రాయడం ప్రారంభించారు.

లంకలో జోతిష్యంమీదవలె, దయ్యాలు, మంత్రతంత్రాలమీద సామాన్యప్రజలతోబాటు విద్యావంతులకు కూడ చాలా విశ్వాసం ఉండేది. భిక్షువుల నియమానికి విరుద్ధమైనప్పటికి, డబ్బుకు ఆశించి చాలామంది భిక్షువులు

ఈవిషయాలను ప్రచారం చేయడంలో బాహాటంగా తోడ్పడేవారు. భగవంతుడు లేడని వాదిస్తే, వీరు సంతోషించేవారు, కాని దయ్యాలు లేవని వాదిస్తే వీరికి నచ్చేది కాదు. విద్యాలంకార విహారంలో రాహుల్జీ దయ్యాలకు, మంత్ర తంత్రాలకు, జోతిష్యానికి వ్యతిరేకంగా మాట్లాడేవారు. యువకులైన భిక్షువులు ఆయన వాదనలను శ్రద్ధతో వినేవారు.

భారతదేశంలో సత్యాగ్రహం జరుగుతూ ఉండేది. గాంధీజీ పత్రిక 'యంగ్ ఇండియా' కాపీలు లంకకుకూడ వచ్చేవి. వాటిని భారతీయులు శ్రద్ధతో చదివేవారు. ఇలాంటి సమయంలో సత్యాగ్రహోద్యమం నుండి వేరుపడిఉండటం రాహుల్జీకి ఇష్టంలేకపోయింది. ఆయనమిత్రుడు భదంత్ ఆనంద కౌసల్యాయన్‌కూడ అదేవిధంగా భావించారు. కాని రాహుల్జీ కలకత్తానుండి రవాణాచేసిన టిబెట్ పుస్తకాలు వగైరా ఇంకా కొలంబో చేరలేదు. వాటిని భద్రపరచి వెళ్ళడం అవసర మనిపించింది. ఆనంద్‌కౌసల్యాయన్‌కు ఈ బాధ్యత అప్పగిద్దామనుకొంటే, అతడు తనకంటె ముందే ప్రయాణమైనాడు. విద్యాలంకార విహార అధిపతికి చెప్పకుండానే భారతదేశానికి వెళ్ళిపోయాడు. రాహుల్జీ ఎదురుచూస్తున్న ఓడ కలకత్తానుండి వచ్చింది. అందులోని పుస్తకాలను తీసుకొని, భద్రపరచారు. ఇక తాను భారతదేశానికి వెళ్ళుతానని విహార అధిపతికి చెప్పారు. రాహుల్జీ పట్ల ప్రగాఢస్నేహం కారణంగా అతడు మొదట్లో అనుమతించలేదు. రాహుల్జీ కొద్దిరోజులవరకు ఈప్రస్తావన మాని

వేశారు. ఇంతలో "బుద్ధచర్య" వ్రాయడం పూర్తిఅయింది (అక్టోబరు 7 వ తేదీన మొదలుపెట్టి డిసెంబరు 14వ తేదీన పూర్తిచేశారు.) ఆనందకౌసల్యాయన్ భారతదేశంలో అరెస్టు అయినట్లు, అతనిని కొద్దిరోజులు జైలులోపెట్టి తిరిగి వదలినట్లు తెలిసింది. రాహుల్జీ విహార అధిపతిని కలుసుకొని, బౌద్ధభిక్షువు అయినవాడు ఇతరులకోసం ఎంత కష్టమైనా సహిస్తాడనే విషయం రుజువుపరచవలసి ఉందని చెప్పారు. చివరికి రాహుల్జీ భారతదేశం వెళ్ళడానకి అతడు అనుమతించాడు. డిసెంబరు 15వ తేదీన రాహుల్జీ భారతదేశానికి బయలుదేరారు.

## సత్యాగ్రహానికై భారత పయనం

రాహుల్జీ లోగడ "అభిధర్మకోశాన్ని" టీకా సహితంగా అనువదించి, ప్రచురణకోసం కాశీవిద్యాపీఠంవారికి ఇచ్చారు. దాని ప్రూఫులు చూచిపోదామనుకొంటే, ప్రెస్ వారు ఆలస్యంచేశారు. అందుచేత రాహుల్జీ ఛప్రాకు వెళ్లారు. ఆజిల్లాలో సత్యాగ్రహోద్యమం జోరుగా సాగుతున్నది. సత్యాగ్రహులు ఏపని రహస్యంగా చేయకూడదని గాంధీజీ ఉపదేశించారు. కాని రహస్య కార్యక్రమం లేనిదే ఉద్యమాన్ని నడపడం కష్టమని కార్యకర్తల అనుభవంలో తేలింది. బయటఉన్నట్లు కనిపిస్తూనే, రాహుల్జీ రహస్యకార్యక్రమం నిర్వహించారు. పోలీసులు, గూర్ఖాలు కలిసి ప్రజలపై ఎన్నో అత్యాచారాలు చేశారు. రాహుల్జీ తదితరులు తత్సంబంధమైన

ఫోటోలుతీసి, ప్రయాగనుండి వెలువడే 'భవిష్య' పత్రికలో ప్రచురించారు.

అప్పటికే బీహారురాష్ట్రంలో చాలామంది జాతీయ కార్యకర్తలకు గాంధీయిజంపట్ల నిస్పృహ ఏర్పడింది. ప్రజలను సోషలిజంవైపు మళ్ళించాలనే అభిప్రాయానికివచ్చారు. గాంధీ – ఇర్విన్ ఒడంబడిక తర్వాత జూలై 13వ తేదీన రాహుల్జీ, తదితరులు బీహారు సోషలిస్టుపార్టీని స్థాపించారు. కార్యదర్శులలో ఒకరుగా రాహుల్జీని ఎన్నుకొన్నారు.

## మొహంజదారో సందర్శన

అంతకుముందు కరాచీలో కాంగ్రెస్ మహాసభ జరిగింది. ఈసభలో రాహుల్జీ, ఆనందకౌసల్యాయన్‌కూడ పాల్గొన్నారు. కాని వీరు ఎలాంటి ఉత్తేజమూ పొందలేక పోయారు. ఆనందకౌసల్యాయన్ లంకకు, రాహుల్జీ మొహంజదారో, హారప్పాలకు వెళ్ళారు. సైంధవ (సేంధా) లవణం, సైంధవ అశ్వాలతోకూడిన ప్రాచీనజన్మభూమి సింధుదేశాన్ని, పిండదాదన్‌ఖాన్ మొదలైన ఉప్పుకొండలను ప్రత్యక్షంగా చూశారు. బుద్ధునికాలంనాటి పైఠన్ (ప్రతిష్ఠానపురం), ఔరంగాబాద్‌వద్దఉన్న అంధక (ఆంధ్రక) ప్రాంతం ఇప్పుడు గోదావరి క్రిందిభాగంలోకి వచ్చింది.

రాహుల్జీ ఎండలోనే మొహందారో శిధిలాలను చూడటం ప్రారంభించారు. నేడు మనం విదేశీ ఇటుకలుగా భావించే గుండ్రని ఇటుకలు అక్కడ కనిపించాయి. పట్టణ వీధులు, నీటికాల్వలు, అయిదువేల ఏళ్ళకుపూర్వం, ఆర్యుల

కంటె పురాతనులైన సింధువాసుల నాగరిక జీవనం ఎంత ఉన్నతదశలో ఉండేదో రుజువుచేస్తాయి. వారు ఇటుకలతో నిర్మించిన ఇళ్లు, ఇటుకలతోనిర్మించిన బావులు, వారు నిర్మించిన స్నానపుగదులు ఇవన్నీ రాగియుగంలోకూడ అక్కడి ప్రజలు అత్యున్నతమైన నాగరికజీవనం గడిపారనడానికి దృష్టాంతం.

మొహంజదారోనుండి రాహుల్జీ సక్కర్‌కు వెళ్ళారు. సింధునదిబడ్డును ఆనుకొని, కొంతదూరంలో సాధువుల మఠం ఉంది. అది చాలా రమణీయమైన ప్రదేశం. అక్కడ రాహుల్జీ కొద్దిసేపు విశ్రమించారు. తర్వాత ప్రాచీన సౌవీర రాజధాని రోరూక్ (నేటిరోరీ)ను సందర్శించారు. తనవెంట ఉన్న మరో ఏడుగురు యాత్రీకులు బీహారుకు వెళ్ళిపోయారు. తానుఒకలారీపై హరప్పాస్టేషన్‌రోడ్డుకుతిరిగివచ్చారు.ఆరాత్రి అక్కడే ఉండి, ఉదయమే హరప్పా చేరుకొన్నారు. మొహంజదారోవలె ఇక్కడ పట్టణంలో ఒకభాగం కళ్ళఎదుట సాక్షాత్కరించింది. ఇటుకలు అదే ఆకారంలో ఉన్నాయి. రాతితో తయారుచేసిన నున్నని ఉంగరాలు రాహుల్జీని చాలా ఆకర్షించాయి. పెద్దపెద్ద భాండాలలో పదిల పరిచిన మనుష్యుల ఎముకలను ఆయన చూశారు. మ్యూజియంలో కొంతసేపు గడిపారు. తర్వాత మాంటగోమరీ స్టేషన్‌కు వచ్చారు. అక్కడ అయిదురోజులుఉండి, ఛత్రాకు బయలు దేరారు.

తానురచించిన "బుద్ధచర్య"ను అచ్చువేయించుకోవాలని రాహుల్జీ అనుకొన్నారు. కాశీకివచ్చి, అక్కడ ఒక

ప్రెస్‌లో అచ్చుకు ఇచ్చారు. అచ్చువేయడం, ప్రూఫులుదిద్దడం ప్రారంభమైంది. తాను హిందీలో రచించిన తొలిగ్రంథం ఇది. పుస్తకం ఎప్పుడు చేతికి అందుతుందాఅని రాహుల్జీ ఎదురుచూస్తున్నారు. ఆయన ఆచార్య నరేంద్రదేవ్ ఇంట భోజనంచేస్తూ, పుస్తకం అచ్చువేయించు కొంటున్నారు. పుస్తకాన్ని మరొకచరిత్రకారునికి చూపించడం మంచిదని సలహా ఇవ్వబడింది. రాహుల్జీ అలాగే చేశారు. దీనిని స్వతంత్రగ్రంథంగా మార్పుచేయాలని ఆ చరిత్రకారుడు చెప్పాడు. అతని మాట వినడంకంటె, ఈ పుస్తకాన్ని అగ్గిలో పారవేయడం ఉత్తమమని రాహుల్జీకి అనిపించింది. అందుచేత పుస్తకాన్ని ఎలాంటి మార్పుచేయకుండా అచ్చువేయించారు.

వర్షాకాలం పూర్తి అయ్యేలోగా "బుద్ధచర్య", అలాగే "అభిధర్మకోశం" అచ్చువేయడం పూర్తి కావచ్చింది. ఒకనాడు ఆ ప్రెస్‌లో పండిత అయోధ్యాసింహ ఉపాధ్యాయ కనిపించారు. ఆయన రచించిన "చోఖే - చౌపదే" ఆ ప్రెస్సులోనే అచ్చు అవుతూ ఉండేది. జాతీయత, హిందూసభను గూర్చి చర్చజరిగింది. చర్చలో రాహుల్జీకూడ పాల్గొన్నారు. తాను పండిత అయోధ్యాసింహ ఉపధ్యాయ శిష్య పరంపరలోనివాడు అయినప్పటికి ఈ విషయం ఉపాధ్యాయకు తెలియదు. ఆయన హిందూసభను సమర్థిస్తూ మాట్లాడారు. రాహుల్జీ ఆయన వాదాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తూ మాట్లాడారు. ఒక బౌద్ధభిక్షువు హిందూ మతంపై ఈ విధంగా దాడిచేయటం ఆయన

వహించలేకపోయారు. "ఇందుచేతనే మిమ్మ భారతదేశం నుండి బయటికి సాగనంపవలసి వచ్చింది" అన్నారు. రాహుల్జీ లోలోపల నవ్వుకొన్నారు.

అదేసంవత్సరం నవంబరు నెలలో సారనాథ్‌వద్ద నూతని విహారప్రారంభోత్సవం జరిగింది. అన్ని బౌద్ధదేశాల నుండి, ముఖ్యంగా లంకనుండి ఎందరో భిక్షువులు వచ్చారు. అందులో విద్యాలంకార విహార అధిపతి, రాహుల్జీ ఉపాధ్యాయుడైన ధర్మానందనాయక మహాస్థవిరకూడ ఉన్నారు. రాహుల్జీకూడ ఆ ఉత్సవంలో పాల్గొన్నారు. ఉత్సవానంతరం లంకకురమ్మని ధర్మానంద రాహుల్జీని కోరారు. లంకనుండి వచ్చిన భిక్షువులు, గృహస్థులు అంతాకలసి ఒకనాడు సారనాథ్‌నుండి జేతవనం వెళ్ళారు. బుద్ధుడు తన ప్రచారక జీవనంలో ఎక్కువకాలం గడిపినప్రదేశం ఇది. ధర్మానంద్ జేతవనాన్ని ప్రశంసిస్తూ సంయుత్తని కాలంలోనిగాథ "ఇంద జేతవన్" చెప్పనారంభించారు. కొద్దిసేపటికి ఆయన నోట మాట పెగలలేదు. కళ్ళనుండి బాష్పాలు జలజల రాలాయి.

వీరితో కలిసి రాహుల్జీ నలందా, రాజగృహం, కలకత్తాలమీదుగా లంకకు వెళ్ళారు.

## లంకకు మూడో పర్యాయం

విద్యాలంకార విహారంలో ఈ పర్యాయం రాహుల్జీ ఒక చైనావిద్వాంసుని చూశారు. అతనిపేరు వాంగ్-మో-లమ్. షాంఘైనుండి వెలువడే ఒక ఇంగ్లీషు పత్రిక (బౌద్ధమత సంబంధమైనది) సంపాదకుడు. పాలీ, సంస్కృతం

చదువుకోవడానికి ఇక్కడకు వచ్చాడు. అతనివద్ద చైనా అక్షరాలు నేర్చుకోవడానికి రాహుల్జీ ప్రయత్నించారు. కాని అది పూర్తిగా నేరవేరలేదు. అక్షరాలు నేర్చుకోవడంతోబాటు ఏదైనా సంస్కృత పుస్తకాన్ని పునరనువాదం చేయాలని రాహుల్జీ ఉద్దేశం. ఆయన అభిధర్మకోశాన్ని ఫ్రెంచి-అనువాద సహాయంతో పూర్తిచేశారు. మొదట తాను అదే పుస్తకంతాలూకు చైనా - అనువాదాన్ని తీసుకున్నారు. తర్వాత యువాన్-చ్వాంగ్ అనువదించిన విజ్ఞప్తిమాత్రతాసిద్ధి, దీర్ఘనికాయంలో కొన్ని సూత్రాలను తీసుకొన్నారు. చైనా త్రిపిటకం (ధైసోసంస్కరణ) కాపీ ఒకటి తెప్పించుకోవడానికి కాశీవిద్యాపీఠం వారు ఆర్థికసహాయం చేశారు. అందుచేత చైనాలిపి బాగా నేర్చుకోవాలని రాహుల్జీ అనుకొన్నారు. కాని పనులవత్తిడివల్ల ఈ ఉద్దేశం నెరవేరలేదు. వాంగ్ ఇక్కడవుండగా క్షయవ్యాధిగ్రస్తుడైనాడు. నెలలతరబడి కృశించి చనిపోవడం ఇష్టంలేక, సముద్రంలోదూకి మరణించాడు.

ఆనంద కౌసల్యాయన్ చదువు పూర్తి అయింది. ఇద్దరూ విదేశయాత్ర చేద్దామన్నాడు. రాహుల్జీ అందుకు అంగీకరించారు. సయాం వెళ్ళదామని ఆనందసూచించాడు. వీరిద్దరినిగూర్చి భారతీయ పోలీసులు లంకపోలీసులకు కొన్ని రిపోర్టులు పంపారు. అయినప్పటికి ఆనంద పెద్ద ప్రమాదికారి కాదని తోచింది. అతనికి ప్యాస్‌పోర్టు ఇచ్చారు. ఇంతలోనే మహాబోధిసభద్వారా లండన్‌లో ప్రచారంకోసం పంపిన భిక్షువులు తిరిగివచ్చినట్లు తెలిసింది. కొత్త ప్రచారకులను

పంపవలసిందిగా సభట్రస్టీలు విద్యాలంకార విహార అధి పతిని కోరారు. అందుకు అతడు ఆనందను ప్రోత్సహించాడు. కాని అతడు ఒంటరిగా వెళ్ళడానికి ఇష్టపడలేదు. రాహుల్జీనికూడ రమ్మన్నారు. ఇంగ్లాండుకు వెళ్ళిరావడానికి మాత్రమే ప్యాసుపోర్టు ఇమ్మని రాహుల్జి దరఖాస్తు పెట్టారు. భారతప్రభుత్వ అనుమతిలేనిదే ప్యాసుపోర్టు ఇవ్వజాలమని లంక పోలీసులు జవాబిచ్చారు. అలాగే ఆనందుకు ఇచ్చిన ప్యాసుపోర్టుకూడ ఉపసంహరించుకొన్నట్లు తెలియ జేశారు. అందుచేత ఇద్దరికీ నిరుత్సాహం కలిగింది. అప్పట్లో సి. బి. జయతిలక్ సింహళ ప్రధానమంత్రి అయినారు. రాహుల్జీకి అతడు అదివరకే పరిచితుడు. అతని కృషివల్ల ఇద్దరూ ఇంగ్లాండుదాకానే కాకుండా. బ్రిటిష్ సామ్రాజ్య మంతటా పర్యటించడానికి ప్యాసుపోర్టు లభించింది.

## యూరపు యాత్ర

రాహుల్జీ, ఆనంద్ ఇద్దరూ క్రీ.శ. 1932 జులై 5 తేదీ కొలంబోదీవిలో ఓడ ఎక్కడానికి వచ్చారు. యూరపులో కోటు, బూటు ధరిస్తారు. కాని వీరు రెండున్నరవేల ఏళ్ళ క్రిందట భిక్షువేషం ధరించారు. ఫ్రెంచినావికులు గట్టిగా నవ్వుతూ, వీరికి స్వాగతమిచ్చారు. రాత్రి 11 గంటలకు ఫ్రెంచిఓడ బయలుదేరింది. ఇద్దరూ పడుకుని నిద్రపోయారు. ఆనందకు ఓడ ప్రయాణం సరిపడలేదు. పగటిపూట మూడు సార్లు వాంతి చేసుకున్నాడు. అన్నం ముట్టలేదు. రాహుల్జీకి అన్నం రుచించలేదు. ఇద్దరూ నిమ్మపళ్ళ రసం తీసు

కొన్నారు. ఆనంద్ మరీ నీరసించిపోయాడు. ఈ పరిస్థితికి తోడు తుఫాన్ కూడ ప్రారంభమైంది. అది వారంరోజుల వరకు కొనసాగింది. 12 వ తేదీన ఆగిపోయింది. ఆఫ్రికా తీరం కనిపించింది. ఓడలో స్నానపుగది అంతబాగాలేదు. స్నానానికి ఉప్పునీరు, మంచినీరు ఉంది. కాని రాహుల్జీ ఉప్పు నీటితో ఒళ్ళుతడుపుకొన్నారు. సబ్బురాసుకొంటూ ఉండగా రాతితో గీసినట్లు ఉంది. మొదట మంచినీటితో ఒళ్లు తడుపుకొని, సబ్బురాసుకోవాలని, ఆ తర్వాత ఉప్పునీటితో స్నానం చేయాలని రాహుల్జీకి తెలియదు.

రెండువేల రెండువందలఏళ్ళకు పూర్వం ఈజిప్టులో బౌద్ధభిక్షువుల కొరత ఉండేదికాదు. సికందరియా మొదలైన ప్రదేశాలలో బౌద్ధవిహారాలు ఉండేవి. అశోకుని పనుపున బౌద్ధభిక్షువులు మాసిడోనియా, తదితర యూరపుదేశాలలో మతప్రచారంకోసం వెళ్ళారు. ఇప్పుడు రాహుల్జీ, ఆనంద్ అందుకోసమే యూరపు వెళ్ళుతున్నారు. కాని వీరిలో అంత ఆత్మవిశ్వాసం లేదు.

వీరు జూలై 23 వ తేదీ మధ్యాహ్నం మార్సెయిల్స ఓడరేవులో దిగారు. ప్యారిస్కువెళ్ళేరైలు కొద్ది ఆలస్యంగా బయలుదేరుతుంది. అందుచేత మార్సెయిల్స్‌లో ముఖ్యమైన ప్రదేశాలు చూచి వచ్చారు. పిమ్మట రైలులో ప్యారిస్కు వెళ్ళారు. అంబాలాల్ అనే మిత్రుని కలుసుకొన్నారు. అతడు వీరికి పట్టణమంతా చూపించాడు. వీరికి ప్యారిస్ నగరం వింతగా ఉంది. ప్యారిస్ పౌరులకు వీరు వింతగా ఉన్నారు. ఇక్కడ నివసిస్తున్న ఒక అమెరికన్ మహిళ

లుంజ్ బగీ చిరునామా తెలిసింది. ఆమెకు బౌద్ధమతమంటే అనురాగం. వీరు ఆమెఇంటికి వెళ్ళారు. కాని ఆమె లేదు. తర్వాత ప్యారిస్ విశ్వవిద్యాలయం, రాఫెల్ మీనార్, నెపోలియన్‌సమాధి, పురాతన రాజమహల్ సందర్శించారు. మరునాడు ప్యారిస్‌లోని ప్రాచ్యభాషా తత్వవేత్తలను కలుసుకోదలచారు. కాని ఎండాకాలం సెలవులు అయినందువల్ల, వారు నగరం వెలుపల ఉన్నట్లు తెలిసింది. డాక్టరు పేలియోకు ఫోన్‌చేయగా, అతడు ఇంటివద్దనే ఉన్నాడు. డాక్టరు పేలియో చైనాభాషలో ప్రకాండ పండితుడు. రాహుల్జీ అతనిని కలుసుకొన్నారు. తన సంపాదకత్వాన వెలువడిన "అభిధర్మకోశం" కాపీ ఒకటి బహూకరించారు. ఇద్దరూ చాలాసేపు సంభాషణ జరిపారు. తర్వాత ఒక టాక్సీలో తమ బసకు బయలుదేరారు. రాహుల్జీ ప్రక్క ఒక ముసలమ్మ కూర్చుని ఉంది. "మీకు పిల్లలు ఎందరు?" అని ఆమెను ప్రశ్నించారు. "నేను ఒంటరిగానే ఉన్నాను. నేను అవివాహితను" అని ఆమె చెప్పింది. రాహుల్జీ, ఆనంద్ ఆ మరునాడుకూడ కొన్ని ముఖ్యమైనప్రదేశాలుచూచి, ఓడలో లండన్‌కు వెళ్ళారు.

ధర్మపాలుడు లంకలోఉన్నప్పుడు, విదేశాలలో బౌద్ధమతప్రచారాన్నిగూర్చి కలలుగనేవాడు. యువకుడుగా ఉన్నప్పుడే అతడు భారతదేశానికివచ్చి, తన జీవితమంతా ఇక్కడే గడిపాడు. బౌద్ధమతప్రచారంకోసం మహాబోధి సభను స్థాపించాడు. కొలంబో, కలకత్తా, సారనాధ్ తదితరచోట్ల కేంద్రాలు నెలకొల్పాడు. ఇంగ్లీషువారికికూడ బుద్ధుని

సందేశం అందించాలని అతనికోర్కె. అందుచేత లండన్‌లో రీజెంట్‌పార్కు వద్ద, లక్షరూపాయలు పెట్టి నాలుగంతస్తుల మేడ ఖరీదుచేశాడు. ఇప్పుడది విదేశాలలో బౌద్ధమత ప్రచార కేంద్రంగా ఉంది. రాహుల్జీ, ఆనంద్ అక్కడకు వెళ్ళారు. కేంద్రంలో లంక వాతావరణమే ఉంది. ఇది రాహుల్జీకి నచ్చ లేదు. బౌద్ధమతాన్ని ఇంగ్లాండువారి మతంగా చేయాలంటే, అది ఇంగ్లాండు వాతావరణంలోనే ఉండటం అవసరమని ఆయన అభిప్రాయం.

మరునాడు పత్రికాగోష్ఠి జరిగింది. "డెయిల్ హెరాల్డు" పత్రికాప్రతినిధి కొన్నిప్రశ్నలు అడిగాడు. ఇంగ్లాండు వాస్తవ్యులకు తాము బుద్ధుని ఉపదేశాన్ని ఎరుక పరచదలచామని రాహుల్జీ చెప్పారు. కాని ఆ ప్రతిక, వీ రిద్దరూ ఇగ్లాండునంతటినీ బౌద్ధమతంలోకి మార్చివేయ జూస్తున్నారని వ్రాసింది. "డెయిలీమెయిల్" ప్రతినిధి రాహుల్జీని కలుసుకొని, టిబెట్‌యాత్రను గురించి కొన్ని ప్రశ్నలు అడిగాడు. ఆయన మామూలు పద్ధతిలోనే జవా బిచ్చారు. కాని ఆ పత్రిక ఈ భిక్షువు ప్రపంచంలోని ఘోరా టవులలో ఎన్నోఏళ్ళు గడిపాడని, అయినప్పటికీ ఇతనికి ఏ జంతువూ హానికలిగించలేదని, ఇంకా ఏవేవో వ్రాసింది. సంపాదకీయశాఖతరఫున టైప్‌చేసినకాపీ ఒకటి అంతకు ముందే రాహుల్జీవద్దకు పంపించారు. తప్పుగాఉన్న విషయా లను ఆయన కొట్టివేసినా, యథాతథంగా అచ్చువేశారు. రాహుల్జీ అబద్ధాలకోరు, మోసగాడు అని ఒకవైపున మేధా వులకు, మానవునిలో దివ్యశక్తిఉందని ఇంకొకవైపున

మూర్ఖులకు చాటిచెప్పడం ఈ పత్రికఉద్దేశం. చైనానుండి వచ్చిన యూనివర్సిటీ ప్రొఫెసర్ ల్యూ ప్రకటననుకూడ పెట్టుబడిదారీ పత్రికలు ఇలాగే వక్రంగా చిత్రించాయి.

రాహుల్జీ "దివ్యశక్తి"ని గూర్చి పత్రికలలో చదివి, ఇంగ్లాండు వాస్తవ్యులు కొందరు తాయెత్తులకోసం ఆయనకు జాబులు వ్రాశారు. ఒకనాడు ఒకమహిళ ఆయనతో మాట్లాడటానికి వచ్చింది. ఆమెకు చిత్రవిచిత్రమైన స్వప్నాలు వచ్చేవట. కూర్చుని ఉండగానే స్పృహతప్పి పడిపోయేదట. మానసిక శాస్త్రజ్ఞుడు మాత్రమే దీనికి ఏదైనా ఉపాయం చెప్పగలడు. కాని ఆ మహిళకు ప్రాచ్యదేశాల వారి "తత్వజ్ఞానం"పై విశ్వాసం ఉంది. ఆమె శాస్త్రసమ్మతమైన చర్చలకు రాలేదు. జోతిష్యం, భూత - ప్రేతాలు, తంత్ర-మంత్రాలు, తాయెత్తులు, యోగం, ఋషిసిద్ధి, దివ్యశక్తులపై రాహుల్జీకి విశ్వాసం ఏనాడోపోయింది. అయినప్పటికీ, "మీకువచ్చే స్వప్నాలు ఏవో వాటిని రోజూ వ్రాసి పెట్టుకోండి. కొద్దిరోజుల తర్వాత వాటిని పరిశీలిస్తాను," అని రాహుల్జీ ఆ మహిళకు చెప్పారు.

మహాబోధి సభలో ప్రతిఆదివారం సమావేశం జరిగేది. ఆనంద్‌తోబాటు, అప్పుడప్పుడు రాహుల్జీకూడ ఉపన్యసించేవారు. వీరు ఒకటి రెండుసార్లు భారతీయ యువక క్రైస్తవసభకు వెళ్ళారు. లండన్‌లో ఉంటూ, కొంతకాలానికి ఐ.సి.యస్. బారిస్టరయి భారతదేశానికి వెళ్ళే యువకులే అక్కడ ప్రోగైనట్లు కనపడింది. రాహుల్జీ లండన్‌లో "థియాసఫీ" (దివ్యజ్ఞానం) పుస్తకాలు ఎన్నో చదివారు.

దివ్యజ్ఞానసమాజం మోసగాళ్ళ కూటమి అనే అభిప్రాయా నికి వచ్చారు. ఒకనాడు లండన్‌లోని పెద్దగ్రంథాలయానికి వెళ్లారు. అక్కడ రోజూ చదువుకోవడానికి అనుమతి పత్రం సంపాదించారు. గ్రంథాలయంలో ఏకాంత అధ్యయనానికి కూడ చక్కని ఏర్పాట్లుఉండేవి.

భారతదేశం, లంకనుండివచ్చి ఇక్కడ స్థిరనివాసం కల్పించుకొన్న వ్యక్తు లెందరో రాహుల్జీకి పరిచితులైనారు. ఒకనాడు నలుపురంగుగల ఒక బలిష్ఠమైన యువకుడు,ఆయన వద్దకు వచ్చాడు. అతనివెంట ఇద్దరు చిన్నపిల్లలు ఉన్నారు. వారు అతని బిడ్డలు. తెలుపురంగులో ఉన్నారు. అతడు బౌద్ధ గృహస్థునివలె చేతులు జోడించి, తలవంచి నమస్క రించాడు. మొదటిప్రపంచయుద్ధకాలంలో, తన పదిహేనవ యేట లంకనుండి లండన్‌కుపారిపోయి వచ్చానని, ఇక్కడే పెళ్ళిచేసుకొని, స్థిరనివాసం కల్పించుకున్నానని చెప్పాడు. లండన్‌లో బౌద్ధవిహారం, బౌద్ధభిక్షువులు ఉన్నట్లు ఇటీవల పత్రికలలో చదివి, ఈ ప్రదేశాన్ని వెదుక్కొంటూ వచ్చా నన్నాడు. అతనిని బౌద్ధ మందిరంలోకి తీసుకువెళ్ళగా, గద్గద స్వరంతో పూజచేశాడు. ఆ తర్వాత అతడు తన భార్యా పుత్రులతో విహారంలోకి వస్తూ ఉండేవాడు.

రాహుల్జీ టిబెట్‌నుండి తెచ్చిన చిత్రాలలో 25 చాల మంచివి. ఆయన వాటిని లండన్‌కు తీసుకువచ్చారు. ఇక్కడ, ప్యారిస్‌లోకూడ ప్రదర్శింపజేశారు. నలందాను పునరుద్ధ రించాలనే ఆలోచన ఆయన బుర్రలో మెదలుతూ ఉండేది. వీటిని అమ్మి ఆ డబ్బుతో నలందాలో భూమిఖరీదు చేయ

వచ్చునని అనుకొనేవారు. ఒక అమెరికన్ మ్యూజియమ్‌కు అమ్మితానని కూడ వ్రాశారు. కాని ఇక్కడకు వచ్చిన తర్వాత ఆ చిత్రాల గొప్పదనం తెలిసింది. అమ్మితే దాదాపు లక్షరూపాయలు వచ్చేవి. కాని పాట్నా మ్యూజియమ్‌కు ఉచితంగా ఇచ్చివేశారు.

శ్రీమతి రీజ్-డేవిడ్స్ పాలీ భాషలో గొప్పపండితురాలు. ఆమె, ఆమెభర్త పాలీసాహిత్యంలో అపారమైన కృషి చేశారు. యుద్ధకాలంలో ఆమె ప్రియపుత్రుడు మరణించాడు. కొద్దికాలమైన తర్వాత, ఆమెభర్తకూడ మరణించాడు. వృద్ధురాలు శ్రీమతి డేవిడ్స్ ఈ శోకాన్ని భరించలేకపోయింది. ప్రేతవిద్య తెలిసినవారివద్దకు వెళ్ళడం మొదలుపెట్టింది. తనపుత్రుడు ప్రేతలోకంలో జీవించి ఉన్నాడనే విశ్వాసం ఏర్పడింది. తన పాలీభాషా పాండిత్యం అప్రత్యక్షరూపంలో మరో విషయాన్ని ప్రతిపాదించడానికి ఉపయోగపడింది. ఆమె ఇలా ఆలోచించడం మొదలుపెట్టింది: నా పుత్రుడు జీవంతో ఉన్న ప్రేతలోకం ఉంటే, దేవలోకంకూడ ఉన్నట్లే. ఈ ప్రేతలోకమూ, దేవలోకమూ లక్షలాది సంవత్సరాలు ఉండగలిగినప్పుడు, ఈ శరీరాన్ని వదలి, వేరొక శరీరంలోకి వెళ్ళే అజరామరమైన, నిత్యమైన ఆత్మకూడ ఉండితీరుతుందని ఆమె వాదన. బుద్ధుడు అనాత్మను కాకుండా ఆత్మను అంగీకరించాడని ఆమె చెప్పడం మొదలుపెట్టింది. ఇలాగే ఇంకా ఎన్నో కొత్త ఆలోచనలు చేసింది. బుద్ధుని ఉపదేశాలకు పూర్తి వ్యతిరేకమైన అర్థం చెప్పింది. మరొక శాస్త్రవేత్త సర్ ఆలివర్‌లాజ్ విష

యంలోకూడ ఇలాగే జరిగినట్లు రాహుల్జీకి తెలిసింది. యుద్ధంలో అతని కుమారుడుకూడ మరణించాడు. తన కుమారునితో మాట్లాడేందుకై అతడు ప్రేత విద్యావేత్తల వద్దకువెళ్ళేవాడు. తర్వాత ఏవో పిచ్చిపిచ్చి వ్రాతలు వ్రాయ మొదలుపెట్టాడట. శ్రీమతి డేవిడ్స్ భావాలను ఖండిస్తూ రాహుల్జీ ఒక వ్యాసం వ్రాశారు. అది ఒక బౌద్ధ మాస పత్రికలో అచ్చయింది.

భవిష్యత్తులో మతం అనేది లేకుండాపోయే ప్రమాదం ఉందని, కొన్ని మతాలవారు కలసి లండన్‌లో 'సర్వ మత మిత్రమండలి'ని ఏర్పాటు చేయదలచారు. ఇందులో బౌద్ధమతానికి ప్రాతినిధ్యం లేకపోతే ఎలాగ? అందుచేత వారు మహాబోధిసభకు ఆహ్వానపత్రం పంపించారు. రాహుల్జీ బౌద్ధమత సమర్థకుడు అయినమాట నిజమే. దీనితోబాటు ఆయన ఇతరమతాలను వ్యతిరేకించేవారు కాదు. అయితే భగవంతుడు ఉన్నాడనే మతం ప్రజాశ్రేయస్సుకు, ప్రపంచ అభ్యుదయానికి వ్యతిరేకమని భావించేవారు. మత రీత్యా బౌద్ధమతంకూడ ఒకవిధంగా అభివృద్ధి నిరోధకమైనదే అనే నిర్ణయానికి ఆయన ఇంకా రాలేదు. 'సర్వమత మిత్ర మండలి' ఆహ్వానాన్ని అందుకొని, ఆనంద మాత్రమే అక్కడకు వెళ్లారు. అప్పటికే మండలి ఉద్దేశాలను, నియమాలను రూపొందించడం చాలా వరకు పూర్తి అయింది. దేవుని బిడ్డలు అయినందువల్ల మానవులందరిలోను భ్రాతృభావాన్ని పెంపొందించాలనేది మండలి నియమాలలో మొదటిది. ఈ నియమం ఉన్నట్లయితే బౌద్ధులు ఈ మండలిలో

చేరజాలరని, ఎందుకంటె బౌద్ధులు దేవుడు ఉన్నాడనే విషయం అంగీకరించరని ఆనంద చెప్పాడు. దేవునికి స్థానంలేని మతంకూడ ఒక మతమేనా? అని ఒక మాల్వీ పెదవి విరచాడు. ఏమైనా బౌద్ధులను మిత్రమండలిలో చేర్చుకోవాలి కాబట్టి, నియమావళినుండి దేవునిమాట తొలగించారు.

భారతదేశంలో మహమ్మదీయులతో బాటు, హరిజనులకుకూడ ప్రత్యేక ఎన్నిక నియోజకవర్గాలు ఏర్పాటు చేయడానికి బ్రిటిష్‌ప్రభుత్వం అగీకరించింది. 'విభజించి' పాలించేఈ రాజనీతిని నిరసిస్తూగాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష పూనారు. ఈ వార్త లండన్ పత్రికలో వెలువడగానేచాలా ఆందోళన:బయలుదేరింది. ఒక చైనావిద్యార్థి రాహుల్జీవద్దకు వచ్చాడు.'అస్పృశ్యత అంటేఏమిటి?' అనిఅడిగాడు. రాహుల్జీ అతనికి చాలా వివరంగా చెప్పారు. అయినప్పటికీ ఆరోగ్యవంతుడైన వ్యక్తిని ముట్టుకోవడమన్నా, అతనిచేతి అన్నం తినడమన్నా చెడ్డగా ఎందుకుభావిస్తారో అతనికి అర్థం కాలేదు. భారతదేశంలో బ్రహ్మదేవుడు ఏర్పాటుచేసిన నియమం అనుకొంటున్నదానిని, ఇతరదేశాలలో చాలా మూర్ఖత్వంతోకూడిన నియమంగా భావిస్తున్నారని రాహుల్జీకి స్పష్టమైంది.

రాహుల్జీ ఒకనాడు కాన్‌సింగ్టన్ మ్యూజియమ్‌కు వెళ్ళారు. బుద్ధుని ముఖ్య శిష్యులు సారిపుత్ర, మౌద్గల్యాయనుల అస్థికలు అక్కడ చిన్నపెట్టెలలో భద్రపరచబడి ఉండేవి. పెట్టెలపై క్రీస్తుకుపూర్వం రెండోశతాబ్దపులిపిలో ఆ ఇద్దరు సత్పురుషులపేర్లు చెక్కబడి ఉన్నాయి. వాటిని తెర

వగా అస్థికలముక్కలు చిన్న చిన్నవి కనిపించాయి. క్యాంపెబెల్ ఈ మ్యూజియమ్‌లో ఉన్న ఇతరవస్తువులను కూడ చూపించాడు. రాహుల్జీని తన ఆఫీసులోకి తీసుకు వెళ్ళాడు. అక్కడ ఒక ఇంగ్లీషు అధికారి క్యాంపెబెల్ కోసం కాచుకొని ఉన్నాడు. అతడు భారత ప్రభుత్వానికి సంబందించినవాడు. మర్యాదకోసం క్యాంపెబెల్ అతనిని రాహుల్జీకి పరిచయం చేశాడు. కాని అతడు సందేహిస్తూనే రాహుల్జీతో కరచాలనంచేశాడు. అతడు భారతీయులను గులాములుగా భావిస్తున్నట్లు కనపడింది.

ఇంగ్లాండునుండి అమెరికాకు వెళ్ళి, అక్కడ బౌద్ధ మతప్రచారంచేయమని మహాబోధిసభవారు రాహుల్జీని కోరారు. కాని ఆయన మతప్రచారకుడు అయ్యే దశదాటి పోయింది. ఇప్పుడు బౌద్ధమతంతో తనకు, 'నూలుపోగు సంబంధం' మాత్రనే ఉంది. అది ఎప్పుడైనా తెగిపోవచ్చు, అయితేఆయనకుబుద్ధునిపట్ల శ్రద్ధఎప్పటికీతగ్గిపోలేదు. బుద్ధుడు భారతదేశంలోఅందరికంటె గొప్పతత్వవేత్త అని రాహుల్జీ అభిప్రాయం. ప్రపంచంలో మతమనేపేరులేకుండాపోయినా, బుద్ధునిపేరునిలుస్తుందని ఆయన నమ్మకం. తాను బుద్ధునిఉపదేశాలు చదివినతర్వాత, అతడుకూడా కమ్యూనిస్టుగా తయారు కావాలని కలులుకన్నట్లు రాహుల్జీ భావించారు. లండన్‌లో ఉండగా ఆయన కమ్యూనిస్టు సాహిత్యాన్ని, ముఖ్యంగా రష్యా పత్రికలను, పుస్తకాలను చదివేవారు. లండన్‌నుండి వెలువడే కమ్యూనిస్టు పత్రిక "డెయిలీవర్కర్"ను నిత్యమూ పఠించేవారు. అయితే ఆయన బ్రిటీష్ కమ్యూనిస్టులలో

ఎవరితోనూ నేరుగా సంబంధం పెట్టుకోవడానికి అవకాశం లభించలేదు.ఆయన వేషం చూస్తేనే బ్రిటిష్ కమ్యూనిస్టులు జడుసుకొనేవారు. పైపెచ్చు తాను కూడ రష్యా వెళ్ళదలచారు. గూఢచారుల దృష్టిలో పడతానని ఆయనభయం.

రాహుల్జీ ఒకరోజున కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాన్ని సందర్శించారు.అప్పుడు ఆయనకు టిబెట్‌లోని సేరా, డేపుంగ్ బౌద్ధ విహారాలు గుర్తుకువచ్చాయి. కేంబ్రిడ్జికూడ ఒకప్పుడు క్రైస్తవభిక్షువుల విహారంగా ఉండేది. వారే దీనిని విద్యాపీఠంగా మార్చారు. భారతదేశంలో నలందా, విక్రమశిలవంటి పెద్ద విద్యాపీఠాలు ఉండేవి. అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన ఈ విద్యాపీఠాలు శిథిలమైపోయేటప్పుడే, కేంబ్రిడ్జి, ఆక్సఫర్డు విద్యాపీఠాలు స్థాపింపబడటం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది.

మార్క్స మహాశయుడు లండన్‌లో చనిపోయాడని, ఆయన భౌతికకాయం హైగేట్ స్మశానవాటికలో సమాధి చేయబడిందని రాహుల్జీ చదివారు.అందుచేత ఒకనాడు భక్తి భావంతో ఆ స్మశాన వాటికను వెదుక్కుంటూవెళ్ళారు. బయట ఒక స్త్రీ పువ్వులు అమ్ముతున్నది. ఆమెవద్ద పువ్వులు ఖరీదుచేశారు. మార్క్స సమాధి ఎక్కడ అని చౌకీదారును అడుగగా, తనకు తెలియదన్నాడు. ఏవర్గ దాస్యాన్ని తొలగించచానికై మార్క్సపాటు పడ్డారో, ఆ వర్గానికి సంబంధించిన ఒకవ్యక్తికి ఆయన సమాధి ఎక్కడ ఉండేదీ తెలియకపోవడం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది. స్మశానవాటికలో వేలాది సమాధులు ఉండేవి. వాటిపై

ఉన్న పేర్లు చదివి, మార్క్సుసమాధిని గుర్తుపట్టాలంటే ఒక రోజు చాలదు. ఇంతలో ఒకవ్యక్తి సమాధులవైపునుండి గేటువైపువచ్చాడు. 'పదండి, నేను చూపిస్తా'నని అతడు రాహుల్జీని తీసుకువెళ్ళాడు. అది మామూలుసమాధి-దానిపై గడ్డిమొలిచిఉంది. ప్రపంచ శ్రమజీవుల పరిరక్షకుడు తన జీవితాంతంవరకూ పరిశ్రమించి, దారిద్ర్యాన్ని సహించిన తర్వాత, తనభార్య జెన్నీతోబాటు ఇక్కడే విశ్రమించారు. రాహుల్జీ చాలా భక్తిభావంతో పువ్వులను సమాధిపై ఉంచారు. తలవైపుఉన్న రాతిపై మార్క్సుపేరుకూడా చెక్కబడి ఉంది. అక్కడ ఎవరో ఒకచిన్న ఎర్రజెండా పెట్టారు. అదే రోజు రాహుల్జీ వెస్టుమినిస్టర్ అబే చూడటానికి వెళ్ళారు. ఇక్కడబీదలరక్తం పీల్చినవారి సమాధులు ఉన్నాయి. వీటిని అలంకరించడానికై డబ్బు మంచినీళ్ళవలె ఖర్చుపెట్టినట్లు కనపడింది.

లండన్‌లో మూడునెలలన్నర కాలం గడిపినతర్వాత రాహుల్జీ, ఆనంద తదితర మిత్రులవద్ద సెలవుతీసుకొని తిరిగి ఫ్రాన్సుకు వెళ్ళారు. అమెరికన్ బౌద్ధమత సానుభూతిపరురాలు లుంజ్ బరీ ఆయనకు స్టేషన్‌లో స్వాగతమిచ్చింది. రాహుల్జీ మరునాడు 'ముజీ_గ్వ' అనే కళామందిరాన్ని సందర్శించారు. ఆరాత్రి జరిగిన బౌద్ధసభలో ఉపన్యసించారు.

మరునాడు ఆచార్య సెల్వాన్ లెవీ ఇంటికివెళ్ళారు. ఆయన వయస్సు 70 ఏళ్ళు. భారతీయసంస్కృతీ పరిశోధనలో అయనకు సాటివచ్చే పండితుడు ఈప్రపంచంలో లేడని చెప్పవచ్చు. పండుముసలి అయినప్పటికీ, రోజుకు పది

పన్నెండుగంటలు పనిచేస్తున్నారు. అవసరమైతే ప్రపంచంలో ఎక్కడికైనా వెళ్ళడానికి సిద్ధంగాఉన్నారు. రాహుల్జీ ఆయనకు "అభిధర్మకోశం" కాపీ ఒకటి బహుకరించారు. ఆయన గదిలో ఎక్కడచూచినా పుస్తకాలే ఉండేవి. అందులో ఆధునిక యూరపు భాషాగ్రంథాలే కాకుండా, చైనా, పాళీ, సంస్కృతం, టిబెట్ భాషాగ్రంథాలుకూడ ఎక్కువ ఉండేవి. విరిగిపోయిన ఒక నల్లని రాతివిగ్రహాన్ని రాహుల్జీకి చూపించి, "దీనిని నేను నలందాలో సంపాదించాన"ని చెప్పారు. ఇద్దరూ నాలుగుగంటలసేపు సంభాషించారు. ఆచార్యలెవీ టిబెట్ రాజవంశాన్నిగూర్చి ప్రస్తావించారు. ఆయనకుగల కొన్ని సందేహాలను రాహుల్జీ నివృత్తిచేశారు.

బహుభాషా పండితుడు, గోవా నివాసిఅయిన బర్గంజా కూడ ఇక్కడే కనిపించారు. తాను భారతీయ నృత్యాన్నిగూర్చి ఒకపుస్తకం వ్రాస్తున్నట్లు తెలియజేశారు. "భరతనాట్యశాస్త్రం"లో నృత్యానికి సంబంధించిన అధ్యాయాల అనువాదంలో తనకు తోడ్పడాలని రాహుల్జీని కోరారు. అందుకు రాహుల్జీ సంతోషంతో అంగీకరించారు. బర్గంజాకు పాశ్చాత్య నృత్యశాస్త్రం కొట్టినపిండి. అయితే భరతనాట్యశాస్త్రంకూడ బాగా చదివాడు. భరతుడు చెప్పిన్నన్ని నృత్యముద్రలు యూరోపియన్ నాట్యశాస్త్రంలో కూడ లేవని ఆయన అన్నప్పుడు రాహుల్జీ ముక్కుపై వేలు పెట్టుకున్నారు. బర్గంజా వెంట, రాహుల్జీ జాతీయగ్రంథాలయం చూడడానికి వెళ్ళారు. బ్రిటిష్ గ్రంథాలయంవలె ఇది కూడ చాలా పెద్దది. చదువుకోవడానికి అక్కడ ఇంకా

చక్కని ఏర్పాట్లుఉండేవి. సాయంత్రంపూట సోర్బోన్ విశ్వ విద్యాలయానికి వెళ్లారు. అక్కడ ఆచార్యలెవీ, ఆచార్య ఫూషే, తదితర అధ్యాపకులు కనిపించారు. చాలా సేపటి దాకా శాస్త్రీయచర్చలు జరిగాయి. కుమారి సిల్వర్ బౌద్ధ తత్వ విద్యార్థిని. ఆమె రాహుల్జీని ఎన్నో ప్రశ్నలడిగింది.

సోవియట్ రష్యాకు వెళ్ళాలని రాహుల్జీ ఉద్దేశం. లండన్‌లో ఉండగానే ప్యాస్‌పోర్టుపై అనేక విదేశాల పేర్లు వ్రాయించుకొన్నారు. కాని సోవియట్ రష్యా పేరులేదు. అందుచేత ప్యారిస్‌లోని బ్రిటిష్‌రాయబార కార్యాలయానికి వెళ్లారు. తాను వచ్చినపని చిక్కుతోకూడుకొన్నదని ఆయన అనుకొన్నారు. బ్రిటిష్‌రాయబారికి ఒక బుద్ధవిగ్రహాన్ని గూర్చి ఏదో సమాచారం కావలసివచ్చింది. రాహుల్జీని అడగగా, ఆయన చెప్పారు. రాయబారి సోవియట్‌రష్యా, పోలెండ్‌లపేర్లుకూడ ప్యాస్‌పోర్టుపై ఎక్కించాడు. తాను వెంటనే సోవియట్ రష్యాకు వెళ్ళగలనని రాహుల్జీ అనుకో లేదు. అయినప్పటికీ రష్యన్‌భాష నేర్చుకోవడం ప్రారంభించారు. ఆయనకు ఒక పోలెండ్ వనిత చాలాప్రేమతో రష్యన్‌భాష నేర్పిస్తూ ఉండేది. ఆమెకు కమ్యూనిస్టులంటే గిట్టదు. తనవద్ద రష్యన్‌భాష నేర్చుకొంటున్న భిక్షువు కమ్యూనిస్టు అభిమాని అని ఆమెకు ఏమి తెలుసు?

రాహుల్జీ ఆ నెలాఖరులో జర్మనీకి వెళ్ళారు. ఫ్రాంక్ ఫర్ట్ స్టేషన్‌లో ఠాకుర్ ఇంద్రబహాదూర్‌సింహ్, జపాన్ పండితుడు డాక్టరు కితాయామా, ఆయనకు స్వాగతమిచ్చారు. ఠాకుర్ ఇంద్రబహాదూర్‌సింహ్ కాశీవిద్యాపీఠంలో 'శాస్త్రి'

పరీక్ష ప్యాసై, ఇక్కడ పి. హెచ్. డి. కోసం కృషిచేస్తున్నారు. డాక్టరు కితాయామా ఫ్రాంక్ ఫర్ట్, మార్ బర్గ్ విశ్వవిద్యాలయాలలో బౌద్ధమతాన్ని గూర్చి అధ్యయనం చేస్తున్నారు. మరునాడు వీరు ముగ్గురూ కలిసి, జర్మనీ సంస్కృత విద్వాంసుడు డాక్టరు ఓటో ఇంటికి వెళ్ళారు. రాహుల్జీ ఆయనతో అయిదుగంటలసేపు శాస్త్రీయ చర్చలు జరిపారు. పాళీ భాష, బౌద్ధమతం, మహాయానం, రామానుజుని విశిష్టాద్వైతం, ఆర్యుల అశ్వపాలన వీరి చర్చలలో వచ్చాయి.

మరునాడు రాహుల్జీ మార్ బర్గ్ లోని విశ్వవిద్యాలయాన్ని చూడటానికి వెళ్లారు. డాక్టరు ఓటో పని చేస్తున్నది అక్కడే. ఆయన శీతాకాలపు సెలవులలో ఇటలీకి వెళ్ళుతున్నారు. అందుచేత వందలాదివిద్యార్థులు ఆయన ఉపన్యాసం వినడానికి వేచిఉన్నారు. డాక్టరు ఓటో గాంధీజీని గూర్చి ఉపన్యాసించారు. రాహుల్జీని విద్యార్థులకు పరిచయం చేశారు.

డాక్టరు ఓటో ఒక స్విడ్జర్లాండ్ మహిళ తయారు చేసిన రంగు రేఖా చిత్రాలను రాహుల్జీకి చూపించారు. ఈ మహిళ స్వప్నావస్థలో ఇలాంటి చిత్రాలను చూచేదని, తర్వాత వీటిని కాగితాలపై గీసిందని చెప్పారు. వీటిపై మీ అభిప్రాయ మేమిటని రాహుల్జీని అడిగారు. వీటిలో కొన్ని చిత్రాలు టిబెట్ మండల చక్రాన్ని పోలివున్నాయని రాహుల్జీ చెప్పారు. స్విడ్జర్లాండ్ మహిళ అభ్యర్థనపై రాహుల్జీ ఆమె ఇంటికి వెళ్ళారు. యోగంపట్ల ఆమెకు చాలా శ్రద్ధఉండేది. కొన్ని యోగాలు చేస్తూఉండేది. తాను

గీసిన రంగురేఖా చిత్రాలనుగూర్చి రాహుల్జీ అభిప్రాయం తెలుసుకున్నది. విన్నదీ, కన్నదీ ప్రతిఒక్కటీ చిత్తైకాగ్రత వల్ల భౌతికరూపంధరించి కనిపిస్తుందని రాహుల్జీ చెప్పారు. ఆయన వ్యాఖ్య ఆమెకు చాలా సంతృప్తి కలిగించింది.

రాహుల్జీ సోవియట్ రష్యాప్రయాణం తలపెట్టారు. కాని మరో వారంరోజులు ఇక్కడే ఉండవలసివచ్చింది. ఒక నాటిరాత్రి ఠాకుర్ ఇంద్రబహుదూర్ సింహ్‌వెంట పట్టణం చూడటానికి బయలుదేరారు. ఆ రోజున ఏదో పండుగ. ఎక్కడచూచినా జనసంగోహమే. వృక్షాలు విద్యుద్దీపాల పొదరిళ్ళవలె కనపడుతున్నాయి. అక్కడక్కడ కొందరు యువతులు నిల్చుని ఉన్నారు. వీరు వేశ్యలని ఆయనమిత్రుడు చెప్పాడు. అడుగడుగునా వీరేకనిపిస్తున్నారు.ఆయనమిత్రుడు వీరినిగూర్చి సైగతో చెబుతున్నాడు. అయినప్పటికీ రాహుల్జీ పట్టించుకోలేదు. కొంతదూరంవెళ్ళినతర్వాత ఆయనమిత్రుడు మళ్ళీ హెచ్చరించాడు. ఇంతలో ఒకరిద్దరు యువతులువచ్చి రాహుల్జీ చెయ్యిపట్టుకొన్నారు. ఆయన "నాయిన్" (వద్దు) అనే జర్మన్‌మాట వల్లించి, అక్కడనుండి తప్పు కున్నారు.

రాహుల్జీని తిరిగి లండన్‌కు రమ్మని, తర్వాత అమెరికాకు వెళ్ళమని కోరుతూ మహాబోధి సభ తరఫున ఆనంద్ ఒక ఉత్తరం వ్రాశాడు. కాని యూరపు పెట్టుబడిదారీ జీవితం రాహుల్జీకి చాలారోత పుట్టించింది. ఆ దేశాలలో ఇంకా తిరగడమంటే కాలాన్ని వ్యర్థపరచడమే అనిపించింది.

అందుచేత తాను స్వదేశానికి వెళ్ళుతున్నానని మహాబోధి సభకు లేఖ వ్రాశారు. అయితే రష్యాకువెళ్ళే ప్రయత్నాన్ని విరమించుకోలేదు.

ఆయన డిసెంబరు 12వ తేదీ రాత్రి బెర్లిన్‌కు బయలుదేరారు. మరునాడు ఒక స్టేషన్‌వద్ద కుమారి వర్తా డాల్కే స్వాగతమిచ్చింది. ఆయనను బెర్లిన్ ఉపనగరమైన ప్రోనోకు తీసుకువెళ్ళింది. జర్మనీ వైద్యుడు, ప్రఖ్యాత పండితుడు. అయిన డాక్టరు పాల్‌డాల్కే అక్కడ ఒక కొండపై బౌద్ధ విహారాన్ని నిర్మించాడు. దీనిని ఇంకా అభివృద్ధిలోకి తీసుకురావాలని ప్రయత్నించాడు. కాని ఈ కోర్కె నెరవేరక ముందే మరణించాడు. ఇప్పుడు అతని కుటుంబంవారే ఆ విహారాన్ని నిర్వహిస్తున్నారు. జపాన్‌నుండి చదువుకోవడానికి వచ్చిన యువక పురోహితుడు సకాకిబారాకూడ అక్కడ కనిపించాడు. రాహుల్జీ ఆ సాయంత్రం బౌద్ధుల సభలో ఉపన్యసించారు.

మరునాడు ఆయన బెర్లిన్‌కు బయలుదేరారు. ముఖ్యంగా రష్యాకువెళ్ళే ఏర్పాట్లు చేసుకోవడానికే ఇక్కడకు వచ్చారు. భారతీయ కమ్యూనిస్టులు ఇక్కడ ఎందరో ఉన్నట్లు రాహుల్జీ విన్నారు. అయితే వారిని కలుసుకోవడం తేలికైందికాదు. చివరికి లక్నో వాస్తవ్యుడు రామచంద్ర సింహ్ కనిపించాడు. రాహుల్జీ అతని ఇంటికి వెళ్ళారు. అతడు పి. హెచ్. డిగ్రీపొంది బెర్లిన్ విశ్వవిద్యాలయంలో ఐన్‌స్టీన్‌క్రింద పరిశోధన చేసేవాడు. అతని జీవితం విషాదకరంగా పరిణమించింది. హిట్లర్ అధికారం చేజిక్కించు

కొన్నా తర్వాత ఐన్‌స్టీన్ జర్మనీ నుండి పారిపోయాడు. రామచంద్రసింహ్ తన పరిశోధనకు స్వస్తి చెప్పాడు. కొన్నాళ్ళు ఒక కంపెనీ ఏజంటుగా ఉన్నాడు. తర్వాత వకాలత్ ప్రారంభించాలనుకున్నాడు. ఇప్పుడు ఇంకేదోపని చేస్తూ, జీవితం గడుపుతున్నాడు. అతని భార్య రెండేళ్ళ నుండి తనవద్దనే ఉంటున్నది. కొద్ది రాబడితోనే సంసారం ఈదుతున్నారు. రామచంద్రసింహ్ సోవియట్‌రష్యా అభిమాని కాని అతడు రష్యాకు వెళ్ళలేదు. అతడూ, రాహుల్జీ చాలాసేపు సంభాషణ జరిపారు. పిమ్మట రాహుల్జీ ప్రోనోకు తిరిగి వెళ్లారు.

ఆయన లెనిన్‌గ్రాడ్ ప్రయాణాన్ని కొంత కాలానికి వాయిదా వేసుకోవలసి వచ్చింది. ఒకనాడు మళ్ళీ రామచంద్రసింహ్ ఇంటికి వెళ్ళారు. అతని ఇంటి యజమానురాలు ఒక జర్మన్ సైన్యాధిపతి కూతురు. కొద్ది ఏళ్ళక్రితం జర్మన్ నాణెంవిలువ దారుణంగా పడిపోయింది. ఆమెతండ్రి బ్యాంకులో వేసిన డబ్బు వృధాఅయింది. అందుచేత ఆమె ఒక పెద్ద ఇంటిలో నాలుగైదు గదులు అద్దెకు తీసుకొని, వాటినే తిరిగి ఇతరులకు లాభసాటి అద్దెకు ఇస్తున్నది. అద్దెకు ఉన్నవారికి టీ, కాఫీ తయారుచేసి ఇస్తూ, జీవితం గడుపుతున్నది. ఆమెకు పెళ్ళిఅయ్యే సూచనలు లేవు.

మరునాడు రాహుల్జీ బెర్లిన్ విశ్వవిద్యాలయాన్ని, అనేక మ్యూజియమ్‌లను చూశారు. శాస్త్రీయరంగంలోను, ప్రాచ్యభాష, సంస్కృతుల అధ్యయనంలోను జర్మనుల కృషి ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. తర్వాతకొద్దిరోజులకు

ఫ్రాంక్ ఫర్టు వెళ్లారు. తన మిత్రుడు ఠాకుర్ ఇంద్రబహాదూర్ వద్ద సెలవు పుచ్చుకొన్నారు. పిమ్మట మార్సెయిల్స్‌కు వచ్చి "ఫేరీ రుసల్" అనే ఓడలో తిరిగి లంకకు బయలుదేరారు.

రాహుల్జీ సహయాత్రికులలో భారతీయులెవ్వరూ లేరు. అమెరికాలో చదువుకొనివస్తున్న చైనా దేశస్థుడు యూవన్ ఆయనకు తోడైనాడు. అతడు ఇంగ్లీషు మాట్లాడే వాడు. కాని మితభాషి. రాహుల్జీవద్ద చదువు కోవడానికి పుస్తకాలేవీ లేవు. ఓడలో కొందరు క్రైస్తవమతప్రచారకులు బైబిలు గ్రంథాలు అమ్ముతున్నారు. వారివద్ద 14 భాషలలో బైబిలు గ్రంథాలు ఉండేవి. రాహుల్జీ 50 ఫ్రాంకులు ఇచ్చి అన్ని భాషలలోను బైబిలు ఖరీదుచేశారు. ఓడ సయీాదా రేవుకువచ్చింది. యాత్రీకులసంఖ్య తగ్గిపోయింది. ఖాళీ సమయాన్ని రాహుల్జీ ఏదోవిధంగా ఉపయోగించదలచారు. అందుచేత "డీహ్‌బాబా" అనే కథ వ్రాశారు.

క్రీ.శ. 1932 జనవరి 13వ తేదీ ఉదయం "ఫేరీరుసల్" కొలంబో చేరుకొన్నది. కొన్ని నెలల తర్వాత రాహుల్జీ తిరిగి పచ్చపచ్చని పంటపొలాలను చూశారు. విద్యాలంకార విహారంవారు ఆయనను చాలా ప్రేమతో కలుసుకొన్నారు. రాహుల్జీ తన పర్యటనానుభవాలను వివరిస్తూ, వారితో చాలాసేపు గడిపారు. విహారఅధిపతి కొందరు భిక్షువులతో కలసి భారతదేశం వెళ్ళినట్లు తెలిసింది. అతడు తిరిగివచ్చిన తర్వాత, రాహుల్జీ జనవరి 30వ తేదీన భారతదేశానికి బయలుదేరారు.

---

# ఏడో అధ్యాయం

## పురాతత్వంపై శ్రద్ధ-భారతదేశ పయనం

రాహుల్జీ మద్రాసులో దిగి మ్యూజియమ్‌కు వెళ్ళారు. అమరావతి, గోలి, నాగార్జున కొండలనుండి తెచ్చిఉంచిన రాతిశిల్పాలను చాలా శ్రద్ధతో తిలకించారు. ఆయన నాగార్జునకొండకు వెళ్ళాలనుకొన్నారు. కొందరు మిత్రులు తగు ఏర్పాట్లుకూడ చేశారు. కాని వ్యవధి చాలనందున వెళ్ళలేక పోయారు.

రైలులో ఆయనకు ఒక ఆంధ్ర వృద్ధబ్రాహ్మణుడు తోడైనాడు. అతని కాలికి ఒక కడియం ఉండేది. అతడు సంస్కృత పండితుడు. భారతీయ నృత్యకళను గూర్చి అతనికి బాగా తెలుసు.స్వయంగా ఉత్తమ నర్తకుడు. అతడూ, రాహుల్జీ ఇద్దరూ నృత్యకళనుగూర్చి చాలాసేపు మాట్లాడుకొన్నారు.

రాహుల్జీ కలకత్తాలో రెండురోజులు ఉండి, సుల్తాన్‌గంజ్‌కు వెళ్ళారు. "గంగా" అనే పత్రికలో ఇదివరకే ఆయన వ్యాసాలు ఎన్నో ప్రచురింపబడ్డాయి. ఇక్కడ వుండగానే ఆయన 'భారతదేశంలో మానవ పరిణామం' అనే వ్యాసం వ్రాశారు. "గంగ" పత్రికాధిపతి చాలా సహృదయుడు. కాని అతని ఇంటిపరిస్థితి బాగాలేదు. ఇంట్లో తాను, భార్య, ఇద్దరుపిల్లలు మాత్రమే ఉండేవారు. కాని నెలకు కొన్నివేల

రూపాయలైనా ఇంటిఖర్చుకు సరిపడేట్లులేదు. ఇంట్లోనివారు పత్రికాధిపతిని ముప్పతిప్పలుపెడుతూ ఉండేవారు. ఈ పరిస్థితిలోఅతనిఇంటికి రాహుల్జీ వెళ్ళలేదు.

ఆయన కొద్దిరోజులతర్వాత పాట్నా వెళ్లారు. స్టేషన్ వద్ద కాశీప్రసాద్ జాయస్వాల్ స్వాగతమిచ్చారు. తన ఇంటికి తీసుకువెళ్ళారు. ఆనాడు ప్రారంభమైన స్నేహం ఏళ్ళ తరబడి కొనసాగించి రాహుల్జీ అతనిని తనజ్యేష్ఠసోదరుడుగా భావించేవారు. కాని ఆయన వెళ్ళినప్పుడు జాయస్వాల్ చాలా చీకాకుగా ఉన్నారు. అతని పెద్దకుమారుడు బారిస్టరీ చదవడానికివెళ్లేముందు, ఒక సామాన్యయువతిని మెడకు కట్టారు. అతడు విదేశంలో చదువుతూ ఒక ఇంగ్లీషు యువతిని ప్రేమించాడు. స్వదేశానికి వచ్చేటప్పుడు ఆమెనుకూడ తనవెంట తీసుకువచ్చాడు. కాని ఆమెకు ఆశ్రయమిస్తే, మొదటిభార్యకు తీరని అన్యాయం జరుగుతుందని తండ్రి భయం. అయితే కుమారుడు తాను ప్రేమించినయువతిని నట్టేటముంచదలచుకోలేదు. స్వతంత్ర జీవనం కోసం కొన్ని నెలలవరకు తంటాలు పడ్డాడు. తన ప్రయత్నం నెరవేరనందువల్ల, చివరికి ఆమెను విదేశానికి పంపించాడు.

జాయస్వాల్‌వంటి బుద్ధిమంతుడు, లోకజ్ఞుడు తన కుమారుని పెళ్ళి విషయంలో ఇలాంటి తప్పు ఎందుకు చేశాడని రాహుల్జీ ప్రశ్న. జాయస్వాల్ కూడ విదేశంలోఉంటూ ఒక యువతిని ప్రేమించాడు ఆమె సింహళందాకా వచ్చిందట. జాయస్వాల్ విప్లవభావాలు కలవాడు. కాని సమాజ ప్రభావంవల్ల అవి అడుగున పడిపోయాయి. పెద్దకుమారుడు

ఒకసారి... (handwritten margin note)

తన ప్రేయసిని ఇంగ్లాండుకు పంపించాడనివిని చాలా సంతోషించాడు. ఈ ఇద్దరిపరిస్థితిపట్ల రాహుల్జీ తన సానుభూతి చూపడంతప్ప, మరేమీ చేయజాలక పోయారు.

రాహుల్జీ కమ్యూనిస్టుభావాలను పెంపొందించుకోవడంలో, జాయస్వాల్ వంటి వ్యక్తుల జీవిత సంఘర్షణలు ఎక్కువగా తోడ్పడ్డాయి. జాయస్వాల్‌కు భారతదేశచరిత్ర కొట్టినపిండి. అతడు బారిస్టరుగాకూడ పేరుపొందాడు. ఈ పనిచేస్తూ, విరామ సమయంలో చరిత్రపరిశోధన సాగించాడు. ఎన్నెన్నో కొత్తవిషయాలు వెలికితీశాడు. కాని సంసారం ఎక్కువైంది. చరిత్రపరిశోధన వదలిపెట్టాడు. ఎవరో ధనికునికి ఇన్‌కమ్‌టాక్సు తగ్గించడానికి వకాలత్ పుచ్చుకొన్నాడు. ఇందుకు అహోరాత్రులూ కృషి చేయవలసి వచ్చింది.

జాయస్వాల్ ఇంట రాహుల్జీ నాలుగురోజులు ఉన్నారు. గిల్‌గిట్‌వద్ద త్రవ్వకాలలో ప్రాచీనబౌద్ధ గ్రంథాలు బయట పడ్డాయని తాను చాలాకాలం క్రిందట విన్నారు. రాహుల్జీ అక్కడకు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. జాయస్వాల్ కొంతడబ్బు, ఒక కెమెరాకూడ ఇచ్చి పంపారు.

## రెండోసారి లడక్ యాత్ర

బౌద్ధమత వ్యాప్తంకోసం నల్లభైఏళ్ళు అవిరామకృషి సలిపిన ధర్మపాలుడు సారనాథ్‌లో మరణించాడని రాహుల్జీకి టెలిగ్రామం వచ్చింది. రాహుల్జీ మొదట అక్కడకు వెళ్ళి, తర్వాత లాహోర్ మీదుగా శ్రీనగర్‌కు బయలుదేరారు.

శ్రీనగర్ పోస్టాఫీసర్ ఇంట్లో మకాం పెట్టారు. అతడు విదేశంలో చదివి డాక్టరుపట్టా పుచ్చుకున్నారు. స్వదేశం వచ్చినతర్వాత సంస్కృతం చదువుకోవాలని బుద్ధిపుట్టింది. వ్యాకరణసూత్రాలు వల్లించడం మొదలుపెట్టాడు. అతనికి రాహుల్జీ ప్రయోగాత్మక పద్ధతిలో వ్యాకరణం బోధించారు.

ఈ పర్యాయం గిల్‌గిట్ వెళ్ళడం రాహుల్జీ ముఖ్యోద్దేశం. ఆయనమిత్రుడు బారిస్టర్ శ్యామలబహదూర్ కాశ్మీర్ విద్యామంత్రి చౌదరి వజాహత్ హుసేన్‌పేర ఒక ఉత్తరం వ్రాసి ఇచ్చాడు. గిల్‌గిట్‌లో లభ్యమైన హస్తలిఖిత గ్రంథాలలో ఒకభాగం ఇక్కడ ఉందనికూడ రాహుల్జీకి తెలుసు. అందుచేత చౌదరిని కలుసుకోవడానికై అతని ఆఫీసుకు వెళ్లారు. అతడు చాలా ప్రేమతో మాట్లాడాడు. తనకు చేతనైనంత సహాయం చేస్తానని మాట ఇచ్చాడు. రాహుల్జీకి కావలసినవన్నీ చూపెట్టమని ఒక అధికారిని ఆదేశించాడు. కాని అతడు 'నోట్సు' తీసుకోనకుండా ఉండేట్లయితే, అన్నీ చూపిస్తానని షరతుపెట్టాడు. ప్రభుత్వమే హస్తలిఖిత గ్రంథాలన్నీ ముద్రించ దలచిందని, అందుచేత అందులో ఎవరూ వ్రేలు పెట్టకూడదని చెప్పాడు. ఎంతో విలువైన ఆ గ్రంథాలు ఏదో ఒక వ్యాపారి జమాఖర్చుల పుస్తకాలవలె మూలవేయబడి ఉన్నాయి. పన్నెండు పదమూడు వందల ఏళ్ళక్రితం భూర్జర పత్రాలపై వ్రాయబడిన గ్రంథాలు అవి. కొన్నిపత్రాలు ముక్కలై నేలరాలిపోతున్నాయి. ఒకఉన్నతాధికారి వాటిని తనపేరుతో ప్రకటించి, తేలికగా కీర్తిని ఆర్జింపచూస్తున్నట్లు తెలిసింది. మ్యూజియం దుస్థితిని చూచి

రాహుల్జీకి చాలా దుఃఖం కలిగింది. ఇది నిష్ప్రయోజనంగా ఉంది. కాబట్టి దీనిని వేలంపాటకు పెట్టమని మహారాజు ఒక సారి చెప్పాడట. ఇందులో కొంత భాగం చౌకీదారులకు అప్పగించబడింది. వారు కొంతడబ్బు తీసుకొని, చరిత్ర, కళకుసంబంధించిన అమూల్యసామగ్రిని అమ్మివేసేవారు.

గిల్‌గిట్, లడక్‌లకు వెళ్ళాలంటే బ్రిటిష్ జాయింట్ కమిషనర్‌వద్ద అనుమతిపత్రం పొందవలసి ఉండేది. రాహుల్జీ గిల్‌గిట్‌కు అనుమతిపత్రం ఇమ్మని అతనినికోరగా నిరాకరించాడు. గిల్‌గిట్‌కు యూరోపియన్‌లు, ఫ్రెంచివారు, హంగేరియన్‌లు వెళ్ళడానికి అనుమతించేవారు. కాని ఒక భారతీయునికి అనుమతి ఇవ్వకపోవడం రాహుల్జీకి చాలా బాధ కలిగించింది. ఇక గిల్‌గిట్‌యాత్ర అసాధ్యమని భావించి, లడక్‌కు వెళ్ళ నిశ్చయించారు. జర్మనీనుండి వచ్చిన బౌద్ధ భిక్షువు గోవింద్‌కూడ ఆయెనవెంట వస్తానన్నాడు. రాహుల్జీ ప్యాస్‌పోర్టుచూచిన మీదట బ్రిటిష్ జాయింట్ కమిషనర్ లడక్ యాత్రకు అనుమతి ఇచ్చాడు.

రాహుల్జీ, గోవింద్ ఇద్దరూ గుర్రాలను అద్దెకు తీసుకొని, శ్రీనగర్‌నుండి బయలుదేరారు. గోవింద్‌కు ఫోటోగ్రఫీ కూడ తెలుసు. పైగా గొప్ప చిత్రాకారుడు. యూరపు, ఆఫ్రికా, ఆసియాకు చెందిన అనేక ప్రాంతాలలో పర్యటించాడు. రాహుల్జీవలె కమ్యూనిస్టు సానుభూతిపరుడు. మొదటి ప్రపంచయుద్ధంలో సైనికుడుగా పనిచేశాడు. నేటి సామాజిక వ్యవస్థలో మార్పును కోరేవాడు.

ఇద్దరూ సింధునదీతీరానఉన్న ఒక గ్రామంలో

ప్రవేశించారు. గ్రామంలో దాదాపు ముప్ఫయి ఇళ్ళు ఉండేవి. ప్రజలు కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నారు. వారికి పంటలు అంతంత మాత్రనే పండేవి. అందుచేత గుర్రాలపై సరకులు ఎత్తించుకొనిపోవడం ప్రధాన వృత్తిగా పెట్టుకున్నారు. ఈ దారిద్ర్యానికితోడు. 'మీరు ఇంతమంది పిల్లలను ఎందుకు పుట్టించారు?' అని గోవింద్ ఒక వ్యక్తిని అడిగాడు. పుట్టించిన దేవుడు పూరి అయినా మేపకపోడనే ఆశతో ఉన్నామని అతడు జవాబిచ్చాడు. ఈ గ్రామంలో బహుభర్తల సంప్రదాయం అమలులోవుంది. కాని టిబెట్ లోవలె అన్నదమ్ములందరికీ ఒకేస్త్రీ భార్యగా ఉండటం లేదు.

రాహుల్జీ, గోవింద్ సింధునదీతీరంలో తమ యాత్ర కొనసాగించారు. కొంతదూరం వెళ్ళినతర్వాత, ఒకచోట విరిగిపోయిన విగ్రహాలు, శిలాఫలకాలు కనిపించాయి. శిలాఫలకాలపై ఏడు ఎనిమిది శతాబ్దాలనాటి లిపి చెక్కబడి వుంది. చదవడానికి వ్యవధిలేకపోయింది. అందుచేత ఫోటోలు తీసుకొన్నారు. ముల్బేక్ గ్రామంలో రెండు రోజులు గడిపారు. అక్కడ రంగు రంగుల పర్వతాలు కనిపించాయి. గోవింద్ వాటిని చిత్రించ మొదలుపెట్టాడు. రాహుల్జీ ప్రజల సాంఘిక, ఆర్థిక పరిస్థితులను పరిశీలించ మొదలు పెట్టారు. ఇక్కడ ఒక పర్వతంలో అందమైన మైత్రేయవిగ్రహం బయటపడింది. ఒకప్పుడు ఇక్కడ గొప్ప శిల్పకళావేత్తలు ఉండేవారు. ముల్బేక్-లామాయురుల మధ్య ముస్లిం-బౌద్ధ మిశ్రిత బస్తీలు కానవచ్చాయి.

షర్‌గోల్ అనే గ్రామపెద్ద మహమ్మదీయుడు. పెళ్ళి చేసుకోవడం, ఉంపుగత్తెను తెచ్చుకోవడంవంటి కార్యాలలో అతడు ఇతరులకు తోడ్పడేవాడు. అయితే వారు మతాంతరం పొందిన తర్వాతనే ఆపని చేసేవాడు. ఇది ఒక పుణ్య కార్యంగా లెక్కించేవాడు. కాని అతని తల్లికి ఇది గిట్టేది కాదు. తమగ్రామానికి ఇద్దరు బౌద్ధభిక్షువులు వచ్చారని ఆమెకు తెలిసింది. టిబెట్ సంప్రదాయం ప్రకారం వారికి సాష్టాంగప్రణామం చేసింది. వెక్కి వెక్కి ఏడుస్తూ, "నా కుమారుడు పెద్ద అపరాధం చేస్తున్నాడు. నన్ను పూజలు చేసుకోనివ్వడంలేదు. లామాను సత్కరించనివ్వడం లేదు. తాను ఎటూ నరకంలోకిపోతాడు. కాని నన్నుకూడ అందులోకి తోయదలచుకొన్నాడు," అని చెప్పింది. గ్రామానికి వెలుపల కొద్దిదూరంలో ఒక బౌద్ధ విహారం ఉంది. ఒక సహజమైన గుహలో అది నిర్మింపబడింది. వెలుపలి గోడలు పర్వతశిలకు పూర్తిగా అంటుకు పోయినట్లు కనిపించాయి.

రాహుల్జీ ఈ ప్రాంతంలోని లామాలతో సంభాషించ దలచారు. కాని వారంతా నిరక్షరకుభిక్షులు. అన్ని చోట్ల బౌద్ధ విహారంప్రక్కనే చేలుఉండేవి. తినడం, మద్యపానం సేవించడం – ఇంతటితోనే బౌద్ధులు తృప్తిపడేవారు. వారిలో నైతికస్థాయి తగ్గిపోయినట్లు కనిపించింది. ఖల్–బే అనేగ్రామంలో ఒకబౌద్ధ అధ్యాపకునిఆహ్వానంపై రాహుల్జీ, గోవింద్ అతని ఇంటికి వెళ్లారు. అతనికి ఇంట్లో ఏవిధమైన కొరతలులేవు. తల్లిదండ్రులకు అతనిమీద అసంతృప్తి ఏర్పడింది. ఎందుకంటె అతడు మద్యపానం చేసేవాడు.

భార్య అంటే విముఖభావం చూపేవాడు. ఆమె చాలా అంద గత్తె. అయినప్పటికీ అతనికి విరక్తి ఎందుకు కలిగిందో ఎవ రికీ బోధపడలేదు.

రాహుల్జీ, గోవింద్ ఒకనాడు అల్చీ బౌద్ధ మందిరం చూడటానికి వెళ్ళారు. బయటనుండిచూస్తే దీని గొప్పదనం ఏమీ తెలియదు. పదకొండో శతాబ్దంలో ఉత్తర భారత దేశంలో చిత్రకళ చాలా ఉన్నతస్థాయిలో ఉందనడానికి ఈ మందిరమే నిదర్శనం. పూజారివచ్చి వీరిని లోపలికి తీసుకు వెళ్ళాడు. కొంత చీకటిగాఉంది. కాని మందిరంలోని చిత్రి కళా సంపద కన్నులకు మిరుమిట్లుగొల్పింది. సూక్ష్మతూలికల ద్వారా మాత్రాయుక్త వర్ణాలతోగీసిన ఈ చిత్రాలు, తొమ్మిదివందల ఏళ్ళతర్వాత నేటికీ సజీవంగా ఉన్నాయి. చిత్రాలు అన్నీ అందంగావున్నాయి. అవలోకితేశ్వర విగ్ర హంపై కనిపించే చిన్నచిన్న చిత్రాలు వేనోళ్ళ కొనియాడ దగినవి. గోవింద్ స్వయంగా కళాకారుడు. అతడు ఈ కళా భాండారాన్ని చూచి, కొంతసేపు స్తబ్ధుడైపోయాడు. అజంతాలోని అసంపూర్ణ చిత్రాలు ప్రజలకు పూర్తితృప్తి కలిగించలేవు. కాని ఇక్కడ పూర్ణ చిత్రాలు ఉన్నాయి. వీటి నమూనాలుకొన్ని హస్తలిఖిత గ్రంథాలలో మాత్రమే కనిపిస్తాయి. మందిరంలో వెలుగు తగినంతగాలేదు. అందు చేత ఫోటోలుతీసినా ఉపయోగం ఉండదని మొదట్లో అను కొన్నారు. అయినప్పటికీ అలాగే కొన్ని ఫోటోలు తీసు కొనక తప్పలేదు.

ఇంత అపురూపమైన మందిరానికి ఎలాంటి రక్షణ

లేదు. వెలుపలి ద్వారంపైఉన్న స్తంభాలు వంకర తిరిగాయి. మందపుగోడ పగుళ్ళు ఇచ్చింది. ఇది అనతికాలంలోనే పూర్తిగా శిథిలమైపోయేట్లు ఉంది. టిబెట్ మహాపండితుడు లో-చ-వా రిన్-ఛేన్-జంగ్-పో (మరణం క్రీ.శ. 1052) వందలాది సంస్కృత గ్రంథాలను అనువదించి టిబెట్ భాషలో భద్రపరచినట్లే, ఆకాలంలో భారతీయ చిత్రకళకు చెందిన అందమైన నమూనాలను ఈ మందిరరూపంలో భద్రపరచాడు. కాని అది ఈ శతాబ్దంలో మనకళ్ళఎదుటనే రూపుమాసిపోయేట్లు ఉంది.

కొద్దిరోజులతర్వాత రాహుల్జీ, గోవింద్ హెమిస్‌కు వెళ్ళారు. హెమిస్ లామా అప్పట్లో అక్కడలేదు. అతడు టిబెట్‌కు వెళ్ళినట్లు తెలిసింది. ఇద్దరూ ఆ రాత్రి అక్కడే గడిపారు. వారు వెళ్ళినరోజు హెమిస్ వార్షికోత్సవం జరిగింది. ఈ సందర్భంలో 'భూతనృత్యం' ప్రదర్శింపబడింది. నిజంగా అది 'భూతనృత్యం' కాదు. మతసంబంధమైన నాటకం. బుద్ధుడు, టిబెట్ పురాతన చక్రవర్తులు సాంగ్‌చన్-గైంబో, లంగ్-దర్‌మా' ఇతర దుష్టదేవతల అభినయం అది. దుష్టదేవతల భయంకర స్వరూపంచూచి, యూరోపియన్‌లు దీనికి 'భూతనృత్యం' (డెవిల్ డాన్స్) అని పేరు పెట్టారు. గోవింద్ ఈనృత్యం ఫోటోలు కొన్ని తీశారు.

గత యాత్ర సందర్భంలో, ఇక్కడ ఒకచోట 84 మంది సిద్ధుల బొమ్మలు ఒక రాతిపై చెక్కిఉండటం

రాహుల్జీ చూశారు. ఇప్పుడు గోవింద్‌చేత వీటినికాపీచేయించారు.

రాహుల్జీ టిబెట్ ప్రముఖ సాహిత్యవేత్త పాదరీ జోసెఫ్ గర్గెన్‌ను కలుసుకున్నారు. గర్గెన్ అచ్చంగా టిబెట్ సాహిత్యం, భాష, చరిత్రలను కూలంకషంగా అధ్యయనం చేశాడు. తాను టిబెట్ జాతీయుడనని అతడు సగర్వంగా చెప్పుకునేవాడు.

తాను చేయవలసిన పనులు ఎన్నో ఉన్నందువల్ల, రాహుల్జీ ఇక లడక్‌లో పర్యటించదలచుకోలేదు. ఆయన గత సంవత్సరం "దమ్మపదాన్ని" సంస్కృతంలోకి అనువదించారు. ఈ పర్యాయం "మఝ్ఝిమ నికాయ" మంతటిని అనువదించ దలచారు. టిబెట్‌లో బౌద్ధమతాన్ని గూర్చి హిందీలో ఒక ప్రామాణిక చారిత్రిక గ్రంథం వ్రాయదల పెట్టారు. అలాగే లడక్ బౌద్ధులకు, ముఖ్యంగా ప్రాథమిక పాఠశాలలకు, ఉపకరించేట్లు పాఠ్యగ్రంథాలు, వ్యాకరణం వ్రాయ సంకల్పించారు.

గోవింద్ శాంతినికేతనంలో ఉపాధ్యాయుడుగా ఉండేవాడు. సెలవు రోజులైనందువల్ల అతడు రాహుల్జీవెంట ఇక్కడకు వచ్చాడు. ఇప్పుడు శాంతి నికేతనంలో తిరిగి పాఠాలు ప్రారంభమవుతాయి. అందుచేత అక్కడకు వెళ్ళ దలచాడు. అతడు జర్మనీని వదలిపెట్టిన రెండు నెలలకే హిట్లర్ అధికారంలోకి వచ్చాడు. గోవింద్‌కు జర్మనీలో ఆ స్తిపాస్తులు ఉండేవి. వాటిద్వారా అతనికి కొంత ఆదాయం వచ్చేది. ఇప్పుడు నాజీపరిపాలన మూలంగా జర్మనీ నుండి

డబ్బు రావడం ఆగిపోయింది. గోవింద్, అతనితల్లి విషమ పరిస్థితిని ఎదుర్కోవలసివచ్చింది. యుద్ధం ప్రారంభంకావడానికి ముందే గోవింద్ జర్మన్ పౌరసత్వాన్ని వదలుకొని, భారతీయపౌరుడైనాడు.

గోవింద్ వెళ్ళిపోయిన తర్వాత, రాహుల్జీ "లే"లో దాదాపు రెండున్నర నెలలు ఉన్నారు. "మజ్ఝిమనికాయాన్ని" హిందీలోకి అనువదించారు. "టిబెట్‌లో బౌద్ధమతం", టిబెట్ పాఠ్యగ్రంథాల్లో, ఆయన యాత్రనుగూర్చి ఎన్నోవ్యాసాలు వ్రాశారు. క్రీ. శ. 1933 సెప్టెంబరు 17 వ తేదీన ఇక్కడనుండి గుర్రంపై భారతదేశానికి బయలుదేరారు. "మీరు" గ్రామంలో రామదయాళ్ అనునతడు కనిపించాడు. అతడు తొలుత బుష్‌హర్ వాస్తవ్యుడు. కాని ఇల్లటంవచ్చి ఇక్కడే స్థిరపడిపోయాడు. తనకు యంత్రం వ్రాసి ఇమ్మని రాహుల్జీని కోరాడు. అనవసరమని ఆయన ఎంత చెప్పినా వినలేదు. రాహుల్జీవద్ద రెండు యంత్రాలు వ్రాయించుకొన్నాడు. అందులో ఒకటి సంతాన ప్రాప్తికి ఉద్దేశించింది. రెండోది భార్య స్వభావాన్ని మార్చు చేయడానికి ఉద్దేశించింది. ఆమె కఠినస్వభావాన్ని మృదువుగా మార్చాలని రామదయాళ్ కోరిక. రాహుల్జీ బ్రాహ్మీ లిపిలో "మంత్రాలు వట్టివి" అని వ్రాశారు.

రాహుల్జీ ఎన్నోపర్వతాలు, మైదానాలు దాటి లాహుల్ ప్రాంతానికి వచ్చారు. అది వట్టి రాతిప్రదేశం అక్కడ మంచు విపరీతంగా పడుతూఉండేది. ప్రయాణీకులు కొందరు కాలినడకను, కొందరు గుర్రాలపైన వసు

సగా వెళ్ళుతున్నారు. అందులో రాహుల్జీ ఒకరు. కొంత దూరం పోయిన తర్వాత ప్రయాణీకులు బెదరి, పరుగెత్తడం మొదలుపెట్టారు. ఇది చాలా ప్రమాదకరమైన స్థలం, ప్రక్కనున్న కొండనుండి, తెరపిలేకుండా చిన్న, పెద్దరాళ్లు వచ్చి పడుతున్నాయి. జంతువులు, మనుష్యులు గాయపడుతున్నారు. రాహుల్జీ ఎదుటకూడ రెండురాళ్ళు వచ్చి పడ్డాయి. అంతకు క్రితంకూడ కొన్నిరాళ్లు పడిఉన్నాయి. కొండలో మట్టిఅనేది మచ్చుకైనా లేకపోవడం ఇందుకు కారణం. మంచుకరగినప్పుడల్లా రాళ్ళు క్రిందికి జారి, ఒకదానితో నొకటి ఢీకొంటూ వస్తాయి. తాను ఫాహియాన్, యువాన్ - చ్వాంగ్ కాలంనాటి యాత్రికుడనై ఉంటే, "ఇక్కడ ఒక పెద్దరాక్షసుడు ఉన్నాడని, అతడు మనుష్యులపై రాళ్ళు విసురుతాడని వ్రాసి ఉందును" అని రాహుల్జీ అన్నారు.

లాహుల్ ప్రాంత జనసంఖ్య పదిపన్నెండు వేలకంటె మించదు. కాని ఆరుభాషలు వాడుకలో ఉండేవి. ఇక్కడ స్త్రీలు లడక్ స్త్రీలవలె పాముపడగగల నగ ధరిస్తారు. చెవులపై ఏనుగచెవులు (ఉన్నివి) పెట్టుకొంటారు. ముక్కుకు లవంగం పోలిన ఒక నగ వ్రేలాడవేసుకొంటారు. చంద్రనదీ తీరాన గూండలాలో కొయ్యసామాను ఉపయోగించి కట్టిన ఆరంతస్థులభవనం కనిపించింది. దూరంనుండి చూస్తే, అది ఒక అల్మారిని పోలిఉంది. అది ధనికుల భవనం. రాహుల్జీ ఆ భవనంలో ఒకరోజు గడిపారు. భవనం మూడో అంతస్థులో దేవాలయం ఉంది. టిబెట్ భాషలో "కర్మశతకం"

అనే పురాతన హస్తలిఖిత గ్రంథం కనిపించింది. చలువ రాతితో తయారుచేసిన ఒక జైనవిగ్రహంకూడ అందులో ఉండేది. బుద్ధునిపేరిట దానికి పూజలు చేసేవారు.

## లాహోరు పయనం

రాహుల్జీ కులూలో దసరా వేడుకలు చూశారు. తర్వాత యోగేంద్రనగర్, పఠాన్‌కోట, అమృతసర్‌ల మీదుగా అక్టోబరు నెల మొదటివారంలో లాహోరుకు వచ్చారు. పంజాబ్ విశ్వవిద్యాలయంలో టిబెట్ భాషను కూడ పరీక్షావిషయంగా స్వీకరించేట్లు చేయాలని ఆయన ఉద్దేశం. అందుచేత లాహోరులో విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ డాక్టరు వర్నర్‌ను కలుసుకొన్నారు. కాశ్మీరు ప్రభుత్వవిద్యాశాఖ సిఫార్సుచేస్తే, ఇందుకు తాము సుముఖులమేనని అతడు చెప్పాడు. కాని ఈ విషయం ఎటూ తేలలేదు.

తాను అనువదించిన "మజ్ఝిమనికాయాన్ని" అచ్చొత్తించుకోవాలని రాహుల్జీ కాశీకి వచ్చారు. కాని వీలుపడ లేదు. అందుచేత పాట్నాకు వెళ్ళారు. జాయస్వాల్‌ను కలుసుకొన్నారు. ఆయన "మంజుశ్రీ మూలకల్ప" చదివి నప్పుడు కొన్ని అధ్యాయాలు చారిత్రక ప్రాధాన్యత గలవిగా కనిపించాయి. ఈ విషయమై జాయస్వాల్‌తో చర్చలు జరిపారు. అతడు దీనినిగూర్చి ఒక పెద్దవ్యాసం వ్రాసినట్లు తెలిసింది. హస్తలిఖిత ప్రతిని రాహుల్జీ చదివారు. జాయస్వాల్ ప్రతిభ ఆయనను ముగ్ధుణ్ణిచేసింది.

రాహుల్జీని తిరిగి రాజకీయాలలోకి ఆకర్షించాలని ఛప్రాజిల్లా కార్యకర్తలు ఎంతో ప్రయత్నించారు. కాని ఆయనకు ఉత్సాహం కలుగలేదు. భాగల్పూర్‌లో బీహారు రాష్ట్ర హిందీ-సాహిత్య సమ్మేళన్‌కు అధ్యక్షత వహించడానికై జాయస్వాల్ బయలుదేరారు. అతనివెంట రాహుల్జీ కూడ వెళ్ళారు. జాయస్వాల్ అధ్యక్షోపన్యాసం పండితుల నందరినీ ఆకర్షించింది. మరునాడు రాహుల్జీ ప్రభుత్వకార్యాలయాలలో రోమన్ లిపి వాడుక చేసే విషయమై మాట్లాడదలచారు. సభికులు దీనిని వ్యతిరేకించారు. సమ్మేళన్‌సభ్యుడు కాదు కాబట్టి రాహుల్జీ మాట్లాడటానికి వీలులేదన్నారు. కాని జాయస్వాల్ చెప్పినమీదట రాహుల్జీ ఉపన్యాసం విన్నారు. అప్పట్లో ప్రభుత్వకార్యాలయాలలో ఉర్దూలిపిని ప్రవేశపెట్టదలచారు. ఆ లిపికంటె రోమన్ లిపిని వాడుక చేయడం మంచిదని రాహుల్జీ వాదించారు.

ఆయన నవంబరు ఒకటో తేదీన సారనాథ్ వెళ్ళారు. "మజ్ఝిమనికాయాన్ని" ప్రచురించడానికి మహాబోధి సభ వారు అంగీకరించారు. ప్రచురణకు అడ్వాన్సుగా కొంత డబ్బు ఇచ్చారు. రాహుల్జీ మరునాడే ప్రయాగకు వెళ్ళి, పుస్తకాన్ని ఒక ప్రెస్‌కు అప్పగించారు. కొద్దిరోజులతర్వాత కాశీకి వెళ్లారు. అక్కడజరిగిని ఒకసభలో ఉపన్యసించారు. అక్కడే ఒకవ్యక్తి రాహుల్జీవద్దకు వచ్చి నిలుచున్నాడు. "మీరు ఎవరూ?" అని ఆయన ప్రశ్నించారు. "నాది కాశీ" అని అతడు జవాబిచ్చాడు. అతడు తన ద్వితీయ సోదరుడు రామధారీ అని తర్వాత తెలిసింది. రామధారీని చూచి పాతి

కేళ్ళు అయినప్పటికీ, అతడు తన మనస్సులో ఏమను కొంటున్నాడో అని రాహుల్జీ చాలా చింతించారు. మరునాడు సారనాథ్‌లో బౌద్ధులసభ జరిగింది. రాహుల్జీ అధ్యక్షత వహించారు. జపాన్ ప్రొఫెసర్ న్యోదో, పండిత జవహర్ లాల్ నెహ్రూ తదితరులు ఉపన్యసించారు. బుద్ధునికి తమ శ్రద్ధాంజలి సమర్పించారు.

ప్రయాగలో "మజ్ఝిమని కాయం" పూర్తిగా అచ్చయింది రాహుల్జీ గ్రంథం కాపీలు కొన్ని తీసుకొని, బరోడా ప్రాచ్యభాషా సమ్మేళనలో పాల్గొనడానికై బయలు దేరారు. ఆయనవెంట జయచంద్ర విద్యాలంకార్ కూడా ఉన్నారు. రైలుపెట్టెలో జాయస్వాల్ తదితర పండితులు కనిపించారు. అందరూ అజంతా-ఎల్లోరాగుహాలు చూచి వద్దామని బయలుదేరారు.

## అజంతా - ఎల్లోరా

అజంతా గుహాలను మూడున్నరగంటలసేపు చూశారు. గుహాలలో ఎక్కువభాగం వాకాటకకాలంనాటివి- వజ్రయానం జాడ కనిపించదు. మహాయాన బోధిసత్వాల బొమ్మలుకూడ కొన్నిచోట్ల కనిపించాయి. ఇది ముఖ్యంగా హీనయాన విహారం, ఒకచోట భవచక్రం చెక్కబడిఉంది కాని అది చెరిగిపోయింది. అందుచేత దీనికీ, టిబెట్ భవ చక్రానికి భేదమేమిటో తెలుసుకోవడం సాధ్యమైందికాదు. చైత్య (స్తూప) గృహాలు చాలా పురాతనమైనవి. ఒక

చైత్యాన్ని తొలిచి బుద్ధునిబొమ్మ చెక్కారు. అది తరువాత కాలంలో జరిగిన పని.

రాహుల్జీ ప్రభృతులు ఆ మరునాడు ఎల్లోరాకు బయలుదేరారు. దారిలో ఉన్న దేవగిరి (దౌలతాబాద్)కి వెళ్లారు. ఇంత అజేయమైన దుర్గాన్ని కొద్దిమంది మహమ్మదీయులు ఎలాపట్టుకోగలిగారో తాము ఊహించలేక పోయారు. ఆ కాలంలో దేవగిరిమంత్రి హేమాద్రి. అతని కొలువులో భాస్కరాచార్యునివంటి జ్యోతిష్కుడు ఉండే వాడు. రాహుల్జీ ప్రభృతులు దేవగిరి నాలుగు అంచులూ కలయ దిరిగారు. తర్వాత ఖుల్దాబాద్‌కు వెళ్ళి ఔరంగజేబు సమాధిని చూశారు. మధ్యాహ్నం "బేరూల్"కు వెళ్లారు. దీనినే ఇంగ్లీషువాళ్ళు "ఎల్లోరా" చేశారు. పల్లవుల మహాబలిపురగుహప్రాసాదాలను ఆదర్శంగా తీసుకొని, రాష్ట్రకూటులు "కైలాసాన్ని నిర్మించారు. పల్లవుల శిల్పకళను ఇక్కడేకాకుండా సముద్రం అవతల "బరోబుదూర్" (జావా) నిర్మాతలుకూడ అనుసరించారు. రాహుల్ ప్రభృతులు బౌద్ధ, జైన, బ్రాహ్మణగుహాలన్నిటినీ చూశారు. వజ్రయానంజాడ ఇక్కడకూడ కనిపించలేదు. అయితే మహాయానానికి చెందిన అమోఘపాశ, అవలోకితేశ్వర, ప్రజ్ఞాపారిమిత, తారల బొమ్మలు ఇక్కడ చెక్కబడిఉన్నాయి. ఈ గుహాలనిర్మాణం వాకాటకుల కంటె పూర్వమే ప్రారంభమైంది.

ఎల్లోరానుండి వీరు తమయాత్ర కొనసాగించారు. కార్లా, నాసికకు వెళ్ళి, అక్కడఉన్న గుహాలను చూశారు.

నాసికలోని పాండవగుహలు శకశాతవాహనకాలంనాటివని రాహుల్జీ అభిప్రాయం. తర్వాత వీరు కార్లా, భాజా గుహలను సందర్శించారు. చైత్యగృహంలో స్తంభాల వరసలు ఉన్నాయి. వాటిపై ఏనుగులు, ఏనుగలపై స్త్రీ, పురుషుల బొమ్మలు అందంగా చెక్కబడిఉన్నాయి. బ్రాహ్మీలిపిలో ఉన్న అనేక శిలా ఫలకాలను రాహుల్జీ చదివారు. ఆయన క్రీస్తుపూర్వం రెండోశతాబ్దంనాటి వేష - భాషలను శ్రద్ధతో చూస్తూ ఉండిపోయారు.బయట వరండాలో జాయస్వాల్ మరొకపండితునితో ఏదో వ్రాయిస్తున్నాడు. కొంత సేపటికి రాహుల్జీ బయటికి రాగానే, "ఇదిగో చూడండి. ఈ కాలంలో బుద్ధునిబొమ్మ చెక్కేవారు" అని జాయస్వాల్ అన్నాడు. "ఇది అసంభవము"ని రాహుల్జీ చెప్పారు. అయితే వాస్తవంగా అక్కడ బుద్ధునిబొమ్మ చెక్కబడివుంది. రాహుల్జీ శ్రద్ధతో పరిశీలించారు. గోడను కొంత అడుగు భాగంనుండే త్రవ్వి, బుద్ధునిబొమ్మ చెక్కారు. దాని పై భాగం ఇప్పటికి అక్కడఉంది. బుద్ధునిబొమ్మ చెక్కిన చోట, పూర్వం ఒకవృక్షం ఉండేది. రాహుల్జీ ఈ విషయం జాయస్వాల్కు వివరించారు. "మీరు సరిగా చెప్పారు. లేకపోతే నేను పెద్ద పొరబాటుచేసి ఉండేవాణ్ణి" అని జాయస్వాల్ అన్నాడు. మరొకపండితునిచేత నోటుబుక్కులో వ్రాయించిన పంక్తులను వెంటనే కొట్టి వేయించారు. భాజావద్దఉన్న గుహలు కార్లాగుహలకంటె పురాతనమైనవి. అక్కడ చైత్యగుహ వరండాలో ఏడు చైత్యాలు

నిర్మింపబడి ఉన్నాయి. ఇక్కడ శాతవాహన రాజైన కౌశికీ పుత్రుని శిలాశాసనం ఉంది.

రాహుల్జీ ప్రభృతులు మరునాడు బొంబాయికి వెళ్లారు. ఎలిఫెంటా గుహలను, సెయింట్ జేవియర్ కాలేజిలో పురాతత్వ సంగ్రహాలయాన్ని చూచారు. తర్వాత ప్రాచ్య భాషాసమ్మేళన్‌లో పాల్గొనడానికై తిరిగి బరోడాకు వచ్చారు.

మహాబోధిసభ తరఫున గ్రంథప్రచురణకై, బరోడా మహారాజును కలుసుకొని ఆర్థికసహాయం కోరవలసిందని రాహుల్జీకి "మజ్ఝిమనికాయం" ప్రచురణకర్త సూచించాడు. రాజుల, మహారాజుల నీడసోకడమే రాహుల్జీకి గిట్టేది కాదు. అందుచేత బరోడామహారాజును కలుసుకొనే ఉద్దేశాన్ని విరమించుకొన్నారు. అయితే మహారాజే రాహుల్జీకి కబురుచేశాడు. అందువల్ల తిరస్కరించలేకపోయారు. అతడు ఉద్యానవనంలో గొడుగుపట్టిన కుర్చీపై కూర్చుని ఉన్నాడు. ఒక్కొక్కరే అతని ఎదుటికి వెళ్ళుతున్నారు. రాహుల్జీకూడ వెళ్ళారు. మహాబోధిసభ కోర్కెనువివరించారు. మహారాజుసానుభూతి ప్రకటించాడు. ఈ విషయం విద్యాధికారితో చెబుతానన్నాడు.

## ప్రాచ్య భాష సమ్మేళన్

ఆదేరోజు ప్రాచ్యభాషాసమ్మేళన్ ప్రారంభమైంది. దేశమంతటినుండి పెద్దపెద్ద చరిత్రకారులు, పురాతత్వవేత్తలు, పురాలిపిశాస్త్రజ్ఞులు, భాషాతత్వవేత్తలువచ్చారు. బరోడామహారాజు అరగంట ఆలస్యంగా వచ్చి, వారికి

దర్శన మిచ్చాడు. తానుకూడ లిఖితపూర్వకమైన వ్యాసం ఒకటి చదివి, ఆఖరులో ఏదో మాట్లాడాడు. జాయస్వాల్ అధ్యక్షపీఠంనుండి చక్కని ఉపన్యాసం ఇచ్చాడు. తర్వాత వివిధభాషల సమ్మేళనలు జరిగాయి. హిందీ సమ్మేళనలో రాహుల్జీ అధ్యక్షోపన్యాసం ఇచ్చారు. ఇది ప్రాచ్యభాషా సమ్మేళనమైనా, ఇంగ్లీషుదే పైచేయి అయింది.

అప్పట్లో కర్నల్ వేయర్ బరోడా రెసిడెంట్‌గా ఉండేవాడు. రాహుల్జీ అతనిని కలుసుకొన్నారు. వేయర్ టిబెట్ చిత్రాలను, విగ్రహాలను, ఇతరవస్తువులను రాహుల్జీకి చూపించాడు. అత్యంతసుందరమైన అవలోకితేశ్వర విగ్రహం ఒకటి అతనివద్ద ఉండేది. వేయర్ దంపతులిద్దరూ సజ్జనులు, సంస్కారంగలవారు, కళోపాసకులు. వారికుమార్తె తాను గీసిన చిత్రాలెన్నిటినో రాహుల్జీకి చూపించింది.

తర్వాత రాహుల్జీ బృందం అహమదాబాద్, ఆబూ, అజ్మీర్, చిత్తూరు, ఉదయపురం, సాంచీ, భిల్సాలను సందర్శించడానికి కార్యక్రమం వేసుకొన్నది. అయితే జాయస్వాల్ అజ్మీర్‌దాకా వచ్చి, ఏదో కేసుపనిమీద పాట్నాకు వెళ్ళారు.

వీరు అహమ్మదాబాద్‌లో "హఠీభాయినీ వాడీ"ని సందర్శించారు. ఇది క్రీ. శ. 1846 లో నిర్మింపబడిన జైన మందిరం. ఇక్కడ ఉన్న మసీదుల అలంకరణలో ఎల్లోరా ముద్ర కనిపించింది. వీరు ఆబూ మహాసరోవరంవద్ద కొంత సేపు గడిపి, దేల్‌వాడ మందిరంవైపు వెళ్ళారు. వస్తుపాల్, తేజ్‌పాల్ దీనిని నిర్మించారు. భారతీయవాస్తుశిల్పంలో ఇది

అమర నిధి. చలువరాతిని వెన్నముద్దవలె మెత్తగా కోసి, అందమైన పువ్వులు, ఆకులు రూపొందించబడ్డాయి.

ఉదయపురంలో ఒకకృత్రిమ సముద్రాన్ని చూశారు. చిత్తూరులో ఒక స్త్రీ విగ్రహం కనిపించింది. నగభాగమే నిర్మించిన ఆ విగ్రహం చాలా అందంగావుంది. అవంతిపురి అందమైన కవిత్వంవలె ఆకర్షణీయంగా ఉంది. శూద్రకుడు, కాళిదాసు, బాణుడు, దండి-వీరంతా దీనికీర్తిని దశదిశల వ్యాపింపజేశారు. సాంచీలో "ఖమ్‌బాబా"పేర ప్రసిద్ధి చెందిన గ్రీకుభక్తుడు హెలియోదోర్ గరుడస్తంభం ఉంది. రోమరోమాన బలపరాక్రమం ఉట్టిపడే నరసింహావిగ్రహం ఉదయగిరి గుహలో కనిపించింది. ఇది గుప్తకాలంనాటిది. చంద్రగుప్తుడు తనునే నరసింహుడుగాను, గుప్తరాజలక్ష్మి ధ్రువదేవిని పృథ్విగాను రూపకల్పన చేయించుకొని ఉండ వచ్చునని రాహుల్జీ అభిప్రాయం.

బరోడా యాత్ర ముగించుకొని, రాహుల్జీ క్రీ. శ. 1934 జనవరి నెల మధ్యభాగంలో ప్రయాగకు వచ్చారు. ఒకమిత్రుని ఇంట్లో మకాంపెట్టి, ఏదో పుస్తకం ప్రూఫులు దిద్దుకొంటున్నారు. ఒకనాటిమధ్యాహ్నం కిటికీతలుపులు కొట్టుకొన్నట్లు చప్పుడు అయింది. తాను లండన్‌లో ఉండటం లేదుగదా అనుకొన్నారు. ఇంతలోనే ప్రజలు "భూకంపం" అని కేకలుపెట్టారు. రాహుల్జీ వీధిలోకి వచ్చిచూడగా, అప్పటికీ గోడలు కదులుతూనే ఉన్నాయి. కొంతసేపటికి భూకంపం ఆగిపోయింది.

రాహుల్జీ భూకంపబాధితులకు సేవచేయదలచారు.

ముఖ్యంగా ఉత్తరబీహారులో చాలా కష్టం వాటిల్లినట్లు తెలిసింది. ప్రభుత్వం, రాజేంద్రబాబు, తదితర కాంగ్రెసునాయకులను జైలునుండి విడుదలచేసింది. బీహారు కేంద్రసహాయ సమితి ఏర్పడింది. ఇందులో పనిచేయడానికి రాహుల్జీకూడ వెళ్ళారు. ఒక నెలరోజులవరకు ప్రజాసేవచేశారు. నేపాల్లో కూడ విపరీతనష్టం వాటిల్లినట్లు తెలిసింది. రాహుల్జీ అక్కడకు బయలుదేరారు. కాని రాక్సౌల్ దాకా వెళ్ళి, తిరిగి రావలసి వచ్చింది. ప్రభుత్వ రహదారి నిబంధనలే ఇందుకు కారణం. ఆయన తనవద్దఉన్న డబ్బును ఒక నేపాల్ పౌరునికి అప్పగించి వచ్చారు. రాక్సౌల్ నుండి సారన్కు తిరిగివచ్చేటప్పుడు, ఒక చోట పూరీప్యాసెంజరు స్టేషన్కు దూరంగా నిలబడిఉంది. భూకంప ఫలితంగా ఆ ప్యాసింజరుకు, వెనుక, ముందు దారి తెగిపోయింది. అందుచేత రాహుల్జీ ఒకనదినిదాటి, మోతిహారీ రైలుయెక్కారు. ముజఫ్ఫర్పూర్ మీదుగా ఛప్రాకు వచ్చారు.

ఇలా దాదాపు రెండు నెలలు భూకంపపీడితులకు సేవ చేసి, గయకు వెళ్ళారు. ఆయనవెంట మంగోలు భిక్షువు ధర్మకీర్తి ఉన్నాడు. ఇద్దరూ బోధగయ ధర్మశాలను చూడటానికివెళ్ళారు. ఈ ధర్మశాలలో ముగ్గురు మంగోలు భిక్షువులు ఇద్దరుచైనాభిక్షువులు ఉండేవారు. చైనాభిక్షువులు ఎప్పుడూకలహించుకొనేవారు. వారిలో ఒకడుగూనివాడు. శుద్ధచైనీయుడు. మరొకడు అర్ధచైనీయుడు. అతనితల్లి టిబెట్ స్త్రీ, తండ్రి చైనీయుడు. గూనిభిక్షువు చాలా ఏళ్ళనుండి ఇక్కడ ఉన్నాడు. అయినప్పటికీ హిందీనేర్చుకోవడానికి ప్రయత్నించలేదు.

అతనిపేరు ఫూ-చిన్. అతని ప్రతిద్వంధికూడ ఫూ-చిన్ అని పేరు పెట్టుకొన్నాడు. అందుచేత పెద్దఫూ-చిన్ అని, చిన్న ఫూ-చిన్ అని వారిని పిలిచేవారు. తనపేరు పెట్టుకొన్నందుకు చిన్న ఫూ-చిన్పై పెద్ద ఫూ-చిన్ మేజస్ట్రేట్‌వద్ద ఫిర్యాదుచేశాడు. అతనివద్ద చైనా - ఇంగ్లీషు శబ్దకోశం ఉండేది. అతడు దానిని చూచి ఇంగ్లీషులో అర్జీవ్రాసేవాడు. ఆ అర్జీ ఎవరికీ అర్థమయ్యేదికాదు.

భూకంపపీడితులకు సహాయం అందజేసేవిషయమై గాంధీజీ పాట్నాకు వచ్చారు. ఆయనవెంట ఒక విదేశ మహిళ ఉంది. ఆమె విదేశానికి ఓడలో త్వరగా వెళ్ళవలసి వచ్చింది. లంకనుండి మాత్రమే ఇలాంటి వీలు ఉండేది. రాజేంద్రబాబు రాహుల్జీని పిలిపించారు. ఆయన లంక ప్రధానికి సిఫారసు లేఖవ్రాస్తూ, టెలిగ్రాం ఇచ్చారు. రాహుల్జీ ఇంతకుపూర్వంకూడ ఒకటి రెండుసార్లు గాంధీజీని చూశారు. కాని ఆయనకు దూరంగానే ఉండేవారు. తాను గాంధీజీవద్దనుండి బయటికి వస్తుండగా మాలవీయ కనిపించాడు. బుద్ధుడు భగవద్భక్తుడని అతని నమ్మకం. సారనాథ్‌లో ఎవరో దీనిని కాదంటే, అతనికి ఆశ్చర్యంకలిగింది. రాహుల్జీ బౌద్ధమతాన్నిగూర్చి బాగా తెలిసినవారని ప్రతీతి. అందుచేత "నిజంగా బుద్ధునికి భగవంతునిపై విశ్వాసం లేదా?" అని రాహుల్జీని ప్రశ్నించాడు. "సబ్బం అనిచ్చం" అనే బుద్ధవాక్యాన్ని రాహుల్జీ ఉదాహరించారు. "దీర్ఘనికాయం"లోని ఒక కథ చెప్పారు. అందులో భగవంతుని స్పష్టంగా నిరాకరించారని తెలియజేశారు. మాలవీయకు

కష్టం వేసింది. కాని రాహుల్జీ సత్యాన్ని మరుగుపరచే వ్యక్తి కాదు.

ఈ సంవత్సరం రాహుల్జీ మరల టిబెట్ యాత్ర చేయదలచారు. వెళ్లేముందు, బీహారు-ఒరిస్సా రీసెర్చి సొసైటీవారు తనకు పెద్దసన్మానం చేయదలచినట్లు తెలిసింది. ఇది ఆయనకు సంతోషంగాని, ఆశ్చర్యంగాని కలిగించలేదు. అయితే జేమ్సు, థామస్, హైలట్, తదితర ఇంగ్లీషు అధికార్లుకూడ ఇందుకు అనుమతించినట్లు విని రాహుల్జీకి ఆశ్చర్యం కలిగింది. ఇంగ్లీషు అధికార్ల ప్రాపకం కోసం ఆయన ఎప్పుడూ ఎదురు చూడలేదు.

## టిబెట్‌కు రెండోసారి

రాహుల్జీ ధర్మకీర్తిని వెంటదీసుకొని, క్రీ. శ. 1934 మార్చి 20 వ తేదీని పాట్నానుండి కాలింపాంగ్‌కు బయలుదేరారు. కాలింపాంగ్‌లో ధర్మాలోక్ అనే భిక్షువు వీరికి తోడైనాడు. తానుకూడ టిబెట్ యాత్ర చేయదలచానని చెప్పాడు బోధి సత్వుడు మాంజుశ్రీని వెదికే నిమిత్తం చైనాకుకూడ వెళ్ళాలని అతని ఉద్దేశం. ధర్మాలోక్ ఎప్పుడూ రాహుల్జీవద్దనే ఉండేవాడు. అతడు చెప్పే విషయాలు చాలా మనోరంజకంగా ఉండేవి. ఒకనాడు నేపాల్ భూతాలను గూర్చి సంభాషణ ప్రారంభమైంది. ధర్మాలోక్ చెప్పిన దానినిబట్టి, నేపాల్‌లో పద్ధెనిమిదిరకాల భూతజాతులు ఉండేవి.

వాటిపేర్లు ఇవి (1) ముండ్‌కటా-తల తెగినందువల్ల

మరణించిన వ్యక్తి; (2) అగతితోంగ్-చాలా బాధవల్ల, అజ్ఞానంవల్ల మరణించినవ్యక్తి; (3) రాఘస్ - అడవిలో కన పడే మనుష్యుని గుండెకాయ తినేవాడు; (4) కాం - కంకాళాన్ని పోలిన శరీరంకలిగి, "కాం"అని మాట్లాడేవాడు; (5) కీం చక్ నీ—అందగత్తె వేషంధరించి మనుష్యులనుచంపే ఆడదయ్యం; (6) మిా చూ - లాఖం—నదులలో, నిర్జన మైదానాలలో నోటినుండి నిప్పులు కక్కుతూ పరిగెత్తే రాక్షసుడు; (7) హో-న్యాఘుర్—ఇంట్లో కూర్చుని రాళ్ళువిసిరే భూతం; (8) సీక్-అగతి—చచ్చి, ఆ ఇంట్లోనే నివసించే భూతం; (9) ఖ్యాక్ — తుయూ—క్స్వా—తెల్లని కోతివలె ఉండి, హానికలిగించకుండా, లాభం కలిగించే భూతం; (10) ఖ్వాట్—గ్వారా—ఖ్యాక్—ఇది చింపిరిబట్టలు ధరిస్తుంది. మనుష్యుని కిందపడగొట్టి, ఎగతాళిచేస్తుంది; (11) నాంగ్-సూ-ఖ్యాక్—దారిలో పేరుపెట్టిపిలిచేభూతం (12) ఘురు-రురు-ఖ్యాక్-ఇంటిపై చప్పుడుచేసే భూతం. ఇదిచాలా మేలు కలిగిస్తుంది; (13) లం-పనేక్స్వా-ఖ్యాక్—దారిని అడ్డగించే భూతం; (14) గ్వ-దూ-మా-మి-సా—మీసాలుగల ఆడ దయ్యం; (15) జంగ్-కీ-కో—యమదూత;(16) జూ-మిా-మనుష్యుని నేరుగా తీసుకువెళ్లే భూతం; (17) వారా-ఖ్యాక్—ప్రథమ రజస్వల అయి మరణించి, దయ్యంగా తయారైనది; (18) యో - ఖ్యాక్—రాట్నంపై నూలు వడికే భూతం.

టిబెట్ వెళ్ళడానికి అనుమతిపత్రంకోసం నిరీక్షిస్తూ రాహుల్జీ కాలింపాంగ్‌లో ఉండిపోయారు. ఈఖాళీసమయంలో

తనవద్దకుపంపిన భోట్-భాషా వ్యాకరణం ప్రూఫులు దిద్దు
కొనేవారు. తాను లంకలో ఉన్నప్పుడు, యునాన్-త్సాంగ్
అనువదించిన "విజ్ఞప్తిమాత్రతాసిద్ధి"లో ప్రతిశబ్దాన్ని వాంగ్
మోలమ్ సహాయంతో సేకరించారు.వాటిని ఇప్పుడుసంస్కృ
తంలోకి మార్చడం మొదలుపెట్టారు. ఇతరపనులవల్ల,
"విజ్ఞప్తిమాత్రతాసిద్ధి"లో సగంమాత్రమే సంస్కృతంలోకి
మార్చి అచ్చువేయించుకోగలిగారు.ఏప్రిల్ రెండో వారంలో
ఆయన పుస్తకం "టిబెట్‌లో పదిహేను నెలలు" అచ్చయి
వచ్చింది.ఆయన రెండోయాత్రకుముందేతొలియాత్రకుసంబం
ధించిన పుస్తకం అచ్చయినందుకు చాలా సంతోషిం
చారు.

కాలింపాంగ్‌లో ఉంటూ నెలరోజులు గడిపారు.
కాని టిబెట్ ప్రయాణానికి గ్యాంటన్‌నుండి అనుమతిపత్రం
రాలేదు. అందుచేత రాహుల్జీ స్వయంగా గ్యాంటన్ వెళ్ళి
పొలిటికల్ ఆఫీసరును కలుసుకొన్నారు. అనుమతిపత్రం ఇచ్చే
ముందు ఇంకా కొన్నివిషయాలు తెలుసుకోవలసిఉందని
అతడు చెప్పాడు. కొద్దిరోజులకుముందు బీహారు గవర్నరు
బీహారు రీసెర్చి సొసైటీ వార్షికోత్సవంలో మాట్లాడుతూ,
టిబెట్ యాత్రలో రాహుల్జీకృషిని గొప్పగా పొగడాడు.
అతని ఉపన్యాసం సొసైటీ జర్నల్‌లో అచ్చయింది. ఆ
పత్రిక రాహుల్జీవద్దఉంది. దానిని పొలిటికల్ ఆఫీసరుకు
అందజేశారు. అతడు ఆ ఉపన్యాసంచదివి, మరింత ఉప్పొంగి
పోయాడు. వెంటనే గుమస్తాను పిలిచి, అనుమతి వ్రాయించి
ఇచ్చాడు. రాహుల్జీకి అన్నివిధాలా సహాయం చేస్తానని

చెప్పారు. తానువచ్చినపని తేలికగానే అయిపోయి నందుకు రాహుల్జీ చాలా సంతోషించారు.

ఆయన గ్యాంటస్‌లో కొన్ని ముఖ్యమైన ప్రదేశాలను చూచి, అదేరోజున కాలింపాంగ్‌కు తిరిగివచ్చారు పాట్నా వాస్తవ్యుడు రాజనాథ్ పాండేకూడ ఆయనవెంట వస్తానన్నాడు. అతనికి అనుమతి పత్రం రాలేదు. అందుచేత నేపాలీ వేషంలో బయలుదేరాడు. సామానులు మోయడానికి, స్వారిచేయడానికి మూడుకంచరగాడిదలను అద్దెకు తీసుకొన్నారు. ఏప్రిల్ 22 వ తేదీన కాలింపాంగ్‌నుండి బయలుదేరారు.

కంచరగాడిదల ఆసాములు పద్మోగంగ్ గ్రామ వాస్తవ్యులు. వారు రాహుల్జీని తమగ్రామానికి తీసుకువెళ్ళారు. అది చాలా పురాతనమైన గ్రామం. అన్నదమ్ములంతా ఒకేపెళ్ళిచేసుకొనే సంప్రదాయం ఉన్నందువల్ల, కుటుంబాలు అభివృద్ధి చెందలేదు. గ్రామంలో పదహారు కుటుంబాలుమాత్రమే ఉండేవి. వీరు "బోన్" మతస్థులు. ఇక్కడ "బోన్" దేవాలయాలు రెండు ఉన్నాయి. కాని రెంటిలోను శాక్యముని విగ్రహాలుకూడ ఉన్నాయి. 'బోన్' మతగ్రంథాలు (హస్తలిఖితమైనవి) కొన్ని ఇక్కడ కనిపించాయి. అవి చాలాపురాతనమైనవి. తాళపత్రగ్రంథాల వలె చిల్లులుపడిఉన్నాయి. "బోన్"మతం బౌద్ధులనుండి అనేక విషయాలను స్వీకరించిందని రాహుల్జీ అభిప్రాయం.

మరునాడుకూడ రాహుల్జీ ఇక్కడ ఉండవలసివచ్చింది.

ఆయన "వినయపిటక్" ను హిందీలోకి అనువదించడం మొదలు పెట్టారు.

మరునాడు ఫరీజోంగ్ కు బయలుదేరారు. ఆ రోజున ఒక దుర్ఘటన జరిగింది. రాజనాథ్ ఎక్కిన కంచరగాడిద, అతని వశం కాలేదు. ఎక్కడికో పరుగెత్తింది. రాజనాథ్ కిందపడి చనిపోయేవాడే. కాని తోడిమనుష్యులు కాపాడారు. తర్వాత అంతా "ఫరీ" గ్రామానికి వెళ్ళారు. కంచరగాడిదల ఏర్పాటుకోసం అక్కడ వారంరోజులు ఉండవలసి వచ్చింది. "ఫరీ" గ్రామం సముద్రమట్టానికి 14 వేల అడుగుల ఎత్తున ఉంది. అందుచేత ఏడాదిపొడుగునా చలిఎక్కువగా ఉంటుంది. నిరంతరం మబ్బులు ఆడుతూ ఉంటాయి. మంచురూపంలో వానపడుతూ ఉంటుంది.

వారంరోజులైనా అద్దెకు కంచరగాడిదలు దొరికే సూచన కనిపించలేదు. పైపెచ్చు ధర్మకీర్తి ఆరోగ్యం చెడిపోయింది. అతనిని కంచరగాడిదపై లాసాకు పంపించాలని రాహుల్జీ అనుకొన్నారు. ఇక్కడకూడా "వినయపిటక్" అనువాదం కొనసాగించారు. కాని ఆయనకు చీకాకుగా ఉంది. మే నెల 7 వ తేదీన "ఫరీ"నుండి బయలుదేరారు. మరునాడు "దోజిక్" చేరుకొన్నారు. దగ్గరలో విశాలమైన దేవసరోవరం కనిపించింది. హంసల కలరవాలు వినిపిస్తున్నాయి. ఆ రాత్రి ఒక గ్రామంలో తలదాచుకొన్నారు. మరునాడు గ్యాంచీ చేరుకొన్నారు. రాహుల్జీ గ్యాంచీ విహారాన్ని శ్రద్ధగా పరిశీలించారు. అక్కడ మూడు మందిరాలు ఉన్నాయి. ప్రధానమందిరంలో బుద్ధుని

విగ్రహం ఉంది. దానికి కుడివైపు మందిరంలో నాథత్రయ (మంజుఘోష, ఏకాదశముఖ అవలోకితేశ్వర, వజ్రపాణి) విగ్రహాలు ఉన్నాయి.

గ్యాంచీలో నాలుగురోజులు ఉండి రాహుల్జీ బృందం యాత్ర కొనసాగించింది. ఇది ఒక చిన్న శంకరుని బృందం వలె ఉంది. దారిలో ధర్మాలోక్ కంచరగాడిదకు రాతి ఎదురుదెబ్బ తగిలి కింద పడింది. రాజనాథ్ కంచరగాడిద దానివద్దకు వెళ్ళి, ధర్మాలోక్‌ను కింద పడగొట్టింది. ఈ విషయమై ఇద్దరిమధ్య దురభిప్రాయం ఏర్పడింది. కొంతదూరం వెళ్ళిన తర్వాత రాజనాథ్ ఎక్కిన కంచరగాడిదే అతనిని కింద పడగొట్టింది. రాజనాథ్ గాయపడ్డాడు. ధర్మాలోక్ అతనికి మందు ఇవ్వడానికి నిరాకరించాడు. రాహుల్జీ వీరికి ఏదో విధంగా రాజీకుదిర్చారు. రాత్రిపూట ఏదో ఒకగ్రామంలో తలదాచుకొంటూ, వీరు నాలుగురోజులతర్వాత బ్రహ్మపుత్ర నదిఒడ్డుకు వచ్చారు. ప్రక్కనే చా-సమ్-ఘూ-వో-రీ పేరుగల పవిత్రపర్వతం ఉంది. ప్రజలు దీనికి ప్రదక్షిణం చేసేవారు. ఇది టిబెట్ పర్వతం కాదని, భారతదేశానిదని, అక్కడ నుండే తీసుకురాబడిందని ధర్మాలోక్ చెప్పాడు. "ఇది అసంభవమేమీకాదు. పూర్వకాలంలో పర్వతాలు రెక్కలు కట్టుకొని ఎగిరిపోయేవి" అని రాహుల్జీ చమత్కరించారు. ఇంద్రుడు పర్వతాల రెక్కలు విరగ్గొడితే, అప్పటినుండి అవి భూమిపై పడిఉన్నట్లు బ్రాహ్మణుల పురాణాలలో వ్రాసి ఉండటాన్ని ఉదాహరించారు.

రాహుల్జీ బృందం ఒకపడవ ఎక్కి బ్రహ్మపుత్రనదిని

దాటింది. మరునాడు వీరు నాథంగ్ చేరుకొన్నారు. దానికి సమీపంలో తారామందిరం ఉంది. దీపంకర్ శ్రీజ్ఞాన నిర్వాణప్రదేశం అదే. రాహుల్జీ ఆ ప్రదేశాన్ని చూడ దలచారు. మధ్యాహ్నభోజనానంతరం అక్కడకు వెళ్లారు. ఒకపంజరంలో దీపంకర్ శ్రీజ్ఞాన్ పాత్ర, దండం వగైరా పదిలపరచబడి ఉన్నాయి. బయటతాళంవేసి, ప్రభుత్వసీలు వేశారు. అందుచేత మందిరంలోపలికి వెళ్ళడానికి వీలులేక పోయింది. దీపంకర్ శ్రీజ్ఞాన్ తన వృద్ధాప్యాన్ని లెక్క చేయకుండా, హిమాలయాన్ని దాటి భారతసందేశాన్ని ఇక్కడ వినిపించాడు. ఆయన నివసించినచోట అమితాయు మందిరం నిర్మించినట్లు పూజారి తెలియజేశాడు.

మరునాడు రాహుల్జీ ప్రభృతులు లాసాకు వెళ్ళారు. వీరికి జ్ఞానమాన్‌సాహు హృదయపూర్వకమైన స్వాగత మిచ్చాడు. రాహుల్జీ ఈ పర్యాయం ముఖ్యంగా సంస్కృత గ్రంథాన్వేషణకై టిబెట్‌కు వచ్చారు. భారతదేశంనుండి తెచ్చిన వేలాది తాళపత్ర గ్రంథాలలో కొన్ని అయినా ఇక్కడ ఉంటాయని ఆయన విశ్వాసం. మధ్యాహ్నభోజనా నంతరం టెలిగ్రాఫిక్ ఆఫీసు అధికారిని కలుసుకొన్నారు. అతనితో చాలాసేపు సంభాషణ జరిపారు. సక్యా, ముంషోర్ విహారాలలో సంస్కృతగ్రంథాలు ఉంటాయని రాహుల్జీ చెప్పారు. వాటిని తెరవడానికి భోట్ ప్రభుత్వ అనుమతి తీసుకోవలసి ఉంటుందని టెలిగ్రాఫిక్ ఆఫీసు అధికారి తెలియ జేశాడు. రాహుల్జీ ఇందుకు ప్రయత్నిస్తూ, ఈలోగా "వినయపిటక్" అనువాదం పూర్తిచేయదలచారు.

మురు విహారానికి గోలోన్-గే-షే అనే పెద్దవిద్వాంసుడు వచ్చినట్లు తెలిసింది. రాహుల్జీ అతనిని కలుసుకొని మాట్లాడారు. సంస్కృత హస్తలిఖిత గ్రంథాన్వేషణలో సహాయపడతానని గే-షే వాగ్దానంచేశాడు. భారతదేశం నుండి అనేక సంస్కృతగ్రంథాలు లుప్తమైనాయని రాహుల్జీ చెప్పారు. కొందరు టిబెట్ విద్వాంసులు సంస్కృతం చదవాలని, ఇదేవిధంగా భారతీయవిద్వాంసులు భోట్-భాష చదవాలని, అప్పుడు ఉభయులూ కలిపి టిబెట్ గ్రంథాలను సంస్కృతంలోకి తిరిగి అనువదించాలని గే-షే సూచించాడు. అతని సూచన రాహుల్జీకి నచ్చింది.

రాహుల్జీ "వినయపిటక్" అనువాదం కొనసాగిస్తూనే, మేనెల 20వ తేదీనుండి "కమ్యూనిజమే ఎందుకు కావాలి?" అనే గ్రంథరచన మొదలుపెట్టారు. అదేరోజున ఒక అధ్యాయంకూడ పూర్తిచేశారు. కాని ఆయన వచ్చిన పని మూలపడేట్లుఉంది. అందుచేతస్వయంగా వ్రాయడంమాని వేశారు. ఆయన చెబుతూ ఉండగా, రాజనాథ్ వ్రాస్తూ పోయాడు. కొద్దిరోజులతర్వాత, రాహుల్జీ ఒక మంగోలు విద్వాంసుని కలుసుకొని సంభాషించారు. మరొకపర్యాయం "సేరా" మఠాన్ని సందర్శించివచ్చారు. రాజనాథ్‌కు స్వదేశం గుర్తువచ్చినట్లుంది. అతడు ప్రయాగవాస్తవ్యుడు. ఆ సంవత్సరమే ఎం.ఏ. ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడైనాడు. టిబెట్‌యాత్రకోసం వచ్చాడు. కాని కష్టాలను ఎదుర్కొనలేకపోయాడు. దారిలో రెండు దుర్ఘటనలు జరిగాయి. తన భార్య నొసటితిలకమే తనను కాపాడిందని అతడు చెప్పాడు.

రాహుల్జీకి అతడు చాలా సహాయకారిగా ఉండేవాడు. కాని అతనికి ఇక్కడ ఉండే ఇష్టంలేదు. అందుచేత అతనిని జ్ఞాన మాన్ సాహు వెంట భారతదేశానికి పంపించారు. ధర్మా లోక్ లాసాదాకా వచ్చి, మరో చోటికి వెళ్ళిపోయాడు.

ఇప్పుడు రాహుల్జీ తనగదిలో ఒంటరిగా ఉన్నారు. అయితే పగటిపూట వచ్చి పోయేవారి సంఖ్య ఎక్కువగానే ఉండేది. రాహుల్జీ రాత్రిపూట గ్రంథ రచనను ఉపక్రమించే వారు. ఒక్కొక్కప్పుడు రాత్రి రెండు గంటలయ్యేదాకా వ్రాస్తూనే ఉండేవారు. ఇలా తాను ఒంటరిగా ఉంటూ చాలా రోజులుగడపారు. ఆయన గది వెనక తలుపు ఎల్లప్పుడూ మూసి వేయబడి ఉండేది. ఎందుకంటె ఆ గదిలో ఇతరులు కాపురం ఉన్నారు. వారు కాదిర్ భాయ్ దంపతులు. ఒకనాడు కాదిర్ భాయ్ రాహుల్జీని కలుసుకొని, "మీరు రాత్రి ప్రొద్దుపోయే వరకూ మేలొంటున్నారు. మీకు ఏదీ కనిపించదా!" అని అడిగాడు. అతడు భూతాలను మనస్సులో పెట్టుకొని ఇలా అడుగుతున్నాడని రాహుల్జీకి వెంటనే అర్థమైంది. "ఏమని చెప్పను! రాత్రి పన్నెండు దాటినతర్వాత, నా గదిలో ఇసుక వేసినా కిందరాలదు" అన్నారు. "పది-పన్నెండుదాకా ఉంటాయా?" అని కాదిర్ భాయ్ ప్రశ్నించాడు. "పది-పన్నెండు ఏమిటి? నా ప్రక్క మినహాయించి, ఎక్కడచూచినా భూతాలే కనిపిస్తాయి," అని రాహుల్జీ చెప్పారు. "లామాజీ, ఇన్ని భూతాలు ఉంటాయా!" అని కాదిర్ భాయ్ భార్య అన్నది. "మీకు నమ్మకంలేకపోతే, రాత్రి ఒంటిగంటప్పుడు తలుపు తెరవండి. పది పన్నెండు భూతాలను మీవద్దకు

పంపుతాను," అని రాహుల్జీ చెప్పారు. "మీకు పుణ్యం ఉంటుంది. ఆపనిమాత్రం చేయవద్దు బాబూ!" అన్నది ఆమె. రాహుల్జీ భూతాలనుగూర్చి ఇంకా లేనిపోని కల్పనలు చేసి చెప్పారు. జనం మరి కొంతమంది పోగైనారు. తనగదిలో ఉండే భూతాలు చాలామంచివని, తనకు దారికూడ ఇస్తాయని, ఇలాంటివి ప్రపంచంలో ఎక్కడా లేవని రాహుల్జీ చెప్పారు. అంధవిశ్వాసం ఒక తీగవంటిదని, గట్టిగా లాగి, అది తెగిపోయేట్లు చేయాలని ఆయన ఉద్దేశం. అందుచేతనే అప్పటికప్పుడు ఈ కథ అల్లి చెప్పారు.

తాళపత్ర గ్రంథాన్వేషణ చేయవలసిందిగా రాహుల్జీ తన స్నేహితులకుకూడ చెప్పి ఉంచారు. ఒకనాడు మాఘ (శిశుపాలవధ) కావ్యంపై భవదత్తుని టీక "తత్వకౌముది" వచ్చింది. పుస్తకం శిథిలమైఉంది. అది మైథిలీలిపిలో ఉంది. రెండు మూడు వందల ఏళ్ళకంటె పురాతనమైనది కాదు. టీకలో కాశీ వాస్తవ్యుడు జగద్ధరునిపేరుకూడ ఉంది. అమర, విశ్వకోశాలనుండి ఎన్నో "కొటేషన్లు" ఇవ్వబడ్డాయి. "అభి సమయాలంకారం" గూర్చి బుద్ధ శ్రీ జ్ఞాన్ రచించిన "ప్రజ్ఞా దీపావళి" అనే అముద్రిత వేదాంత గ్రంథం ఇంకొకటి వచ్చింది. దీనిని తెచ్చిన వ్యక్తి, అమ్మదలుచుకోలేదు. అందుచేత రాహుల్జీ దీనిని కాపీ చేసుకోవాలని నిశ్చయించారు రేడింగ్ విహారంలో కొన్ని తాళపత్ర గ్రంథాలు ఉన్నాయని రాహుల్జీకి తెలిసింది. దీపంకర్ శ్రీ జ్ఞాన్ శిష్యుడు డోమ్-తోన్ పదకొండో శతాబ్దంలో ఈ విహారాన్ని నిర్మించాడు. రాహుల్జీ ఈ విహారాధిపతిని కలుసుకొని

మాట్లాడారు. అవసరమైనప్పుడు జాబు వ్రాస్తానని అతడు చెప్పాడు. తన విహారంలోని తాళపత్ర గ్రంథాలు ఎక్కువ భాగం కాలిపోయాయని తెలియజేశాడు.

లాసా చాలా చల్లని ప్రదేశం. అక్కడ నివసించేవారు స్నానంచేసే విషయం మరచినట్లే ఉంటారు. రాహుల్జీ వారానికి ఒకసారి స్నానంచేసేవారు. ఇందుకు షోగంగ్ రాజభవనం అనుకూలంగా ఉండేది. ఇదే పనిమీద ఒకనాడు అక్కడకు వెళ్ళగా, చక్కని ముద్రణతో కూడిన "కంజూర్" గ్రంథం లభించింది. అది శ్లోకులరూపంలో ఉంది. దాని వెల సుమారు వెయ్యి రూపాయలు. మూడు-నాలుగు కంచర గాడిదలకు సరిపడ బరువు ఉంటుంది. రాహుల్జీ తిరిగి వచ్చేటప్పుడు ఆ గ్రంథాన్ని పాట్నాకు తీసుకువచ్చారు. దానిని కొనుక్కోవడానికి ఆయనవద్ద డబ్బులేదు. ఈ విషయం కలకత్తా విశ్వవిద్యాలయం వారికి తెలిసింది. వారు వెంటనే డాక్టరు బాగ్చిని పంపి, పుస్తకాన్ని కొనుక్కుపోయారు.

కుం-దే-లింగ్ విహారంలో కొన్ని తాళపత్ర గ్రంథాలు ఉన్నట్లు తెలిసి, రాహుల్జీ అక్కడకు వెళ్ళారు. గేషే-షేరబ్ అనే పండితుని కలుసుకొన్నారు. అతడు భోట్ శాస్త్ర పారంగతుడు. అలాంటి పండితులు టిబెట్‌లో ఇద్దరు ముగ్గురుకంటె ఎక్కువ ఉండరని రాహుల్జీ అభిప్రాయం. గేషే-షేరబ్ చాంద్ర-వ్యాకరణంకూడ వల్లించాడు. కాని సంస్కృతం చదువుకొనే అవకాశం లేకపోయింది. అతడు కుం-దే-లింగ్ లామా గురువు. అందుచేత తాళపత్ర గ్రంథాలు చూడటానికి ఎలాంటి ఇబ్బంది కలుగలేదు. ఒక

గ్రంథం రంజన-అక్షరాలలో ఉంది. గే-షే చెప్పినదానినిబట్టి, అది ప్రసిద్ధ ఆచార్య నాగార్జునునిది. ఇక్కడ మరో అమూల్య గ్రంథం కనిపించింది. అది ధర్మకీర్తి రచించిన "వాద న్యాయం"పై శాంతరక్షితుని టీక. రాహుల్జీ దానిని ఫోటో తీసుకున్నారు. ఇదే యాత్రలో గోర్ విహారంలో దీని మూలంకూడ లభించింది. కొన్నాళ్ళతర్వాత దీనిని రాహుల్జీ అచ్చువేయించారు.

రాహుల్జీ ఒకనాడు గే-షే ధర్మవర్ధన్‌ను కలుసు కొన్నారు. అతడు భోట్ సాహిత్యంలో, తత్వశాస్త్రంలో గొప్ప పండితుడు, ప్రసిద్ధ చిత్రకారుడు, ఉన్నత శ్రేణికి చెందిన కవి, ఆదర్శవాది. అప్పటినుండి వీరిమధ్య ఘనిష్ఠ సంబంధం ఏర్పడింది. (స్వతంత్రభావాలు కలిగి ఉన్నాడనే కారణంతో అతనిని 1948లో భోట్ ప్రభుత్వం జైలులో పెట్టినట్లు రాహుల్జీకి తెలిసింది. ఆయన ఇక్కడ ఉన్నప్పుడు పే.గంగ్ రాకుమారుడు చిరుతప్రాయంలో ఉండేవాడు. అతడు 1948లో జనరల్ షోగంగ్ అయినాడు. రాహుల్జీ అతనికి లేఖవ్రాసి, గే-షే ధర్మవర్ధన్‌ను జైలునుండి విడిపించారు) గే-షే ధర్మవర్ధన్ భారతదేశానికి రావాలనే కోర్కె వెలిబుచ్చారు.

'వినయపిటకే' అనువాదం జూన్ నెలాఖరుకు పూర్తి అయింది. అందుచేత రాహుల్జీ అక్కడక్కడ తిరగడానికి వీలు దొరికింది. ఒకనాడు దే-పుంగ్ విహారానికి వెళ్ళారు. లుమ్—బుంగ్ గేషే-షేరబ్ ఆయనకు స్వాగతమిచ్చారు. ఇద్దరూ తత్వశాస్త్రం, చరిత్ర తదితర విషయాలనుగూర్చి

చాలాసేపు సంభాషణలు జరిపారు. డే-పుంగ్‌లో విద్యా బోధనను గూర్చి అడుగగా గే-షే - షేరబ్ ఇలా తెలియ జేశాడు: ఆరో ఏట అక్షరాభ్యాసం ప్రారంభమవుతుంది. తర్వాత రెండేళ్ళు మామూలు పాఠాలు బోధిస్తారు. పిమ్మట నాలుగేళ్ళు "శ్వేతరక్త—రంగ" (చిత్రకళ కాదు)—అంటే న్యాయశాస్త్రానికి సంబంధించిన ప్రాథమిక విషయాలు బోధింపబడతాయి. ఈ విధంగా ఆరేళ్ళు చదివినతర్వాత, ప్రమాణవార్తికం మొదలుపెడతారు. అది పూర్తిచేయ డానికి అయిదేళ్ళు పడుతుంది. తర్వాత తత్వశాస్త్రం, మత గ్రంథాలు చదవడానికి 16 ఏళ్ళు పడుతుంది. ఈ విధంగా 27 ఏళ్ళు చదివినతర్వాత లా - రంపా (డాక్టరు, లేక ఆచార్య)కు అర్హుడవుతాడు. ఈ పరీక్షలు శాస్త్రార్థ రూపంలో మూండేళ్ళవరకు జరుగుతాయి. ఇందులో నెగ్గిన 16 మంది లా - రంపా అవుతారు. ధనవంతుడైన, అవతార పురుషుడైన లామాకుకూడ లా రంపా బిరుదు ఇస్తారు.

రాహుల్జీ డే - పుంగ్‌కు వెళ్ళినరోజు లా రంపా సంబంధమైన చర్చలు సాగుతున్నాయి. లోగడ ఆయన సహ యాత్రికుడు కర్రోక్ ఈ విద్యాలయంలోనే చదివాడు. కాని రెండేళ్ళక్రితమే అతడు చనిపోయాడని తెలిసి రాహుల్జీ దుఃఖించారు.

ఒకనాడు గే-షే ధర్మవర్ధన్, ధర్మకీర్తి, రాహుల్జీ ముగ్గురూ కలిసి తాళపత్ర గ్రంథాన్వేషణకై లాసానుండి బయలుదేరారు. వీరు లంగ్‌థంగ్ విహారంమీదుగా నలందా విహారం చేరుకొన్నారు. భారతదేశంలోని నలందాపేరు

తోనే ఈ విహారం పదిహేనవ శతాబ్దారంభంలో నిర్మింప బడింది. ఇక్కడఉన్న భిక్షువులు రాహుల్జీ బృందానికి అన్ని విధాల తోడ్పడ్డారు. పన్నెండుమైళ్ళదూరంలో పాఛవ్ అనే గ్రామం ఉండేది. రాహుల్జీ ప్రభృతులు అక్కడకు వెళ్లారు. పురాతన అనువాదకులలో పాఛవ్ నిమంగక్ చాలాగొప్ప పండితుడు. అతడు ఎన్నోగ్రంథాలను సంస్కృతంనుండి టిబెట్ భాషలోకి అనువదించాడు. పాఛవ్ గ్రామం అతని జన్మస్థలమని తెలిసింది. గ్రామం వెలుపల కొండప్రక్క ఒకస్తూపం ఉంది. దానిలోపలనే పాఛవ్ శరీరంఉన్నట్లు గ్రామస్థులు చెప్పారు.

పాఛవ్ గ్రామానికి కొద్దిదూరంలో గ్యల్ ఖంగ్ అనే విహారంఉంది. ఇది అన్నిటికంటె పురాతనమైనది. ఎనిమిది, లేక తొమ్మిదోశతాబ్దంలో నిర్మింపబడింది. టిబెట్ అశోక సామ్రాట్ ఠి - స్రోంగ్ దీనిని నిర్మించాడు. రాతి స్తంభానికి నలువైపుల వజ్ర, యుగళవజ్రి, పద్మ, రత్నాలు నిర్మింప బడ్డాయి. అన్నిటికంటె పురాతనమైనది మైత్రేయమందిరం. ఇక్కడ హస్తలిఖితమైన కంజూర్ తంజూర్ గ్రంథాలు మూడు ఉన్నాయి. ఇవికాక ఇంకా ఎన్నోగ్రంథాలు ఉన్నాయి. కాని వీటిని తెరచి చాలా ఏళ్ళు అయింది. గ్రంథాలు శిథిలమైనాయి. దాతలు తమపేర్లను దేశ, కాలాలను పుస్తకాలపై వ్రాయించేవారు. ఇవి చరిత్ర రచనకు ఏంతో ఉపకరిస్తాయి. కాని ఈ సామగ్రి బయటికి వచ్చే మార్గం కనపడలేదు. మైత్రేయమందిరం పూజారి రాహుల్జీకి 'శతసాహస్రిక' ప్రతిఒకటి ఇచ్చాడు. దానిని రాహుల్జీ

పాట్నా మ్యూజియమ్‌లో భద్రపరచారు. ఈ పుస్తకంలోని అక్షరాలు పురాతనమైనవి. పదమూడో శతాబ్దంతర్వాత వ్రాసినట్లు కనిపిస్తుంది. పుస్తక ప్రారంభంలో బుద్ధునిబొమ్మలు రెండు ఉన్నాయి.

రాహుల్జీ బృందం తనయాత్ర కొనసాగించింది. దారిలో కొన్ని పొదలు కనిపించాయి. అందులో ఎక్కువ భాగం అడవిగులాబి పొదలు. విరిగిపోయిన ఒకవంతెనదాటి ఎత్తుప్రదేశానికి వెళ్ళారు. నలువైపులా చమరీమృగాలు మేస్తున్నాయి. ఒక కస్తూరిమృగం పారిపోతుండగాచూశారు. ఈ ప్రాంతంలో దొంగలబాధ ఎక్కువగా ఉండేది. రాహుల్జీ బృందంవద్ద కొన్నిపిస్తోళ్ళు, ఒక రైఫిలుఉంది. లాసానుండి ఒక ఫోటోగ్రాఫర్ వీరివెంట వచ్చాడు. వచ్చేటప్పుడు తనకు పిస్తోలు అవసరంలేదని అతడు అన్నాడు. తనవద్ద మి-టి-కూ (స్మృతిజ్ఞానకీర్తి తయారుచేసిన చిన్న మట్టిబొమ్మ) ఉందని, అందుచేత తన శరీరంపై తుపాకిగుళ్ళు ఏమీ పనిచేయవని కూడ చెప్పాడు. "అలాఅయితే నీ మట్టిబొమ్మపైనే గుండు పేల్చుతాను. అది పగిలిపోకుండాఉంటే, నీకు పిస్తోలు అవసరంలేదు," అని రాహుల్జీ చెప్పారు. కాని అతడు అందుకు సిద్ధంకాలేదు. అందుచేత రాహుల్జీ అతనికికూడ ఒకపిస్తోలు అంటగట్టారు. అవసరం వచ్చినప్పుడు, దానిని అతడు ఉపయోగిస్తాడనేది అనుమానాస్పదమే-అయినప్పటికీ అందరివద్ద పిస్తోళ్ళు కనిపించేట్లు ఉండాలని రాహుల్జీ ఉద్దేశం. కొంతదూరం వెళ్ళినతర్వాత ఒక లామా నల్లని యాక్ (చమరీమృగం)పై ఎక్కి వస్తున్నాడు. దీనినిబట్టి శంకమని

నందివాహనం తెల్లగా కాకుండా, నల్లగా ఉండేదని రాహుల్జీకి తోచింది. ఎందుకంటె కైలాసపర్వతంలో ఎద్దు జీవించడం అసంభవం. అందుచేత శంకరుని వాహనం ఎద్దు కాదు, యాక్ మృగమే అయివుంటుంది. యాక్ మృగం గోజాతిలోనిదే. శంకరుడు నంది అనే యాక్ మృగాన్ని ఎక్కి వెళ్లేటప్పుడు ఈ లామావలెనే ఉంటాడని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు.

రెండురోజులతర్వాత వీరు శేడింగ్ విహారం చేరుకొన్నారు. లామా ఇచ్చిన ఉత్తరాన్ని అధికారికి అందజేశారు. అతడువీరికిచక్కని బస ఏర్పాటుచేశాడు. కానిపుస్తకాలు చూపించమని అడిగితే, నిరాకరించాడు. లామా తన ఉత్తరంలో పుస్తకాలు చూపించమని వ్రాయలేదన్నాడు. రాహుల్జీ బృందానికి చాలావిచారం కలిగింది. ఇప్పుడు మళ్ళీ లాసాకు జాబువ్రాసి, సమాధానం తెప్పించుకోవాలంటే ఇరవైరోజులు పడుతుంది. అందుచేత ఆ ప్రయత్నం విరమించుకొన్నారు. మందిరాన్ని చూడటానికి వెళ్ళారు. శేడింగ్ విహారం పదకొండోశతాబ్దంలో నిర్మింపబడింది. విహారంలో పదహారు భారతీయచిత్రపటాలు ఉన్నాయి. ఇవి వరండాలో వ్రేలాడదీయబడి ఉన్నాయి. ఇవి కాకుండా దీపంకర్ శ్రీ జ్ఞాన్, అతని శిష్యుడు డోమ్-తోన్-పాల చిత్రాలుకూడ ఉన్నాయి. విహారానికి ఒకవైపు మూడు దేవాలయాలు ఉన్నాయి. వీటిలో చిన్నచిన్న చిత్రపటాలు కొన్ని ఉన్నాయి. ఇవి భారతీయ తూలికాసృష్టి అనిపిస్తుంది. అజంతాచిత్రాలు కొన్ని చెడిపోయాయి. కాని

ఇక్కడ వెయ్యిసంవత్సరాల క్రిందటి చిత్రపటాలు సురక్షితంగా ఉన్నాయి. వాటి రేఖలు, లేతరంగునుబట్టి, అవి ఒక గొప్ప చిత్రకారునిచే గీయబడినట్లు తోస్తుంది. చిత్రపటాలు ఫోటో తీసుకోవాలని రాహుల్జీ ప్రయత్నించారు. కాని అధికారులు ఇందుకు కూడ అనుమతించలేదు. గే-షే ధర్మవర్ధన్ స్వయంగా గొప్ప చిత్రకారుడు. ఒకటి రెండు చిత్రపటాలను కాపీ చేయబోగా, ఇందుకుకూడ అధికారులు అడ్డు చెప్పారు. రాహుల్జీ ప్రభృతులు ఆ రోజు, మరుసటిరోజు రెండుపర్యాయాలు ఆ చిత్రాలను చూచి మాత్రమే సంతోషించారు.

ఇక తనకు ఇక్కడ పనిలేదని, వీరు లాసాకు తిరిగి బయలుదేరారు. దారిలో "పోతో" విహారానికి వెళ్ళదలచారు. ఇది పదకొండో శతాబ్దంలో నిర్మింపబడింది. ఇది ప్రసిద్ధ పండితుడు పోతోపా జన్మస్థలం. కాని వీరు డగ్యాబ్ విహారానికి వెళ్ళారు. ఆ రాత్రి అక్కడే ఉండదలచుకొన్నారు. పూర్వపు అవతారపురుషుడైన లామా శరీరం ఒకగదిలో భద్రపరచబడింది. ఆ గదిలోనే రాహుల్జీ బృందానికి చోటు ఇచ్చారు. పూర్వకాలంలో పొట్ట చించి ప్రేగులు తీసివేసేవారు. తర్వాత శరీరాన్ని ఎండబెట్టేవారు. కాని ఇప్పుడు శవాన్ని ఉప్పులో వేసి, రెండు నెలలవరకు ఉంచుతారు. వారానికి ఒకసారి దానిపై ఉప్పుచల్లుతారు. ఎండిన శరీరంపై పూర్వకాలంలోనూ, ఇప్పుడూ ఒకవిధమైన పాలాస్త్రి వేస్తారు. ఇలాంటి శరీరాలు ఇతరమఠాలలోకూడ ఉన్నాయి. కాని అవి స్తూపాలలోపల భద్రపరచబడి

ఉన్నాయి. అందుచేత చూడటానికి వీలుపడదు. రాహుల్జీ ప్రభృతులు డగ్యాబ్ విహారంలోని లామా శరీరాన్ని చూశారు. ఈ విహారాన్ని డగ్యాబ్‌పా నిర్మించాడు. అతడు పోతోపా (క్రీ. శ. 1027-1104) సమకాలికుడు.

రాహుల్జీ ప్రభృతులు మరునాడు పోతో విహారానికి బయలుదేరారు. కాని కొంతదూరం వచ్చినతర్వాత, వారికి దారిచూపించే వ్యక్తి రానని మొండికేశాడు. అందుచేత నిరుత్సాహంతో లాసాకు వచ్చారు.

రాహుల్జీ సమ్యే విహారానికి వెళ్ళదలచుకొన్నారు. కాని ప్రయాణపదుపాయాలు లేవు. ఇది చాలా ధన వ్యయంతో కూడినపని. అందుచేత భోట్‌ప్రభుత్వానికి ఒక లేఖ వ్రాశారు. మంత్రివర్గం ఆ లేఖను పరిశీలిస్తున్నట్లు తెలిసింది. వారంరోజులు ఎదురుచూశారు. కాని ప్రయోజనం లేకపోయింది. సాక్యాప్రాంతంలో సంస్కృత తాళపత్ర గ్రంథాలు తప్పకుండా దొరుకుతాయని ఒక బౌద్ధభిక్షువు ద్వారా తెలిసింది. అందుచేత అక్కడకు వెళ్ళ సంకల్పించారు. గే-షే కూడ రాహుల్జీ అభిప్రాయంతో ఏకీభవించారు. రాహుల్జీ ఆగస్టు 27 వ తేదీనాటికి "కమ్యూనిజమే ఎందుకు?" అనే గ్రంథం పూర్తిచేశారు. సాక్యా ప్రాంతంలో యాత్రకు సన్నాహాలు ప్రారంభించారు.

రాహుల్జీ లాసాలో ఉండగా ఒకవ్యక్తి చనిపోయాడు. శవాన్ని కొండప్రక్కన ఉన్న శ్మశానవాటికకు తీసుకువెళ్ళారు. "రాకోవా" జాతివారు నలుగురు శవాన్ని మోసుకుపోయారు. ముఖభాగం కొద్దిగా కనిపించేట్లు,

దానిని ఒకరాతిపై పెట్టారు. కత్తులతో శవాన్ని ముక్కలుగా తరిగి గద్దలకు వేశారు. ఈ కర్మకాండను "థేక్ చోన్" (మహాయానం) అంటారు. వంటచెరకు కరవైనందువల్ల టిబెట్‌లో శవాన్ని దహనంచేయరు. దానిని ముక్కలుగా తరిగివేస్తే, కొన్ని ప్రాణులైనా పొట్ట నింపుకొంటాయని వారి అభిప్రాయం. కాని ఈ కారణంగా "రాకోవా" జాతివారు అస్పృశ్యులైపోయారు. చలికాలంలో మంచు పేరుకొంటున్నందువల్ల, నీళ్లు దొరకవు. అందుచేత 'రాకోవా' జాతివారు తమ మూత్రంతోనే చేతులు కడుక్కొంటారు. [illegible] అందరూ చాలా అసహ్యదృష్టితో చూస్తారు.

రాహుల్జీ, గే-షే ధర్మవర్ధన్ సెప్టెంబరు 8 వ తేదీన లాసానుండి సాక్యాప్రాంతానికి బయలుదేరారు. ఈసారి సామానులు గాడిదలపై ఎక్కించి, వాటివెంట కాలినడకనే వెళ్ళారు. దారిలో రాత్రిపూట తలదాచుకోవడానికి ఏ గ్రామం వెళ్ళినా నల్లులబాధ తప్పలేదు. నాలుగురోజులతర్వాత బ్రహ్మపుత్రనది ఒడ్డు చేరుకొన్నారు. ఆ ప్రాంతంలో సుఖరోగాలు ఎక్కువగా ఉండేవి. కొందరు స్త్రీలు మందుకోసం రాహుల్జీదగ్గరకు వచ్చారు. ఆయన ఏవో మందులు ఇచ్చి, పీడ వదలించుకొన్నారు. తీర్థయాత్రకు వెళ్ళే యువతులిద్దరు దారిలో కనిపించారు. అందులో ఒకరికి కుక్కకాటు వేసింది. రాహుల్జీ టించర్-అయోడిన్ వేశారు. ఆ యువతులు చాలా దూరప్రదేశంనుండి వస్తున్నారు. వారివెంట పురుషులెవ్వరూ లేరు. వారంరోజులు ప్రయాణంచేసినా, దారిలో ఎక్కడా ఊళ్ళు కనిపించవు. రెండు మూడు నెలలప్రయాణం తల

పెట్టిన ఆ యువతుల సాహసాన్ని రాహుల్జీ ప్రశంసించారు. కొంతదూరం వెళ్ళినతర్వాత గే-షే ధర్మవర్ధన్ వాస్తవిక పరిస్థితిని ఆయనకు వివరించారు. ఈ ప్రాంతంలో కన్యలు స్వేచ్ఛావాతావరణంలో పెరుగుతారని, పెళ్ళిఅయినతర్వాత ఈ స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తారని చెప్పారు.

రాహుల్జీ ప్రభృతులు తమ ప్రయాణం కొనసాగించారు. దారిలో ఛార్లెస్ వెల్ తన సిబ్బందితో కనిపించాడు. అతడు భారతదేశంలో కొంతకాలం ఉద్యోగంచేసి పింఛను పుచ్చుకొంటున్నాడు. అతనికి చనిపోయేముందు ఒకసారి టిబెట్ చూడాలనిపించింది. అందుచేత విదేశంనుండి అతడు ఇక్కడకు వచ్చాడు. రాహుల్జీని వెంటనే గుర్తుపట్టారు. ఆయన తన యాత్రాఉద్దేశాన్ని వివరించారు. ఛార్లెస్ వెల్ కొంత డబ్బు ఇవ్వబోగా, రాహుల్జీ తీసుకోక నిరాకరించారు. తర్వాత వీరు రాలుంగ్ విహారానికి వెళ్ళారు. ఇందులో డబ్బైమంది భిక్షువులు, వందమంది భిక్షిణిలు ఉన్నారు. వీరు ప్రతి ఒక్కరూ ఆలు-మగలుగా ఉన్నారు. వీరికి పుట్టిన పిల్లలు తిరిగి భిక్షువులు, భిక్షిణిలు అవుతున్నారు. ఇతర మతాలలోవలె ఇక్కడ యవ్వన-దురాచారం కనిపించదు. ఏక భర్త సంప్రదాయం ఉన్నందువల్ల, జనసంఖ్య పెరిగింది. రాహుల్జీ ఇక్కడకు వచ్చినరోజున భిక్షువులు-భిక్షిణులు పొలం కోస్తున్నారు. మఠం ఆధిపత్యంక్రింద ఉన్న జాగీరు వీరి తిండికి చాలడంలేదు. అందుచేత భిక్షువులు-భిక్షిణిలు చలికాలంలో భిక్షాయాత్ర చేస్తారు.

రాలుంగ్ విహారంలో తాళపత్ర గ్రంథాలేవీ లభ్యం

కాలేదు. అందుచేత రాహుల్జీ బృందం గ్యాంచీకి బయలు దేరింది. దారిలో పోయిఖంగ్ విహారం ఉంది. వీరు అక్కడకు వెళ్ళారు. విహారంలో శాక్యశ్రీభద్రుని భిక్షువస్త్రాలు, బట్ట చెప్పులు, భిక్షాపాత్ర, కమండలం ఉన్నాయి. శాక్య శ్రీభద్రుని విగ్రహం ఒకటి ఉంది. ముక్కు చిలుకవంటి ముక్కు. ఆ విగ్రహాన్ని పరిశీలించగా, ఎవరో భారతీయ కళాకారుడు తయారుచేసినట్లుంది. ఇక్కడ సంస్కృత పుస్త కాల కట్టలు మూడు కనిపించాయి. ఒకదానిలో భిక్షువులు ఉపదేశాలిచ్చే పద్ధతి వివరింపబడింది. మరొకటి (పరికథ) కూడ అటువంటిదే. కాని గ్రంథకర్త పేరులేదు. రాహుల్జీ సంస్కృత గ్రంథాల పట్టిక తయారు చేసుకొన్నారు. కొన్ని ఫోటో తీసుకొన్నారు. తర్వాత షులూ విహారానికి వెళ్లారు. మరునాడు పదకొండు తాళపత్ర గ్రంథాలు వచ్చాయి. రాహుల్జీ సాయంత్రం నాలుగుగంటలవరకు వాటిని పరిశీలిం చారు. వాటిలో చాలాభాగం అసంపూర్ణ గ్రంథాలు. ఇవి కాబుల్-టర్కి-స్థానలలో ఏడోశతాబ్దంలో వాడుకలోఉన్న శారద, రంజన్, ఇంకా మూడురకాల వర్తుల లిపులలో వ్రాయబడిఉన్నాయి. ఒకటి మహా సాంఘిక లోకత్తరవాద సంప్రదాయానికి చెందిన భిక్షుప్రకీర్ణక (వినయ) గ్రంథం. ఇది సంపూర్ణమైనది. మహత్వపూర్ణమైనది. విక్రమశిల నైయాయికుడు జ్ఞానశ్రీరచించిన నవన్యాయగ్రంథాలుకూడ పూర్ణంగాఉన్నాయి. రాహుల్జీ ఈ రెండుకట్టలను ఫోటో తీసుకొన్నారు. తరువాత షిగర్చే, నాథుంగ్లమీదుగా గోర్ విహారానికి వెళ్ళారు.

గోర్ విహారంలో తానాలామాను కలుసుకొని అత నితో సంభాషణ జరిపారు. తర్వాత విహారాన్ని చూశారు. ప్రధాన మందిరంలో క్రింద బుద్ధ, బోధిసత్వ్వాల విగ్రహాలు ఉన్నాయి. పై మందిరాలలో కొన్ని భారతీయ విగ్రహాలు ఉన్నాయి. ఒక మందిరంలో భోట్ వైయాకరణి సితూపణ్ ఛేన్ గీసిన ఎన్నో చిత్రపటాలు ఉన్నాయి. అవి బుద్ధుని జీవితచరిత్రకు సంబంధించినవి. మానవ అంగోపాంగాలు బాగాలేవు. కాని ప్రాకృతిక దృశ్యాలు అందంగాఉన్నాయి. చిత్రణలో చైనాప్రభావం ఉంది. విహారం రెండో అంతస్థులో తాళపత్రగ్రంథాల కట్టలు 38 కనిపించాయి. రాహుల్జీ సంతోషానికి మేరలేదు. అందులో 'వాద న్యాయం' మూల గ్రంథాలు రెండు ఉన్నాయి. ధర్మకీర్తి, దిగ్నాగులంటే రాహుల్జీకి చాలా అభిమానం. 'వాద న్యాయం' ధర్మకీర్తి రచించిన గ్రంథం. ఈ యాత్రలోనే లాసాలో 'వాద న్యాయం' టీకా దొరికింది. కాని అక్కడ మూలగ్రంథం లేదు. రాహుల్జీ భోట్ అనువాద సహాయంతో మూలాన్ని సంస్కృతంలోకి మార్చడానికి మొదలుపెట్టారుకూడ. అయితే ఇప్పుడు మూలగ్రంథమే దొరికింది. రాహుల్జీ ఈరోజు మొత్తం పన్నెండు గ్రంథాలను పరిశీలించారు. ధర్మకీర్తి రచించిన 'హేతువిందు', 'న్యాయవిందు'లపై దుర్వేక మిశ్రుని రెండు టీకలు కనిపించాయి. ఈ గ్రంథాలన్నీ బౌద్ధ న్యాయానికి సంబంధించినవి. దిగ్నాగుడు, ధర్మకీర్తివంటి నైయాయికులు బౌద్ధ సాహిత్యాన్ని పరిపుష్టి నొందించారు. వారు హిందూదేశంలో ఉన్నతశ్రేణికిచెందిన మేధావులు.

ధర్మకీర్తి రచించిన ఈ గ్రంథాలను చూచి రాహుల్జీ సంతోషంతో ఎగిరి గంతులు వేశారు. తానుపడిన కష్టాలన్నీ మరచి పోయారు. అదేరోజు "వాద న్యాయం"లో మూడు పుటలు ఎత్తి వ్రాసుకొన్నారు. నాలుగోరోజున ఎత్తి వ్రాయడం పూర్తిచేశారు.

వారంరోజులతర్వాత రాహుల్జీ బృందం సాక్యకు బయలుదేరింది. సాక్య విహారం క్రీ. శ. 1073లో నిర్మింప బడింది. కాని ఇప్పుడు కనిపించే పురాతన భవనాలు పన్నెండు, పదమూడు శతాబ్దాలనాటివి. 13, 14 శతాబ్దాలలో సాక్య భోట్ ప్రాంతంలో అధిక భాగానికి రాజధానిగా ఉండేది. నేటికీ మహంతి స్వాధీనంలో చాలా పెద్ద జాగీరు ఉంది. దలైలామా, టషీలామా తర్వాత టిబెట్‌లో అతడే పెద్ద. మూడురోజుల యాత్ర అనంతరం రాహుల్జీబృందం సాక్య చేరుకొన్నది. వీరికి కంజూర్ మందిరంలో బస ఏర్పాటు చేయబడింది. వీరికి పుస్తకాలు చూపించడానికి మహంతి అనుమతి ఇచ్చాడు.

వీరు తొలుత నది అవతల ఉన్న విహారాన్ని చూశారు. తర్వాత కొండలో ఉన్న అనేక మందిరాలను చూడటం మొదలుపెట్టారు. ప్రాచీనగ్రంథాలకోసం గాలిం చారు. ఇరవై అయిదు అంగుళాల పొడవు, నాలుగు అంగుళాల వెడల్పుగల ఒక కాగితపు పుస్తకం గేషేధర్మవర్ధన్‌కు దొరికింది. ఇది ప్రమాణవార్తికంలో ఒకటిన్నర అధ్యాయాలపై ప్రజ్ఞాకర గుప్తభాష్యం-వార్తికాలంకారం. ఇది చాలా ముఖ్యమైన గ్రంథం. తర్వాత వీరు ఛ్వాచే-లఖంగ్‌కు

సారు తరగదా మెస్మరిజన్



వెళ్ళారు. ఇక్కడ సాక్య పణ్ ఛేన్ (క్రీ. శ. 1182-1251) చిత్రపటం ఉంది. రాహుల్జీ దీనిని ఫోటో తీశారు. తర్వాత చిదోంగ్ భవనంలోకి వెళ్ళారు. ఇక్కడ ఒక గదిలో ఏడెనిమిది వరుసలలో చాలా ఇత్తడి విగ్రహాలు ఉన్నాయి. వీటిలో ఎక్కువభాగం భారతీయ విగ్రహాలు. కొన్ని చాలా అందంగా ఉన్నాయి. కొన్ని ఏడెనిమిది శతాబ్దాల నాటివి అయినట్లు కనిపిస్తాయి. క్రీ. శ. 1135 నాటి జైన విగ్రహం ఒకటి ఉంది. 28 విగ్రహాలు చలువరాతితో తయారు చేయబడినవి. రాహుల్జీ వీటిలో కొన్నిటిని ఫోటో తీశారు.

తర్వాత వీరు మహాకాలమందిరంలోకి వెళ్లారు. ఒక పెద్ద రాగితొట్టిలో నీరు అట్టిపెట్టబడి ఉంది. ఈ తొట్టిలోని నీరు ఎప్పటికీ తరగదని, ఎండిపోదని చెప్పారు. దీనిలోపల తొంగి చూస్తే, చాలా మంచి మంచి దృశ్యాలు అగుపిస్తాయని, భవిష్యత్తుకు సంబంధించిన విషయాలు తెలుస్తాయనికూడ చెప్పారు. తొట్టి చాలా చీకటి ఇంట్లో ఉండేది. దీపం సహాయంతో రాహుల్జీ ప్రభృతులు అక్కడకు వెళ్లారు. తొట్టిలోని నీరు ప్రళయకాలంవరకు ఉంటుందనే విషయం రాహుల్జీ నమ్మలేదు. కాని దృశ్యాలు కనిపించడం సహజమేనన్నారు. ఆ చీకటిలో దీపం వెలుగు కొద్దిగా చూపిస్తే తొట్టినీరు మెస్మరిజమ్‌లో ఉపయోగించే ఒకవిధమైన కాటుక చుక్కవలె పనిచేస్తుందని, మనుష్యుడు చిత్తైకాగ్రతకలవాడైతే అతని మనస్సులోపలి సంస్కారాలను ఈ దర్పణంలో చూడవచ్చునని ఆయన అభిప్రాయం.

ముకదచ్చర్ల



ప్రమాణవార్తిక భాష్యాన్ని శాక్యశ్రీభద్రుని శిష్యుడు విభూతిచంద్రుడు స్వహస్తంతో వ్రాశాడు. విక్రమశిల ధ్వంసమైనతర్వాత శాక్యశ్రీభద్రుడు మొదట తూర్పు బెంగాల్‌కు వెళ్ళాడు. తర్వాత నేపాలుకువచ్చాడు. సాక్యలామా డగ్పా - గ్లఛన్ (క్రీ.శ. 1147-1216) దూత ఆహ్వానంపై సాక్యకు వచ్చాడు. ఎన్నోవళ్ళు ఇక్కడే ఉన్నాడు. ఇక్కడే సాక్యపణ్‌ఛేన్ అతని శిష్యుడైనాడు. అప్పటికి భారత దేశంలోకి కాగితంరాలేదు. కాని చైనా సంబంధంవల్ల, నాలుగు శతాబ్దాలుముందే టిబెట్‌లోకి కాగితం వచ్చింది. భారత దేశంలో తాళపత్రాలు తేలికగా దొరుకుతున్నట్లే, ఇక్కడ కాగితం దొరికేది. అందుచేత విభూతిచంద్రుడు వార్తికాలంకారాన్ని కాగితంపై వ్రాశాడు. ఇందులో మూలకారికలుకూడ ఇవ్వబడ్డాయి. వీటిని రాహుల్జీ పరిశీలిస్తూ ఉండగా, గ్రంథాన్వేషణకు వెళ్ళిన గేషేధర్మవర్ధన్ తిరిగి వచ్చాడు. అతడు తెచ్చిన గ్రంథాలు ఏవీ పూర్తిగాలేవు. రెండేసి, నాలుగేసిపుటలు మాత్రమే ఉన్నాయి. తాళపత్రగ్రంథాలను కడిగి, ఆ నీటిని త్రాగిస్తే జబ్బులు నయమవుతాయని, పాపాలు నశిస్తాయనే విశ్వాసం ప్రజలలో ఉన్నట్లు తెలిసింది. అందుచేత ఈతాళ పత్ర గ్రంథాలను ముక్కలుచేసి, ప్రసాదంవలె పంచిపెట్టే వారట. ఇలా ఎన్ని అమూల్య గ్రంథాలు నష్టమైనాయో అని రాహుల్జీ చాలా చింతించారు.

# ఒకభారతీయ పండితుని గాథ

భారతీయపండితుడు స్మృతిజ్ఞానకీర్తి జీవితంలో ఒక ఘట్టానికి చిత్రరూపం కల్పించడంలో గేషేధర్మవర్ధన్ నిమగ్నుడైనాడు. స్మృతిజ్ఞానకీర్తి భారతదేశంలో ఉన్నత శ్రేణికిచెందిన పండితుడు. మతప్రచారంకోసం, అనువాదం చేయడంకోసం అతనిని ఒక టిబెట్ పండితుడు టిబెట్‌కు తీసుకు వెళ్ళుతూ, నేపాలులో మరణించాడు. స్మృతిజ్ఞానకీర్తికి టిబెట్‌భాష తెలియకపోయినప్పటికి, ఆ దేశంతో ఏమీ పరిచయం లేనప్పటికి, ఒక పవిత్రకార్యసాధనకై బయలుదేరాడు. మొదట టిబెట్‌భాష బాగా నేర్చుకోవాలని అతడు నిశ్చయించాడు. అందుచేత భిక్షువేషం వదలిపెట్టి, మామూలు భోటియావేషం వేసుకొన్నాడు. 'షబ్' అనే గ్రామంలో కొద్దిరోజులదాకా పశువులను మేపాడు. కాని తాను భారతదేశానికి వెళ్లే దారిలో ఉన్నాడు. అందుచేత ఇది ఎప్పుడైనా తనకు ప్రమాదం కలిగిస్తుందని తోచింది. బ్రహ్మపుత్రకు అవతల షిగర్చేకు రెండుమైళ్ళదూరంలో,పశువులను మేపుకొంటూ తిరిగే బృందంలో చేరాడు. ఆ ప్రాంతంలోనే పది పన్నెండేళ్ళు పశువులను మేపాడు. అతని యజమానురాలు చాలా కఠినస్వభావంగలది. ఆమె 'యాక్' జంతువుతో పాలుతీసేటప్పుడు దాని పొదుగు చేతికి అందేదికాదు - అందుచేత స్మృతిజ్ఞానకీర్తిని వంగమనిచెప్పి, అతని వీపుపై కూర్చుని ధీమాగా తీసేదట. గేషెధర్మవర్ధన్ ఈ ఘట్టాన్ని బొమ్మగా గీశారు.

అతడు బొమ్మగీస్తూ ఉండగా, రాహుల్జీ వారి కాలం కారాన్ని ఎత్తి వ్రాసుకోవడం మొదలుపెట్టారు. అప్పు డప్పుడు ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకొంటున్నారు. రాహుల్జీ వ్రాస్తూఉండగా ఒకచోట "ఈ పూజలన్నీ బాలల వినోదాలు" అనే వాక్యం కనపడింది. ఆయన, గేషే ఇద్దరూ నవ్వుకొంటున్నారు. అదే సమయంలో విహారం పెద్ద పేష్కర్ భార్య చామోకుష్ వచ్చింది. "ఏమిటిసంగతి" అని గుచ్చి గుచ్చి అడిగింది. పూజలు నిస్సారమైనవని గ్రంథంలో వ్రాయబడిఉన్నట్లు రాహుల్జీ తెలియజేశారు. చామోకుషో అప్పటికే ఏదో ఉపవాసవ్రతం మొదలుపెట్టింది. ఆ రోజున పారణం. పనికత్తె సూప్ తయారుచేసి, ఆమె ముందు పెట్టింది. ఎందుచేతనో ఆమె సూప్‌ను విసరికొట్టి, పనికత్తెకు చెంపలు వాయించింది. రాహుల్జీ ఈ విషయాన్ని ఆమెకు గుర్తుచేశారు. ఆమెతో తనకు ఏర్పడిన చనువుకొద్దీ "వ్రతంవల్ల మీరుపొందిన పుణ్యం ఇదేనా?" అని ప్రశ్నించారు. చామోకుషో చాలా కోపపడుతుందనుకొన్నారు. కాని ఆమె ఏమీ అనుకోలేదు. పైపెచ్చు అక్కడకూర్చుని, ఏవేవో కబుర్లుచెప్పింది. ఏడాదిక్రిందట ఇంగ్లీషు పొలిటికల్ ఏజంటు తనభార్యసమేతంగా ఇక్కడకువచ్చాడు. చామో కుషో ఇప్పుడు అతనిభార్య వేషాన్ని ఎగతాళిచేసింది. "ఆమె చెవులకు ఏ విధమైన నగలు లేవేమిటి? అని రాహు ల్జీనిప్రశ్నించింది. "ఆమెవద్దధనుర్బాణాలుఉండేనగఉంటుంది. మీ వద్ద బాణంలేకుండా వట్టి ధనుస్సుమాత్రమే ఉంటుంది" అని రాహుల్జీ చెప్పారు. "కాని నాకు ఆమె తలలో ఏ

విధమైన నగ కనిపించలేదు" అని చామ్కుషో అన్నది. రాహుల్జీ నవ్వుతూ, "ఇంగ్లీషు స్త్రీ ధనుర్బాణాలను ఇంగ్లీషు పురుషుడే చూడగలడు" అని రాహుల్జీ అన్నారు.

రాహుల్జీ బృందం సాక్యలో 17 రోజులు గడిపిన తర్వాత, అక్టోబరు 27 వ తేదీన నేపాలుకు బయలుదేరింది. వీరు అయిదురోజులతర్వాత టింగరీ చేరుకున్నారు. ఇక్కడ భోటియా పండితుడు పూరాగ్యర్గేన్ ఉండేవాడు. గేమ్ధర్మ వర్ధన్ అతనిని కలుసుకొనివచ్చాడు. పూరాగ్యర్గేన్నుగూర్చి ఒక కథ ప్రచారంలో ఉండేది. పూరాగ్యర్గేన్వృద్ధుడు. అతని భార్య పడుచుది. ఆమె ఖంపాఅనే యువకుని ప్రేమించింది. పూరాగ్యర్గేన్ మేజిస్ట్రేట్కు ఫిర్యాదుచేశాడు. ఖంపాకు బెత్తందెబ్బలు విధింపబడ్డాయి. దెబ్బలు పడేటప్పుడు అతడు ఏ విధంగా తల్లడిల్లిందీ వర్ణిస్తూపూరాగ్యర్గేన్ ఒకగేయం అల్లాడు. దానిని తన విద్యార్థిచేత వ్రాయించాడు. రాహుల్జీ ఆ గేయాన్ని కాపీచేయించుకొనివెళ్ళారు. దాదాపు 17 రోజులు ప్రయాణంచేసి, కాఠ్మండూ చేరుకొన్నారు. అక్కడ ధర్మసాహు ఇంట మకాంపెట్టారు. త్రిరత్నమాన్, జ్ఞానమాన్ ఇద్దరూ ఇంటివద్దనే ఉన్నారు. వారు రాహుల్జీ బృందానికి చక్కని ఆతిథ్యం ఇచ్చారు.

ఒకరోజున రాహుల్జీ ఇటూఅటూ తిరుగుతూ సునయశ్రీ విహారానికి వెళ్లారు. అంతకు క్రితం వచ్చిన భూకంపం వల్ల, విహారం పడిపోయింది. సునయశ్రీ మట్టిబొమ్మ తలమినహా, తక్కినభాగం చెడిపోయిఉంది. రాహుల్జీ సునయశ్రీ మట్టిబొమ్మ తలను ఫొటో తీసుకొన్నారు. సాయంత్రం

రాజగురు పండిత హేమరాజశర్మను కలుసుకొన్నారు. ఈ విహారంలో చాలా విలువగల తాళపత్రగ్రంథాలు అనేకం ఉండేవని. భూకంపానికితోడు వర్షంకూడ వచ్చి అవన్నీ పాడైపోయాయని రాజగురువు నిట్టూర్చాడు. వర్షానికి ముందు తన గ్రంథాలను చూస్తానన్నా, బౌద్ధపురోహితులు చూడనివ్వలేదని చెప్పాడు.

రాహుల్జీ మరునాడు విక్రమశిల విహారానికి వెళ్లారు. ఇక్కడ ఉన్న విగ్రహం వాస్తవంలో బుద్ధునిది. కాని దీనిని సింహసార్థవాహుని విగ్రహంగా మార్పుచేశారు. బుద్ధుని శరీరంపై ఉన్న భిక్షువస్త్రాన్ని శానంతో చెక్కివేసినట్లు కనిపిస్తుంది. బౌద్ధమతానుయాయులే ఈ విధంగా చేసినందుకు రాహుల్జీ చాలా చింతించారు. ఇక్కడకూడ సంస్కృత గ్రంథాలు ఉన్నాయి. కాని శ్రావణమాసం దాటితేగాని చూడనివ్వరని తెలిసింది. ఒక కాగితంపై బంగారుతో వ్రాసిన "అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమిత" కూడ ఉంది. దీనిని నాగార్జునుడు స్వహస్తంతో వ్రాశాడని, ఎదుటనే ఉన్న సరోవరంలోనుండి బయటకువచ్చిందని ప్రజలు చెప్పారు. రాహుల్జీ ఈ విషయాన్ని నమ్మలేదు. పన్నెండో శతాబ్దానికి పూర్వం భారతదేశంలో కాగితపు సంప్రదాయం బొత్తిగా లేదని, వెయ్యేళ్ళకు పూర్వమే పుట్టిన నాగార్జునుడు కాగితంపై వ్రాసిఉండటం అసంభవమని ఆయన చెప్పారు.

## స్వదేశ ప్రయాణం

రాహుల్జీ కాఠ్మండూలోని రాజవంశస్థులనుకూడ కలుసుకొని, వారితో సంభాషించారు. తర్వాత డిసెంబరు 2వ

తేదీన భారతదేశానికి బయలుదేరారు. ఆయన వెంట గేషె ధర్మవర్ధన్‌కూడ ఉన్నారు. నాలుగురోజుల తర్వాత ఇద్దరూ పాట్నా చేరుకొన్నారు. కార్మండూలో ఉండగానే రాహుల్జీ జ్వరగ్రస్తులైనారు. కొద్దిగా కోలుకొన్నతర్వాత, ఇద్దరూ రాజగృహం, కాశీ, ప్రయాగలను సందర్శించారు. పిమ్మట గేషెధర్మవర్ధన్ సారనాథ్‌కు వెళ్ళిపోయారు.

రాహుల్జీ టిబెట్‌లో వ్రాసిన గ్రంథాలను ప్రయాగలో ఒకవైపున అచ్చువేయించుకొంటూ, మరోవైపున టిబెట్‌యాత్రనుగూర్చి వ్రాశారు. టిబెట్ చిత్రకళనుగూర్చి ఒక పెద్దవ్యాసం వ్రాసేటప్పుడు, భారతీయ చిత్రకళనుగూర్చి కూడ ఆయనలో కొన్నిభావాలు రేకెత్తాయి భారతీయ చిత్రకళను ఇలా దశలవారీగా విభజించుకొన్నారు: (1) మౌర్య (క్రీ. పూ. 300), (2) గాంధార కుషాణ (క్రీ. శ. 100), (3) గుప్త (క్రీ. శ. 500), (4) అంతిమ హిందూ (క్రీ. శ. 1000), (5) మొగల్ (క్రీ. శ. 1600), (6) రాజపుత్ర (క్రీ. శ. 1700), (7) ఆధునిక (క్రీ. శ. 1900).

కొద్దిరోజులతర్వాత రాహుల్జీ ఛప్రామీదుగా సీవాన్‌కు వెళ్ళారు. అక్కడ గేషెగోవర్ధన్ కనిపించాడు. ఇద్దరూ కలసి కుసీనార. గోరఖ్‌పూర్, లుంబినీలకు వెళ్ళారు. అప్పట్లో లుంబినీలో పురావస్తువులను వెలికి తీస్తూఉండేవారు. కాని పురాతత్వంగూర్చి ఓనమాలు తెలియని వ్యక్తికి ఈ పని అప్పగించినందుకు రాహుల్జీ చాలా చింతించారు. అతడు రాళ్ళు, సున్నం, మట్టి, అన్నిరకాల విగ్రహాలు కలిపి గంపలకు ఎత్తిస్తున్నాడు. ఈ సందర్భంలో

చాలా విగ్రహాలు విరిగిపోయాయి. త్రవ్వకాలలో శుంగ కాలానికి చెందిన ఒక మట్టిబొమ్మ, కుషాణుల కాలానికి చెందిన ఎర్రని రాతిబొమ్మతల, ఆరేడు అంగుళాల పొడవు గల అవలోకితేశ్వరుని సుందర శిలావిగ్రహం, గుప్తకాలానికి చెందిన ఎన్నో అందమైన మట్టిబొమ్మలతలలు కనిపించాయి. గేషె. ధర్మవర్ధన్ తనఎదుట కనిపిస్తున్న హిమాలయాన్ని బొమ్మగా గీశాడు.

పిమ్మట రాహుల్జీ, గేషెగోవర్ధన్లు బలరామపురం మీదుగా లక్నో వెళ్ళి మ్యూజియాన్ని చూశారు. తర్వాత పాట్నాకు వచ్చారు. వినయపిటకం ప్రచురించే బాధ్యతను మహాబోధిసభవారు స్వీకరించారు. రాహుల్జీ మార్చి నెలలో అక్కడే ఉండి ప్రూఫులు చూశారు. నెలాఖరులో ఇద్దరూ కలకత్తాకు బయలుదేరారు. ఈ సంవత్సరం (క్రీ. శ. 1935) జపాన్, కొరియా, మంచూరియా, రష్యా, ఇరాన్ల యాత్ర చేయాలని రాహుల్జీ ఉద్దేశం. అందుచేత గేషెధర్మవర్ధన్ వద్ద సెలవుతీసుకొని రంగూన్ వెళ్లారు.

---



# ఎన్మిమిదో అధ్యాయం

## జపాన్, రష్యా యాత్ర

రాహుల్జీ "గంగాసాగర్" అనే ఓడలో క్రీ. శ. 1935 ఏప్రిల్ 2 వ తేదీన కలకత్తానుండి రంగూన్ బయలుదేరారు. రంగూన్‌లో వైద్యుడుగాఉన్న జయపురం వాస్తవ్యుడు హనుమాన్‌ప్రసాద్ సపరివారంగా అదే ఓడలో ప్రయాణంచేశాడు. రాహుల్జీ భిక్షువేషంలో ఉండగా చూచి, చాలా ఆప్యాయంగా పలకరించాడు. ఆయనకు ఉచిత మర్యాదలు చేశాడు. కాని రాహుల్జీ ముస్లింహోటల్‌లో మాంసం తింటూఉండటం చూశాడు. ఇది అతనికి గిట్టలేదు. "మీరు అహింసను అంగీకరిస్తూ, మాంసం ఎందుకు తింటున్నారు? ఇలా చేయడంద్వారా మీరు హింసలో పాలు పంచుకొన్నట్లు కాదా?" అని అతడు ప్రశ్నించాడు. ఇందుకు రాహుల్జీ చెప్పిన సమాధానం ఇది: "పని జరగకముందు, దానిని చేసేకోర్కె పురుషుని ఉన్నప్పుడే, ఆ పనికి అతడు కర్త కాగలుగుతాడు. బజారులో మేకను చంపేపని జరగక ముందు ఆ పనిచేయాలనే కోర్కె నాకు లేదని మీరు ఎరుగుదురు. బియ్యం పప్పువలె నిర్జీవమైన స్థితిలోనే మనం మాంసాన్ని తింటున్నాం. ఒకవేళ నేను భోజనంచేయాలనే కోర్కెను వెల్లడించి, ఆ తర్వాత కత్తితీసుకొని మేకను చంపబోతే, అందుకు తప్పకుండా బాధ్యుణ్ణి అవుతాను."

రాహుల్జీ జపాన్ వెళ్ళుతున్నట్లు రంగూన్‌లోని హిందీ ప్రేమీమండలికి తెలిసింది. మండలి వార్షికోత్సవానికి అధ్యక్షత వహించవలసిందని వారు ఆయనను కోరారు. రాహుల్జీ ఇందుకు అంగీకరించారు. సాయంత్రం మోటారులో రంగూన్‌పట్టణం చూచివచ్చారు. హిందీ ప్రేమీ మండలి వార్షికోత్సవం అయిదురోజుల తర్వాత జరుగుతుంది. అందుచేత ఈలోగా బర్మాలో తిరిగి రావాలని రాహుల్జీ అనుకున్నారు. మాండలేకు వెళ్ళే రైలుబండి ఎక్కారు. తెల్లవారేటప్పుడు ఈరైలుబండి ఒక బస్తీని దాటి వెళ్ళింది. ఆబస్తీలో ఆడుతున్న ఒక నాటకం అప్పటికీ సమాప్తి అయినట్లులేదు. రాహుల్జీ మాండలేలో దిగి ఒక బౌద్ధవిహారానికి వెళ్లారు. టిబెట్‌లోవలె ఇక్కడకూడ బౌద్ధ భిక్షువులలో శౌడీతనం ఉన్నట్లు గ్రహించారు. సగాయీ పర్వతంలోని విహారాలనుచూచి మాండలేకి తిరిగి వచ్చారు. పిమ్మట కోటలో రాజప్రాసాదాలను చూశారు. వాటిలో ఎక్కువభాగం కొయ్యభవనాలు. రాహుల్జీ ఆసాయంకాలమే రైలుఎక్కి రంగూన్‌కు తిరిగి వచ్చారు. బర్మాస్త్రీలు ఆర్థికంగా, సాంఘికంగా చాలా స్వతంత్రులుగా ఉన్నట్లు ఈ పర్యటనలో రాహుల్జీకి తోచింది.

ఆయన హిందీ ప్రేమీమండలి వార్షికోత్సవంలో పాల్గొని, ఆ మరునాడు ఒక ఓడలో పెనాంగ్‌కు వెళ్లారు. అక్కడఉన్న బౌద్ధ సంఘ భవనంలో మకాంపెట్టారు. ఆ భవనం చాలా చక్కగా నిర్మింపబడిఉంది. ఇటలీనుండి చలువరాతితో బుద్ధ, ఆనంద, కాశ్యప, అమితాయ మొద

లైనవారి విగ్రహాలు చేయించి తెచ్చారు. పినాంగ్ నలు వైపులా రబ్బరు, కొబ్బరిచెట్లు విశేషంగా ఉన్నాయి. ఇక్కడనుండే జపాన్‌కు వెళ్ళాలని రాహుల్జీ ఉద్దేశం. కాని వెంటనే జపాన్‌కు వెళ్ళే ఓడ ఏదీలేదు. అందుచేత సింగ పూర్ దాకా రైలులో వెళ్ళ నిశ్చయించారు. జాయస్వాల్ పెద్దకుమారుడు మలాకాలో బారిస్టరు పనిచేస్తున్నాడు. మలాకాకు రావలసిందని అతడు రాహుల్జీకి జాబుకూడ వ్రాశాడు. అందుచేత ఆ మరునాడు రాహుల్జీ బయలు దేరారు. మలయారాజధాని కౌలాలంపూరులో దిగారు. అక్కడ ఏర్పాటుచేయబడిన బౌద్ధ సభలో ఉపన్యసించారు. ఆయనను మలాకాకు తీసుకువెళ్ళడానికై జాయస్వాల్ పెద్ద కుమారుడు వచ్చాడు. కాని వ్యవధి లేనందువల్ల రాహుల్జీ మలాకాకు వెళ్ళలేదు. రైలులో సింగపూర్‌కు వెళ్ళారు. ఇక్కడ జరిగిన ఒక బౌద్ధసభలో ఉపన్యసించారు. ఆయన పాళీభాషలో మాట్లాడగా, ఒక బౌద్ధసన్యాసి సింహాళభాష లోకి అనువదించాడు.

రాహుల్జీ సింగపూర్‌నుండి ఓడలో బయలుదేరి, వారంరోజులకు హాంకాంగ్ చేరుకొన్నారు. అదేరోజు పట్ట ణంలోని ముఖ్యప్రదేశాలను చూచి, తిరిగి ఓడరేవుకు వచ్చారు. అక్కడనుండి షూంఘైకి యాత్ర కొనసాగించారు. దారిలో యాంగ్‌ట్సీ సముద్ర సంగమప్రదేశాన్ని చూశారు. రెండురోజులతరువాత షూంఘై చేరుకున్నారు. టాక్సీలోవెళ్ళి పట్టణంలోని ముఖ్యప్రదేశాలను చూశారు. ఆసియాలో

[illegible]
[illegible]



కెల్లా ఎత్తైన భవనం ఇక్కడ ఉంది. దానిపేరు సాసూన్ భవనం. అది 20 అంతస్థులు కలిగిఉంది.

## జపాన్‌లో

ఆదే రోజు ఓడప్రయాణం కొనసాగింది. మూడో రోజున రాహుల్జీ జపాన్‌లో ప్రవేశించారు. క్యూషోదీవికి చెందిన మోజీపట్టణం చేరుకున్నారు. సముద్రతీరాన, ఒక కొండప్రక్క ఈ పట్టణం నిర్మింపబడింది. రాహుల్జీ ఆ మరునాడు తప్తకుండాలను చూశారు. ఒక కుండంలో స్నానం చేశారు. వేడినీటితో చికిత్సచేసే పెద్ద ఆస్పత్రి ఒకటి ఇక్కడ ఉంది. రాహుల్జీ ఆ సాయంకాలమే ఓడరేవువద్దకు తిరిగి వచ్చారు. తెల్లవారేసరికి కాంబే చేరుకున్నారు. తన పూర్వ మిత్రుడు ఆనందమోహనసహాయ్‌ని కలుసుకున్నారు.

మరో వారంరోజులకుగాని ఓడ యోకహామాకు బయలుదేరదని తెలిసింది. అందుచేత రాహుల్జీ ఇతరపట్టణాలను చూడటానికి వెళ్ళారు. జపాన్‌లో అన్నిటికంటె పురాతనమైన హోరియోజీ బౌద్ధవిహారాన్ని సందర్శించారు. ఇక్కడ ఉన్న మందిరాలలో ఎక్కువభాగం కొయ్యతో నిర్మింపబడినవి. ఒక మందిరం నేటికి పద్నాలుగుశతాబ్దాలక్రితం నిర్మింపబడింది. ప్రధానమందిరంలో గోడలపై అజంతావంటి చిత్రాలు ఉన్నాయి. ఇక్కడ పలురకాలైన వాయిద్యాలను సేకరించి ఉంచారు. నాలుగు అంతస్థులస్తూపం ఒకటి ఉంది. బుద్ధుని విగ్రహం ఒకటి తయారుచేయడానికై భారతదేశంనుండి మట్టిని తెప్పించినట్లు రాహుల్జీకి తెలియజేశారు. మరునాడు

ఆయన జపాన్ పూర్వరాజధాని క్యోటోకు వెళ్ళారు. బౌద్ధ దినపత్రిక "చుగాయినిప్పో" కార్యాలయాన్ని హిగ్షి హోంగన్ విశాలమందిరాన్ని సందర్శించారు. ఆ మందిరం యావత్తూ కొయ్యతో నిర్మింపబడింది. మందిరనిర్మాణానికై పెద్దపెద్ద దేవదారు స్తంభాలను ఈడ్చుకువచ్చేటప్పుడు లావైన త్రాళ్ళు అవసరమైనాయి. వెంటనే వేలాది బౌద్ధ స్త్రీలు తమ తలవెంట్రుకలను కోసి, వాటితో త్రాళ్ళు తయారుచేయించారట. ఆ త్రాళ్ళను ఇప్పటికీ అక్కడ సురక్షితంగా ఉంచారు.

రాహుల్జీ అదేరోజు కాంబేకి తిరిగివచ్చారు. మరునాడు ఓడ బయలుదేరింది. రెండురోజులకు యోకహామా చేరింది. రాహుల్జీ తన సామానును న్యూ యోకహామా ఎక్స్ప్రెస్ స్వాధీనంలో ఉంచారు. అదేరోజు టోకియోకు వెళ్లారు. అక్కడ దాదాపు అయిదువారాలు ఉన్నారు. చాలామంది పండితులను కలుసుకున్నారు. విద్యాసంస్థలను సందర్శించారు. టోకియోలో ఉన్నన్ని రోజులూ, ఆయనకు సకాకీబారా ఆతిథ్యమిచ్చాడు. జపాన్లో ఎంగిలిఅన్నం వదలిపెట్టడం తప్పుగా భావిస్తున్నట్లు రాహుల్జీ గ్రహించారు. ఒకటి రెండుసార్లు ఆయన ఎంగిలిఅన్నం వదలిపెట్టారు. తనమిత్రుడు కలుగజేసుకొని, "మేము భారతదేశంనుండి ఈ సత్సంప్రదాయాన్ని నేర్చుకొన్నాం. మీరే ఎంగిలిఅన్నం వదలిపెడితే ఎలాగ!" అన్నాడు. రాహుల్జీ నాడు మొదలుకొని నేటికీ ఈ సంప్రదాయాన్ని పాటిస్తున్నారు.

టోకియోలో రిష్షో అనే బౌద్ధ విశ్వవిద్యాలయముంది. ప్రొఫెసర్ కిమూరా ఇక్కడ అధ్యాపకుడుగా ఉన్నాడు. రాహుల్జీ అతనిని చాలాసార్లు కలుసుకుని, సంభాషించారు. భారతీయ, సింహళభిక్షుసంస్థలు కొన్ని ఇక్కడఉన్నాయి. వారు సభలు ఏర్పాటుచేసి, రాహుల్జీని ఆహ్వానించారు. లంకనుండివచ్చిన నారద, రాహుల్జీకి తోడైనాడు. టోకియోలోని పండితులు ఒక సభజరిపి, వీరిద్దరిని సన్మానించారు. సన్మానానికి నారద పాళీ భాషలోను, రాహుల్జీ సంస్కృతంలోను సమాధాన మిచ్చారు.

ఒక జపాన్ గ్రామంలో ఉండి, గ్రామీణ ప్రజాజీవితాన్ని అధ్యయనం చేయాలని రాహుల్జీ అనుకొన్నారు. బోద్దో భారతదేశానికి వచ్చినప్పుడు రాహుల్జీకి పరిచితుడైనాడు. అతడు ఇక్కడ కనిపించాడు. తన గ్రామంనిట్టాకు రమ్మని రాహుల్జీని ఆహ్వానించాడు. అతని తమ్ముడు కమ్యూనిష్టుభావాలు గలవాడు. ఇందుకుగాను అతడు చాలా నెలలు జైలుశిక్ష అనుభవించాడు. ఇప్పుడు అతడు ఒక మాసపత్రికకు సంపాదకుడుగా ఉన్నాడు. రాహుల్జీ మేనెల 23వ తేదీన బోద్దో వెంట ఆ గ్రామానికి వెళ్ళారు. అతని ఇల్లు ఒక కొండపై ఉంది. అతనికి బౌద్ధ పౌరోహిత్యం ఉంది. తద్వారా కొంత ఆదాయం వస్తుంది. దీనికితోడు పొలం-పుట్రకూడ ఉంది.

రాహుల్జీ జూలై 20వ తేదీవరకు ఈ గ్రామంలో బోద్దో ఇంట ఉన్నారు. అతనికి ముఖ్యంగా ఇంగ్లీషు, కొద్దిగా సంస్కృతం తెలుసు. జపాన్ భాష రాదు. తన తల్లి

దండ్రులతో మాట్లాడవలసివస్తే చేతిసైగతో మాట్లాడేవారు. అన్నదమ్ములిద్దరూ ఇంకా పెళ్ళిచేసుకోలేదు. ఇంటి ఆవరణలో తోటఉంది. అందులో కొన్ని దేవదారు వృక్షాలు కూడ ఉన్నాయి. దేవదారు వృక్షాలంటే జపానీయులకు చాలా ప్రీతి. హిమాలయంనుండి దేవదారు మొక్కలను ఇక్కడకు తెచ్చారు. పదేసి అడుగులపొడవుగల మొక్కలను వీధులలో అమ్మడం రాహుల్జీ చూశారు.

భారతదేశంనుండి ఇక్కడకు ప్రూఫులువస్తే, రాహుల్జీ వాటిని దిద్దుకొంటూ మరోవైపున "దీర్ఘనికాయాన్ని" హిందీలోకి అనువదిస్తూ ఉండేవారు. విరామసమయంలో జపానీభాష నేర్చుకోవడానికి ప్రయత్నించేవారు. ఆయనవద్ద బ్యోగో సంస్కృత కావ్యాలు చదివేవాడు. అప్పుడప్పుడు ఆయనను చుట్టుపట్ల పల్లెటూళ్ళకు, బస్తీలకు తీసుకువెళ్ళేవాడు.

రాహుల్జీ జపాన్ రైతుల జీవితాన్ని శ్రద్ధగా అధ్యయనంచేసారు. వ్యవసాయం చేయడంలో రైతులు ఆధునిక వస్తువులను ఉపయోగిస్తున్నారు. పట్టణాలనుండి పడవలలో వచ్చే పాయఖానను ఖరీదుచేసి, చేలను సత్తువచేస్తున్నారు. పచ్చి మలం పడినతర్వాత, కొద్దిరోజులవరకు ఆ చేలప్రక్క వెళ్ళడానికే సాధ్యంగాదు. ఆస్తిపై జ్యేష్ఠపుత్రునికే హక్కు ఉంటుంది. అందుచేత చేలను పంచుకొనే సమస్యలేదు. తల్లిదండ్రులు నగదు డబ్బులోనుండి కొంతతీసి ఇస్తేనో, జ్యేష్ఠ సోదరుడు దయదలిస్తేనో, తమ్మునికి ఏమైనా లభిస్తుంది. లేకపోతే అతనికి ఆస్తిలో ఏమీ దక్కదు.

ఈ సంప్రదాయాన్ని రాజ్యాంగం ఖండించారు. జ్యేష్ఠసోదరునికి ఉన్న బాధ్యతలను బ్యోదో ఏకరువుపెట్టాడు. జపాన్‌లో తమ్ముడు పెద్దవాడై, నాలుగుడబ్బులు సంపాదించుకోగలిగినప్పుడే పెళ్ళిచేసుకొంటాడు. అలాగే ఆడపిల్లలుకూడ నాలుగైదేళ్ళు ఏ కార్ఖానాలోనో, ఏ ధనికునిఇంటనో పనిపాటలుచేసి, పెళ్ళికి అవసరమైన డబ్బు కూడబెట్టుకొంటారు. బీదలైన తలిదండ్రులు డబ్బు అడ్వాన్సు తీసుకొని, తమ ఆడబిడ్డలను కొన్నిఏళ్ళపాటు ధనికులఇంట పనిపాటలకు పంపుతారు. ఆచరణలో ఇది ఆడపిల్లలను అమ్మివేయడమే అవుతున్నది. పెళ్ళి కాకపూర్వం బస్తీలలోని ఆడపిల్లలు తమ శరీరాన్నిసైతం అమ్మి తల్లిదండ్రులకు సేవ చేయవలసివస్తుంది.

బ్యోదో ఇంటిప్రక్క ఒక రైతు ఉండేవాడు. కుటుంబంలో భార్యా, భర్తలేకాకుండా, నలుగురు మగపిల్లలు, ఆరుగురు ఆడపిల్లలు ఉండేవారు. పెద్దవాడు తండ్రివెంట వ్యవసాయానికి వెళ్ళేవాడు. రెండోవాడు యోకహోమాలో టాక్సీ నడిపేవాడు. అతనికి ఎవరో తనకూతురును ఇచ్చి పెళ్ళి చేశాడు. అద్దెకు ఇచ్చుకొమ్మని ఉచితంగా ఒక బండి కొనిపెట్టాడు. మూడోవాడు పదిహేనవ ఏటనే పూల తోటలు వేసే ఒకరైతుకు అమ్మివేయబడ్డాడు. ఆ రైతు కొంతడబ్బు అడ్వాన్సు ఇచ్చాడు. ఆ కుర్రవాడు అతనివద్ద పనిచేస్తూ అయిదేళ్ళు అయింది. మరో ఏడాదితర్వాతనే అతనికి విముక్తి లభిస్తుంది. ఒక అమ్మాయికి పెళ్ళి అయిపోయింది. మరోఇద్దరు టోకియోలో ఎవరిఇంటనో పని

చేస్తున్నారు. వారు ఏడాదికి ఒకసారి ఇక్కడకు వచ్చి వెళ్ళుతూ ఉంటారు. తక్కినవారు చాలా చిన్నపిల్లలు. తండ్రికి మొదట్లో ఎలాంటి ఆస్తి లేదు. అతడు జ్యేష్ఠ పుత్రుడు కాకపోవడమే ఇందుకు కారణం. అతడు కాయ కష్టంచేసి, ఎలాగో ఈ ఇంటిని సంపాదించాడు. ఇతరుల పొలాలు కౌలుకు చేస్తూ, జీవితం గడుపుతున్నాడు.

రాహుల్జీ రష్యాకు వెళ్ళదలచుకొన్నారు. కాని ఆయనవద్ద డబ్బులేదు. అమెరికాపత్రిక 'ఏషియా'లో టిబెట్ చిత్రకళనుగూర్చి ఒకవ్యాసం వ్రాశారు. ఇందుకు ప్రతిఫలంగా ఎనభైడాలర్లు చేకూరవచ్చింది. ఇక తాను రష్యాయాత్ర చేసి రాగలననుకొన్నారు. నిట్టాగ్రామంనుండి జూలై 21 వ తేదీన టోకియోకు తిరిగివచ్చారు. అక్కడ ఒకవారం పదిరోజులు సకాకిబారా అతిథిగా ఉన్నారు. అతడు ఉపన్యాసాలు ఇవ్వడానికి వెళ్ళితే, రాహుల్జీకూడ అతనివెంట వెళ్లారు. ఆయనకూడా ఒక సభలో మాట్లాడారు. తర్వాత టోషోదాయిజీ, తదితరప్రదేశాలకు వెళ్ళారు. బౌద్ధ విహారాలను చూశారు. బౌద్ధమతాచార్యులతో సంభాషణలు జరిపారు. కొయాసాన్‌లోని సంస్థలన్నీ బౌద్ధభిక్షువుల చేతిలోనే ఉన్నాయి హైస్కూలులో నాలుగువందలమంది విద్యార్థులుఉంటే, వారిలో మూడువందలు బౌద్ధభిక్షువులు. కాలేజీలో అయిదారుగురు విద్యార్థులుతప్ప, తక్కినవారంతా బౌద్ధభిక్షువులే. కాలేజీలో సంస్కృతం ప్రొఫెసర్లు అయిన ఫూచీదా, ఉయేదాలను రాహుల్జీ కలుసుకొన్నారు. మరు నాడు కాంబేకి వెళ్ళారు. ఆనందమోహన్ సహాయ్ కృషి

ఫలితంగా భారతదేశంనుండి మరికొంతడబ్బు లభించింది. అందుచేత రాహుల్జీ రష్యాయాత్రకు గట్టిగా నిశ్చయించుకొన్నారు. ఆగస్టు 9 వ తేదీన షిమోనోస్కి చేరుకొన్నారు. మరునాడు ఓడఎక్కి కొరియాకు బయలుదేరారు.

## కొరియా

రాహుల్జీ అదేరోజు ఫ్యూసన్ నగరం చేరుకొన్నారు. తర్వాత రైలులో కొరియారాజధాని సియోల్‌కు వెళ్ళారు. హీగాషీ బౌద్ధ విహారంలో మకాంపెట్టారు. అక్కడఉన్న బౌద్ధాచార్యుడు కోంగోషాన్ (వజ్రపర్వతం) యాత్ర తలపెట్టాడు. రాహుల్జీనికూడ తనవెంట రమ్మన్నాడు.

ఇద్దరూ సకునోజీస్టేషన్‌కు వెళ్ళారు. అక్కడనుండి కాలి నడకనే పయనం సాగించారు. కొరియారైతుల ఇళ్ళు జపాన్‌లోవలె గడ్డిఇళ్ళు. బౌద్ధవిహారంవద్ద పెద్ద పెద్ద దేవదారు వృక్షాలు కనిపించాయి. విహారంలో అయిదారు దేవాలయాలు ఉన్నాయి. వాటిలో భేసజ్జగురు (బుద్ధుడు), శాక్యముని, అమితాభ విగ్రహాలు ఉన్నాయి. కళదృష్ట్యా ఇవి ఏమంత బాగాలేవు. మఠ ఉపనాయకుడు యువకుడు. అతడు జపాన్‌లో చదువుకొన్నాడు. రాహుల్జీ బౌద్ధాచార్యునితో కలిసి, సకునోజీస్టేషన్‌కు తిరిగివచ్చారు. రైలు ఎక్కి తూర్పు సముద్ర తీరానఉన్న గన్‌సేన్ ఓడరేవుకు వెళ్ళారు. వ్లాడివోస్టాక్ (రష్యా)నుండి ఇక్కడకు ఓడలువస్తూ ఉంటాయని తెలిసింది.

వీరు మరునాడు కోంగోషాన్‌కు వెళ్లారు. ఇది పన్నెండు

వేల పర్వత శిఖరాలుగల ప్రదేశం. క్రీస్తుశకం నాలుగు-అయిదు శతాబ్దాలలో ఇక్కడ బౌద్ధవిహారం స్థాపింపబడింది. స్థలాన్ని ఎన్నుకోవడంలో భిక్షువులు ఎంతో విజ్ఞతను ప్రదర్శించి నట్లు తోస్తుంది. విహారానికి మూడువైపుల దేవదారు వృక్షాలతో నిండిన పర్వతాలుఉన్నాయి. అందులో మూడు నాలుగు ఎత్తయిన శిఖరాలు చూపరుల దృష్టిని మిక్కిలి ఆకర్షిస్తాయి. విహారాన్ని ఆనుకొనే విశాలమైన అడవి, పొలాలు ఉన్నాయి. విహారానికి అన్నీచక్కగా అమరి నాయి. కాని ఇందులోని భిక్షువులకు మతప్రచారం చేద్దామనే ఇష్టమేలేదు.

మరునాడు యూతెన్‌జీ విహారాన్ని సందర్శించారు. ఇది కొరియాలోకెల్లా పెద్ద విహారం. ఆ మరునాడు హీంగాన్‌జీ బౌద్ధాచార్యుడు సియోల్‌కు తిరిగివెళ్ళాడు. రాహుల్జీ విరోహా (వైరోచన) పర్వతాన్ని చూడదలచారు. ఇది కొరియాలో కెల్లా ఎత్తయిన పర్వతం. ఒక రైల్వే ఇంజనీయర్ రాహుల్జీకి తోడ్పడ్డాడు. ఇద్దరూ కొంతదూరం మోటారులో, కొంతదూరం కాలినడకను వెళ్ళారు. పర్వతారోహణ మొదట మామూలుగా ఉంది. కాని పోను పోను కష్టమైంది. పర్వతాకారాలు నానావిధాలుగా ఉన్నాయి. ఒకటి పాము ఆకారం అయితే, మరొకటి గుర్రం ఆకారం. జలమార్గాలుకూడ నాగ, త్రిపుండ్రి మొదలైన ఆకారాలలో ఉన్నాయి. పర్వతదృశ్యాలు చాలా మనోహరంగా ఉన్నాయి. కొన్నిమైళ్ళదూరం పర్వతారోహణ చేసిన తర్వాత, ఒకహోటల్ కనిపించింది. ఆ రాత్రి అక్కడ

విశ్రమించి, మరునాడు అన్నిటికంటె ఎత్తయిన విహారశిఖరం చేరుకొన్నారు. అక్కడ రెండు బౌద్ధవిహారాలు ఉన్నాయి. అందులో ఒకటి కొత్తది. రాహుల్జీ కొంతసేపు అక్కడ గడిపి వచ్చారు. రైలులో సియోల్ నగరం చేరుకొన్నారు. ఆయన సియోల్‌లో కొన్ని ముఖ్యమైన ప్రదేశాలను చూశారు. ఇక్కడ కొందరు ప్రొఫెసర్లను కలుసుకోదలచారు. కాని ఎండకాలం సెలవులలో వారు బయటికి వెళ్ళినట్లు తెలిసింది. రాహుల్జీ ఆ మరునాడు పగలంతా సియోల్‌లోనే గడిపారు. సాయంత్రం బౌద్ధ క్లబ్ వారు తేనేటివిందు చేశారు. ఆ రాత్రే రాహుల్జీ మంచూరియాకు వెళ్లారు.

## మంచూరియా

రాహుల్జీ మరునాడు మధ్యాహ్నం ముగ్డన చేరుకొన్నారు. ఇది కొంతకాలంవరకు మంచూరియా రాజధానిగా ఉండేది. రాహుల్జీ ముగ్డన్ బౌద్ధ విహారం, లామా మందిరం మొదలైన ప్రదేశాలను చూశారు. కొద్దిరోజుల తర్వాత సింకింగ్ వెళ్లారు. అప్పట్లో ఇక్కడ జపాన్‌వారిదే పైచేయిగా ఉండేది. పట్టణంలో తిరుగుతూ ఉండగా రెండు సింహబట్టలు దుకాణాలు కనిపించాయి. దక్షిణ మంచూరియా రైల్వేవారు రాహుల్జీకి ఉచితంగా మొదటితరగతి టిక్కెట్టు ఇచ్చారు. కాని తాను త్వరలోనే రష్యాయాత్ర జరుప నున్నానని చెప్పి రాహుల్జీ టిక్కెట్టు వాపసు చేశారు.

తర్వాత రాహుల్జీ హార్బిన్ వెళ్లారు. ఇక్కడ గుర్రపుబండి తోలేవారు రష్యన్లు. పోలీసులు ఎంతోమంది

రష్యన్లు. కూలీలుకూడ ఎక్కువమంది రష్యన్లే. చాలామంది తెల్లరష్యన్లు చిరిగినగుడ్డలతో తిరగడం రాహుల్జీ చూశారు. రష్యాలో విప్లవాన్ని వ్యతిరేకించి, పారిపోయి వచ్చినవారు వీరు. ఇలాంటివారు పొరుగుదేశాలలోకూడ ఉన్నట్లు తెలిసింది. మరల స్వదేశానికి రావడానికి సోవియట్ ప్రభుత్వం అనుమతించినా, వీరు వెళ్ళలేదు. పొరుగు దేశాలలో ఉంటూ సోవియట్ ప్రభుత్వ వ్యతిరేక కుట్రలు కొనసాగించారు. ధనవంతులైనవారు వ్యాపారంచేస్తూ సుఖజీవనం గడిపారు.

రాహుల్జీ రెండురోజులు హార్బిన్‌లోగడిపి, మరునాడు రైలులో మన్చూలీకి బయలుదేరారు. దారిలోమైదానంలో కూడ దేవదారు, భూర్జవృక్షాలు కనిపించాయి. ఇది రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది. హిమాలయంలో పన్నెండుపదమూడువేల అడుగుల ఎత్తునమాత్రమే పెరిగేచెట్లు, ఇక్కడ ఎలా పెరిగాయో మొదట అర్థంకాలేదు. కాని విచారించగా, యీ ప్రదేశం గంగోత్రి, బదరీనాథ్‌కంటె చల్లనిదని, అందుచేతనే ఈ వృక్షాలు పెరిగాయని తెలిసింది.

ఆయన రైలులో ఇద్దరు మంగోలు భిక్షువులతో సంభాషిస్తూ మన్చూలీస్టేషన్ చేరుకొన్నారు. మంచూరియాలో ఆఖరుస్టేషన్ ఇదే. తర్వాత స్టేషన్ సోవియట్ రష్యాలో మొదలవుతుంది. రాహుల్జీ ఆమరునాడే మాస్కోకు బయలుదేరారు.

# రష్యా

రాహుల్జీ ఎక్కినరైలు వారంరోజులకు మాస్కో చేరుతుంది. రష్యాలో 1917 చివరి నెలలో జరిగిన పరిణామాలన్నీ ఆయనకు గుర్తువచ్చాయి. రాజుల, ధనికుల ప్రభుత్వం అంతమొంది, బీదలరాజ్యం ఏర్పడిన దేశంలోకి తాను వెళ్ళుతున్నానని సంతోషించారు.

రష్యాలో మొదటి స్టేషన్ వచ్చింది. కస్టమ్స్ అధికారులు రాహుల్జీ పాస్‌పోర్టును చూడగా, "లీసా" గడువు ముగిసింది. మళ్ళీ మన్చూలీకి వెళ్ళనలసినస్తుందేమో అనిరాహుల్జీ భయపడ్డారు. తన ఇబ్బందులు అధికారులకు తెలియజేశారు. కొంతసేపైన తర్వాత వారు "ఫరవాలేదు, వెళ్ళండి" అని చెప్పారు. రాహుల్జీ కూర్చున్న పెట్టెలో ఒక లిథువేనియన్ ఉన్నాడు. అతడు అమెరికానుండి వస్తున్నాడు. అతనివద్ద చాలాసామానులు ఉన్నాయి. వాటిని కస్టమ్స్ అధికారులు చాలాసేపు తనిఖీచేశారు.

చీకటిపడగానే రాహుల్జీ నిద్రపోయారు. మరునాడు ఉదయమే లేచి, బయటివైపు చూశారు. గ్రామీణ ప్రజల ఒంటిపై గట్టిబట్టలు కనిపించాయి. అవి వినోదంకోసం తొడుక్కొన్నవి కావు. కొంచెంసేపు అయిన తర్వాత చీటానగరం వచ్చింది. అక్కడక్కడ కొత్తఇళ్ళు తయారవుతున్నాయి. గోడలు ఎక్కువభాగం కలపతో నిర్మిస్తున్నారు. ఇక్కడ చాలామంది మంగోలు స్త్రీ, పురుషులు కనిపించారు.

రాహుల్జీ మాస్కో ప్రయాణంలో ఇది మూడో రోజు. ఆయన కూర్చున్న పెట్టెలో కుమారి మూలర్ ఉంది. ఆమెకూడ మాస్కోకు వెళ్ళుతున్నది. మూలర్ తండ్రి కోటీశ్వరుడుగా ఉండేవాడు. ఆ రోజులలో ఆమె రాజకుమారివలె ప్యారిస్ స్విట్జర్లాండ్‌లలో తిరిగేది. బాల్యంలో ఆమెను ఫ్రెంచి, ఇంగ్లీషుదాదులు ఆడించేవారు. ఆమె ఇంగ్లీషు, ఫ్రెంచి, రష్యన్ భాషలు మూడు మాట్లాడేది. రాహుల్జీ ఆమెతో పరిచయం కలిగించుకొన్నారు. ఆమె కమ్యూనిస్టులను బూతులు తిట్టింది. ఆమెతండ్రి ఆస్తిని కమ్యూనిస్టులుస్వాధీనపరచుకొన్నారు. ఆమెసోదరిని అనుమానంపై ఖబారోవ్స్క్ జైలులో పెట్టారు. ఆమెను జైలు నుండి విడిపించుకోవడానికే మూలర్ మాస్కో వెళ్ళుతున్నది.

ప్రక్కనున్న పెట్టెలో మాస్కో ఇంజనీయర్ ఉన్నాడు. రాహుల్జీ అతనివద్దకు వెళ్ళి, పరిచయం కలగించుకొన్నారు. అతడు ఒక పెద్ద "వోడ్కా" సీసా తెప్పించాడు. మద్యపానం రాహుల్జీకి ఎప్పటికీ గిట్టదు కాని "వద్దు" అని చెప్పలేకపోయాడు. "వోడ్కా" గిన్నెను పెదవులతో తాకారు. తర్వాత తలనొప్పిగా ఉందని చెప్పి, తప్పించుకొన్నారు. "ఇన్-టూరిస్టు" ప్రతినిధి ఒకడు అదేపెట్టెలో ప్రయాణం చేస్తున్నాడు. అతడు తనకోసం రాహుల్జీచేత సిగరెట్లు కొనిపించాడు. ఆ డబ్బు రాబట్టుకొనే ఉద్దేశం రాహుల్జీకి లేదు. కాని అతడు ఆ ఊసే ఎత్తకుండా వెళ్ళిపోయాడు. కమ్యూనిస్టులపై నిందలు వచ్చిపడటానికి ఇలాంటివారు కారణమవు

తున్నారని రాహుల్జీ అనుకొన్నారు. తాను వెళ్ళి రష్యన్లతో పోట్లాడినట్లు అతడు ఏవేవో కబుర్లు చెప్పేవాడు. అతని ప్రవర్తన రాహుల్జీకి నచ్చలేదు.

రాహుల్జీ మాస్కో ప్రయాణంలో ఇది నాలుగోరోజు. దారిలో "యేనేసేయ్" నది కనిపించినది. ఇది గంగానది కంటె పెద్దది. ఎదుట క్రాస్నోయాన్స్క ఫ్యాక్టరీలుఉన్నాయి. కార్మికులఇళ్ళు పెద్దమేడలవలె కనిపిస్తున్నాయి. స్త్రీలు చాలా ఆరోగ్యంగా, చురుకైనవారుగా ఉన్నారు. రాహుల్జీ ప్రయాణంచేస్తున్న రైలులో ఎందరో ఎర్రసైనికులుఉన్నారు. వారంతా కలసి పాటలుపాడుతున్నారు.

వారంరోజుల తర్వాత రాహుల్జీ మాస్కో చేరుకొన్నారు. ఆ రాత్రి రైలుబండిలోనే ఉండవలసివచ్చింది. మరునాడు మెట్రోపోల్ హోటల్‌కు వెళ్ళారు. లెనిన్‌గ్రాడ్ చూడటానికి అనుమతి లభించదని తెలిసింది. బయటినుండి శత్రువులు చొరబడుతూ ఉండటమే ఇందుకు కారణం. రాహుల్జీ మోటారులోకూర్చొనిమాస్కోపట్టణంచూడడానికి వెళ్ళారు. రెడ్‌స్క్వేర్, లెనిన్‌సమాధి,విశ్వవిద్యాలయం,లెనిన్ గ్రంథాలయం మొదలైనవాటిని చూచి హోటల్‌కు తిరిగి వచ్చారు. మధ్యాహ్నం కాలిసడకనే బయలుదేరారు. యూరోపుయాత్ర సందర్భంలో తనకు పరిచితుడైన వోల్డెన్ బర్గ్‌ను కలుసుకోదలచారు. ట్రాములో ఎక్కగా డబ్బు చిక్కు ఏర్పడింది.ఆయనవద్ద రష్యన్ డబ్బులేదు. అమెరికన్ సెంట్లు చెల్లవు. ప్రక్కనున్న వ్యక్తి ట్రాము ఛార్జీ చెల్లించాడు. డాక్టరు వోల్డెన్‌బర్గ్ ఇంటికి వెళ్ళి విచారించగా,

అతడు చనిపోయినట్లు తెలిసింది. రాహుల్జీ హోటల్‌కు తిరిగి వచ్చారు.

ఆ రాత్రి బాకూ రైలు ఎక్కి, ఉక్రెయిన్‌కు బయలుదేరారు. ఆయనవద్దఉన్నడబ్బును ఇంకా రష్యన్‌లోకి మార్చుకోలేదు. ఒకటి రెండుచోట్ల ప్రయత్నించినా వీలుకాలేదు. ఆయనప్రక్క ఒక స్త్రీ పైలట్టు కూర్చునిఉంది. ఆమె ఉదయమే వెన్న, రొట్టె తెప్పించింది. దానిని తమ ఇద్దరిమధ్య ఉంచింది. రాహుల్జీ వద్దని చెప్పినా వినలేదు. ఆయనవద్ద రష్యన్‌డబ్బు లేదని ఆమెకు తెలుసు. "తినండి, బడాయి వదలిపెట్టండి" అన్నది. రాహుల్జీ తన మొండిపట్టు వదలి, వెన్న, రొట్టె పుచ్చుకొన్నారు. ప్రక్కనున్న ఇంకో మహిళను పరిచయం చేసుకొన్నారు. ఆమె తానుకూడ పైలట్టునని చెప్పింది. అయితే విమానం నడపడం, తుపాకిపట్టడం, ట్రాక్టరు నడపడం కూడ తనకు తెలుసునని చెప్పింది. వెన్నవలె మెత్తని అరచేతులుగల పద్మినీజాతి స్త్రీలకు ఇక్కడ విలువలేదని రాహుల్జీ అనుకొన్నారు.

రైలు కాకసస్ పర్వతాలలో ప్రవేశించగానే భారతదేశ వాతావరణం కనిపించింది. స్త్రీలవేషం పంజాబులో వలె ఉంది. ఆవులు, ఎద్దులు ఉత్తరభారతదేశంలోవలె ఉన్నాయి. పల్లెటూళ్ళలో ఇళ్ళకు వెల్లవేశారు. మూడు రోజులు ప్రయాణంచేసిన తర్వాత రాహుల్జీ బాకూ చేరుకొన్నారు.

ఆయన "ఇన్-టూరిస్టు" హోటల్‌లో మకాం పెట్టారు. ఒకమహిళా దుబాసీతో బాకూ, దాని చుట్టుపట్ల

ప్రదేశాలను చూడటానికి వెళ్ళారు. అయిదుమైళ్ళదూరంలో ఉన్న జ్వాలాదేవి మందిరం చేరుకొన్నారు. స్థానికులు దీనిని అగ్నిపూజకుల మందిరం అంటారు. కాని ఇది హిందువుల జ్వాలామాత. పదహారేళ్ళక్రితం రాహుల్జీ ఈపేరువిన్నారు. కాని నమ్మలేదు. తర్వాత ఒక ఇంగ్లీషుపత్రికలో ఈవిషయమై వివరణాత్మకమైన ఒకవ్యాసం చదివారు. అప్పుడు నమ్మకం ఏర్పడింది. ఇప్పుడు జ్వాలాదేవిమందిరంవద్దనే ఉన్నారు. మందిరంలో పన్నెండుదాకా శిలాశాసనాలు ఉన్నాయి. ఇవి ఎక్కువభాగం దేవనాగరిలిపిలో ఉన్నాయి. రెండు గురుముఖి లిపిలోఉన్నాయి. ముంగిలి, మధ్యభాగంలో ఒక కుండం ఉంది. పదేళ్ళక్రితంవరకు ఈముంగిలికుండంలో నిప్పు రాజుతూ ఉండేదట. ఇదే హిందువుల జ్వాలామాత. చుట్టుపట్ల మట్టినూనె బావులు ఉన్నాయి. ఇలాంటి చోట ఏదో రాపిడివల్ల నిప్పు రాజడం, లోపల గ్యాసుమూలంగా అది ఎల్లప్పుడూ మండుతూ ఉండటం సహజమే.

రాహుల్జీ జ్వాలాదేవిమందిరంలోని శిలాశాసనాలను వడివడిగా చదవడం ప్రారంభించారు. ఇది చూచి, ఆయన వెంట ఉన్న మహిళా-దుబాసీ ఆశ్చర్యం వెల్లడించింది. ఇక్కడ పెద్దపెద్ద పండితులు ఎందరో వచ్చారని, కాని ఎవ్వరూ ఈ శాసనాలను చదవలేకపోయారని చెప్పింది. మా దేశంలో నాలుగోతరగతి చదివేపిల్లవాడు కూడ ఈ శాసనాలను చదవగలడని రాహుల్జీ చెప్పారు. తర్వాత జ్వాలాదేవి సమాధిని చూచి, మోటారులో సముద్రతీరానికి వెళ్లారు. అక్కడ కాస్సేపు గడిపి, హోటల్‌కు తిరిగివచ్చారు. ఆ

రాత్రి ఆర్మీనియన్ భాషలో సినిమా చూశారు. సినిమాలో ప్రకృతిదృశ్యాలు చాలా మనోహరంగా ఉన్నాయి. జారు చక్రవర్తి కాలంలో అధికార్ల న్యాయంపేరట ఆడే కపట నాటకం ఆ సినిమాకు ఇతివృత్తం.

మరునాడు రాహుల్జీ స్టాలిన్ శ్రామిక సాంస్కృతిక భవనంలోకి వెళ్ళారు. ఇది అయిదంతస్థుల భవనం. ఇక్కడ రెండు సభామందిరాలు ఉన్నాయి. ఒకదానిలో వెయ్యి కుర్చీలు, రెండోదానిలో నాలుగువందల కుర్చీలుఉన్నాయి. సోవియట్ ఎన్నికలకుకూడ ఈ మందిరాలను ఉపయోగించేవారు. తర్వాత రాహుల్జీ పంచాయతీ - భోజనాలయానికి వెళ్ళారు. ఇదికూడ అయిదంతస్థుల భవనం. ఇక్కడ రోజూ ఏడువేలమంది ఒకేదఫా భోజనంచేసేవారు. రాహుల్జీ భోజనశాలలోకి వెళ్ళగా, ఆయనను భోంచేయమని కోరారు. రాహుల్జీ అద్దాలబీరువాలో ఉంచిన పెరుగు తిన్నారు. అది చాలా రుచిగా ఉంది. తర్వాత వాగిరోవ్ శిశుసదనానికి వెళ్ళారు. అప్పుడు పిల్లలు మంచాలపై పడుకొని ఉన్నారు. రాహుల్జీ చప్పుడు చేయకుండా, ఆ గదినిదాటి వెళ్ళారు. బాకూలో ఇలాంటి శిశుసదనాలు వందకుపైగా ఉన్నాయి.

రాహుల్జీ, ఇరాన్ రాయబార కార్యాలయంవద్ద "వీసా" తీసుకున్నారు. సెప్టెంబరు 11 వ తేదీన ఓడఎక్కి ఇరాన్ బయలుదేరారు.

## ఇరాన్

రాహుల్జీ ఆ మరునాడే టెహరాన్ చేరుకొన్నారు. జెకోస్లోవేకియా దంపతులు ఇద్దరు ఆయనవెంట వచ్చారు.

జెకోస్లోవేకియా మిత్రుడు చాలారోజులుగా టెహరాన్‌లో ఉండేవాడు. పారసీభాష చక్కగా మాట్లాడేవాడు. రాహుల్జీకి టెహరాన్‌లో పరిచితులు ఎవ్వరూ లేరు. అందుచేత ఆయన జెకోస్లోవేకియా మిత్రుడు ఉన్న హోటల్‌లోనే దిగారు.

మరునాడు పట్టణం చూడటానికి బయలుదేరారు. ప్రజలు పూర్తిగా యూరోపియన్ వేషం ధరిస్తున్నారు. స్త్రీలు పైనుండి ఒకనల్లని పర్దా వేసుకొంటారు. అయితే ముఖం కనపడుతూఉంటుంది. ఈ రోజు సెలవుదినం. అందుచేత ప్రజలు షికారుకోసం షమీరాన్ వెళ్ళుతున్నారు. అది టెహరాన్‌కు పదిమైళ్ళదూరంలోవున్న అతిసుందర ప్రదేశం. ప్రజలతోబాటు రాహుల్జీకూడ బస్సులో వెళ్లారు. షమీరాన్‌లో అనేక ఉద్యానవనాలు ఉన్నాయి. వచ్చే ప్పుడు, పాతజైలు, సైనికశిబిరం, వైర్లెస్‌స్టేషన్ చూశారు. ఆ రాత్రే తనహోటల్‌కు తిరిగివచ్చారు. మరునాడుకూడ కొన్ని ముఖ్యమైన ప్రదేశాలను సందర్శించి, బస్సులోఅస్ఫహాన్ నగరానికి బయలుదేరారు.

ఆ రాత్రి కుమ్ అనే బస్తీలో విశ్రాంతితీసుకొన్నారు. ఇరానులో వర్షపాతం తక్కువ. అందుచేత ప్రజలకు నీటి విలువ బాగా తెలుసు. ప్రతిఇంటి క్రింద ఒకగుంట ఉంటుంది. వర్షపు నీరు అందులోకి వెళ్ళుతుంది. కాళ్ళు-ముఖం కడుక్కోవడానికి, స్నానం చేయడానికి ఈ నీరు పనికివస్తుంది. హోటలలో మంచినీరు ఇచ్చేటప్పుడు, అందులో మంచుముక్క పడవేస్తారు. మంచినీరు త్రాగిన తర్వాత, మిగిలిన మంచు

ముక్కను తొలగించరు. రెండోదఫా మంచినీరుపోసి, ఆ గ్లాసులోనే ఇతరులకు ఇస్తారు. రాహుల్జీ దీనినుండి తప్పించుకోవడానికి కర్బూజా పండు తీసుకొన్నాడు.

రాహుల్జీ మరునాడు సాయంకాలం ప్రయాణం కొనసాగించారు. దారిలో అన్నీ చిన్నచిన్న కొండలు. చెట్టుచేమలు బొత్తిగాలేవు. వాగు అనేది ఎక్కడా కనిపించదు. అక్కడక్కడ భూగర్భకాలువలు త్రవ్వారు. వాటిని ఒకచోటినుండి మరొకచోటికి తీసుకుపోతున్నారు. ఇరాన్‌లో ద్రాక్షపళ్ళు అన్నీ అమృతోపమానంగా ఉంటాయి. అయితే ఇక్కడ మామిడిపళ్ళు దొరకవు. రాహుల్జీ ఆరాత్రి ఒకగ్రామంలో విశ్రాంతితీసుకున్నారు. మరునాడు అస్ఫహాన్ నగరం చేరుకున్నారు.

అస్ఫహాన్ నగరం చాలారోజులవరకు ఇరాన్ రాజధానిగా ఉండేది. ఇస్లాంమతం రావడానికి పూర్వంకూడ ఇది ఇరాన్‌లో ప్రసిద్ధిచెందిన నగరం. నగరానికి వెలుపల ఒక పర్వతం ఉంది. ఇక్కడ ఒకప్పుడు పార్సీల అగ్నిమందిరం ఉండేది. అక్కడ కొన్ని వేలసంవత్సరాలుగా అగ్నిమండుతూ ఉండేదని, ఇస్లాం మతం వచ్చి దానిని ఆర్పివేసిందని చెబుతారు. ఇప్పుడు అగ్నిశాలలో కొన్నిగోడలు మాత్రం నిలిచిఉన్నాయి. రాహుల్జీ దీనినిచూచి, మరునాడు షీరాజ్‌కు బయలుదేరారు. దారిలో ఎటుచూచినా కొండలన్నీ నగ్నంగా ఉన్నాయి. ప్రాకృతిక సౌందర్యం నోచుకొనని ఈ దేశంలో హాఫిజ్, సాదీవంటి మహాకవులు పుట్టడం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది. చీకటిపడేటప్పటికి ఆయన షీరాజ్

చేరుకొన్నారు. మరునాడు నగరం వెలుపల మహాకవి హాఫిజ్ సమాధిని సందర్శించారు. సమాధి కొత్తగా మరమ్మతు చేయబడింది. కాని ఎలాంటి కళలేదు, అందంలేదు. రాహుల్జీ ఆ రాత్రి సినిమా చూడటానికి వెళ్ళారు. అది బహిరంగస్థలంలో ఏర్పాటు చేయబడింది.

రాహుల్జీ సెప్టెంబరు 21వ తేదీన టెహరాన్‌కు బస్సు టిక్కెట్టు తీసుకొన్నారు. అది ఆ రాత్రే బయలుదేరింది. దారిలో రెండుమూడుచోట్ల ఆగిపోయింది. రాహుల్జీకి విసుగుపుట్టి వేరొక బస్సులో టెహరాన్ చేరుకొన్నారు. హామీద్‌ఖాన్ అనే యహూదీ దంతవైద్యుడు రాహుల్జీకి పరిచితుడైనాడు. అతడు రాహుల్జీని తనఇంటికి తీసుకు వెళ్ళాడు. ఆ రాత్రి ఇద్దరూ ఇరానీనాటకం చూశారు. ప్రేక్షకులలో ఎక్కువమంది స్త్రీలు. రాహుల్జీ ఆ మరునాడు పట్టణంలో అటూఇటూ తిరిగి హమీద్‌ఖాన్ ఇంటికి వచ్చారు. అతనితండ్రి రాహుల్జీని "ఆగా రుహుల్లాఖాన్" అని తన స్నేహితునికి పరిచయంచేశాడు.

రాహుల్జీ మరునాడురాత్రి మష్‌హద్‌కు బస్సులో బయలుదేరారు. మూడోరోజు తెల్లవారుజామున నేషాపోర్ చేరుకొన్నారు. ఇక్కడే ప్రపంచఖ్యాతిచెందిన కవీశ్వరుడు ఉమర్ ఖయ్యాం సమాధిఉంది. బస్సును సమాధివద్దకు తీసుకు వెళ్ళమని, అదనంగా కొంతడబ్బు ఇస్తానని రాహుల్జీ కోరారు. కాని బస్సువాడు ఒప్పుకోలేదు. మరునాడు చీకటి పడేటప్పటికి బస్సు మష్‌హద్ నగరం చేరుకొన్నది. ఇక్కడనుండి కాబుల్‌కు వెళ్ళాలని రాహుల్జీ ఉద్దేశం. కాని "పేసా"

సంపాదించడానికి పదిరోజులైనా పట్టేట్లు కనపడింది. అందు చేత ఇక్కడకు 18 మైళ్ళదూరంలో ఉన్న తూస్‌కు వెళ్ళి మహాకవి పిరదౌసి సమాధిని సందర్శించివచ్చారు. కాబూల్ వెళ్లే ఆశవదలుకొని, అక్టోబరు 3 వ తేదీన ఒక లారీలో భారతదేశానికి బయలుదేరారు. వారంరోజుల తర్వాత నోక్కుండీ రైల్వేస్టేషన్ చేరుకొన్నారు. అక్కడనుండి లాహోరుకు రైలు టిక్కెట్టు తీసుకొన్నారు.

## స్వదేశ పయనం

ఆయన రెండోరోజున లాహోరు చేరుకొన్నారు. ఆ రాత్రి డాక్టరు లక్ష్మణస్వరూప్ ఆతిథ్యం స్వీకరించారు. తర్వాత రెండుమూడురోజులు లాహోరులో ఉపన్యాసాలు ఇచ్చారు. మరునాడు ఢిల్లీకి వెళ్ళారు. హిందీప్రచారిణీసభ వారు ఆయనను సన్మానించారు. రాహుల్జీ ఢిల్లీలో చతురసేన శాస్త్రి, జైనేంద్రకుమార్, చంద్రగుప్తలంకార్ తదితర సాహితీవేత్తలను కలుసుకొని, చాలా సంతోషించారు.

రాహుల్జీ కొద్దిరోజుల తర్వాత, ప్రయాగకు వెళ్లారు. ఆయనకు టాన్సిల్ బాధ ఎక్కువైంది. దీనికితోడు జ్వరం వచ్చింది. మరునాడు పాట్నారు వచ్చారు. ఆస్ప త్రిలో చేరారు. అయిదురోజుల తర్వాత ఆపరేషన్ చేయించారు. ఇక ఏడాదివరకు ఫరవాలేదనుకొన్నారు. ఆస్పత్రి నుండి విడుదలై, జాయస్వాల్ ఇంటికి వెళ్లారు.

తర్వాత సాగనాధ్ వార్షికోత్సవం జరుగుతూ

ఉండగా, అక్కడకు బయలుదేరారు. ఉత్సవం బాగా జరిగింది. ఆయన అక్కడకు వస్తారని, ఆయన సోదరులు ముగ్గురూ ఊహించారు. రాహుల్జీ పద్ధెనిమిదేళ్ళ తర్వాత వారిని అక్కడ కలుసుకొన్నారు. కొద్దిరోజులకు హిందూ విశ్వవిద్యాలయ విద్యార్థులసభలో జపాన్‌నుగూర్చి ఉపన్యాసం ఇచ్చారు.

రాహుల్జీ తిరిగి పాట్నాకువచ్చి, నెలరోజులకుపైగా అక్కడే ఉండిపోయారు. జాయస్వాల్ ఇంట భోంచేస్తూ, "దీర్ఘనికాయం" (హిందీ అనువాదం), "జపాన్", "వాదన్యాయం" మొదలైన గ్రంథాల ప్రూఫ్లు దిద్దుకొంటున్నారు. ఒకరోజున కొద్దిగా జ్వరంవచ్చింది, జాయస్వాల్ ఒక హోమియో వైద్యుని పురమాయించి, మైసూరు ప్రాచ్య భాషాసమ్మేళన్‌కు వెళ్లారు. రాహుల్జీకి జ్వరం ఎక్కువైంది. చివరికి ఆస్పత్రిలో చేరారు. కాని జ్వరం తగ్గలేదు. రెండు మూడుసార్లు మూర్ఛ వచ్చింది. మరునాడు శరీరంపై ఎర్రనిచారలు అగుపించాయి. ఇది టైఫాయిడ్ అని నిశ్చయమైంది. రాహుల్జీ అయిదురోజులు మూర్ఛలో మునిగి ఉన్నారు. ఈ విషయం వార్తాపత్రికలకు ఎక్కింది. చాలా మంది మిత్రులు చూడటానికి వచ్చారు. అయిదురోజుల తర్వాత జ్వరం పూర్తిగా తగ్గిపోయింది. రాహుల్జీ మృత్యు గహ్వరంనుండి బయటపడ్డారు.

రాహుల్జీ ఆస్పత్రిలో ఉన్నన్ని రోజులూ సూప్‌నాథ్ అనే మిత్రుడు ఆయనవద్ద ఉండేవాడు. స్పృహలేనిస్థితిలో తాను దేవునిపేరు ఏదైనా ఎత్తానా అని అతనిని అడిగారు. అతడు "లేదు" అని చెప్పాడు. "ఒకసారి మీనోట ధర్మ

కీర్తి పేరు వినపడింది" అన్నాడు. ఇది సహజమేనని రాహుల్జీ అనుకొన్నారు. ఎందుకంటె ధర్మకీర్తి "ప్రమాణ వార్తికాన్ని" తాను పూర్తిగా సంపాదించినప్పటికీ అచ్చొత్తించుకోలేకపోయానని రాహుల్జీ ఎల్లప్పుడూ బాధపడుతూ ఉండేవారు. చావుబ్రతుకుల స్థితిలోకూడ ఆయన కంగారు పడకుండా ఉండటం అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

జ్వరం తగ్గిపోయిన తర్వాత కొద్దిరోజులకు రాహుల్జీ ఆస్పత్రినుండి విడుదలైనారు. జాయస్వాల్ ఇంట ఉంటూ పుస్తకం ప్రూఫులు దిద్దుకొనేవారు. ముంగైర్‌లో జరగనున్న సాహిత్యసమ్మేళనకు ఆయన అధ్యక్షునుగా ఎన్నికైనారు. ఆయన చాలా నీరసస్థితిలో ఉన్నప్పటికీ, అధ్యక్షోపన్యాసం తయారుచేశారు. ముంగైర్ వెళ్ళి, అతికష్టం మీద ఉపన్యాసం చదివారు. మరునాటి సమావేశంలో పండిత జనార్దన్ ఝూ ఝూన్సీరాణిపై వ్రాసిన కావ్యం చదివి వినిపించారు.

ఆ తర్వాత రాహుల్జీ పాట్నా, కాశీలమీదుగా ఛప్రా వెళ్లారు. తాళపత్రగ్రంథాలకోసం మరోసారి టిబెట్ వెళ్ళి రాదలచారు. ధూప్‌నాథ్‌ను వెంట తీసుకొని క్రీ. శ. 1936 ఫిబ్రవరి 17 వ తేదీన ఛప్రానుండి నేపాల్‌కు బయలుదేరారు.

---

# తొమ్మిదో అధ్యాయం

## తీరని జ్ఞానదాహం - తిరిగి టిబెట్ యాత్ర

రాహుల్జీ కాఠ్మండూలో ధర్మమాన్ సాహు ఇంట మకాం పెట్టారు. లాహోరులో తన పూర్వమిత్రుడు స్వామీ ప్రణవానంద్ ఇక్కడకు వచ్చినట్లు తెలిసింది. పదిహేడేళ్ళ తర్వాత రాహుల్జీ అతనిని మొదటిసారిగా కలుసుకొన్నారు. అతనిని పూర్వం "మిస్టర్" అని పిలిచేవారు. అతడు ఇప్పుడు సంసారం వదలిపెట్టి యోగి అయినాడు. రాహుల్జీకి, అతనికి ఇప్పుడు భావాలలో పెద్ద అంతరం ఏర్పడింది. అయినప్పటికీ ఇద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పుకున్నారు.

ఇక్కడ ఉండగా రాహుల్జీ హెమిన్‌లామా, రాజగురు పండిత హేమరాజు శర్మ, సర్వసైన్యాధిపతి పద్మ షంషేర్ తదితరులనుకూడ కలుసుకొన్నారు. ఏప్రిల్ ఒకటో తేదీన పాట్నానుండి ఆయన ప్రియమిత్రుడు జాయస్వాల్ మొదలైనవారు ఇక్కడకు వచ్చారు. అందరూ కలసి కొన్ని చరిత్రాత్మక ప్రదేశాలను చూచివచ్చారు. జాయస్వాల్ బృందం తిరిగి భారతదేశానికి వెళ్ళింది. అలాగే ధూప్‌నాథ్‌కూడ వెళ్ళిపోయాడు.

అభయసింహ అనునతడు రాహుల్జీ సలహాపై టిబెట్‌లో గ్రంథపరిశోధన చేయదలచాడు. అతడు సింహళీయుడు. భారతదేశంలో పన్నెండేళ్ళు సంస్కృతం చది

వాడు. కాఠ్మండూకువచ్చి రాహుల్జీని కలుసుకొన్నాడు. వీరి ద్దరూ టిబెట్‌కు బయలుదేరారు. దాదాపు ఇరవైరోజులు ప్రయాణంచేసినతర్వాత వీరు సాక్యవిహారం చేరుకొన్నారు.

అక్కడ తాళపత్ర గ్రంథాన్వేషణ ప్రారంభించారు. వీరికృషి చాలాసఫలమైంది. "ప్రమాణవార్తికం" పూర్తిగా లభించడమే కాకుండా, ఒకఅధ్యాయంపై గ్రంథకర్త 'స్వవృత్తి', దానిపై కర్ణకగోమి విస్తృత టీక కూడా లభించాయి. వీటిని రాహుల్జీ ఎత్తి వ్రాసుకొన్నారు. కొంతకాల మైన తర్వాత 'స్వవృత్తి'లోని శిథిలభాగాన్ని టిబెట్ అనువాదం, టీకల సహాయంతో తిరిగి సంస్కృతంలోకి మార్చారు. ప్రమాణ వార్తికంలోని తక్కిన మూడు అధ్యాయాలపై ప్రజ్ఞాకరగుప్త వార్తికాలంకారం (బృహద్భాష్యం) కూడ ఇక్కడే లభించింది. వీటన్నిటి కాపీలు తయారుచేసుకొన్నారు. షులూవిహారంలోకి వెళ్ళినమీదట ప్రమాణవార్తికంపై మనోరథనంద్‌కృత వృత్తికూడ లభించింది. దీనినికూడ కాపీ చేసుకొన్నారు.

అంతేకాదు. మహాతత్వవేత అసంగుని "యోగాచారభూమి", చంద్రవ్యాకరణం టీకాకూడ సాక్యలో లభించాయి. ఒకపుస్తకం తమిళలిపిలో, రెండోది సింహాళ లిపిలో ఉన్నాయి. "యోగాచారభూమి" ఎనిమిదివేల శ్లోకాలలో ఉంది. దీనిని ఎత్తి వ్రాసుకోవడానికి వ్యవధిలేదు. అందుచేత దీనిఫోటోలు తీసుకొని సంతృప్తిచెందారు.

తర్వాత రాహుల్జీ బృందం ఇతర బౌద్ధ విహారాలకు బయలుదేరింది. ఇక్కడఉన్న పుస్తకాలలో "మధ్యమక

హృదయ" (భావ్య), "విగ్రహ వ్యావర్తని" (నాగార్జున) "ప్రమాణవార్తికవృత్తి" (మహానందిని), "క్షణభంగాధ్యాయ" (జ్ఞానశ్రీ) లను మూడు నెలలవరకు తమవద్ద ఉంచుకోవడానికి అధికారులు అనుమతించారు.

పిమ్మట వీరు గ్యాంచీమీదుగా షులూ, గోర్, నర్థంగ్ విహారాలకు వెళ్ళారు. రాహుల్జీ "క్షణభంగాధ్యాయ"ను కాపీచేశారు. ఇంతలో ఆయనకోసం గోర్ నుండి ఒకమనిషి వచ్చాడు. అందుచేత తిరిగి అక్కడకు వెళ్లారు. వసుబంధుని "అభిధర్మకోశ భాష్యం" పూర్తిగా దొరికింది. "తర్కరహస్యం", 'వాదరహస్యం' అనే పేర్లుగల రెండు శిథిల గ్రంథాలుకూడ లభించాయి. రాహుల్జీ వీటిని ఫోటోతీశారు. ఆయన తిరిగి సాక్యవిహారానికి వచ్చారు. అక్కడ తన మిత్రులందరివద్ద సెలవుతీసుకొని, అక్టోబరు 30వ తేదీన భారతదేశానికి బయలుదేరారు. గ్యాంటక్ మీదుగా కలకత్తా చేరుకొన్నారు.

## కలకత్తా ఆగమనం

స్టేషన్లో పండిత బనారసీదాస్ చతుర్వేదీ ప్రభృతులు రాహుల్జీకి స్వాగతం ఇచ్చారు. ఆయన టిబెట్ యాత్రనుగూర్చి పత్రికలలో ఇదివరకే బాగా ప్రచారమైంది. అందుచేత పాత్రికేయులు ఆయనవద్దకు పరుగెత్తుకొనివచ్చి, అనేక విషయాలు తెలుసుకొన్నారు. రాహుల్జీ ఇక్కడ అయిదురోజులు ఉన్నారు. మహామహోపాధ్యాయ విధుశేఖరశాస్త్రి. మహామహోపాధ్యాయ

ఫణిభూషణ్, డాక్టరు సునీతికుమార ఛటర్జీ మొదలైన పండితులతో సంభాషణలు జరిపారు. తర్వాత పాట్నాకు వెళ్లారు. ఒకరోజున టౌన్‌హాలులో కాశీవాస్తవ్యులు రాహుల్జీని సన్మానించారు. అక్కడే ప్రొఫెసర్ పుణతాంబేకర్ అధ్యక్షతను సభ జరిగింది. టిబెట్‌యాత్రనుగూర్చి రాహుల్జీ ఉపన్యసించారు. ఈసందర్భంలో టిబెట్‌ప్రజల ఆహారాన్ని ప్రస్తావించారు. తానుకూడ 'యాక్' మాంసంతిన్నట్లు తెలియజేశారు. అప్పుడు శ్రోతలలో ఎవరూ ఏమీఅనలేదు. కాని ఆతర్వాత సనాతనులు దుమారం లేవదీశారు. రాహుల్జీ ఈ విమర్శలను లెక్కచేయలేదు.

టిబెట్‌యాత్రలో తానుసేకరించినగ్రంథాలనుగూర్చి రాహుల్జీ డాక్టరు స్చేర్బాట్‌స్కీ (రష్యా)కి లేఖ వ్రాశారు. అతడు రాహుల్జీకి జవాబువ్రాస్తూ, సోవియట్ రష్యాకు రావలసిందిగా కోరాడు. "వీసా" విషయమై తాను సోవియట్ ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నట్లు కూడ తెలియజేశాడు. అందుచేత రాహుల్జీ తన ప్యాస్‌పోర్టు గడువును పొడిగించవలసిందిగా బీహారు ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకొన్నారు. దానిని రాష్ట్రప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి పంపింది.

వారంరోజుల తర్వాత రాహుల్జీ ప్రయాగ వెళ్ళారు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ తనను కలుసుకొమ్మని కబురంపారు. కాని పెద్దవారికి దూరంగా ఉండటం రాహుల్జీకి స్వభావసిద్ధమైపోయింది. ఏడాదిక్రిందట బ్రహ్మచారి గోవింద్ (జగన్మోనీ) ఆనందభవనంలో ఉన్నాడు. ఒకనాడు అతనిని

కలుసుకోవడానికై రాహుల్జీ అక్కడకు వెళ్ళారు. ఆయన వెంట చిత్రకారుడు శంభునాథమిశ్ర కూడ ఉన్నాడు. అతడు పండిత విజయలక్ష్మిని కలుసుకోదలచాడు. రాహుల్జీని అడగకుండానే ఆయనపేరుకూడ చీటీలో వ్రాసి పంపించాడు. పండిత విజయలక్ష్మి ఇంటర్వ్యూ ఇవ్వనిరాకరించారు. ఇది తెలుసుకొని, రాహుల్జీ శంభునాథమిశ్రను మందలించారు. పండిత విజయలక్ష్మి తీసుకొన్న వైఖరికూడ ఆయనకు విచారం కలిగించింది. ఇప్పుడు తాను పండిత జవహర్‌లాల్ నెహ్రూను కలుసుకోవలసిన అగత్యం ఏమీలేదు. అందుచేత తాను ఆయనవద్దకు రాజాలనని చీటి తెచ్చినవ్యక్తితో కబురంపారు. మరునాడుసాయంత్రం పండిత నెహ్రూ తిరిగిచీటీవ్రాసిపంపారు. మీరు రాలేకపోతే. నేనే మీవద్దకు వస్తానని అందులో వ్రాశారు. అందుచేత రాహుల్జీ మరునాడు ఆనందభవనానికి వెళ్లారు. టిబెట్ యాత్రనుగూర్చి ఎక్కువసేపు సంభాషణ జరిపారు. "టిబెట్‌లో సైన్సుకు సంబంధించిన పుస్తకాలుకూడ ఏవైనా దొరికాయా?" అని పండిత నెహ్రూ ప్రశ్నించారు. రాహుల్జీ ఏదో సమాధానం చెబుతూఉండగా, కృపలానీ అక్కడకు వచ్చారు. 'సైన్సు' అంటే ఏమిటో రాహుల్జీకి బోధించడానికి ప్రయత్నించారు. కొంచెం కటువుగానే సమాధానం ఇద్దామని రాహుల్జీ అనుకొన్నారు. కాని కృపలానీని కలుసుకోవడం ఇదే ప్రథమమైనందువల్ల, మౌనం వహించారు.

సోవియట్ "వీసా" విషయమై రాహుల్జీకి ఎలాంటి సమాచారం అందలేదు. అందుచేత ఆనంద్‌ను వెంటతీసు

కొని లాహుల్ (లడక్) బయలుదేరారు. ఢిల్లీ మీదుగా లాహోరు చేరుకున్నారు. అక్కడ లజపతిరాయ్‌మహల్‌లో టిబెట్‌నుగూర్చి ఉపన్యాసం ఇచ్చారు. తర్వాత యాత్ర కొనసాగించారు. ఉరుస్వతికి వెళ్ళి, ప్రొఫెసర్ రోరిక్ (రష్యా) అతని కుమారులు జార్జి, స్వెట్‌స్లావ్‌లను కలుసుకున్నారు. లెనిన్‌గ్రాడ్‌లో బౌద్ధవిహారస్థాపనకు ప్రొఫెసర్ రోరిక్ గట్టి కృషిచేశాడు. అతని కుమారుడు జార్జి భోట్‌భాషలో గొప్ప పండితుడు. రెండో కుమారుడు స్వెట్‌స్లావ్ గొప్ప చిత్రకారుడు. రాహుల్జీ, ఆనంద్ వీరిఇంట రెండురోజులు గడిపారు. తర్వాత కులూ లోయకు బయలుదేరారు.

మూడురోజులతర్వాత హరిపురం చేరుకొన్నారు. సమీపగ్రామంలో ఒక ప్రాచీనమందిరం ఉన్నట్లు తెలిసింది. సాయంత్రం ఆ మందిరాన్ని చూశారు. కొండదిగువ కార్తి కేయుని విగ్రహం ఉంది. కులూకు వెళ్ళేదారిలో రాళ్ళు వర్షించేచోటు ఉంది. లోగడ ఒకపర్యాయం రాహుల్జీ ఇక్కడకు వచ్చారు. ఇప్పుడు తిరిగి ఈప్రాంతంలో ప్రవే శించారు. ఒకచోట గుట్టగాపడిఉన్న రాళ్ళను ఇద్దరూ తొల గించారు. వాటిక్రింద టిబెట్ అక్షరాలలో వ్రాయబడిన కొన్ని మంత్రాలు దొరికాయి. ఇక్కడ ఒక గ్రామం ఉండే దని రుజువైంది.

పేరు కొద్దిరోజులకు ఖంగ్‌సర్ చేరుకున్నారు. ఇక్కడ హస్తలిఖితగ్రంథాలు చాలా ఉన్నాయి. వీటిని పరిశీలించ డానికి ముందే, పాట్నానుండి హృదయవిదారకమైన వార్త వచ్చింది. జాయస్వాల్ చాలా ప్రమాదస్థితిలో ఉన్నట్లు

ధూస్‌నాథ్ జాబు వ్రాశాడు. రాహుల్జీ ఆనంద్‌వద్ద సెలవు తీసుకొన్నారు. గుర్రం ఎక్కి తిరుగుముఖంపట్టారు. వచ్చేటప్పుడు ఉమస్వతిలో రోరిక్ కుటుంబాన్ని కలుసుకున్నారు. జాయస్వాల్ పరిస్థితి అలాగే ఉందని, మీరు తప్పకుండా రావాలని టెలిగ్రాం వచ్చింది.

రాహుల్జీ ప్రయాణం కొనసాగించారు. మూడు రోజుల తర్వాత పాట్నా చేరుకున్నారు. జాయస్వాల్‌కు సేవచేస్తూ కొద్దిరోజులు అక్కడే ఉన్నారు. కాని పరిస్థితిలో ఏమీ మార్పుకనపడలేదు. ఏదోపనిమీద రాహుల్జీ ప్రయాగ, లక్నోలకు వెళ్ళారు ఆయన తిరిగి పాట్నాకు వచ్చినరోజునే జాయస్వాల్ భౌతికకాయం బయటపెట్టబడి ఉంది. రాహుల్జీ ఒక మహామిత్రుని, మహాబంధువును, మహాగురువును కోల్పోయానని దుఃఖించారు.

రాహుల్జీ సోవియట్‌రష్యా వెళ్ళడానికి "వీసా" సిద్ధపరచినట్లు డాక్టరు స్చెర్బాత్స్కీనుండి జాబువచ్చింది. అలాగే బీహారుప్రభుత్వం రాహుల్జీ టిబెట్‌యాత్రకై ఆరువేల రూపాయలు మంజూరుచేసినట్లుకూడ తెలిసింది. మొదట రష్యా వెళ్ళిరావాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. పాట్నాలో ఉండగా "గాంధీవాదం, కమ్యూనిజం", "మానసిక బానిసత్వం","జమీందారీవ్యవస్థ"లనుగూర్చి వ్యాసాలు వ్రాశారు. ప్రయాగలో పండిత జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతను జరిగిన కళాశాలవిద్యార్థులసభలో "మన బలహీనతలు" అనే విషయంపై ఉపన్యసించారు. రష్యాప్రయాణ ఖర్చులకు ఆయనవద్ద ఏడెనిమిదివందలరూపాయలుమాత్రమే

ఉన్నాయి. ప్రయాగలో మరికొంతడబ్బు సేకరించారు. పండిత నెహ్రూకూడ వందరూపాయలు ఇచ్చారు. ఆయన వద్ద డబ్బు తీసుకోవడం ఉచితంగా కనబడలేదు. కాని ఆయన ఇస్తున్నప్పుడు నిరాకరించడం మంచిదికాదనుకొన్నారు.

రాహుల్జీ క్రీ. శ. 1937 సెప్టెంబరు 17వ తేదీ ఢిల్లీ నుండి బయలుదేరారు. ఇరాన్ మీదుగా నవంబరు 12వ తేదీన సోవియట్ రష్యా చేరుకొన్నారు.

## రెండోసారి రష్యాయాత్ర

రాహుల్జీ ప్రయాణంచేస్తున్న ఓడ నవంబరు 12వ తేదీ ఉదయం బాకూరేవువద్ద ఆగింది. కస్టమ్స్ అధికారి రాహుల్జీ తాళపత్రగ్రంథాలను లెక్కపెట్టి, ప్యాస్‌పోర్టుపై వ్రాశాడు. "భారతదేశంనుండి వచ్చేపండితుడు మీరేకదా?" అని ప్రశ్నించాడు. అతనికి ఈ విషయం కొద్దిగా తెలిసినట్లుంది. "నేను సోవియట్ అకాడమీ ఆహ్వానంపై వెళ్ళుతున్నాను," అని రాహుల్జీ సమాధానం చెప్పారు. ఒక మోటారుకారులో ఇన్-టూరిస్ట్ హోటల్‌కు వెళ్ళారు.

మరునాడు రైలులో మాస్కోకు బయలుదేరారు. ఇది మూడురోజుల ప్రయాణం. సాయంత్రం డర్బండ్ కనుమ చేరుకొన్నారు. సైనికదృష్ట్యా ఇది చాలాముఖ్యమైనప్రదేశం. భారతదేశానికి కైబర్ కనుమ ఎలాంటిదో, రష్యాకు డర్బండ్ కనుమ అలాంటిది. చీకటిపడిన తర్వాత ఒకచోట, భూమిలోపలనుండి ఏడు అగ్నిశిఖలు కనిపించాయి. కమ్యూనిస్టులు బాకూలోని జ్వాలాదేవిని ఆర్పివేస్తే, ఇక్కడ ఏక

ముఖంతో కాదు, సప్తముఖాలతో తిరిగి బయటికి వచ్చిందని చమత్కరించారు.

రాహుల్జీ మూడోరోజు రాత్రి 10 గంటలకు మాస్కో చేరుకున్నారు. ఆయనకు స్వాగతంఇవ్వడానికై ఇన్-టూరిస్ట్ ప్రతినిధివచ్చాడు. రాహుల్జీ మోటారులోకూర్చుని ఇన్ - టూరిస్ట్ హోటల్‌కు వెళ్ళారు. మరునాడు పాలి టెక్నిక్ మ్యూజియమ్, విశ్వవిద్యాలయం, లెనిన్ గ్రంథాలయం మొదలైనవాటిని చూశారు.

ఆరాత్రే మాస్కోనుండి బయలుదేరారు. ఉదయం 9 గంటలకు లెనిన్‌గ్రాడ్ చేరుకున్నారు. "యూరప్ హోటల్"లో దిగారు. తనకు కేటాయించిన గది లోకి వెళ్ళారు. డాక్టరు స్చేర్బాత్స్కీతో ఫోన్‌లో మాట్లాడారు. కాలికి దెబ్బతగిలినందువల్ల, అతడు మంచం పట్టినట్లు తెలిసింది. రాహుల్జీ ఆ సాయంత్రం అతని ఇంటికి వెళ్ళారు. డాక్టరు స్చేర్బాత్స్కీ చాలా ఆప్యాయంగా సంస్కృతంలో "రండి, కూర్చోండి" అని ఆహ్వానించాడు. ఇద్దరూ కాస్సేపు సంభాషణ జరిపారు.

మరునాడు రాహుల్జీ హెర్మిటేజ్ మ్యూజియమ్ చూడటానికి వెళ్ళారు. ఇది జారుచక్రవర్తి శరద్భవనంవద్ద ఉంది. దీనిని ఒక్కరోజులోపలే చూడటం అసాధ్యం. మధ్యఆసియా నుండి సంపాదించిన విగ్రహాలు, దారుఫలకాలు, వస్త్రాలు, వంటపనిముట్లు చక్కగా అలంకరింపబడ్డాయి. ఇక్కడ ఉన్న చిత్రపటాలు పదమూడు పద్నాలుగు శతాబ్దాలకు చెందిన టిబెట్ చిత్రపటాలను పోలి ఉన్నాయి. క్రీస్తుకుపూర్వం

అయిదో శతాబ్దంనుండి క్రీస్తుశకం ఏడో శతాబ్దంవరకు ఎన్నో వస్తువులు ఇక్కడ సేకరింపబడ్డాయి.

రాహుల్జీ ఆ మరునాడు ప్రాచ్యవిద్యాసంస్థకు వెళ్లారు. సంస్థ అధ్యక్షుడు స్త్రావేని, ఆధునిక భారతీయభాషలలో ప్రకాండపండితుడైన డాక్టరు బరన్నికోవ్‌ను కలుసుకొన్నారు. ఆ సాయంత్రం చరిత్రాత్మకమైన ఒక సినిమా చూశారు. తర్వాత ప్రతిరోజూ కాలినడకనే ప్రాచ్యవిద్యా సంస్థకు వెళ్లేవారు. అక్కడ ఇండో-టిబెట్ శాఖలో రాహుల్జీకి ప్రత్యేకంగా టేబుల్-కుర్చీ ఇవ్వబడింది. ఆయన భోట్ అనువాదంతో వార్తికాలంకార సంస్కృతప్రతిని పోల్చి చూచుకొనేవారు. ఇండో - టిబెట్ శాఖ కార్యదర్శి భోట్-రష్యన్ శబ్దకోశం ఒకటి తయారుచేస్తున్నట్లు తెలిసింది. ఆమె ఫ్రెంచి, ఇంగ్లీషు, రష్యన్, మంగోల్ భాషలు మాట్లాడేది. "మీకు నేను సంస్కృతం నేర్పిస్తాను. నాకు రష్యన్‌భాష నేర్పించండి," అని రాహుల్జీ అడిగారు. అందుకు ఆమె ఆమె అంగీకరించింది.

కార్యదర్శిపేరు లోల. ఆమెకు సంస్కృతం బోధించే నిమిత్తం రాహుల్జీ స్వయంగా పాఠాలు తయారుచేశారు. రష్యన్, సంస్కృతభాషలలో పోల్చుకోదగిన ధాతువులనే ఆ పాఠాలలో పొందుపరచారు. డిసెంబరు రెండోతేదీన ఆమెకు మొదటిపాఠం బోధించారు. రెండువారాలు దాటిందో లేదో అప్పుడే ఆమె ఏడుపాఠాలు నేర్చుకొన్నది. వారిద్దరిమధ్య స్నేహం పెంపొందింది. ఒకనాడు లోల ఇంటి నుండి వస్తూ, మంచులో జారిపడింది. ఆమె రాహుల్జీతో

లోల రాహుల్జీగారి ప్రేయసి -



ఈ విషయం చెప్పింది. అప్పుడు ఆయన ఒక శ్లోకభాగం చదివారు—"కాలే పయోధరాణామ పతితయా నైవశక్యతే స్థాయుమ్."

లోల షివాగేన్, కలియానోవ్ అనే భాషావేత్తల నుద్దేశించి దీని అర్థమేమిటని అడిగింది. రాహుల్జీయే జోక్యం కలిగించుకొని అర్థం చెప్పారు. అది విని, లోల చిరునవ్వు నవ్వింది. చివరికి డిసెంబరు 22 వ తేదీ వచ్చింది. ఆ రోజున ఆమె రాహుల్జీ అర్ధాంగి అయింది. అప్పటినుండి రాహుల్జీ ఆమె ఇంటికి వెళ్ళేవారు. ఆమె ఇల్లు ప్రాచ్యవిద్యాసంస్థకు చాలాదూరంలో ఉండేది. అది ఒకగంటప్రయాణం. కాని రాహుల్జీ హోటల్ లోనే ఉండేవారు. ఎందుకంటే అకాడమీవారు ఆయననుగూర్చి ఇంకా ఖచ్చితమైన నిర్ణయానికి రాలేదు.

సోవియట్ రష్యా అంతటా జనవరి ఒకటో తేదీన పండుగ చేసుకొన్నారు. ఆ రోజున డాక్టరు స్చేర్బాట్స్కీ- శిష్యురాలు సెన్యాలికోవా రాహుల్జీని కలుసుకొన్నది. విశ్వవిద్యాలయంలో ఆమె సంస్కృతం చదువుతూ ఉండేది. తనను లెనిన్గ్రాడ్ బౌద్ధవిహారానికి తీసుకువెళ్ళమని రాహుల్జీ కోరారు. విహారం నగరానికి వెలుపల ఉంది. ట్రాముపై ఇద్దరూ వెళ్ళారు. విహారం టిబెట్ పద్ధతిలో నిర్మింపబడింది. దానిఎదుట రెండుజింకల మధ్య ధర్మచక్రం నిర్మించారు. విహారకమిటీ అధ్యక్షుడు డాక్టరు స్చేర్బాట్స్కీ.

ఆ రాత్రి డాక్టరు స్చేర్బాట్స్కీ భోజనానికి పిలిచారు. రాహుల్జీ, లోల ఇద్దరూ వెళ్ళారు. మద్యంకూడ

ఇచ్చారు. కాని రాహుల్జీకి అలవాటులేదు. అందుచేత ఎర్ర రంగుగల ఏదో పానీయం ఇచ్చారు. "ఇది మద్యం కాదు. ఇందులో మంచి మద్యం రంగు మాత్రమే ఉంది," అని డాక్టరు స్చేర్బాట్‌స్కీ అన్నారు. రాహుల్జీ నోటిదగ్గరపెట్టుకోగా, ఘాటువచ్చింది. దానిని అక్కడే వదలిపెట్టారు. తర్వాత లోల రాహుల్జీని తనఇంటికి తీసుకువెళ్ళింది.

డాక్టరు స్చేర్బాట్‌స్కీతో కలిసి కొన్ని బౌద్ధన్యాయ గ్రంథాలను యూరోపియన్‌భాషలలోకి అనువదించే ఉద్దేశంతో రాహుల్జీ ఇక్కడకు వచ్చారు. కాని సోవియట్ రష్యాలో విప్లవానికి వ్యతిరేకంగా ఒక పెద్దకుట్ర జరుగుతున్నకాలం ఇది. అందుచేత రాహుల్జీ విషయమై అకాడమీవారు త్వరగా ఏ నిర్ణయానికీ రాలేకపోయారు. ఒక వేళ తాను భారతదేశానికి తిరిగి వెళ్ళవలసివస్తే, వెంటనే వెళ్ళడం అవసరమని రాహుల్జీ అనుకొన్నారు. ఎందుకంటే టిబెట్‌యాత్రకోసం ఈ సంవత్సరం ఆయనకు బీహారుప్రభుత్వం ఆరువేలరూపాయలు మంజూరుచేసింది. తన సమస్యను త్వరగా తేల్చివేయమని రాహుల్జీ అకాడమీవారిని వత్తిడిపెట్టారు. కాని రాజకీయజీవితాన్నిగూర్చి ఇంకా లోతుగా పరిశీలించకుండానే ఒక నిర్ణయానికి రావడం కష్టమని అకాడమీవారు చెప్పారు. చివరికి రాహుల్జీ భారతదేశానికి తిరిగి వెళ్ళడానికే నిశ్చయించుకొన్నారు.

ఈ వార్త లోల మనస్సుకు చాలా కష్టం కలిగించింది. ఎందుకంటె తాము ఇద్దరూ ఒకటై నెలన్నర మాత్రమే అయింది. రాహుల్జీ భారతదేశానికి వెళ్ళివెళ్ళడం

తోటే టిబెట్ ప్రయాణం పెట్టుకొన్నారు. అందుచేత లోలను తనవెంట తీసుకువెళ్ళదామనే ఆలోచన చేయలేదు. చివరికి జనవరి 13 వ తేదీని వీడ్కోలు ఇవ్వవలసివచ్చింది. అందరికంటె ఎక్కువగా లోలకు, ఆ తర్వాత ఆమెగురువు డాక్టరు స్చెర్బాట్‌స్కీకి దుఃఖం కలిగింది. రాహుల్జీని పాట్నాలో జాయస్వాల్ ఎలా ఆదరించేవాడో, ఇక్కడ స్చెర్బాట్‌స్కీ అలా ఆదరించేవాడు.

లోల, రాహుల్జీ ఇద్దరూ రైల్వేస్టేషన్‌కు వచ్చారు. రైలుబండి కదలడానికి తగినంత వ్యవధి ఉంది. అందుచేత ఇద్దరూ చాలాసేపు స్టేషన్‌లో అటూఇటూ తిరిగారు. బాహ్యప్రపంచానికి, సోవియట్‌రష్యాకు ఉన్న సంబంధాన్ని బట్టి చూస్తే, తాము త్వరలో కలుసుకొనే ఆశలు లేవు. కాని ఈ ప్రేమ ఈ అడ్డంకులను లెక్కచేయదు. అర్ధరాత్రి దాటింది. రైలుఇంజన్ ధ్వనిచేసింది. ఇద్దరి మనస్సులకు ముల్లు గుచ్చుకొన్నట్లు అయింది. వీడ్కోలు పుచ్చుకోవలసిన సమయం వచ్చింది. కళ్ళవెంబడి కరుణరసాన్ని ఒలికిస్తూ, లోల వీడ్కోలు పుచ్చుకొన్నది. రైలుబండి బయలుదేరింది. చాలాసేపటిదాకా లోల ప్లాట్‌ఫారంపై నిలబడి చూస్తూనే ఉంది.

మరునాడు రాహుల్జీ మాస్కో చేరుకొన్నారు. అప్పుడు ఎన్నికలు పూర్తిఅయి రష్యా పార్లమెంటుసమావేశం జరుగుతున్నది. పార్లమెంటుసభ్యులేకాకుండా, దేశం నలుమూలలనుండి చాలామంది ప్రేక్షకులుగా వచ్చారు. రాహుల్జీ ఈసంరంభాన్ని విలకించారు. ఆఫ్ఘనిస్తాన్‌మీదుగా

భారతదేశానికి వెళ్ళాలని ఆయన ఉద్దేశం. మరునాడు ఆయనకు "వీసా" లభించింది. ఆ రాత్రే స్టాలినాబాద్ వెళ్ళే మెయిల్‌లో బయలుదేరారు.

అది జనవరి 17 వ తేదీ. రైలు ఒక కొండమైదానంలో ప్రయాణంచేస్తున్నది. అక్కడక్కడ పేడపిడకలు కొట్టిఉండటం కనిపించింది. గ్రామాలలో ఇళ్ళపై గడ్డి కప్పారు. మధ్యాహ్నం దాటినతర్వాత వోరెన్‌బర్గ్ పట్టణం కనిపించింది. ఇక్కడ రష్యన్లే కాకుండా, మంగోలు ముఖ ముద్రకలిగిన తాతార్ స్త్రీ పురుషు లెందరో ఉన్నారు. తాతార్ స్త్రీలు ఇప్పటికీ పయిజమాలుధరిస్తున్నారు. వోరెన్‌బర్గ్ దాటినతర్వాత గ్రామాలలో మట్టిఇళ్ళు కనిపించాయి. నాలుగురోజుల తర్వాత రైలు టెర్మిజ్ స్టేషన్ చేరుకొన్నది.

రాహుల్జీ అక్కడ దిగారు. ఆయనకు రైలులో పరిచితులైనవారిలో పల్లెటూరి రైతు మహమ్మదోవ్ ఒకరు. "మా కోల్ఖోజ్ టీ స్టాల్‌లోకి వెళ్ళి టీ తాగుదాం రండి" అని పిలిచాడు. పల్లెటూరివారు అప్పుడప్పుడు పట్టణానికి రాక తప్పదు. అందుచే తమ సౌకర్యంకోసం పల్లెటూరి తరఫున పట్టణంలోకూడ టీ స్టాల్ తెరిచారు. పల్లెటూళ్ళలో వ్యవసాయం టీ స్టాల్ దుకాణంకూడ సమష్టిగా ఉంటాయి. అందుచేత పట్టణంలోకూడ ఇలాంటి టీ స్టాల్ ఏర్పాటు చేయడం తేలికైంది. పల్లెటూరివారు సినిమాచూడ్డానికో, మరేదైనా పనిమీదనో పట్టణానికి వస్తే, తమ టీ స్టాల్‌లో దిగుతారు. రాహుల్జీ ఇక్కడే భోంచేశారు. ఆయనకు

మహమ్మదోవ్ వీడ్కోలు ఇస్తూ, "మీరు మళ్ళీ వస్తే, మా గ్రామానికి తీసుకువెళ్ళుతా"నని చెప్పాడు.

మరునాడు రాహుల్జీ పట్టణం చూడటానికి బయలు దేరారు. రెండంతస్థులు గల ఒక పాఠశాలభవనంలో ప్రవేశిం చారు. ఆ రోజు లెనిన్ వర్ధంతి. అందుచేత పాఠశాలకు సెలవు ప్రకటించారు. అక్కడ పనిచేస్తున్న ఒక ముసలమ్మ రాహుల్జీని భూగోళం బోధించే ఉపాధ్యాయుని వద్దకు తీసుకువెళ్ళింది. అతడు బడిపిల్లలకు ఫోటోతీసేపద్ధతి నేర్పిస్తున్నాడు. పయనీర్ల (స్కౌట్ బాలబృందం) తరపున కొందరు రాహుల్జీ వద్దకు వచ్చారు. ఆయన హిందూదేశం నుండివచ్చినట్లు వారికి తెలిసింది. "మేము ఇక్కడ ఒక ఉత్సవం జరపదలచాము. మీరు హిందూదేశాన్నిగూర్చి ఉపన్యాసం ఇవ్వండి" అని రాహుల్జీని కోరారు. తనకు రష్యన్ భాష రాదని ఆయన చెప్పారు. అయినప్పటికీ బాలలు వినలేదు. "మీరు తజిక్ భాషలో మాట్లాడితే, మాలో ఒకడు రష్యాలోకి అనువదిస్తాడ"ని చెప్పారు. ఆయనను ఒక పెద్దగదిలోకి తీసుకువెళ్ళారు. అక్కడ గోడపై ఆసియాపటం వ్రేలాడ దీయబడింది. దగ్గరలోనే ఒక కుర్చీపై పదేళ్ళవయస్సుగల తజిక్ బాలుడు కూర్చున్నాడు. అతడు దుబాసీపనిచేయడానికి తయారైనాడు. మొదటివారు రాహుల్జీయాత్రచేసేమార్గాన్ని గూర్చి ప్రశ్నించారు. రాహుల్జీ ఆసియాపటంపై ఆమార్గాన్ని చూపించారు. తర్వాత హిందూదేశ పయనీర్లనుగూర్చి అడిగారు. హిందూదేశంలో చాలా తక్కువమంది పిల్లలు బడికి వెళ్ళుతారని, వారిలోకూడ చాలా తక్కువమంది

పయనీర్లు అవుతారని రాహుల్జీ చెప్పారు. తర్వాత "హిందూ దేశంలో బాలలు ఏమిచేస్తారు?" అని వారు అడిగారు. "పనిచేస్తారు" అని రాహుల్జీ జవాబిచ్చారు. తొమ్మిదేళ్ళ వయస్సుగల ఒక రష్యన్ బాలుడు తన రొమ్ముపై చెయ్యి పెట్టుకొని, "నాలాంటి పిల్లలు ఏమిచేస్తారు?" అని ప్రశ్నించాడు. "నీలాంటి పిల్లలు పశువులు కాస్తారు. ఇతరుల పిల్లలను ఆట్లాడిస్తారు. లేకపోతే పొట్టకూటికై మరేదైనా పని చేస్తారు" అని రాహుల్జీ జవాబిచ్చారు. తనమాటను వారు నమ్మడంలేదని ఆయన గ్రహించారు. "మీలో ఎవరైనా పెట్టుబడిదారును చూశారా?" అని రాహుల్జీ ప్రశ్నించారు. అందరూ "లేదు" అని చెప్పారు. కాని ఒక పిల్లవాడు నిల్చుని "నేను చూశాను" అన్నాడు. పిల్లలంతా అనుమానంతో అతనివైపు చూశారు. "ఎక్కడ చూశావు?" అని రాహుల్జీ అడిగారు. "సినిమాలో" అని అతడు సమాధాన మిచ్చాడు. అప్పుడు రాహుల్జీ "మా దేశంలో ఉన్నది పెట్టుబడిదార్ల రాజ్యం. అందుచేత బాలలలో ఎక్కువ మంది బడికి వెళ్ళలేకపోతున్నారు" అని చెప్పారు. ఆ పిల్లలు పెట్టుబడిదారును చూచి ఉండనిమాట నిజమే. కాని పెట్టుబడిదార్ల కథలు ఎన్నో విన్నారు. మనదేశంలోని పిల్లల దృష్టిలో పిశాచి, రాక్షసుడూ ఎలాగో, రష్యన్ పిల్లల దృష్టిలో పెట్టుబడిదారు అలాగ ఉంటాడు. రాహుల్జీమాటను ఆ పిల్లలు నమ్మారు. తర్వాత ఆయన పయనీర్లవద్ద సెలవు తీసుకున్నారు. రైలులో ఆయనకు పరిచితుడైన మహమ్మదోవ్‌ను కలుసుకొన్నారు. అతడు రాహుల్జీని తన గ్రామా

నికి తీసుకువెళ్లాడు. రాహుల్జీ ఒకరోజల్లా అక్కడ గడిపి, తిరిగి టెర్మిజ్‌కు వచ్చారు. మూడోరోజున ఒక మోటారు పడవలో ఆఫ్ఘనిస్తాన్‌కు బయలుదేరారు.

## ఆఫ్ఘనిస్తాన్ యాత్ర

రాహుల్జీ జనవరి 27 వ తేదీన మాసిర్ధీ చేరుకొన్నారు. ఇది ఒకప్పుడు పెద్దపట్టణం. కాని ఇప్పుడు పాడుబడింది. సమీపంలో అడవులుకూడ లేవు. పశువులమేతకు ఇది చక్కని ప్రదేశం.

తర్వాత రాహుల్జీ మజార్‌కు వెళ్ళారు. ఇక్కడ బాహ్లీక గుర్రాలు ఉన్నాయి. ఇవి పూర్వకాలంలోకూడ చాలా ప్రసిద్ధికెక్కాయి. బండికి ఒకేగుర్రం కడతారు. కాని దానివెంట ఇంకో గుర్రంకూడ నడుస్తుంది. వెయ్యేళ్ళ క్రితం ఈ పట్టణం ప్రపంచఖ్యాతి చెందింది. నేటికీ దీనిని "మాదరే షహార్" అని గొప్పగా పిలుస్తారు.

ఇళ్ళు కట్టుకోవాలంటే ఇక్కడ ఇటుకల కాల్పించ వలసిన అవసరం ఉండదు. భూమిఅడుగున ప్రాచీనగృహాల ఇటుకలు ఎన్నో ఉన్నాయి. వాటితో వేలాది ఇళ్ళు కట్టు కోవచ్చు. ఒకచోట ఇటుకలు త్రవ్వుతుండగా రాహుల్జీ చూశారు. అది మూడున్నర అడుగుల మందంగల గోడ. ఒక్కొక్క ఇటుకపొడవు పదిహేను అంగుళాలు, వెడల్పు మూడంగుళాలు.

రెండురోజులతర్వాత రాహుల్జీ బల్ఖియా మ్యూజి యమ్‌కు వెళ్లారు. ఇక్కడ ప్రాచీన నాణెములు భద్రపరచ

బడ్డాయి. గ్రీకు, కుషాణకాలంనాటి వెండి, బంగారు, రాగి నాణెములు వెయ్యికిపైగా ఉన్నాయి. వీటిలో ఎక్కువ భాగం ఇక్కడకు మూడుక్రోసులదూరంలో లభించాయి. గాంధారకళకు సంబంధించిన ఎన్నో సున్నపువిగ్రహాలు ఉన్నాయి.

రాహుల్జీ కొద్దిరోజులకు కాబూల్ వెళ్లారు. ఫ్రెంచి రాయబారకార్యాలయంలో మోనియేని కలుసుకొన్నారు. షాగిర్ద్ (కపిశ) ఒకప్పుడు పెద్దనగరంగా ఉండేది. కొద్ది రోజుల క్రితం ఫ్రెంచి విద్వాంసులు దీనిని త్రవ్వారు. ఇందులో చరిత్రాత్మక వస్తువులు అనేకం బయటపడ్డాయి. మోనియేకూడ ఈ కార్యక్రమంలో పాల్గొన్నాడు. అతడు కొన్నివస్తువుల ఫొటోలు తీసుకొన్నాడు. వాటిని రాహుల్జీకి చూపించాడు. తర్వాత రాహుల్జీవెంట కాబూల్ మ్యూజియమ్కు వెళ్ళాడు. అది దారుల్అమాన్లో ఉంది. మ్యూజియమ్లో మైత్రేయ విగ్రహం ఒకటి ఉంది. దానికి ఒకవైపున ఆఫ్ఘన్వేషం, రెండోవైపున శకవేషం కనపడుతుంది.

షాగిర్ద్ (కపిశ)లో లభించిన అందమైన మట్టివిగ్రహా లనుకూడ రాహుల్జీ చూశారు. అవి రంగురంగులలో నేటికీ తాజాగా కనిపిస్తాయి. స్త్రీల వెండ్రుకలు ఎన్నోవిధాలుగా అలంకరింపబడ్డాయి. ఈ కేశవిన్యాసాన్ని ఫ్రెంచి మహిళలు చూస్తే, చాలా సంబరపడతారని మోనియో అన్నాడు. ఒక ఏనుగదంతంపై సాంచీ, భరహుత్ నమూనాకు చెందిన స్తూపం చాలా అందంగా చెక్కబడింది. గంగ, యమునల

కొయ్యబొమ్మలు ఇక్కడ ఉన్నాయి. ఇవికూడ చాలా అందంగా ఉన్నాయి. పాణిని కాలంలో (క్రీస్తుకుపూర్వం నాలుగోశతాబ్దం) కపిశ (షాగిర్ద్) మద్యమూ, ద్రాక్ష చాలా ప్రసిద్ధికెక్కింది. అందుచేత అక్కడ అతిసుందరమైన కాంస్య సురాభాండం, చషకం లభించాయి. పూర్వం అక్కడ నివసించిన హిందువుల, బౌద్ధుల వస్తువులెన్నో మ్యూజియమ్‌లో ఉన్నాయి. కాబూల్‌లో 400 హిందూ కుటుంబాలు, 22 హిందూ దేవాలయాలు ఉన్నాయి.

హిందువులు తమఇళ్ళలో పంజాబీ మాట్లాడతారు. కాబూల్‌లోనేకాకుండా చారికార్, బేగ్రామ్, కంధార్, గజనీ, జలాలాబాద్‌లలోకూడ హిందువులు ఉన్నారు. వారిలో బ్రాహ్మణులు (సారస్వత, మోహియాల్), ఖత్రీ, అరోడా, వైశ్య తదితరజాతులు ఉన్నాయి. హిందువులు ఎక్కువగా వ్యాపారంచేస్తున్నారు. వారు గజనీమహమ్మద్ కాలంలో ఇక్కడకు వచ్చారు. స్వయంగా కొన్ని పుణ్య తీర్థాలను సృష్టించుకొన్నారు. దరాక్ష్కర్ "శంకర్" అయింది. అక్కడే మానసరోవరాన్ని ఏర్పాటుచేసుకొన్నారు, ఇలాగే ఇంకా ఎన్నో పుణ్యతీర్థాలు కనిపిస్తాయి. రాహుల్జీ వెళ్ళినరోజున వసంతపంచమి. ప్రజలు ఒకమందిరంలోక హార్మోనియమ్, తబలా, సితారా తీసుకువెళ్ళి తులసీదాస్ వినయపత్రికలోని పద్యాలు పాడారు.

రాహుల్జీ కాబూలులో అయిదురోజులు ఉండి, ఒక లారీలో పెషావర్‌కు వెళ్ళారు. అక్కడనుండి ఫిబ్రవరి 16 వ తేదీన సారనాథ్ చేరుకొన్నారు. సారనాథ్‌లో నేనే ధర్మ

వర్ధన్ కనిపించాడు. అతడు రాహుల్జీ వెంట టిబెట్‌కు వెళ్ళదలచాడు.

*　　　*　　　*

టిబెట్‌కు వెళ్ళేముందు రష్యానుగూర్చి ఒకపుస్తకం వ్రాయాలని రాహుల్జీ ఉద్దేశం. ఆయన మార్చి రెండవ తేదీన కాశీకి వెళ్లారు. అక్కడఉన్న బర్మీ ధర్మసత్రంలో పుస్తకం వ్రాయ సంకల్పించారు. ప్రేమచంద్ స్వగ్రామంలో గురుప్రసాద్ విశ్వకర్మ అనునతడు ఉండేవాడు. అతనివ్రాతచక్కగాఉంటుంది. పైపెచ్చు త్వరత్వరగాకూడా వ్రాస్తాడు. అందుచేత అతనిని కాశీకి పిలిపించుకొన్నారు. మార్చి రెండో తేదీన పుస్తకరచనప్రారంభించారు. మధ్యలో రాహుల్జీ ఏదో పనిమీద లక్నో, పాట్నాలకు వెళ్ళవలసి వచ్చింది. ఇలా పదిహేనురోజులు పుస్తకరచన కుంటుపడింది. అయినప్పటికి ఏప్రిల్ ఎనిమిదో తేదీకి రచన సమాప్తమైంది. వెంటనే ప్రయాగకు వెళ్ళి, పుస్తకాన్ని అచ్చుకు ఇచ్చారు.

రాహుల్జీ ఆ తర్వాత ముజప్ఫర్‌పూర్‌లో గేషే ధర్మవర్ధన్‌నుకలుసుకొన్నారు. ఇద్దరూ మోటారులో కాలింపాంగ్ చేరుకొన్నారు. రాహుల్జీ రష్యాయాత్రచేసి వచ్చిన తర్వాత, ప్రభుత్వం ఆయనపై నిగాపెట్టింది. ఆయనకాలింపాంగ్ చేరుకొన్న గంటసేపటికే ఒక పోలీస్‌కానిస్టేబుల్ వచ్చి, దర్యాప్తుచేశాడు. రాహుల్జీ సారనాథ్‌లో ఉండగా కూడ ఇదేవిధంగా జరిగింది.

311



# టిబెట్‌లో నాలుగోసారి

రాహుల్జీ ఏప్రిల్ 23 వ తేదీన గ్యాంటిక్ చేరుకొన్నారు. సామానును మహారాజు ఆంతరంగిక కార్యదర్శి ఇంట్లో పెట్టారు. అతడు రాహుల్జీని ఒక ప్రమాదకరమైన వ్యక్తిగా భావించాడు. ఆయన సామానును వేరొకరి ఇంట్లో పడవేయించాడు. రాహుల్జీ పొలిటికల్ ఏజంటును కలుసుకొని అనుమతిపత్రం పొందారు. ఆ సాయంకాలమే కాలింపాంగ్‌కు తిరిగివచ్చారు. టిబెట్ ప్రభుత్వం రాహుల్జీకి అన్ని గ్రంథాలయాలు తెరచి చూపించడానికి అనుమతిఇచ్చింది. ప్రతి కేంద్రంలోను అద్దెకుగుర్రాలు, కంచరగాడిదలు సప్లయిచేయాలనికూడ ఆజ్ఞలు జారీచేసింది. రాహుల్జీ తనబృందంతో మేనెల 4 వ తేదీన టిబెట్‌కు బయలుదేరారు. ఆయన వెంట గేషేధర్మవర్ధన్ కూడఉన్నాడు.

వీరు పదిహేడురోజులు ప్రయాణంచేసి గ్యాంచీ చేరుకొన్నారు. రాహుల్జీకి కొద్దిగా జ్వరం తగిలినందువల్ల, ఇక్కడ మూడు నాలుగురోజులు ఆగిపోవలసివచ్చింది. తర్వాత వీరు తమ యాత్ర కొనసాగించారు. మేనెల 27 వ తేదీన షులూ విహారం చేరుకొన్నారు. మరునాడు గ్రంథాలయం తెరువబడింది. వెనకటిసంవత్సరం కనిపించిన పుస్తకాలు కొన్ని ఇప్పుడు మాయమైనాయి. కాని ఈ సారి సుప్రసిద్ధ నైయాయికుడు జ్ఞానశ్రీ రచించిన పన్నెండు గ్రంథాలు లభించాయి. అవన్నీ ఒకే కట్టలో ఉన్నాయి. "యోగాచారభూమి"లో శిథిలమైన అధ్యాయాలుకూడ లభించాయి టిబెట్ హస్తలిఖితగ్రంథాలలో ఫక్-లో-చా-

జీవితచరిత్ర దొరికింది. ఈపండితుడు క్రీ.శ. 1220ప్రాంతంలో భారతదేశానికి వెళ్లాడు. అతడు నలందాలో రాహుల్ శ్రీభద్రవద్దఉన్నాడు. తురుష్కులు నలందాను నాశనంచేశారని, అయినప్పటికి కొన్ని భవనాలు మిగిలిపోయాయని అతడు వ్రాశాడు.

రాహుల్జీబృందం జూన్ 19వ తేదీన షిగర్చేకి వెళ్లింది. కాని కొన్ని కారణాలవల్ల, వారు వెళ్ళినపని నెరవేరలేదు. తర్వాత నర్థంగ్ విహారానికి వెళ్లారు. అక్కడ పెద్దపెద్ద భారతీయ చిత్రపటాలు కనిపించాయి. వాటిని ఫోటో తీసుకున్నారు. పలకరాళ్ళపై 84 మంది సిద్ధుల బొమ్మలు చెక్కబడి ఉన్నాయి. వాటినికూడ ఫోటో తీసుకున్నారు. ఈవిధంగా రాహుల్జీకి పదేళ్ళకు సరిపడ సామగ్రి లభించింది. వీరు సెప్టెంబరు ఒకటో తేదీన సాక్యవిహారానికి వెళ్లారు. చామెకషో తదితర పూర్వపరిచితులను కలుసుకున్నారు. చామెకుషో పెంపుడుకూతురు చనిపోయింది. అందుచేత మరొక అమ్మాయిని పెంచుకుంటున్నది. రాహుల్జీ ఇక్కడ పదిహేనురోజులు ఉన్నారు. కాని ముఖ్యమైన గ్రంథాలు ఏవీలభించలేదు. అందుచేత సెప్టెంబరు 16వ తేదీన భారతదేశానికి బయలుదేరారు. దారిలో దొంగలముఠా చాలాదూరంవరకు వీరిని వెంబడించింది. కాని రాహుల్జీ అప్రమత్తతవల్ల ఎలాంటి ప్రమాదమూ జరగలేదు. గ్యాంటకే మీదుగా అక్టోబరు అయిదో తేదీన కలకత్తా చేరుకున్నారు.

---

# పదో అధ్యాయం

## రాజకీయాలలో పునఃప్రవేశం

## రైతు, కూలీలసేవ

రాహుల్జీ కలకత్తాకు వచ్చినరోజునే పత్రికాగోష్ఠి జరిగింది. తాను ఈదఫా రాజకీయాలలో మరుకుగా ప్రవేశింప దలచినట్లు రాహుల్జీ తెలియజేశారు. ఆయన రాజకీయరంగం నుండి నిష్క్రమించి ఇప్పటికి పదకొండేళ్ళు అయింది.

సోవియట్ విప్లవం రాహుల్జీకి నూతన దృష్టిని ప్రసాదించింది. ఆయన ఇరవై ఒక్క సంవత్సరాలక్రితమే తన పంథాను నిర్ణయించుకున్నారు. అందుచేత కలకత్తాలోని కమ్యూనిస్టులతో సంబంధం పెట్టుకోదలచారు. అప్పట్లో కమ్యూనిస్టుపార్టీ నిషేధింపబడింది. అయినప్పటికీ రాహుల్జీ సోమనాథ్ లాహిరీ ఉండేచోటు తెలుసుకున్నారు. ఆయనతో సంభాషణ జరిపారు. బీహారులో ఇంకా కమ్యూనిస్టు పార్టీ ఏర్పడలేదని, అక్కడ కమ్యూనిస్టులు కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో ఉంటున్నారని, అందుచేత మీరుకూడ వారితో కలసి పనిచేయమని సోమనాథ్ లాహిరీ చెప్పారు. కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ అంటే రాహుల్జీకి గిట్టేదికాదు. ఆయన పిగక్కెలో ఉండగా "జనత" సంచిక ఒకటి కనిపించింది. అందులో సోవియట్ రష్యాను నిందిస్తూ మసానీ వ్రాసిన వ్యాసం ఒకటి ప్రచురింపబడింది. రాహుల్జీ ఈవిషయంలో

లాహిరీ దృష్టికి తెచ్చారు. సోవియట్‌ను ఒకవైపున నిందిస్తూ, రెండోవైపున తాను కమ్యూనిస్టునని, సోషలిస్టునని చెప్పుకునేవాడు వంచకుడని, మూర్ఖుడని రాహుల్జీ అన్నారు. కాంగ్రెస్ - సోషలిస్టుపార్టీలో ఉన్నవారంతా మసానీలాంటివారు కాదని లాహిరీ చెప్పారు.

తర్వాత రాహుల్జీ ఛప్రాజిల్లాకువెళ్ళి, జిల్లాలోని రాజకీయపరిస్థితులను అధ్యయనం చేశారు. దాల్మియానగర్‌లో కార్మికుల స్థితిగతులను పరిశీలించారు. అక్కడ ఉద్యోగుల క్లబ్ ఒకటి ఉంది. వారు సభజరిపి, రాహుల్జీకి సన్మానపత్రం సమర్పించారు. రాహుల్జీ ఇరాన్, టిబెట్‌యాత్రలను గూర్చి కొద్దిగా మాట్లాడారు. రష్యానుగూర్చి కూడ మాట్లాడవలసిందని సభికులు కోరారు. రాహుల్జీ మౌనం వహించారు. కాని సభికులు పదేపదే వత్తిడిచేశారు. అప్పుడు సేఠ్‌జీ జోక్యం కల్పించుకొని, ఇక్కడ రష్యానుగూర్చి ఏమీ మాట్లాడకూడదన్నాడు. రాహుల్జీ అక్కడ ఏమీ మాట్లాడలేదు. కాని ఆతర్వాత జరిగిన కార్మికులసభలో రష్యానుగూర్చి మాట్లాడారు.

ఆ సంవత్సరం బీహారురాష్ట్రి రైతుమహాసభ దర్భాంగా జిల్లాలో జరిగింది. రాహుల్జీకూడ ఆ మహాసభలో పాల్గొన్నారు. రైతులను ఉద్ధరిస్తామని చెప్పి, వారి వోట్లతో గద్దె ఎక్కిన కాంగ్రెస్ మంత్రివర్గం, ఇప్పుడు జమీందార్ల కష్టాలనుగూర్చి ఉపన్యాసాలు ఇస్తూ ఉండటం రాహుల్జీ సహించలేకపోయారు. జీరాదేయ్‌కి వెళ్ళి, రాజేంద్రబాబును కలుసుకొన్నారు. ఆయనతో జాతీయ, అంతర్జా

తీయ పరిస్థితులనుగూర్చి, ముఖ్యంగా రైతుల సమస్యను గూర్చి మాట్లాడారు. తర్వాత ముజఫ్ఫర్‌పూర్‌కు వెళ్ళారు. అప్పుడు రాష్ట్రకాంగ్రెస్‌- సోషలిస్టుపార్టీ మహాసభ జరుగుతున్నది. జయప్రకాశ్ నారాయణ్, తదితరులు రాహుల్జీని పార్టీలో చేరమని కోరారు. కాని ఆయన మసానీవ్రాసిన వ్యాసాన్ని ప్రస్తావించి, "మీపార్టీ సోవియట్ వ్యతిరేక విధానాన్ని అనుసరిస్తూఉంటే, నేను అందులో ఎలా చేరగలను?" అని ప్రశ్నించారు. అవి మసానీ అభిప్రాయాలేనని, అందుకు పార్టీబాధ్యత వహించదని అతడు చెప్పాడు. అంమమీదట రాహుల్జీ పార్టీసభ్యత్వం స్వీకరించారు. అంతకు క్రితమే హరినగర్ పంచదార ఫ్యాక్టరీలో కార్మికులు సమ్మె చేశారు. ఇది కాంగ్రెస్ పెట్టుబడిదారు ఫ్యాక్టరీ. అతడు వందిలాది కార్మికులను జైలులో పెట్టించాడు. సబ్-డివిజనల్ మేజిస్ట్రేట్ కొందరు పిల్లలను బెత్తాలతో కొట్టాడు. ఇదంతా విని రాహుల్జీకి ఆశ్చర్యం కలిగింది. కాంగ్రెస్ ఇక ఎవరి తోడ్పాటుతో విదేశీయులను వెళ్ళగొట్టదలచిందో ఆయనకు అర్థం కాలేదు.

బీహారురాష్ట్రంలో జమిందార్లు రైతులను బేదఖల్ చేయడం ప్రారంభించారు. రైతునాయకుడు కార్యానంద శర్మతోబాటు రాహుల్జీకూడా రంగంలోకి దుమికారు. పలు చోట్ల సభలు జరిపి, రైతులను సత్యాగ్రహంలోనికి సిద్ధం చేశారు. అమ్వారీ సత్యాగ్రహంలో రాహుల్జీకూడ పాల్గొన్నారు. రైతులు పెట్టిన చెరుకును కోసుకుపోనివ్వకుండా జమీందారు మనుష్యులు అటకాయించారు. ఈసందర్భంలో

సబ్ ఇన్‌స్పెక్టర్ రాహుల్జీ తదితరులను అరెస్టు చేశాడు. వెంటనే జమీందారు మనిషి వచ్చి రాహుల్జీ నెత్తిపై లాఠీతో కొట్టాడు. నెత్తురు కారింది. అరెస్టు అయిన వారినందరినీ ఛప్రా జైలులో పెట్టారు. కొద్దిరోజుల తర్వాత ఆమరణ నిరాహారదీక్ష పూనాలని రాహుల్జీ ప్రభృతులు నిశ్చయించారు. మరునాడు పోలీసు సూపరింటెండెంటు రాజీ ప్రతిపాదన చేశాడు.

రాహుల్జీ మార్చి 14 వ తేదీన "మీ వినాశం" అనే పుస్తకం వ్రాయ మొదలుపెట్టారు. అదేరోజు మాస్కో మిత్రుడు డాక్టరు స్చేర్వాట్స్కీనుండి ఒక జాబు వచ్చింది. లోలకు ఒక చక్కని కొడుకు పుట్టాడని, అతడు ఆరోగ్యంగా ఉన్నాడని అందులో వ్రాయబడింది. జాబుతోపాటు ఒక ఫోటో కూడ పంపబడింది.

రాజీ సంప్రతింపులు విఫలమైనందువల్ల రైతు సత్యాగ్రహం తిరిగి ప్రారంభమైంది. ఛప్రా జైలులో రాహుల్జీ నిరాహారదీక్ష మొదలుపెట్టారు. ఆయన తనదీక్షను కొనసాగిస్తూనే, వారంరోజులలోపల పుస్తకరచన పూర్తి చేశారు. జైలు ఖైదీల కోర్కెలను అధికార్లు అంగీకరించినందువల్ల, రాహుల్జీ అయిదోరోజున నిరాహారదీక్ష విరమించారు. వెంటనే "జీవించడంకోసం" అనే నవలా రచనకు ఉపక్రమించారు. ఆయన చెబుతూ ఉండగా, నాగార్జున్ అనే సహచరుడు వ్రాశాడు. కొద్దిరోజుల తర్మాత రాహుల్జీ ప్రభృతులపై దొంగతనం నేరం ఆరోపించబడింది. రాహుల్జీకి సంకెళ్ళు వేసి కోర్టుకు తీసుకువెళ్ళారు. ఆయన నేరాన్ని

ఒప్పుకోలేదు. తిరిగి సంకెళ్లు వేసి ఛప్రాకు పంపించారు. ఆయన ఛప్రాస్టేషన్‌లో దిగగానే, ఒకమిత్రుడు సంకెళ్ళలో ఉన్న రాహుల్జీని ఫోటో తీశాడు. అది మరునాడే పత్రికలలో పడింది. బీహారు కాంగ్రెసుమంత్రివర్గాన్ని ప్రజలు తిట్టిపోశారు. కాని ప్రభుత్వం రాహుల్జీ యే సంకెళ్ళు తెప్పించుకొని, తొడుక్కున్నారనే పచ్చి అబద్ధాన్ని పత్రికలలో ప్రచురింపజేసింది. తర్వాత జైలులో కేసు విచారణజరిగింది. జమీందారు తప్పుడు సాక్ష్యం చెప్పించాడు. రాహుల్జీకి ఆరు నెలలు కఠినశిక్ష, ఇరవైరూపాయలు జరిమానా, అది చెల్లించకపోతే మరో మూడు నెలలు శిక్ష విధింపబడింది.

రాహుల్జీ మే నెల ఒకటో తేదీనుండి తిరిగి నిరాహార వ్రతం ప్రారంభించారు. ఆయనను హజరీబాగ్ జైలుకు పంపించాలని మరునాడే ఉత్తర్వు వచ్చింది. అక్కడకు వెళ్ళడానికి రాహుల్జీ నిరాకరించారు. నాలుగోరోజున ముక్కులో గుండా ఆయనకు బలవంతాన పాలు త్రాగించాలని ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం విఫలమైంది. ఉన్నతాధికార్లు వచ్చారు. నిరాహారదీక్ష విరమిస్తే, ఆ తర్వాత రైతులకోర్కెలనుగూర్చి ఆలోచిస్తా మన్నారు. రాహుల్జీ వినలేదు. పదోరోజున ఆయనను జైలునుండి వదలిపెట్టారు. తర్వాత పదకొండురోజులకు రాహుల్జీ "జీవించడంకోసం" నవలారచన పూర్తిచేశారు.

తర్వాత రాహుల్జీ ఛితాలీ రైతు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆయనకు రెండేళ్ళ శిక్ష విధింపబడింది. రెండో పర్యాయం హజారీబాగ్‌లో శిక్ష అనుభవించారు. అక్కడ

రాహుల్జీని కొట్టిన వ్యక్తిని వదిలిపెట్టమని



కూడ 17 రోజులు నిరాహారదీక్ష పూనారు. 1939 జూలై 11 వ తేదీన ఆయనను జైలునుండి వదలిపెట్టారు. తర్వాత రాహుల్జీ పాట్నాకు వెళ్లారు.

'వార్తికాలంకారాన్ని' తాము ముద్రిస్తామని బొంబాయి భారతీయ విద్యాభవనంనుండి కబురువచ్చింది. రాహుల్జీ కాశీ, ప్రయాగలమీదుగా బొంబాయికి వెళ్లారు. ప్రతిపేజీకి రెండురూపాయలన్నరచొప్పున ఇస్తామని విద్యాభవనంవారు బేరాలాడారు. ఇది కిట్టుబాటు కానందువల్ల రాహుల్జీ తిరిగి వచ్చారు.

రాహుల్జీని లాఠీతో తలపగులగొట్టినవ్యక్తిపై పోలీసులు కేసు పెట్టారు. కేసు విచారణలో రాహుల్జీ సాక్ష్యం ఇవ్వవలసి వచ్చింది. జమీందారు చెప్పితే, ఆ వ్యక్తి తనను కొట్టాడని, అందుచేత అతనిని జైలులో పెట్టించడం మంచిది కాదని రాహుల్జీ అనుకొన్నారు. ఆగస్టు 29 వ తేదీన విచారణ జరిగింది. రాహుల్జీ కోర్టుకు వెళ్ళి, ఆ వ్యక్తిని వదలిపెట్టమని కోరారు. ప్రజలందరికీ ఆశ్చర్యం కలిగింది.

## కొత్తజీవితం

ద్వితీయ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. ఇక తాను ఎన్నోరోజులు జైలుబయట ఉండే పరిస్థితులు లేవని రాహుల్జీ అనుకొన్నారు. 1939 అక్టోబరు నెల రెండోవారంలో వార్ధాలో భారతకమ్యూనిస్టులు సమావేశం కాబోతున్నారు. కమ్యూనిస్టుపార్టీ నిషేధింపబడిఉంది. అయినప్పటికీ వివిధ రాష్ట్రాలనుండి ముప్ఫయిమందికి పైగా ప్రముఖ

కమ్యూనిస్టులు వచ్చారు. బీహారు రాష్ట్ర ప్రతినిధులుగా రాహుల్జీ, సునీల్ ముఖర్జీ వెళ్ళారు. వార్ధాలో సమావేశమైన కమ్యూనిస్టులను చూచి, రాహుల్జీకి చాలా సంతోషమూ, ఉత్సాహమూ కలిగింది. వారు ప్రాంతీయభేదాలు, మత భేదాలులేకుండా అన్నదమ్ములవలె ప్రవర్తించడం, ఒకరి భావాలను ఒకరు నిస్సందేహంగా తెలుపుకోవడం గమనించారు. రాహుల్జీ ఆయనజీవితంలో ఎక్కువభాగం సాధువులు, మహాత్ములు, పండితుల సహవాసంలో గడిపారు. వారంతా తమ వ్యక్తిగత అభిరుచులకోసం యావత్తు సమాజాన్ని, భవిష్యత్తును వదలిపెట్టినవారు. కాని రాహుల్జీ వ్యక్తిగత జీవితంకంటె, సమిష్టి జీవితాన్నే ఎల్లప్పుడూ కోరేవారు. రాజకీయరంగంలో ఇలాంటిజీవితం మరెంత అవసరమని గుర్తించినవారు. వార్ధాలో సమావేశమైన కమ్యూనిస్టులలో ఈ సద్గుణాలన్నీ కనిపించాయి. కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు కావడంకంటె మించిన గౌరవంగాని, పదవిగాని లేదని స్టాలిన్ చెప్పిన మాట గుర్తుకువచ్చి, రాహుల్జీ మరింత ఉత్సాహం పొందారు.

సమావేశానంతరం రాహుల్జీ కాశీ మీదుగా ఛప్రాకు వెళ్లారు. రష్యానుండి లోల వ్రాసిన జాబు అందింది. పిల్లవానికి "అగ్ని" (రష్యాన్ భాషలో 'వోగోన్') అని పేరు పెట్టాలని వ్రాసిపంపించారు. కాని లోల జవాబు వ్రాస్తూ, 'ఈగర్' అని అప్పుడే పేరుపెట్టానని, 'వోగోన' అనే పేరు భవిష్యత్తుకోసం సురక్షితంగా ఉంచుతున్నానని తెలియ జేసింది. ఈగర్ గుణగుణాలను, అందచందాలను వ్రాస్తూ

ఆమె వర్ణించింది. రాహుల్జీ లోలను ఎగతాళి చేస్తూ జవాబు వ్రాయగా, "మీరు స్వయంగా చూస్తే, అప్పుడు తెలుస్తుంది" అని ఆమె తిరిగివ్రాసింది.

ముంగెర్‌లో 1939 అక్టోబరు 19వ తేదీన బీహారు కమ్యూనిస్టుపార్టీ స్థాపింపబడింది. రాహుల్జీ, మరొక సహచరుని వెంట ఆరోజున అక్కడకు వెళ్ళారు. అన్నిజిల్లాల నుండి మొత్తం 17 మంది కమ్యూనిస్టులు వచ్చారు. పార్టీ కేంద్రంనుండి భరద్వాజ హాజరైనారు. సమావేశం రెండు రోజులు జరిగింది. గూఢచారులు పొంచి ఉన్నందువల్ల, సమావేశం ముగింపు చేయబడింది. ఎక్కడివారు అక్కడ వెళ్ళిపోయారు. కొద్దిరోజులలోనే కాంగ్రెస్ మంత్రివర్గం రాజీనామా ఇవ్వనున్నట్లు వార్తలు వచ్చాయి. కమ్యూనిస్టులపై ఏక్షణంలోనైనా వారంట్లు వెలువడే సూచన ఉంది. రాహుల్జీ సహచరులు ఆయనను కొద్దిరోజులు అజ్ఞాతవాసంలో ఉండమని కోరారు. ఆయన రెండునెలలు అజ్ఞాత జీవితం గడిపారు. ఈకాలంలో సోవియట్ రష్యా కమ్యూనిస్టుపార్టీ చరిత్రను హిందీలోకి అనువదించారు. కాని ప్రచురణకర్తలు దానిని తప్పులతడక చేసిపెట్టారు. రాహుల్జీ కృషి వ్యర్థమైంది.

క్రీ. శ. 1940 లో అఖిలభారత రైతు మహాసభ అధ్యక్షుడుగా రాహుల్జీని ఎన్నుకొన్నారు. ఆంధ్రదేశంలోని పలాసాలో మహాసభ జరుగనున్నది. అధ్యక్షోపన్యాసం తయారు చేసుకోవడానికై రాహుల్జీ ప్రయాగకు వెళ్లారు. డాక్టరు అహమాన్ ఇంట మకాం పెట్టారు. అధ్యక్షోపన్యాసం

తయారుచేయడంలో ఆయనకూడ తోడ్పడ్డారు. కొద్దిరోజుల లోనే ఉపన్యాసం వ్రాయడం పూర్తిఅయింది. రాహుల్జీ పట్టణంలోని మిత్రులను కలుసుకోవడానికి వెళ్ళారు. సాయంత్రం తిరిగి వచ్చి, డాక్టరు అహమద్‌తో మాట్లాడుతుండగా భారతరక్షణ చట్టంక్రింద రాహుల్జీని అరెస్టుచేశారు. ఆయనను వెంటనే మలాకా జైలుకు పట్టుకుపోయారు.

## 29 నెలలు జైలు జీవితం

మలాకా జైలు ఒక నరకకూపంలాగా ఉంది. అయితే జైలరు మంచివాడు. రాహుల్జీని మూడోతరగతిలో పెట్టడం అతనికి విచారం కలిగించింది. రాహుల్జీకి ఆ ప్రివాసులు లేక పోవడమే ఇందుకు కారణం. పైతరగతి ఇవ్వవలసిందిగా ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకోమని జైలరు చెప్పాడు. అయితే రాహుల్జీ, "నేను ఈ తరగతిలోనే ఉంటాను. చదువుకోవడానికి, వ్రాసుకోవడానికి సౌకర్యం కలిగిస్తే చాలు" అన్నారు. కాని పన్నెండురోజులకే ఆయనను హజారీబాగ్ జైలుకు మార్చారు.

రష్యానుండి లోల వ్రాసిన జాబు అందింది. "మీరు ఇక్కడకు వస్తే, మీతోడ్పాటుతో టిబెట్ భాషావ్యాకరణం, టిబెట్-రష్యన్ శబ్దకోశం తయారుచేయాలని డాక్టరు స్చెర్బాట్‌స్కీ కోరిక... నేనుమీకు ఈగర్‌నుచూపించగోరుతున్నాను. మీరు లెనిన్‌గ్రాడ్‌కు రావడం సంభవమేనా?" అని లోల ప్రశ్నించింది. ఇంకొక జాబులో ఆమె ఇలావ్రాసింది: "ఈగర్ చాలా గంభీర స్వభావం గలవాడు. కాని ఒక్కొక్కప్పుడు

సంతోషంతో పిచ్చెత్తిపోతాడు. తర్వాత వానిని ఆపడం కష్టమవుతుంది......అప్పుడప్పుడు నన్ను పనికివెళ్ళనివ్వడం లేదు......నేను గత రెండేళ్ళలోను ఏసినిమాగాని,నాటకం గాని చూడలేదు."

హజారీబాగ్ జైలులో చదువుకోవడానికి పుస్తకాలు ఏవీలేవు. రాహుల్జీని ఒక్కరినే ఒకగదిలో నిర్బంధించారు. అందువల్ల మాట్లాడటానికికూడ ఎవరూలేరు. కాలమంతా వ్యర్థమైపోతూ ఉండటం రాహుల్జీ గ్రహించారు. తన జీవన యాత్రనే ఒక గ్రంథంగా వ్రాయ మొదలుపెట్టారు. కొద్ది రోజులకు జైలు సహచరులు దొరికారు. పోను, పోను వారి సంఖ్య పెరిగింది. రాహుల్జీ తన జీవనయాత్రను కొంతవరకు వ్రాసి వదలిపెట్టారు. జైలుసహచరులతో కొద్దిరోజులు కాల క్షేపంచేశారు. తర్వాత కమ్యూనిజాన్నిగూర్చి ప్రజలకు తేలికగా అర్థమయ్యేట్లు ఒక పుస్తకం వ్రాయదలచారు. అందుకు నోట్సు తీసుకోవడం మొదలుపెట్టారు. ఈ 2() నెలల కాలంలో రాహుల్జీ మొత్తం పధ్నాలుగు పుస్తకాలు వ్రాశారు. ఇందులో ఎనిమిది రాజకీయనాటకాలు. ఇవి వాడుక భాషలో వ్రాయబడ్డాయి తాను టిబెట్‌నుండి తెచ్చిన ఫొటోలు, చిత్రాల సహాయంతో మరికొన్ని పుస్తకాలు వ్రాయసంకల్పించారు. కాని బీహారు రిసెర్చి సొసైటీ ఇందుకు ఒప్పుడు నిరాకరించింది.

రష్యానుండి డాక్టరు స్చేర్బాట్‌స్కీ రాహుల్జీకి ఒక జాబు వ్రాశాడు. అందులో ఇలాఉంది: "నా అతిప్రియ మైన రాహుల్, చివరికి నేను మీ 'సోవియట్‌భూమి'ని

చూశాను. నాకు చాలా సంతోషమైంది. దానిని ఎంతో కుతూహలంతో చదివాను. ఇది చాలా యోగ్యతతో కూడిన రచన. దీనిని రష్యన్ భాషలోకి అనువదిస్తే చాలా బాగుంటుంది."

హజారీబాగ్ జైలులో తొమ్మిది నెలలు గడిపిన తర్వాత, రాహుల్జీ తదితరులను దియోలీ క్యాంపుకు తీసుకువెళ్ళారు. ఈ క్యాంపులో నాలుగైదు పార్టీలవారు ఉన్నారు. వీరిలో ఎక్కువ మంది కమ్యూనిస్టులే. డాంగే, రణదివే, మిరాజ్కర్, బాటివాలా, సోహన్సింగ్ జోష్, సోహన్సింగ్ భాక్నా, డాక్టరు అహమద్, భరద్వాజ్, అజయఘోష్ తదితరులు ఇందులో ఉన్నారు. భారతీయ తత్వశాస్త్రాన్ని గూర్చి ఉపన్యాసాలు ఇవ్వవలసిందిగా రాహుల్జీని ఆయన సహచరులు కోరారు. ఆయన నెలరోజులకు పైగా తత్సంబంధమైన ఉపన్యాసాలు ఇచ్చారు. ఈ ఉపన్యాసాలే ఆయనను "దర్శన్-దిగ్దర్శన్" వంటి ఉద్గ్రంథం వ్రాయడానికి చాలా తోడ్పడ్డాయి.

రష్యానుండి లోల ఒక జాబులో, "ఈగర్ రాత్రిపూట పన్నెండుగంటలకుగాని నిద్రపోవడం లేదు. వీడు చాలా చెడ్డవాడుగా తయారైనాడు. మీరు ఇక్కడకు రావడం ఎంత అవసరమో దీనినిబట్టి తెలుసుకోవచ్చు. మీ చిన్నకొడుకును దారిలోకి తెచ్చే బాధ్యత మీరే తీసుకోవాలి," అని వ్రాసింది. తాను ఈ మాటలు చదువుతున్నప్పుడు లెనిన్గ్రాడ్పై బాంబులవర్షం కురుస్తున్నట్లు రాహుల్జీకి మళ్ళీ గుర్తుకు వచ్చింది.

జర్మన్ ఫాసిస్టులు మాస్కో-యుద్ధరంగంలో ఘోర పరాజయం పొందినట్లు క్రీ. శ. 1941 డిసెంబరు 14వ తేదీన

వార్తలు వచ్చాయి. యుద్ధంవిషయంలో భారతకమ్యూనిస్టుపార్టీవిధానం మారినట్లు డిసెంబరు 18 వ తేదీన వెలిసింది. నాలుగురోజులతర్వాత దియోలీ క్యాంపునుండి రాజకీయఖైదీలను ఆయాప్రాంతాలకు మార్చారు. కొద్దిరోజులకు రాహుల్జీ, తదితరులను తిరిగి హజారీబాగ్ జైలుకు తీసుకువెళ్లారు. రాహుల్జీ ఇదివరకే ప్రారంభించిన రచనలలో ఎక్కువభాగం ఇక్కడేపూర్తిచేశారు.

క్రీ. శ. 1942 జూలై 23వ తేదీన ఆయన హజారీబాగ్ జైలునుండి విడుదలైనారు.

ఆతర్వాత రాహుల్జీ అనేక పట్టణాలలోను, గ్రామాలలోను పర్యటించారు. ఈ సందర్భంగా జరిగిన అనేక సభలలో పాల్గొన్నారు. క్రీ. శ. 1942 నవంబరు నెలలో ఛప్రామీదుగా ప్రయాగకు వెళ్లారు. సుప్రసిద్ధకవి 'నిరాలా' ఆయనను కలుసుకొన్నారు. తానువ్రాసిన మూడు కావ్యాలను ఆయనకు చదివి వినిపించారు.

రాహుల్జీ అదే నెలలో బొంబాయికి వెళ్ళారు. మార్క్సిజాన్నిగూర్చి కొన్నిగ్రంథాలువ్రాయాలని ఆయన ఉద్దేశం. కాని బొంబాయి వాతావరణం ఆయనకు సరిపడలేదు. మొదట కొద్దిరోజులు నూతుంగాలో ఉన్నారు. తర్వాత కమ్యూనిస్టుపార్టీ కార్యాలయంలో మకాం పెట్టారు. ఇక్కడ కొన్నిపుస్తకాలను అనువదించారు.

"పల్లెటూరిపేదలకు" అని లెనిన్ వ్రాసిన గ్రంథమే ఆయనకు ఎక్కువగా నచ్చింది. ఇక్కడ ఉండగానే ఒకరిద్దరు రైతు, కార్మికనాయకుల జీవిత చరిత్రలువ్రాశారు.

క్రీ. శ. 1943 మార్చినెలలో బొంబాయినుండి బయలు దేరారు. తర్వాత వీరి జీవితచరిత్రలను ఒక పెద్దగ్రంథ రూపంలో వెలువరించారు.

## 34 ఏళ్ళ తర్వాత

రాహుల్జీ 34 ఏళ్ళతర్వాత తిరిగి ఆయన స్వంతజిల్లా ఆజమ్‌గఢ్‌కు, తన జన్మస్థలం పందహా గ్రామానికి వెళ్ళ దలచారు. క్రీ. శ. 1943 ఏప్రిల్ 12వ తేదీ రాత్రి ఆయన మిత్రుడు నాగార్జున్‌ను వెంటదీసుకొని రైలులో బయలు దేరారు. మరునాడు ఆజంగఢ్ చేరుకొన్నారు. పందహా గ్రామం ఇక్కడకు ఏడుమైళ్ళదూరంలో ఉంది. రాహుల్జీ చదువుకొన్న చిన్నబస్తీకూడ దారిలో ఉంది. ఆయన మొదట అక్కడకు వెళ్లారు. ఊరంతా ఒకసారి తిరిగి చూశారు. కాని ఎవరినీ గుర్తుపట్టలేకపోయారు. ఒకవ్యక్తి కొంతదూరంలో నిల్చుని, రాహుల్జీని తదేకధ్యానంతో చూశాడు. అతడు తన బాల్యమిత్రుడు రామనిరంజన్ అని తెలిసింది. తర్వాత అంతా కలిసి పందహా గ్రామానికి బయలు దేరారు. ఈ వార్త అప్పుడే గ్రామ మంతటా ప్రాకింది.

రాహుల్జీ పందహా గ్రామంలో ప్రవేశించగానే ఒక వృద్ధుడు కనిపించాడు. అతడు రాహుల్జీని కౌగలించు కొన్నాడు. కళ్ళవెంబడి నీరుపెట్టుకొని, "నీవు కులవంతి కొడుకు కేదార్ గదూ!" అని గద్గదస్వరంతో అన్నాడు. రాహుల్జీ బలవంతంగా కళ్ళనీళ్ళ ఆపుకోవలసివచ్చింది. బాల్యంనాటి ప్రియబంధువులందరూ ఒక్కసారి గుర్తుకు

వచ్చారు. తనమామలు ఏడుగురు అయితే, వారిలో ఇప్పుడు జవ్వార్ ఒక్కడే మిగిలాడు. ఆయన బాలుడుగా ఉన్నప్పుడు జవ్వార్ కలకత్తాలో పోలీసుజవానుగా ఉండే వాడు. అతడు అప్పుడప్పుడు ఇక్కడకు వచ్చిపోతూ ఉండే వాడు.వచ్చినప్పుడల్లా ఆయనకుకొబ్బరికాయలు తెచ్చిఇస్తూ ఉండేవాడు. అతడు ఇప్పుడు పింఛను పుచ్చుకొంటున్నాడు. అతనికి కళ్ళు కనిపించవు. రాహుల్జీ అత్తగారలలో ముగ్గురు విధవరాండ్రు జీవించిఉన్నారు. వారు తమ కొడుకులను, మనుమరాండ్రను వెంటబెట్టుకొని ఆయనను చూడటానికి వచ్చారు. అత్తగారి కళ్ళవెంబడి నీళ్ళు ఏకధారగా ప్రవహిస్తున్నాయి.

యాభైఏళ్ళక్రితం ఆయనపుట్టిన ఇంటిని వెదకినా కనిపించలేదు. అయితే ఆయన తాతగారు త్రవ్వించిన బావి ఇప్పటికీ ఉంది. ఆ బావినీళ్ళు ఇప్పటికీ తియ్యగా ఉంటాయని విని రాహుల్జీ సంతోషించారు. ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేదాకా జనం రాహుల్జీని చూచిపోతున్నారు. రామశరణ్ పాఠక్ మనుమడనే అభిమానంతోనో, హిందీ పండితుడనే అభిమానంతోనో చుట్టుప్రక్కలగ్రామాలనుండి కూడ ప్రజలు గుంపులుగుంపులుగా వచ్చారు.

రెండురోజులతర్వాత రాహుల్జీ నిజామాబాద్ వెళ్లారు. అక్కడవున్న ఉర్దూ మిడిల్‌స్కూలులో క్రీ. శ. 1909లో ఆయన చదువుకొన్నారు. ఇప్పుడు ఆ మిడిల్‌స్కూలు పునాదులపైనే అప్పర్‌ప్రయిమరీస్కూలు భవనం నిర్మింపబడింది. మిడిల్‌స్కూలును ఇంకోచోటికి

మార్చారు. రాహుల్జీ పూర్వ ఉపాధ్యాయుడు సీతారామ్ ఇంటివద్ద ఉన్నట్లు తెలిసింది. రాహుల్జీ ఆయనను కలుసుకొన్నారు. సీతారామ్ చాలా సంతోషించారు.

మరునాడు మధ్యాహ్నం రాహుల్జీ తన స్వగ్రామం కనైలాకు వెళ్ళారు. గ్రామంలో ప్రవేశించగానే ఆయన పినతండ్రి వంశీ కనిపించారు. ఆయన కన్నీరు రాల్చుతున్నారు. రాహుల్జీ వంగి ఆయన పాదాలను సమస్కరించారు. రాహుల్జీ సోదరులలో శ్యామలాల్, రామధారీ ఇంటివద్దనే ఉన్నారు. అందరికంటె చిన్నవాడు శ్రీనాథ్ ఢిల్లీలో మిఠాయి వ్యాపారం చేస్తున్నట్లు తెలిసింది. స్నానంచేసినతర్వాత రాహుల్జీ అందరి ఇళ్ళకు వెళ్ళివచ్చారు. తర్వాత శ్యామలాల్ ఇంట భోజనం చేశారు. వెంటనే బయలుదేరదామనుకొన్నారు. ఇంతలో ముఖానికి ముసుగు వేసుకొన్న ఒకవ్యక్తి తనకాళ్ళపైబడి ఏడ్వడం మొదలుపెట్టింది. ఆ వ్యక్తి ఏడుపు మానలేదు. ఆమె ఎవరైందీ రాహుల్జీకి తెలియదు ఇతరులు ఎవ్వరూ చెప్పలేదు. కానిఆయనకుచిన్నతనంలోచేసినపెళ్ళి గుర్తుకువచ్చింది. రాహుల్జీ ముప్ఫయిఏళ్ళక్రిందటనే ఆ పెళ్ళితో సంబంధం తెంచుకొన్నారు. ఇంటిబయట చాలామందిస్త్రీలుఉన్నారు. వారిలో యమున అనే ముసలమ్మను తప్ప, మరెవ్వరినీ రాహుల్జీ గుర్తుపట్టలేదు.

తర్వాత రాహుల్జీ బఛ్వల్ గ్రామానికి వెళ్ళి, తన బాల్యమిత్రుడు యాగేశ్‌ను కలుసుకొన్నారు. అతనిఇంట ఒకరోజుఉండి, మరునాడు ఆజంగడ్‌కు వెళ్లారు.

# వేసవి కార్యక్రమం

ఆది వేసవికాలం. రాహుల్జీ నాగార్జున్‌ను వెంట బెట్టుకొని హరిద్వార్ వెళ్ళారు. ఏదైనా వ్రాసుకోవాలని ఆయన ఇక్కడకువచ్చారు. కాని పండాలు వీరికి ధర్మ సత్రాలలో చోటు ఇవ్వ నిరాకరించారు. పండాలు యాత్రి కులపాలిటి యమధర్మరాజులైనారు. అందుచేత రాహుల్జీ, నాగార్జున్‌లు ఋషీకేశానికివెళ్ళారు. అక్కడకూడ ఇదే పరిస్థితి ఎదురైంది. వీరుఇష్కకట్టే కార్మికులవద్దకు వెళ్ళారు. వారు వంటపాత్రలు సప్లయిచేశారు. ఇద్దరూ ఆ పూట అక్కడ వండుకుతిన్నారు. తర్వాత కొన్ని ప్రదేశాలలో తిరిగి, లారీలో ఉత్తరకాశీకి వెళ్ళారు. ఇక్కడ బిర్లా దర్మ సత్రంలో చోటు దొరికింది. కాని బిర్లా అనుమతిలేనిదే, మూడురోజులకు మించి ఇక్కడ ఉండకూడదని సత్రం మేనేజరు చెప్పారు. దీనిపై రాహుల్జీకి, అతనికి వాగ్వాదం జరిగింది. ఇక ఇక్కడ ఉండటం బాగులేదనుకున్నారు. వేరొక ధర్మసత్రంలోకి వెళ్ళారు. ఇక్కడ ఉంటూ "దర్శన్ - దిగ్దర్శన్" ప్రూఫులు దిద్దుకోవాలని, ఒక నవల వ్రాయాలని రాహుల్జీ ఉద్దేశం. నాగార్జున్ టిబెట్‌భాష నేర్చుకోదలచారు,టిబెట్‌యాత్ర చేయాలనేకృతనిశ్చయంతోకూడఅతడు ఇక్కడకు వచ్చారు. రాహుల్జీ ఒక నవలను కొంతవరకు వ్రాసి చింపివేశారు. ఒకరోజున ఇద్దరూ తూర్పువైపు చూడటానికి వెళ్ళారు. ఈప్రాంతంలో కొందరు గంగాజలం అమ్ముతూ తిరుగుతున్నారు. ఇందులో గంగాజలం చాలా తక్కువ. కూపజలం, నదీజలమే ఎక్కువగా ఉంటుంది. అది

అయిపోగానే మళ్ళీ ఏదో నింపుకువచ్చి అమ్ముతున్నారు. ఇది చాలా లాభసాటి వ్యాపారంగా తయారైంది. ఇక్కడ పెళ్ళి చేసుకోవడానికి ఆడవాళ్ళను కొనుక్కుంటున్నారు. తమకువచ్చే రాబడినిబట్టి ధరకూడ అయిదారువేల రూపాయలవరకూ పలుకుతుంది. ఇంతకుపూర్వం బాల్యవివాహాలు ఎక్కువగా జరిగేవి. కాని ఇప్పుడు ప్రభుత్వం వీటిని నిషేధించింది. ఇప్పుడు పద్నాలుగేళ్ళకు తక్కువఉన్న అమ్మాయికి పద్దెనిమిదేళ్ళకు తక్కువఉన్న అబ్బాయికి పెళ్ళి జరగడంలేదు. అమ్మాయిధర వందరూపాయలకు మించకూడదని చట్టం చెబుతున్నది. అయితే తను అమ్మాయినిఇచ్చి పెళ్ళి చేసి తీరాలని ఎవరినీ నిర్బంధించకూడదు. ఖరీదు చేసినవానికి నచ్చనప్పుడు, కొన్నాళ్ళతర్వాత స్త్రీని వదలిపెడుతున్నారు. ఇలా త్యజింపబడిన స్త్రీలు తమ ప్రాంతంలో ఇంటికి ముగ్గురు నలుగురు ఉన్నట్లు ఒకసాధువు రాహుల్జీకి తెలియజేశాడు.

"దర్శన్-దిగ్దర్శన్" ప్రూఫులు రానందువల్ల రాహుల్జీ, నాగార్జున్‌లు గంగోత్రి, హరిశిలమీదుగా, సంస్కృతగ్రంథాన్వేషణకై థోలింగ్‌కు బయలుదేరారు. టిబెట్‌లో చాలా కాలంఉండి టిబెట్‌భాషను అధ్యయనంచేయాలని నాగార్జున్ ఉద్దేశం. అయితే రాహుల్జీకి నెలరోజులకంటె ఎక్కువ వ్యవధిలేదు. అందుచేత థోలింగ్‌దాకా వెళ్ళి, తిరిగి రాదలచారు. వీరికి కూలిమనిషి, ఒకగుర్రం అవసరమైంది. ఒకచోట శివదత్తుడనే నవయువకుడు వీరికి కనిపించాడు. అతడు అదివరకే రాహుల్జీపేరు విన్నాడు. ఆయనవెంట

ధోలంగ్ వెళ్ళడానికి ముందుకువచ్చాడు. రోజుకు రూపాయి చొప్పున కూలిఇచ్చేట్లు నిర్ణయించుకున్నారు. శివదత్తుడు వెంటనే ఒకగుర్రాన్ని పురమాయించాడు. రెండుమూడు రోజులలో వీరు ఒక గ్రామం చేరుకొన్నారు. అక్కడ ఆ రాత్రి గడిపి మరునాడు తిరిగి బయలుదేరారు. ఒకమైలు దూరంవెళ్ళిన తర్వాత చూస్తే, రెండు పెద్దపెద్ద శిలలమధ్య ఇరుకుప్రదేశంలో గంగానది ప్రవహిస్తున్నది. ఇక్కడ ఒక బ్రహ్మరాక్షసి ఉన్నట్లు ఇదివరకే విన్నారు. అది ప్రతిసంవత్సరం ఎంతోమంది ప్రాణాలను బలి తీసుకొంటున్నదట. నదిపై కట్టిన వంతెనను చూచినప్పుడు, ఈమాట పూర్తిగా నిజం అనుకున్నారు. వంతెనపేర అక్కడ అడుగు వెడల్పుగల రెండు దుంగలు, వాటిపై చిన్నచిన్న కర్రలు, రాతి ముక్కలు ఉన్నాయి. నడుస్తూఉంటే, దుంగలతోసహా అన్నీ కదులుతున్నాయి. క్రింద ప్రళయకోలాహలంతో గంగానది ఉరకలు తీస్తున్నది. కాలుజారినవాడల్లా, గండ శిలలమీందపడి మూగచావు చచ్చేవాడు. శివదత్తుడు వీపుపై సామాను మోస్తూ, మేకవలె మెల్లగా వంతెన దాటాడు. రాహుల్జీ ఆయన మనస్సులోని భావాలను లోపలే అణగద్రొక్కి, అవతలికి దాటుకొన్నారు. కాని నాగార్జున్కు ఇదొక పెద్ద సమస్య అయింది. క్రిందివైపు మృత్యుగహ్వరాన్ని చూడవద్దని రాహుల్జీ మంత్రోపదేశం చేశారు. నాగార్జున్ ఒక్కొక్కఅడుగు ముందుకు వేస్తూఉంటే అక్కడకక్కడ పెద్ద బరువు దింపుకొన్నట్లుగా ఉంది. తర్వాత గుర్రానికి త్రాడుకట్టి, అది నదిలోనుండి ఇవతలికి ఈదుకు

వచ్చేట్లు చేయడానికి ప్రయత్నించారు. కాని అది ఒడ్డుకు చేరకుండా భీష్మించుకొన్నది. చివరికి ఇతరమనుష్యుల సహాయంతో దానిని ఎలాగో బయటికి లాక్కొని వచ్చారు. ఇలా ప్రయాణం చాలా చిక్కులతో కూడుకొని ఉన్నందువల్ల, థోలింగ్ వెళ్ళి రావడానికి తగిన వ్యవధి లేనందువల్ల రాహుల్జీ నాగార్జునులు వెనక్కి మరలారు. కోపంగ్రాను సులు నాగార్జునన్ థోలింగ్ చేర్పిస్తామని గట్టి మాట ఇచ్చారు. రాహుల్జీ శివదత్తుని వెంటబెట్టుకొని ఉత్తరకాశీకి తిరిగి వచ్చారు. దర్శన్-దిగ్దర్శన్" ప్రూఫులు కొన్ని వచ్చాయి. రాహుల్జీ వాటిని చూశారు. తర్వాత మసోరీ, జౌన్సార్, కాల్సీలమీదుగా డేరాడూన్ వెళ్ళారు. అక్కడ ఆర్యసమాజంలో హిందీభాషభివృద్ధినిగూర్చి ఉపన్యసించారు.

## మళ్లీరచనావ్యాసంగం

రాహుల్జీ జులై ఒకటోతేదీ హరిద్వార్ మీదుగా కనఖల్ వెళ్ళారు. లెనిన్గ్రాడ్నుండి లోల టెలిగ్రాం ఇచ్చింది. "ఇద్దరమూ కలసి ఉండటం అవసరం. మీరు లెనిన్గ్రాడ్కు రండి. అలా వీలుకాకపోతే నేను భారత దేశానికి రావడానికి ఏర్పాట్లు చేయండి" అని అందులో ఉంది. మొదటివిషయం ఏమిటంటే రాహుల్జీ ప్యాస్పోర్టు తీసుకోలేదు. కొద్దిరోజులుగా లోల జాడ తెలియలేదు.

కాని ఇప్పుడు మనస్సు పరుగులెత్తుతున్నది. వెంటనే ప్యాస్‌పోర్టుకు దరఖాస్తు పెట్టాలని నిశ్చయించారు.

వారంరోజుల తర్వాత ప్రయాగకు వెళ్ళారు. ఇక్కడ కొన్ని ప్రూఫులు చూడవలసిఉంది. "ప్రమాణవార్తిక స్వవృత్తి టీకా" కంపోజ్ అయి ఆరు నెలలనుండి అలాగేపడి ఉంది. "స్వవృత్తి" లుప్తభాగాన్ని రాహుల్జీ ఇదివరకే టిబెట్ అనువాదంనుండి సంస్కృతంలోకి మార్చివేశారు. కాని ఇప్పటివరకుదాని ప్రచురణకర్త నిర్ణయం కాలేదు. బీహారు రీసెర్చి సొసైటివారు దానిని ముద్రిస్తామన్నారు. కాని అది జరగలేదు. రాహుల్జీ బొంబాయి భారతీయ విద్యాభవన్ వారితో మాట్లాడారు. కాని అక్కడకూడ ఎలాంటి నిర్ణయం జరగలేదు. తర్వాత కలకత్తా విశ్వవిద్యాలయంవారితో మాట ఖాయపరచుకున్నారు. కాని కాగితం గొడవవల్ల ఈ విషయం మూలపడింది. చివరికి ప్రయాగలో కితాబ్ మహల్ యజమానులు ఈబాధ్యత తీసుకున్నారు. అందుచేత రాహుల్జీ నిశ్చింతగా ఉండిపోయారు.

రాహుల్జీ ఆగస్టు 5 వ తేదీన బొంబాయికి వెళ్లారు. కమ్యూనిస్టుపార్టీ ఆఫీసులో మకాం పెట్టారు. ఇక్కడఉంటూ రెండుపనులు పూర్తిచేయాలని రాహుల్జీ ఉద్దేశం. ఒకటి: ప్యాస్‌పోర్టుకోసం దరఖాస్తు పెట్టడం. రెండు: "నయే భారత్ కే నయే నేతా" గ్రంథరచనకు ఇంకా కొందరి జీవిత చరిత్రలను సేకరించడం. రెండోపనిని వెంటనే ప్రారంభించారు. నాయకులను అడిగి వారి బాల్యంనుండి ఇప్పటిదాకా జీవిత-ఘటనలను నోట్సుతీసుకున్నారు. ఈ నోట్స్ సహా

యంతో దాదాపు పన్నెండుగురి జీవితచరిత్రలను తయారు చేశారు. తర్వాత ప్యాస్‌పోర్టుకోసం దరఖాస్తు పెట్టారు. ప్యాస్‌పోర్టు ఇప్పట్లో రాదని ఆయనకు తెలుసు. అందుచేత తిరిగి ప్రయాగకు వెళ్ళారు.

ప్రయాగలో ప్రూఫులు దిద్దుకోవడమే కాకుండా, "నయేభారత్ కే నయే నేతా" గ్రంథరచనకూడ ప్రారంభించారు. అయితే మరికొందరు నాయకుల జీవితచరిత్రలు అవసరమైనాయి. కాన్పూర్‌లో కవిసమ్మేళనానికి అధ్యక్షత వహించవలసిందిగా రాహుల్జీకి ఆహ్వానం వచ్చింది. ఆయన సెప్టెంబరు 26 న అక్కడకు వెళ్ళారు. కరువు మూలంగా బెంగాలీలో లక్షలాదిమంది చనిపోతున్న రోజులు అవి. ఈ విషాదగాథను వర్ణిస్తూ కొంతమంది రచనలు చేశారు. అవి చాలా కరుణాపూర్ణంగా ఉన్నాయి. రాత్రి 11 గంటలకు కవిసమ్మేళన్ పూర్తిఅయింది. కార్మికనాయకుడు యూసుఫ్ జీవితచరిత్ర నోట్స్ తీసుకోవడం కోసం రాహుల్జీ ఆయన ఇంటికి వెళ్లారు. కార్మికుడుగా ఉంటూ కార్మికుల కష్టాలను ఆకళింపుచేసుకున్నవ్యక్తి యూసుఫ్. ఆయన మొదటిపేరు సంత్‌సింహ్. పోలీసులు వారంటుతీసుకుని, తన కోసంగాలిస్తున్నప్పుడు, ఆయన పేరు మార్చుకున్నారు. అంతేకాని మతాంతరీకరణవల్ల యూసుఫ్ కాలేదు. రాహుల్జీ తెల్లవారు జాము అయిదుగంటలదాకా యూసుఫ్ ఇంట ఉండి, నోట్స్ తీసుకున్నారు. వెంటనే ప్రయాగకు తిరిగి వచ్చారు.

ఆ సాయంకాలమే విశ్వవిద్యాలయం హిందీపరిషత్తు వారు ఏర్పాటుచేసిన సభలో పాల్గొన్నారు "అభ్యాగతుని"

మహాకవుల రచనలు ఎప్పుడూ ఏకాలానికైనా
మంచివే



అనే విషయంపై ఉపన్యసించారు. కొందరు సనాతన భావాలుగల సాహితీవేత్తలుకూడ సభలో ఉన్నారు. రాహుల్జీ ఉపన్యసిస్తూ ఇలా అన్నారు: సూరదాసు, తులసీదాసు, కాళిదాసు, బాణుడు ఛాందసభావాలుగలవారని, రాజరికయుగంలో పుట్టి తమ కవిత్వంద్వారా ఆ వ్యవస్థనే పరిపుష్టినొందించారు కాబట్టి, వారి కవిత్వాన్ని గంగలో పారవేయాలనుకోవడం అభ్యుదయం కాదు. మహాకవులు ఏవ్యవస్థలో, ఏయుగంలో పుట్టినా, వారు మనకు ఎల్లప్పుడూ మహాకవులే అవుతారు. హర్షాతిరేకంతో మన ముఖాన్ని వికసింపజేసేశక్తి, అతిశయదుఃఖంతో మనకళ్ళు చెమ్మగిలజేసేశక్తి, తమ కవిత్వంలో ఉన్నంతవరకు, మనహృదయానికి అలాంటి కోమలత్వం ఉన్నంతవరకు, ఈ మహాకవులకు ఎలాంటి ప్రమాదంలేదు. పూర్వకవులను పరిత్యజింపుమని అభ్యుదయవాది ఎవ్వడూ చెప్పడు, పిచ్చివాడే చెబుతాడు. ఇది నావ్యక్తిగతాభిప్రాయం అని మీరు అనుకోకూడదు. గోథే మొదలైన మహాకవుల రచనలను పాఠ్యప్రణాళికనుండి తొలగించివేయాలన్న ప్రొఫెసర్ డూరింగ్ అభిప్రాయాన్ని ఎంగెల్స్ మహాశయుడు తీవ్రంగా ఖండించాడు.

సభానంతరం ఒక సాహితీవేత్త, ప్రాచీన కావ్యాల పట్ల అభ్యుదయరచయితల అభిప్రాయం ఇదే అయితే, తాము ఏవిధంగానూ వ్యతిరేకించబోమని, ప్రపంచాన్ని మార్పునొందించే నిమిత్తం వారుచేసే సాహిత్యప్రయత్నానికి తాము వ్యతిరేకులం కాబోమని చెప్పాడు.

రాహుల్జీ గ్రంథరచనకు మరికొందరి జీవితచరిత్రలు

అవసరమైనాయి. భారద్వాజ్ భువాలీలో, సుమిత్రానందన పంత్ అల్మోడాలో, మరెందరో నాయకులు పంజాబ్‌లో ఉన్నారు. రాహుల్జీ అక్టోబరు మొదటివారంలో అల్మోడాకు వెళ్ళారు. సుమిత్రానందనపంత్ ఉదయశంకర్ కళాకేంద్రంలో ఉన్నారు. అక్కడ రామలీల జరుగుతున్నది. రాహుల్జీ సుమిత్రానందనపంత్‌ను కలుసుకున్నారు. ఆయన జీవితచరిత్ర నోట్స్ తీసుకున్నారు. అల్మోడాలోని బోషీసేన్ జీవశాస్త్రసంబంధమైన పరిశోధనలు చేస్తున్నారు. ఆ కేళ్ళక్రిందట ఆయన రాహుల్జీని ఇక్కడకు ఆహ్వానించారు. కాని వ్యవధిలేనందున అప్పుడు వెళ్ళలేదు. ఇప్పుడు రాహుల్జీ వీలుకల్పించుకున్నారు. వెదక్కుంటూ సేన్‌వద్దకు వెళ్ళారు. రాహుల్జీ అదివరకే "విశ్వకీ రూపరేఖ" అనే శాస్త్రీయ గ్రంథం వ్రాయదలచారు. ఇందుకు శాస్త్రీయగ్రంథాలు ఎన్నో చదవవలసివచ్చింది. అయితే లేబరేటరీ సహాయం లేకపోతే ఈపని సవ్యంగా నెరవేరదు. రాహుల్జీ వెళ్ళిన రోజునే సేన్ "వివేకానంద లేబరేటరీ" నూతనభవనం తెరువబడింది. ఆయన అక్కడకువెళ్ళి సేన్ దంపతులను కలుసుకున్నారు. లేబరేటరీని చూశారు.

ఆ రాత్రి ఝుజాక్‌పేనిలోకి వెళ్ళారు కమ్యూనిస్టు నాయకుడు పూర్ణచంద్రజోషీ ఇక్కడనే జన్మించారు. జోషీ తండ్రి పినతండ్రిమనుమడుభోలాదత్తు లోగడ స్టేషన్ మాస్టరుగా ఉండేవాడు. ఇప్పుడు ఏదో వ్యాపారం చేస్తున్నాడు. రాహుల్జీ అతనిని కలుసుకున్నారు. ఆయన పూర్ణచంద్రజోషీ మిత్రులని, ఆయన పుట్టిన ఇంటిని చూడదలచా

[illegible]

నని చెప్పారు. పూర్ణచంద్రజోషీ జన్మస్థానంలో కమ్యూనిస్టుపార్టీ సందేశం వినపడక పోవడం రాహుల్జీకి ఆశ్చర్యం కలిగించింది. భోలాదత్తుకు రాజకీయాలతో ఎలాంటి సంబంధం లేదు. అతడు పత్రికలుకూడ చదువుతున్నట్లులేదు. పూర్ణచంద్రజోషీ పెద్దవాడైనాడని మాత్రం తెలుసు. జోషీ కనిపిస్తే, ఇక్కడకు రమ్మని చెప్పండి" అని రాహుల్జీని పదేపదే కోరాడు. ఆయనకు పనిభారం ఎక్కువగ ఉంటుందని, వ్యవధి దొరకక పోవచ్చునని రాహుల్జీ చెప్పారు. అయితే ఎప్పుడో ఒకసారి తనభార్యతోసహా ఇక్కడకు తప్పకుండా వస్తారని తెలియజేశారు. జోషీకి పెండ్లి అయిందనే విషయం కూడ రాహుల్జీ చెప్పేదాకా అతనికి తెలియదు. "ఎవరు ఆమె?" అని కుతూహలంతో ప్రశ్నించాడు. "పేరు కల్పన, బెంగాల్ యువతి. పోలీసుపాకిపట్టడం, బాంబువిసరడం ఆమెకుబాగా తెలుసు. అయితే చచ్చినవాళ్ళమీద కాదు. బ్రదికినవాళ్ళ మీదే" అని రాహుల్జీ చెప్పారు. తర్వాత భోలాదత్తుజోషీ పుట్టిన ఇంటిని చూపించాడు. అది వందఏళ్ళక్రితం నిర్మింపబడిన మూడంతస్తులభవనం. కుటుంబంలోనివారు ఉద్యోగాలు చేస్తూ, ఇతరచోట్ల ఉంటున్నారు. అందువల్ల భవనంలో చాలాభాగం ఖాళీగా ఉంది.

రాహుల్జీ ఆ మూసనాడు భువాలీకి వెళ్ళి, యశపాల్ దంపతులను కలుసుకొన్నారు. వారితో కొంచెంసేపు మాట్లాడారు. తర్వాత భరద్వాజ్‌ను చూశారు. మనునాడు ఆయన జీవితచరిత్ర నోట్స్ తీసుకొన్నారు. తర్వాత ఢిల్లీకి వెళ్ళారు.

ఢిల్లీలో యజ్ఞదత్తశర్మను కలుసుకొన్నారు. ఆయన మొదట్లో కాలేజిప్రొఫెసరుగా ఉండేవారు. ఆదేసమయంలో కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా వ్యవహరించేవారు. అయితే పార్టీ కార్యకలాపాలకు తగినంత వ్యవధిలభించేది కాదు. అందువల్ల ప్రొఫెసర్‌వృత్తి వదలిపెట్టి, తన యావత్కాలాన్ని పార్టీ సేవకే వినియోగించారు. రాహుల్జీ ఇక్కడ ఉంటూ ఆయన ప్యాస్‌పోర్టునుగూర్చి దర్యాప్తుజరిపారు. కాని అది త్వరలో చేతికి అందేట్లు కనబడలేదు.

అందుచేత అమృతసర్ వెళ్ళారు. ఇక్కడ బాబా సోహన్‌సింగ్ భాక్నా, బాబాబసాఖాసింగ్‌ల జీవితచరిత్రలు నోట్స్ తీసుకోదలచారు. కాని వారు అప్పట్లో అక్కడలేరు. స్వగ్రామాలకు వెళ్ళినట్లు తెలిసింది. రాహుల్జీ మొదట బాబా బసాఖాసింగ్ గ్రామానికి వెళ్ళారు. ఆయనను చూడగానే బాబా వచ్చి, గట్టిగా కౌగలించుకొన్నారు రాహుల్జీ బాబా జీవితచరిత్ర నోట్స్ తీసుకొన్నారు. బాబా బసాఖాసింగ్ ఒక కూలీగా కెనడా, అమెరికా, మెక్సికో, పెనామా, అర్జంటీనాలలో గడిపారు. క్రీ. శ. 1914 లో స్వాతంత్ర్య శంఖారావం విని భారతదేశానికి వచ్చారు. చాలాఏళ్ళు జైలుజీవితం గడిపారు.

రాహుల్జీ అదేరాత్రి అమృతసర్‌కు తిరిగివచ్చారు. బాబా సోహన్‌సింగ్ భాక్నాకూడ అప్పటికి పట్టణం చేరుకొన్నారు. రాహుల్జీని బలవంతంగా తన స్వగ్రామానికి తీసుకువెళ్ళారు. రాహుల్జీ అక్కడే బాబా జీవితచరిత్ర నోట్స్ తీసుకొన్నారు. బాబా సోహన్‌సింగ్ కూడ కూలిపని

కోసం అమెరికా వెళ్లారు. అక్కడ భారతీయులకుస్వాతంత్ర్య సందేశం ఇచ్చారు. గదర్ పార్టీని స్థాపించారు. దానికి ఆయనే ప్రథమఅధ్యక్షుడైనారు. తర్వాత క్రీ. శ. 1914 లో భారతదేశానికి వచ్చారు. ఎన్నోఏళ్ళు జైలుశిక్ష అనుభవించారు. ఆయనకుముందు నాలుగుతరాలనుండి ఏకైకసంతానమే ఉంటూ వచ్చింది. ఇప్పుడు ఆయనతో వంశం నశించిపోతున్నది. కాని ఆయన ఒకవిశాలమైన వంశంలోచేరారు. గ్రామంలో ఉన్న తనఇంటిని కన్యాపాఠశాలకు ఇచ్చారు. తనచేనిలో ఇల్లుకట్టుకొని, అక్కడ ఉంటున్నారు.

రాహుల్జీ లాహోరువెళ్ళి, అక్కడ కొందరి జీవిత చరిత్రలు నోట్స్ తీసుకొన్నారు. తర్వాత శ్రీనగర్ మీదుగా బారామూలాకువెళ్ళారు. అజయకుమార్ ఘోష్ జీవితచరిత్ర నోట్స్ తీసుకొన్నారు. పిమ్మట అక్టోబరు నెలాఖరులో ప్రయాగకు వచ్చారు. అన్నిటికంటె ముందు "నయేభారత్ కే నయే నేతా" గ్రంథం పూర్తిచేయాలని ఆయన ఉద్దేశం. దీనిని వ్రాస్తూ, ప్రూఫులుకూడ దిద్దుకొనేవారు. మొత్తం 42 మంది నాయకుల జీవితచరిత్రలు వ్రాశారు.

తర్వాత ఛప్రామీదుగా కాశీకివెళ్ళారు. ప్రాచ్య భాషా పరిషత్తులో పాల్గొన్నారు. పరిషత్తుకు హాజరైన డాక్టరు సునీతికుమార్ ఛటర్జీ, డాక్టరు సుకుమారసేన్ తదితర విద్వాంసులెందరినో కలుసుకొన్నారు. సర్వేపల్లి రాధాకృష్ణన్ పరిషత్ సమావేశంలో మాట్లాడుతూ, హిందువుల గొప్పతనాన్ని కొనియాడారు. మరునాడు-అంటే క్రీ. శ. 1944 జనవరి ఒకటోతేదీ పరిషత్ ఉపశాఖల సమావేశాలు

జరిగాయి. డాక్టరు అల్తేకర్ ఉపన్యసిస్తూ, కుషాణుల చేతి నుండి మధ్యదేశాన్ని విముక్తి చేసిన కీర్తి యౌధేయులదేగాని గుప్తవంశీకులది కాదని ప్రతిపాదించారు. రాహుల్జీ "ఓల్గా నుండి గంగవరకు" అనే గ్రంథంలో "సువర్ణ యౌధేయ" పేరుగల కథ వ్రాసేటప్పుడు, భారతదేశంలో చిట్టచివర మిగిలిన, మహాశక్తివంతమైన యౌధేయగణాన్ని గూర్చి ఒక నవల వ్రాయాలనే ఆలోచన తట్టింది. డాక్టరు అల్తేకర్ ఉపన్యాసం విన్నతర్వాత ఈ ఆలోచన మరింత బలపడింది.

మూడోరోజున రాహుల్జీ ప్రయాగకు తిరిగివచ్చారు. ప్రభుత్వం తనకు ప్యాస్‌పోర్టు ఇచ్చినట్లు బొంబాయి చేరినట్లు లేఖ అందింది. రాహుల్జీ బొంబాయికి వెళ్ళి విచారించగా, ఆఫ్ఘనిస్తాన్ మీదుగా కాకుండా, ఇరాన్ మీదుగా ప్యాస్‌పోర్టు ఇచ్చినట్లు తెలిసింది. అంతేకాదు. ఇరాన్, సోవియట్ "వీసా"లు దొరకనంతవరకు ప్యాస్‌పోర్టును ఉపయోగించుకోకూడదనే షరతుకూడ విధింపబడింది. ఇదంతా ఒక నాటకమని, తాను భారతదేశంనుండి బయటికి వెళ్ళడం ప్రభుత్వానికి ఇష్టంలేదని రాహుల్జీకి అర్థమైంది. ఆయన మళ్ళీ భారతప్రభుత్వానికి ఒక లేఖ వ్రాశారు.

తర్వాత గ్వాలియర్ విక్టోరియా కాలేజీ విద్యార్థి సంఘంవారి ఆహ్వానంపై అక్కడకు వెళ్లారు. కాలేజి పురాతత్వశాఖ అధ్యక్షులు గర్దే, ప్రిన్సిపాల్ పియర్సన్‌లతో కలిసి గ్వాలియర్ కోటను (గోపగిరి) చూశారు. ఎనిమిది, తొమ్మిది శతాబ్దాలలోకూడ ఇక్కడ ఎవరో సామంతుని రాజధాని ఉండేది కొండపై చాలా సురక్షితస్థానంలో

కోట నిర్మింపబడింది. చిత్తూరులోవలెనే ఇక్కడకూడ ప్రాచీనమందిరాలు అనేకం ఉన్నాయి. అయితే ఆ కాలం నాటి విగ్రహాలను ధ్వంసంచేశారు. ఇక్కడ ఉన్న ఒక మందిరం వాస్తుకళ, శిల్పకళలదృష్ట్యాకూడ చాలా అందమైనది. ఇది తొమ్మిదోశతాబ్దంనాటిదని, చాళుక్యవంశీయుడైన ద్వితీయ తైలపుడు దీనిని నిర్మించాడని రాహుల్జీ అభిప్రాయం. ఇది ధ్రువపడినప్పుడు, ఈ మందిరాన్ని పదో శతాబ్దంలో నిర్మించినట్లు లెక్కించవలసి ఉంటుంది. తైలపుడు భోజుని పినతండ్రి ముంజుని ఓడించాడు. అతడే రాష్ట్రకూటవంశంలో చివరివాడైన ద్వితీయకర్కుని ఓడించి, ఆ వంశాన్ని నాశనంచేశాడు. అత్త-కోడలు మందిరం వాస్తుకళదృష్ట్యా బాగుంది. కాని తైలపునిమందిరానికి సాటిరాదు.

ఆ రాత్రి గ్వాలియర్ సంస్థాన విద్యార్థుల సమావేశం జరిగింది. విద్యార్థులలో కమ్యూనిస్టుభావాలు కలిగినవారు ఉన్నారు. ఇది గిట్టనివారు ఏదో అల్లరిచేస్తారని సభానిర్వాహకులకు ముందే తెలుసు. డాక్టరు రామవిలాసశర్మ అధ్యక్షతను సభ ప్రారంభమైంది. రాహుల్జీ ప్రారంభోపన్యాసం ఇచ్చారు. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. తర్వాత పెద్దపెద్ద తీర్మానాలు చదవడం దీర్ఘోపన్యాసాలు ఇవ్వడం మొదలుపెట్టారు. శ్రోతలు ఇందుకోసం రాలేదు. బయటివ్యక్తుల ఉపన్యాసాలు వినడానికి మాత్రమే వచ్చారు. ప్రతినిధులసభలోనే తీర్మానాలను ఆమోదించవలసిఉండేది. ఇంతలో హిందూసభవారు "రాహుల్జీ గోభక్షకుడు, హిందువుల శత్రువు" అని ఇంకా ఏవేవో కేకలువేసి, ప్రజలను

రెచ్చగొట్టడానికి ప్రయత్నించారు. కాని వీరికి వంతపాడేవారు ఎవరూ లేకపోయారు. కొంతసేపైన తర్వాత సభాధ్యక్షుడు ఉపన్యసించడానికై లేచారు. వెంటనే పదిమంది అల్లరి మొదలుపెట్టారు. శ్రోతలు తటస్థంగా ఉన్నారు. అల్లరితోనే సమావేశం అంతమైంది మరునాడు హిందీ సాహిత్య సభవారు ఏర్పాటుచేసిన సమావేశంలో, రాహుల్జీ "టిబెట్‌లో భారతీయ సంస్కృతి, సాహిత్యాలు" అనే విషయంపై ఉపన్యసించారు. తర్వాత ఢిల్లీకి వెళ్లారు.

రాహుల్జీ ఢిల్లీలో ప్యాస్‌పోర్టుకోసం ప్రయత్నించదల చారు. కాని దీనివల్ల ప్రయోజనంలేదని మిత్రులు సలహా ఇచ్చారు. రాహుల్జీ ఇక్కడ ఉండగానే ఢిల్లీ కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగింది. ఆయన అరుణపతాకాన్ని ఎగుర వేశారు. ఆ రాత్రి ఏర్పాటుచేసిన నాటకంలో ప్రొఫెసర్ యజ్ఞదత్త సతీమణి గ్రామీణ స్త్రీ పాత్రను చక్కగా పోషించింది. రాహుల్జీ తమ్ముడు శ్రీనాథ్ ఢిల్లీలో మిఠాయి దుకాణం పెట్టాడు. ఈ విషయం రాహుల్జీకి ఇదివరకే తెలుసు. వెనక ఒకసారి వచ్చినప్పుడు అతనికోసం వెదికారు. కాని కనిపించలేదు. ఈ సారి అతడు కమ్యూనిస్టు పార్టీ సభకు వచ్చాడు. రాహుల్జీ అతనితో కొద్దిసేపు మాట్లాడారు. మరునాడు ఇండోర్ మీదుగా ఉజ్జయినికి వెళ్లారు.

ఉజ్జయినిలో ప్రొఫెసర్ ప్రభాకరమాచవే ఇంట మకాం పెట్టారు. పట్టణంలో జరిగిన అనేకసభలలో పాల్గొన్నారు. ఒకనాడు ఉజ్జయిని శిథిలాలను చూడటానికి వెళ్లారు. భారతదేశంలో అన్నిటికంటె పెద్ద బౌద్ధస్తూపం, అనాగార

గ్రీకులు భారతదేశమునకు శాస్త్రసంగతులు చెప్పిరి



పురం (లంక)లోని రత్నమాల్య చైత్యంకంటె పెద్దస్తూపం ఇక్కడ ఉంది. ఉద్యానవనంగా ఉన్న ఈప్రాంతం ఇప్పుడు ఒకకొండవలె తయారైంది. ఒకప్పుడు లక్షలాదిజనం నివసించిన ఉజ్జయినిలో ఇప్పుడు కొన్ని వేలజనం మాత్రమే ఉన్నారు. రాహుల్జీని ఆర్యసమాజంవారు ఆహ్వానించారు. "ప్రపంచానికి భారతదేశం పెట్టిన భిక్ష" అనే విషయంపై మాట్లాడవలసిందిగా ఆయనను కోరారు. శ్రోతలు రెండు వేలమందికి పైగా వచ్చారు. రాహుల్జీ "కేవలం భిక్ష"ను గూర్చే మాట్లాడతారని కొందరు అనుకొన్నారు కాని రాహుల్జీ ఇలా చెప్పారు: భారతదేశం తాను స్వతంత్రంగా, సజీవంగా ఉన్నకాలంలో ప్రపంచానికి ఎంతో భిక్ష పెట్టింది. దానితో పాటు ఇతరులనుండికూడ నిస్సంకోచంగా ఎంతో స్వీకరించింది. గ్రీకులు తమ కళ, జ్యోతిషం, తత్వశాస్త్రం ద్వారా మనకు ఎన్నో విషయాలు నేర్పారని రాహుల్జీ చెప్పారు.

తర్వాత ఆయన బొంబాయికి వెళ్ళారు. మరునాడు లోలకు ఈ విధంగా టెలిగ్రాం ఇచ్చారు: "ప్యాస్పోర్టు దొరికింది. కాని సోవియట్ "వీసా" అవసరం. సోవియట్ ప్రభుత్వంతో చెప్పి, టెహరాన్, కాబూల్ రాయబార కార్యాలయాలు "వీసా" ఇచ్చేట్లు చేయించు. అలా వీలు కాకపోతే ఇరాన్మీదుగా రా. టెలిగ్రాం ద్వారానే జవాబు ఇవ్వు" రాహుల్జీ ఈ విధంగా లోలకు ఎన్నో టెలిగ్రాములు ఇచ్చారు. ఆమెకు చేరిన టెలిగ్రాములలో ఇదొకటి. అయితే సెన్సార్ చేసేవారి మప్పిన[illegible]వల్ల

టెలిగ్రాములుకూడ లెనిన్‌గ్రాడ్‌నుండి నెలన్నర ఆలస్యంగా వచ్చేవి. ఎర్రసైన్యం జర్మన్ ఫాసిస్టులనుండి ఆత్మరక్షణ చేసుకోవడమేకాకుండా, ఇంగ్లీషువారినికూడ రక్షించింది. కాని భారతదేశంలోని ఇంగ్లీషుప్రభుత్వం ఇప్పటికీ సోవియట్ దేశాన్ని కలరా, ప్లేగువ్యాధులున్న దేశంగా భావిస్తున్నది. అందువల్ల ఎవరినీ వెళ్ళనివ్వడం లేదు.

రాహుల్జీకి పాస్‌పోర్టు లభించింది. ఎప్పుడో ఒకప్పుడు తాను భారతదేశంనుండి బయలుదేరవలసిఉంది. సోవియట్‌కు వెళ్ళేముందు "వార్తికాలంకారం" సంపుటాలు ఒకటి రెండు తయారుచేయాలని మునిజనవిజయ కోరాడు. భారతీయ విద్యాభవనంలో రాహుల్జీకి ఏకాంతంగా ఒకగది చూపించాడు. రాహుల్జీ మరునాడే ఆ గదిలో ప్రవేశించారు. ధర్మకీర్తి గ్రంథం "హేతుబిందు" టీకా (అర్చట, లేక ధర్మాకరదత్త రచించినది) ఒక జైనగ్రంథాలయంనుండి లభించింది. దీని టీకాకు టీకా రాహుల్జీకి ఇదివరకే టిబెట్ గోర్ విహారంలో దొరికింది. అయితే ధర్మకీర్తి మూలగ్రంథం ఇంకా లభించలేదు. అందుచేత దానిని టిబెట్ అనువాదం నుండి సంస్కృతంలోకి మార్చాలని పండిత సుఖలాల్ సలహా యిచ్చారు. రాహుల్జీ మొదట ఆ పనిపూర్తిచేశారు. ధర్మకీర్తి ద్వితీయగ్రంథం "సంబంధపరీక్ష"లో శిథిలమైన కారికలనుకూడ టిబెట్ అనువాదంనుండి సంస్కృతంలోకి మార్చారు. "వార్తికాలంకారం" దాదాపు పద్దెనిమిది వేల శ్లోకాలలో ఉన్న విస్తృతగ్రంథం. దానిని మూడు సంపుటాలుగా ప్రచురించవలసిఉంది. టిబెట్ అనువాదంతో సరి

పోల్చి పాఠభేదాలు ఇస్తూ, దానిని ఎడిట్ చేయడం అన్నిటి కంటె పెద్దపని. రాహుల్జీ ఈ పనిలో నిమగ్నమైనారు. రెండు సంపుటాలు పూర్తిఅయ్యేదాకా విశ్రమించలేదు.

దాదాపు ఇరవైఏళ్ళ తర్వాత, స్వామీ సత్యస్వరూప్, అతనిగురువు స్వామీ గంగేశ్వరానంద్ రాహుల్జీకి కనిపించారు. రాహుల్జీ రచించిన "వోల్గానుండి గంగవరకు", "మానవసమాజం" మొదలైన గ్రంథాలను తాము చదివినట్లు తెలియజేశారు. సాధువులలో ఎంతో మంది ఈ గ్రంథాలనుచదివి చాలాసంతోషించారని స్వామీ సత్యస్వరూప్ చెప్పాడు. "మాకు ఈ మార్గమే సత్యమైనదీ, శ్రేయస్కరమైనదిగా కనిపిస్తుంది. కాని ఏంచేస్తాం? మా భక్తులు సేఠ్‌లు. వారికి ఇవి క్వైనైన్‌మాత్రలుగా కనిపిస్తాయి!" అని ఒకసాధువు అన్నాడట.

లోలవద్దనుండి క్రీ. శ. 1944 ఫిబ్రవరి 22 వ తేదీన టెలిగ్రాం వచ్చింది. ఆమె దీనిని మూడురోజులక్రితం పంపింది. అందులో ఇలా ఉంది: "వోక్స్‌ద్వారా పంపిన జాబు అందింది లెనిన్‌గ్రాడ్ రావడం సంభవమేనా? టెలిగ్రాం ద్వారా తెలియజేయండి." రాహుల్జీ అదేరోజున టెలిగ్రాంద్వారా జవాబిచ్చారు. తాను సోవియట్‌కు రాదలచినట్లు తెలియచేశారు. సోవియట్ "వీసా" పంపమని కోరారు. తన నవల "సింహసేనాపతి"లోని కొన్ని వాక్యాలను పట్టుకొని, జైనసంప్రదాయవాదులు కోపంతో చిందులు తొక్కుతున్నట్లు, గుజరాత్-హిందీ పత్రికలలో తనపై వ్యతిరేకంగా ఏనేకో వ్యాసాలు వ్రాస్తున్నట్లు రాహు

జ్జీకి తెలిసింది. ఆ నవలలో ఒక విదూషకపాత్రద్వారా జైన సాధువుల నగ్నస్వరూపాన్ని ప్రాకృతికప్రాణులతో ఉపమింపజేశారనే విషయం జైనులకు కోపం తెప్పించింది. తీర్థంకర మహావీరునికి సంబంధించినంతవరకు, నవలలోని నాయకుడు అతనిపట్ల చాలా మంచిభావాలు ప్రకటించాడు. జైనులు ఈ విషయం విస్మరించి, అప్రధానమైన విదూషక పాత్రద్వారా చెప్పించినమాటలనే పట్టుకొన్నారు. కొన్ని చోట్లనుండి రాహుల్జీని బెదరిస్తూ జాబులు వచ్చాయి. అయినప్పటికీ ఆయన లెక్కచేయలేదు.

# పదకొండో అధ్యాయం

## ఆంధ్రలో పర్యటన

## అమరావతి, నాగార్జునకొండ యాత్ర

అఖిలభారత రైతుమహాసభ ఈ పర్యాయం ఆంధ్రలో జరుగనున్నది. నాలుగేళ్ళ క్రితం మహాసభకు రాహుల్జీ అధ్యక్షుడుగా ఎన్నికైనారు. కాని ఆయన మహాసభకు వెళ్ళకపూర్వమే అరెస్టయినారు. అందుచేత ఈ పర్యాయం మహాసభకు వెళ్ళనిశ్చయించారు. క్రీ.శ. 1944 మార్చి 6వ తేదీన, సర్దార్ పృథ్వీసింగ్, డాక్టరు అధికారి తదితరులతో కలిసి రాహుల్జీ విజయవాడకు బయలుదేరారు. మరునాడు ఉదయం హైద్రాబాద్ చేరుకొన్నారు. ఇక్కడ రైలుపెట్టె మారవలసి వచ్చింది. రాహుల్జీ, తదితరులు ఇక్కడ దిగారనే విషయం కమ్యూనిస్టుపార్టీ సభ్యులకు తెలిసింది. వందలాదిమంది ప్లాట్‌ఫారమ్‌వద్దకు వచ్చారు. నినాదాలిస్తూ, విప్లవగేయాలు పాడారు.

ఈ యాత్రలో రాహుల్జీ సర్దార్ పృథ్వీసింగ్ జీవిత చరిత్ర (టైప్ చేసింది)ను చదవడం ప్రారంభించారు. దీనిపై హిందీలో ఒకపుస్తకం వ్రాయాలని నిశ్చయించారు. మార్చి 7 వ తేదీరాత్రి వీరంతా విజయవాడ చేరుకొన్నారు. వీరికి మొగల్‌రాజపురంలో విడిది ఏర్పాటుచేశారు.

ఆంధ్రదేశం ముక్కచెక్కలుగా ఉన్నకాలం అది. ఆంధ్రుల స్వరాష్ట్రవాంఛను రాహుల్జీ సంపూర్ణంగా బల పరిచారు. ఆంధ్రుల పూర్వచరిత్రనుగూర్చి ఆయన వెలి బుచ్చిన అభిప్రాయాలు ఇవి:

"ఆంధ్రజాతి ఎల్లప్పుడూ ఒక పరాక్రమవంతమైన జాతిగా ఉంటూవచ్చింది. చంద్రగుప్తమౌర్యుడు, అతని కుమారుడు బిందుసారుడు హిందూకుష్ (ఆఫ్ఘనిస్తాన్) అవ తలివరకు తమ సరిహద్దును వ్యాపింపజేయడంలో సఫలురు కాలేకపోయారు. అయితే కళింగ—పూర్వాంధ—విజయం కోసం మౌర్యులు మూడోతరంవరకు నిరీక్షించవలిసివచ్చింది. అశోకుడు భారతదేశ సైనికబలం అంతటిని సమాకూర్చు కొని, ఆంధ్రులపై దాడిచేశాడు. కాని ఆంధ్రులు మట్టితో కాకుండా ఉక్కుతో తయారైనవారు; తమ ప్రాణాలకంటె ప్రియమైన స్వాతంత్ర్యాన్ని అలాగ్గా వదలిపెట్టేవారుకాదు. వీరత్వంలోను, ఆత్మబలిదానంలోను అపరాజితులైకూడ, సంఖ్యాబలంముందు పరాజితులు కావలసివచ్చింది. అయితే దీనితోబాటు వారు అశోకునికి మంచి గుణపాఠం నేర్పారు. కళింగవిజయంతర్వాత అశోకుడు చండ-అశోకుడుకాకుండా ధర్మ-అశోకుడైనాడు. వీరులైన ఆంధ్రుల ఆత్మబలిదానం, వారి రక్తంతో ఎరుపెక్కినగోదావరి, కృష్ణానదులను చూచి అశోకుని మానవహృదయం ద్రవించింది. ఆంధ్రులు తమ స్వాతంత్ర్యంలో కొంతభాగాన్ని కోల్పోయినప్పటికీ, ముందు ముందు మౌర్యచక్రవర్తులకాలంలో వారు తిరిగి బలపడ్డారు. వందఏళ్ళు పూర్తికాకముందే, క్రీస్తుపూర్వం

రెండో శతాబ్దం మధ్యభాగంలో వారు నర్మదా, ఒరిస్సా వరకుగల దక్షిణభారతదేశానికి అధికారులైనారు. అంతే కాదు. ఆ శతాబ్దం ముగిసేసరికి ఆంధ్రుల విజయపతాక గంగ,యమునానదీతీరస్థప్రాంతాలలో సైతం రెపరెపలాడింది. అప్పుడు మహారాష్ట్రులు, ఆంధ్రులు ఐక్యంగా ఉన్నారు. ఉభయదేశాల పరిపాలకుల - రాజుల - భాష ఒకటిగా ఉండేది. బహుశా కొందరు పరిపాలితులభాషకూడ ఒక టిగా ఉండేది. మహారాష్ట్రలో పరిపాలకులభాష పరిపాలి తులభాషను నాశనంచేసింది. అయితే ఆంధ్రులు పూర్వ నామంతో బాటు పరిపాలితులుభాషనే ఖాయపరచారు. అంతేకాదు. పరిపాలితులతో బాటు వారిభాషనుకూడ తమలో లీనం చేసుకొన్నారు.

క్రీస్తుపూర్వం రెండో శతాబ్దం ముగిసేసరికి విశా లాంధ్ర రాష్ట్రంకూడ ముక్క చెక్కలైపోవడం మొదలు పెట్టింది. శకులద్వారా నాశనంచేయబడ్డ ఎన్నో ఉత్తర భారత (ఉత్తరప్రదేశ్ - బీహారు) రాజవంశాలు ఆంధ్రలో తలదాచుకొన్నాయి. బహుశా వారు అక్కడఉన్న రాజ వంశీకులకు దగ్గర బంధువులుకూడ అయి ఉండేవారు. ఆంధ్ర సామ్రాజ్యం ధ్వంసం అయిపోతున్నప్పుడే, ఇక్ష్వాకువంశీ యుడైన చాంతమూలుడు - బహుశా అతడు పూర్వాంధ్ర రాజు — అక్కడ తనరాజ్యాన్ని స్థాపించాడు. ధాన్య కటకం, శ్రీపర్వతం (నాగార్జునకొండ) లోని సుందర శిలా స్తూపాలు, అక్కడఉన్న అద్భుతశిల్పాలు చాంతమూలుని సోదరి చాంతిసిరి, పుత్రుడు రాజాసిరి వీర పురిసదాతల

(శ్రీ వీరపురుషదత్తు) వి కావు. అవి ఆంధ్రశిల్పుల అమర కృతులు. ప్రపంచంలో ఈ అద్భుతకళను సృష్టించినందుకు ఆంధ్రులు గర్వించకుండా ఎందుకు ఉంటారు? అయితే ఆ శిల్పుల బిడ్డలు నేడు మాచర్లలో రాతిబండలు నరకడం, ధరణికోట (ధాన్యకటకం)లో రాళ్ళు రప్పలు మోయడం ఎరుగుదురు. ప్రజలతోబాటు వారికళకుకూడ రోజులు మారవా?

మూడోశతాబ్దంతర్వాత తిరిగి ఆంధ్ర యావత్తూ ఒక స్వతంత్ర రాష్ట్రంగా సంఘటితంకాలేకపోయింది. ఈ రాజరికయుగంలో పరస్పర కలహాలకారణంగా, అది వేర్వేరు రాజవంశాలతరఫున పోరాటంలో తనశక్తిని వృథా చేసుకొన్నది. ఒకొక్కప్పుడు ఇతరులతండ్రిని తండ్రి అని చెప్పుకొనికూడ సంతోషిస్తూ ఉండేది. విజయనగరం రాజులది శుద్ధకర్ణాటక రాజవంశం – అయితే ఆంధ్రులుకూడ అది తమదేనని అభిమానిస్తూ ఉండేవారు.''

అఖిలభారతరైతుమహాసభ విజయవాడలో మార్చి 14. 15 తేదీలలో జరుగనున్నది. అప్పట్లో ఆంధ్రప్రజా నాయకుల నెందరినో ప్రభుత్వం జైళ్ళలోబంధించి, పంచమాంగ దళంయొక్క పని సుళువు అయ్యేట్లు చేసింది. పంచమాంగదళం దేశభక్తి ముసుగు వేసుకొని, జైళ్ళలో ఉన్న అచ్చమైన దేశభక్తులకు వ్యతిరేకంగా రకరకాల ప్రచారం చేసింది. రైతుల ఉత్సాహమూ, శక్తీ విజయవాడలో ప్రదర్శింపబడటం ప్రభుత్వానికి ఇష్టంలేదు. రైతు మహాసభకు అన్నివిధాలా ఆటంకం కల్పించదలచింది. మహా

సభకు కొన్ని వారాలముందు, ఆ తర్వాత కొన్ని వారాలవరకు చుట్టుపట్ల ముప్పయిమైళ్ళదూరంలోగల అన్ని స్టేషన్లనుండి విజయవాడకు రైలుటిక్కెట్లు అమ్మడం ఆపివేయించింది. మహాసభకు రైతులు హాజరుకాకుండా ఆగిపోతారని భావించింది. కాని రైతులకు బళ్ళు ఉన్నాయని, పడవలు ఉన్నాయని, అందరికీ కాళ్ళుఉన్నాయని ప్రభుత్వం ఊహించలేకపోయింది. పోలీసులు ఎన్నో పుకార్లు లేవదీశారు పట్టణంలోకి వెళ్లేదార్లు బందు అయినాయని, తుపాకి కాల్పులు జరుగుతాయని బెదరించారు. పట్టణంలోని ఆరోగ్యశాఖాధికార్లు అంటువ్యాధి వ్యాపిసుందనే నెపంతో మహాసభను ఆపుచేయించడానికి వేరుగా ప్రయత్నించారు. కాని అయిదువేలమంది సుశిక్షితులైన కమ్యూనిస్టుపార్టీసభ్యులు, పదివేలమంది స్త్రీ-పురుష వలంటీర్లు, లక్షమంది రైతు సంఘసభ్యులు, ఎర్రజెండాకోసం ప్రాణాలర్పించే పల్లెటూరిప్రజలు ఒకచోట చేరారు. పది హేనువందల ఎడ్లబండ్లు వచ్చాయి. ప్రభుత్వమూ, పంచమాంగదళమూ, నాయకత్వంకోసం ప్రాకులాడే కాంగ్రెస్ వాదులు అసూయతో కుమిలిపోయారు.

మొదటిరోజు ఉదయం బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగింది. మహాసభకు లక్షమందికిపైగా ప్రజలుహాజరైనారు. తెల్లవారుజాము నాలుగుగంటలదాకా సాంస్కృతిక కార్యక్రమాలను తిలకించారు. లలితకళలలో ముందున్న బెంగాల్ దళానిదే ఇక్కడకూడ పైచేయి అవుతుందని రాహుల్జీ ప్రభృతులు అనుకొన్నారు. అయితే వారు భ్రమపడ్డారని

రెండురోజుల కార్యక్రమాలలో రుజువైంది. చివరిరోజున ముజఫ్ఫర్, గోపాల్ హాల్దార్లు తమ అభిప్రాయాలను ఇలా వెల్లడించారు: అన్నికళలకు తల్లిఅయిన ప్రజలే వీరికి ఆశ్రయం. ఇక్కడ కార్యకర్తలు ముందుగానే ఏదో ఒక కళను తీసుకొని ప్రజలవద్దకు వెళ్ళడంలేదు. పైపెచ్చువారు ప్రజలనుండే కళను నేర్చుకొంటున్నారు. అయితే బెంగాల్‌లో మేము మధ్యతరగతి కళాసంస్కారాన్ని తీసుకొని ప్రజలవద్దకు వెళ్ళుతున్నాము. వారికళను సరిగా నేర్చుకోవడంలేదు.

ధాన్యకటకం (అమరావతి,) నాగార్జునకొండ, జగ్గయ్యపేట, గోలి తదితర ప్రాచీన భారతీయ కళకుచెందిన శిథిలావశేషాలు ఆంధ్రాలోనే ఉన్నాయనీ రాహుల్జీ ఇదివరకే చదివారు. వీటి శిలాశాసనాల, శిల్పవిగ్రహాల ఫోటోలనుకూడ చూశారు. క్రీ. శ. 1933లో ఇక్కడకు వెళ్ళడానికి ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నం నెరవేరలేదు. ఈ పర్యాయం లభించిన అవకాశాన్ని జారవిడువకూడదనుకొన్నారు. సుప్రసిద్ధ కళా విమర్శకులు సంజీవదేవ్ ఆయనకు తోడైనారు. సంజీవదేవ్‌ది కృష్ణానదిఅవతలిఒడ్డున ఉన్న తుమ్మపూడి గ్రామం. ఇద్దరూ తుమ్మపూడినుండి గుంటూరుకు వెళ్లారు.

ధాన్యకటకం గుంటూరుకు ఇరవైమైళ్ళదూరంలో ఉంది. ఇది బౌద్ధుల పవిత్రక్షేత్రం. తాంత్రికబౌద్ధులకు ఇది అన్నిటికంటె పెద్దతీర్థస్థలం. దీనిపేరుమీదనే టిబెట్‌లో ఇటీవల అన్నిటికంటె పెద్దమఠం "డేపుంగ్" స్థాపించబడింది. ఈ మఠంలో ఎనిమిదివేలమంది భిక్షువులకు వసతి

కల్పించబడింది. "డేపుంగ్" అంటే ధాన్యకటకం లేక ధాన్య-రాశి అని అర్థం. తాంత్రిక బౌద్ధులు చెప్పేదానిని బట్టి, బుద్ధుడు తంత్రమార్గంలో ప్రథమ ఉపదేశం ఇక్కడే ఇచ్చాడు. అందుచేత ఇది వారికి బోధగయకంటె తక్కువ పవిత్రమైన స్థానం ఏమీకాదు. ఇందులో చారిత్రకసత్యం లేకపోయి నప్పటికి ఈ స్థలం మహత్తరమైనదనడంలో సందేహంలేదని రాహుల్జీ అన్నారు. టిబెట్‌లో ధాన్యకటకానికి వెళ్ళేమార్గాన్ని సూచించే పుస్తకాలుకూడ వ్రాయబడ్డాయని, అందులో వినికిడినిబట్టివ్రాసిన విషయాలే చాలా ఉన్నాయనిచెప్పారు. కాని ధాన్యకటకం మహాక్ష్యులతర్వాత బౌద్ధుల మహాక్షేత్రంగా తయారైందనే అభిప్రాయం వెలిబుచ్చారు. "ధాన్యకటకంలోని మహాచైత్యం శిల్పకళకు ఒక చక్కని దృష్టాంతం. దాని శిలాఫలాకాలను చూస్తేనే ఈ విషయం విదితమవుతుంది. ఇవి బహుశా లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియమ్‌ల అన్నిటిలోను ఉంచబడ్డాయి. అమరావతికళ ఒక స్వతంత్ర కళాసంప్రదాయం. అయితే ఈ చైత్యం (స్తూపం) కళనేకాకుండా, బౌద్ధుల ప్రముఖధార్మిక సంప్రదాయాలలో ఒకదాని (చైత్యవాది)కికూడ తనపేరును ప్రసాదించింది. టిబెట్ పరంపరనుబట్టి, ధాన్యకటకానికి తూర్పు, పడమరలలో ఉన్న రెండు పర్వతాలవద్ద నివసించి నందువల్ల పూర్వశైలీయ, అపరశైలీయ అని బౌద్ధ సంప్రదాయాలకు రెండుపేర్లు ఏర్పడ్డాయి" అని రాహుల్జీ చెప్పారు. ధాన్యకటకానికి తూర్పున అయిదుమైళ్ళదూరంలో ఇప్ప

టికీ ఒకపర్వతం ఉంది. కాని పడమటిపర్వతం మున్పయి మైళ్ళకంటె ఎక్కువదూరంలో ఉంది.

ధాన్యకటకాన్ని గూర్చి రాహుల్జీ ఇంకా ఈ దిగువ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

"సుభిక్షంగా ఉన్నకాలంలో ధాన్యకటకం విశేష ప్రాముఖ్యత వహించిన ఒక ఓడరేవుగా ఉంటుంది. దీనితో బాటు ధాన్యకటకం ఆంధ్రసామ్రాజ్య ప్రాగ్భాగరాజధానిగా బహుశా అశోకునికాలంనుండి ఉంటూ వచ్చింది. తర్వాత ఇక్ష్వాకులకాలంలో ఇది ఔన్నత్యంలో చరమ స్థాయిని అందుకొన్నది. ధాన్యకటక శిథిలావశేషాలు నేటికీ ఎనిమిది పదిమైళ్ళదూరంవరకు కనిపిస్తాయి. అమరావతిబస్తీ, ధరణికోట అనేగ్రామం ఈ శిథిలంపైనే నిర్మింపబడ్డాయి. అమరావతిని ఆనుకొని, ధరణికోటకు మైలుదూరంలో పశ్చిమమహాచైత్య శిథిలస్థానం ఉంది. దీని సుందర శిలాఫలకాలనుచాలా పూర్వమే తొలగించారు."

రాహుల్జీ ధాన్యకటకాన్ని సందర్శించి, గుంటూరుకు తిరిగివచ్చారు. ఆరోజేరైలులో మాచర్లకు వెళ్ళారు. అక్కడ నుండి ఎడ్లబండిలో నాగార్జునకొండ(శ్రీ పర్వతం)కు బయలు దేరారు. పుల్లారెడ్డిగూడెంలో ఒకయువకుడుతోడైనాడు అతడు కమ్యూనిస్టుపార్టీ సానుభూతిపరుడు మాత్రమేనని రాహుల్జీ అనుకొన్నారు. కాని అతడు ప్రాచీనశిలా శాసనాలనుకూడ చదవగలిగినవాడని తర్వాత తెలుసుకొని సంతోషించారు. రాహుల్జీ పల్నాటి సీమలో లంబాడీలవద్దకు వెళ్ళి వారితో కాస్సేపు మాట్లాడారు. వారుమాట్లాడేది మేవాడ్ దక్షిణ

సరిహద్దుభాష అని, వారు వ్యాపారంకోసం చాలాకాలం క్రితమే మేవాడ్‌నుంచి ఇక్కడకు వచ్చి స్థిరపడిపోయారని రాహుల్జీ అభిప్రాయం. ఆయన ఆ రాత్రి పుల్లారెడ్డిగూడెంలో గడిపారు.

మరునాడు శ్రీపర్వతాన్ని సందర్శించారు. పర్వతం పంక్తి వలయాకారంలో ఉంది. రెండుచోట్ల కొండలు ఎడమెడంగా ఉన్నాయి. ఇక్కడ కృష్ణానది ప్రవహిస్తుంది. ధాన్యకటకం ఇక్కడకు డెబ్బయిమైళ్ళదూరంలో ఉంది. కాని పడవలు పోడుకల్లువరకు రాగలవు. ఆ తర్వాత రాళ్ళు రప్పలు ఎదురవుతున్నందువల్ల, ముందుకు వెళ్ళలేవు. లంక, తదితర ద్వీపాల బౌద్ధతీర్థయాత్రికులు సముద్రనౌకల ద్వారా పోడుగల్లుదాకా వచ్చేవారని రాహుల్జీ చెప్పారు.

శ్రీ పర్వతాన్నిగూర్చి ఆయన ఈ దిగువ అభిప్రాయాలను వెలిబుచ్చారు:

"శ్రీపర్వతం 'ఆశ్చర్యవార్తా సహస్రుల' ఉద్గమస్థానం. శ్రీపర్వతంలోని మంత్ర తంత్రవేత్తలు చమత్కారాల ప్రతిధ్వని అనేక సంస్కృత కావ్యాలల్లో వినబడుతుంది. రెండోశతాబ్దంలోని మహాతత్వవేత్త నాగార్జునునికి ఇది ప్రియమైన స్థానం. ఆ తర్వాత తాంత్రిక బౌద్ధులకు ఇది సర్వోత్తమైన పీఠంగా తయారైంది. నాగార్జునుడు తన తత్వ గ్రంథాలన్నిటినో ఇక్కడే వ్రాసిఉంటాడు. తన "సుహృదు"డైన శాతవాహన రాజుకు సుప్రసిద్ధమైన "సుహృల్లేఖ"ను బహుశా ఇక్కడేకూర్చుని వ్రాసిఉంటాడు. చక్కని నీతి బోధలతోనిండిన ఈ పత్రం నేటికీ టిబెట్, చైనాభాషాను

వాదాలలో సురక్షితంగా ఉంది. నాగార్జునుడు తన "విగ్రహ వ్యావర్తని" తదితర రచనలద్వారా ప్రారంభించిన తర్క, న్యాయశాస్త్రమే ముందు ముందు భారతదేశమంతటా న్యాయ, తర్కశాస్త్రానికి పరిబలపరివాహోద్గమ స్థానంగా తయారైంది. ఇప్పుడు శ్రీ పర్వతంయొక్క గొప్పదనాన్ని తెలుసుకోవచ్చు. పర్వతాలు, కృష్ణానదీజలంతో చుట్టబడిన శ్రీపర్వతం ఒక స్వాభావికమైన దుర్గం. అయితే ఇది ఎప్పుడైనా పెద్దరాజధానిగా ఉండేదనడానికి చిహ్నాలు కనపడవు. చాంతమూలుని సోదరి చాంతిసిరి, పుత్రుడు రాజా వీరపురిదత్. (వీరపురుషదత్తు), అతని పుత్రుడు రాజా ఏహుబల మూలుడు అపారమైన ధనరాసులనుఖర్చుపెట్టి శ్రీపర్వతంలో ఎనలేని స్తూపాలను నిర్మించారు రాజధాని ధాన్యకటకానికి డెబ్బయిమైళ్ళదూరంలో, ఈ దుర్గమపర్వతంలో, ఈ అద్భుతమైన నిర్మాణంకూడ మతరీత్యా ఈ స్థలం ఎంత మహత్తరమైనదో రుజువుచేస్తుంది.

రాహుల్జీ ఆ మరునాడు శ్రీపర్వతంలో అన్నిటికంటె పెద్దస్తూపావశేషాలను చూశారు. దీనినిగూర్చి ఆయన ఈ దిగువ అభిప్రాయాలను వెలిబుచ్చారు:

"ఈ స్తూపాన్ని అనేక "అశ్వమేధయాజి" అయిన రాజావీరపురుషదత్తుని అత్త చాంతసిరి నిర్మించింది. శిలాస్తంభాలపై చాలా అందమైన అక్షరాలతో ఎన్నో పెద్ద పెద్దశాసనాలు చెక్కబడ్డాయి. ధాన్యకటకంలో ఇక్ష్వాకు వంశానికి చెందిన ఎందరో వ్యక్తులపేర్లు, మతంపట్ల వారి శ్రద్ధాసక్తులనుగూర్చి వీటిలో పేర్కొనబడింది. చాంత

మూలునికి (శాంతమూలుడు) ఇద్దరు తోబుట్టువులు ఉండే వారని ఈ శాసనాలవల్ల బోధపడుతుంది. వీరిలో పెద్దదైన చాంతసిరిని పోగియవంశజుడైన ఖండసిరికి ఇచ్చి వివాహం చేశారు. చాంతమూలుని పుత్రుడు రాజా వీరపురుషదత్తుని రాణి ఛఠసిరి (షష్ఠిశ్రీ) తండ్రిపేరు హమ్మసిరి (హర్మ్యసిరి). వీరపురుషదత్తునికుమారుడు రాజా ఏహువల చాంతమూలుని పేరుకూడ శిలాశాసనాలలో ఉంది. ఉజ్జయినిలోని రుద్రధర భట్టారిక దానం విషయంకూడ ఒక శాసనంలోఉంది. బహుశా అప్పుడు ధాన్యకటకం రాజవంశానికీ, ఉజ్జయిని రాజవంశంతో సంబంధం ఉండేది. స్తూపశిలాకంచుకం అనేక చిత్రాలతో అలంకరింపబడింది. వీటిలో చాలాభాగం త్రవ్వకాలలో లభించింది. నేటికీ సమీపంలోని మ్యూజియంలో ఉంచబడింది. మహాచైత్యంవద్ద మరో చైత్యగృహం ఉంది. దీని ఇటుకలు 18 అంగుళాల పొడవు, 11 అంగుళాల వెడల్పు, మూడంగుళాల మందం కలిగిఉన్నాయి. మహాచైత్యానికి ఒకవైపున 36 స్తంభాలతో విశాలమైన పూజామందిరం ఉంది.

ఆ కాలంలో ఆంధ్ర రాతిశిల్పంయొక్క అద్భుత దృశ్యాన్ని మ్యూజియంలోచూచినప్పుడు, కళ్ళు మిరుమిట్లు గొల్పుతాయి. శిల్పిదృష్టిలో ఇవి తెల్లనిరాళ్ళుకాదని, వెన్నగాని మైనంగాని అయిఉంటుందని బోధపడుతుంది. అతడు ఎంతో మృదువైనహస్తాలతో తన ఉలిని కదిలించిఉంటాడు. శరీరంలో అంగప్రత్యంగాల సామంజస్యాన్ని నిరూపించడంలో ఎంతో నేర్పు చూపించాడు. పెద్ద విగ్రహాలలోనే

కాకుండా చిన్నవిగ్రహాలలోకూడ అదే నేర్పు కనిపిస్తుంది. నిర్జీవమైన రాతికి ఎంత సజీవత్వం కల్పించబడింది! చెక్కిన దృశ్యాలలో ఒకచోట బుద్ధుని జీవితచరిత్రను సంకేతాల ద్వారా చిత్రిస్తే మరొకచోట సాక్షాత్తు విగ్రహంద్వారా చిత్రించబడింది. ఎన్నో జాతక - కథల దృశ్యాలు కూడ ఉన్నాయి. ఒకచోట ఉన్నతవంశానికి చెందిన స్త్రీ-పురుషనృత్యం జరుగుతున్నది. దానికితోడుగా వీణ, డోలు తదితర వాద్యాలు వాయిస్తున్నారు. స్త్రీలు ధరించిన ఎన్నో నగలు నేటికీ ఆంధ్రలో వాడుకలో ఉన్నాయి. అయితే ముక్కుకు నాలుగేసి నగలు పెట్టుకొనే స్త్రీలు ఆ కాలంలో లేరు. ఒకచోట శకయోధుడు చిత్రించబడ్డాడు. అతని తలపై మొనతేలిన టోపీ ఉంది. పొడవైన వస్త్రం, నడుముదట్టీ, పైజామాతోబాటు అతనికి పొడుగైన గడ్డంకూడ ఉంది.

శ్రీపర్వతం మహాయానులకు, తాంత్రికబౌద్ధులకు అతిపవిత్రస్థానమైనప్పటికీ, ఇక్కడ కనిపించే దృశ్యాలు, విగ్రహాలలో మహాయాన, తంత్రయానఛాయలే లేవు. మహాచైత్యానికి దక్షిణం కొన్నిఫర్లాంగులదూరంలో రెండు మూడు బౌద్ధవిహారాలు, స్తూపాలశిథిలావశేషాలుఉన్నాయి. పెద్దపెద్ద స్తంభాలు, విగ్రహాలు విరిగిపడిఉన్న తీరును బట్టి, విహారాలకు నిప్పుపెట్టినట్లు బోధపడుతుంది.

శ్రీపర్వతంలో అనేక శిలాశాసనాలు ఉన్నాయి. అయితే వాటిలో కొన్ని పేర్లేకాకుండా ఇతరసంగతులుకూడ ఒకలాగే పునశ్చరణ చేయబడ్డాయి. ఈ శిలాశాసనాలలో ప్రయోగింపబడిన భాష పాలీకి చాలావగ్గరగా ఉంది. ఇక్ష్వాకులు, వారి వారసులైన పల్లవరాజుల ప్రాకృతశాసనాలను

బట్టి, బహుశా ఈ భాషే ఆ కాలంనాటి పాలకవర్గంయొక్క మాతృభాషగా ఉంటుంది. సర్వసాధారణమైన భాష నేటి తెలుగుయొక్క ప్రాచీనరూపమే అయిఉంటుందనేది ఖాయం. ఆ కాలంలో ఆంధ్రసామ్రాజ్యంయొక్క పశ్చిమ, పూర్వ భాగాలలో ప్రజలభాష పాలకులభాష రెండూ వాడుకలో ఉండేవి. తృతీయశతాబ్దందాకా పాలకులభాష (శిలాశాసనాలు ఆర్యభాష) ప్రాబల్యం వహించింది. ఏ శతాబ్దంలో మహారాష్ట్రంలో మహారాష్ట్రిభాష ప్రజలభాషగా స్థానం సంపాదించిందో, ఆంధ్రలో తెలుగుభాష పాలకులభాషను స్థానభ్రష్టంచేసిందో తెలుసుకోవడం చాలా కుతూహలజనకంగా ఉంటుంది. మరాఠీలో కనిపించే "ఇకడే", "తికడే", "కొండా" (పర్వతం) మొదలైన శబ్దాలెన్నో కూడ ఈ రెంటియొక్క ఈ సంబంధాన్నే రుజువుపరుస్తున్నాయి."

రాహుల్జీ పుల్లారెడ్డిగూడెంలో లంబాడీలను కలుసుకొని వారితో సంభాషించారు. వారి నృత్యాన్ని, నృత్యం చేసేటప్పుడు పాడే గేయాన్ని శ్రద్ధగా పరిశీలించారు. లంబాడీలు (బంజార్లు) గంగానది ప్రాంతంనుండి చాలాదూరం వచ్చినప్పటికి, గంగానదిని మరచిపోలేదని, వారు కృష్ణ - గోదావరీ గేయాలకు మారు గంగానదీ గేయాలను పాడుతున్నారని చెప్పారు. వారుపాడిన గేయాన్ని వినరంగా వ్రాసుకున్నారు. దక్షిణాదిలో 'హోళీ' పండుగ చేసుకునే సంప్రదాయంలేదు. కాని లంబాడీలకు ఆ పండుగ చాల ఇష్టం. వరిధాన్యంపండే ప్రాంతంలో నివసిస్తున్నప్పటికీ వారికి రొట్టెలే ప్రధాన ఆహారంగాఉంది.

విజయవాడ రైతుమహాసభ సందర్భంగా రాహుల్జీ ఆంధ్రరైతుల ఉత్సాహాన్ని గమనించారు. ఈప్రాంతంలో ఒకటి రెండుగ్రామాలనుకూడ చూడదలచుకున్నారు. తెనాలికి 19 మైళ్ళ దూరంలోఉన్న దావులూరుకు వెళ్ళారు. రైతు,వ్యవసాయ కూలీలను కలుసుకున్నారు. కూలీల సంఘటితశక్తిని ఆయన ప్రశంసించారు సాయంత్రం మూడువేల మందితో బహిరంగసభ జరిగింది. రాహుల్జీ ఆసభలో ఉపన్యసించారు. తర్వాత కృష్ణాజిల్లా కాటూరుగ్రామానికి వెళ్ళారు.ఆగ్రామంలో ప్రజల పరిస్థితులను వివరంగా తెలుసుకున్నారు. ఉగాది సందర్భంగా గృహాలంకరణను రాహుల్జీ గమనించారు. ఆరాత్రి కమ్యూనిస్టుపార్టీ ఆఫీసు ఎదుట బహిరంగసభ జరిగింది. వెయ్యిమంది స్త్రీపురుషులు హాజరైనారు. ప్రజల కోరికపై రాహుల్జీ రష్యాపర్యటనానుభవాలను వివరించారు.

## కేరళలో

రాహుల్జీ భారతదేశంలోని అన్నిప్రాంతాలను ఒకసారిగాని, చాలాసార్లుగాని చూశారు. మలబారు లేక కేరళ ప్రాంతాన్ని చూచే అవకాశం దొరకలేదు. అందుచేత ఈ పర్యాయం కేరళను చూడదలచుకున్నారు. మార్చి 27 న తేదీన మైసూరునుండి బస్సులో కాలికట్‌కు బయలుదేరారు. అక్కడక్కడ 'తోడా' ప్రజల గుడిసెలు కనిపించాయి. వీరు ఇప్పు డిప్పుడే బట్టలు ధరించడం మొదలుపెట్టారు. స్త్రీలు నడుముకు దిగువభాగంలో మాత్రమే బట్టలు ధరించి

ఉన్నారు. మలబారులో కొందరు విద్యావంతులైనవారు మినహా, స్త్రీలందరూ నడుముకు ఎగువభాగంలో బట్ట కప్పుకోవడం అవసరమని భావించినట్లు కనపడలేదు. అయితే మహమ్మదీయ స్త్రీలు నడుముకు ఎగువభాగంలో బట్ట కప్పుకుంటున్నారు.

భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో ఒక గ్రామానికి చెందిన ప్రజలంతా ఒకేచోట ఇళ్ళు కట్టుకుంటారు. కాని మలబారులో ఇళ్ళన్నీ చెల్లాచెదరుగా ఉంటాయి. బహుశా ఈ ప్రాంతంలో అనాదికాలంనుండి దొంగలు, దోపిడీగాండ్ర భయంలేదని, అందుచేతనే 'గ్రామం' (సమూహం) నిర్మించుకోవలసిన అవసరం కలుగలేదని రాహుల్జీ అభిప్రాయం.

రాహుల్జీ కాలికట్‌లో దిగి రిక్షాలో తన గమ్యస్థానం చేరుకున్నారు. మార్చి నెలాఖరుకే మలబారులో ఎండలు ముదిరాయి. ఇక్కడ ఎండాకాలం, వర్షాకాలం తప్ప మరో ఋతువు ఉన్నట్లే కనిపించలేదు. చెమటలు తగ్గిపోయే కాలాన్నే ఇక్కడ చలికాలం అంటారు. మలయాళం భాషలో ఇప్పటిదాకా సినిమా ఏదీ తయారుకాలేదని తెలిసింది. తమిళభాష మలయాళానికి చాలా దగ్గరగా ఉంటుంది. మలయాళంలో సంస్కృత శబ్దాలు ఎక్కువ. తమిళంలో సంస్కృతశబ్దాలు కనిపించవు. కాని మలయాళ, తమిళ భాషల మాతృక ఒక్కటే. అందుచేత తమిళభాషను అర్థం చేసుకోవడం మలయాళీలకు చాలా సులువు. అయితే తమిళ సినిమాలకంటె హిందీ సినిమాలకే ప్రజలు ఎగబడతారు. హిందీసినిమాలలో అభినయం బాగా ఉంటుందని

కొందరు, హిందీ సినిమాతారలు చాలా అందంగా ఉంటారని మరికొందరు, అలాకాకుండా వారి సంగీతం చాలా మధురంగా ఉంటుందని ఇంకా కొందరు రాహుల్జీతో చెప్పారు.

ఆయన కాలికట్ నుండి రైలులో కరివెల్లూరు గ్రామానికి వెళ్ళారు. భూమిఅంతా కొండలమయం. మెట్ట పల్లాలుగా ఉంది. చాలా పల్లపు నేలలో వరిపంట పండిస్తున్నారు. మెట్టభూమిలో కొబ్బరితోటలు వేశారు. వాటిలో అరటిచెట్లుకూడ కనిపిస్తాయి. ప్రజల ఇళ్ళు దూరదూరంగా వారివారి తోటలలో ఉన్నాయి. భూమిలేని సిరుపేదలు ఇతరుల తోటలలో కాపురం ఉంటున్నారు. కరివెల్లూరు గ్రామంలో గీతపనివారి జనాభా ఎక్కువ. వీరిలో అత్యధికభాగం కూలినాలి చేసుకొంటారు. లేకపోతే కొబ్బరి చెట్లు గీసి కల్లు అమ్ముకుంటారు.

నంబూతిరి బ్రాహ్మణులనుగూర్చి రాహుల్జీ ఒక వ్యాసం వ్రాశారు. అందులో ఇలాఉంది:

మలబారులో నంబూతిరి బ్రాహ్మణులది వస్తుతః భూదేవవంశం. రెండువేల ఏళ్ళక్రితం వారు మలబారులోకి అడుగుపెట్టారు. అప్పటినుండి ఇది వారికి దేవలోకమైంది. వీరు చేతితో పనిచేయవలసిన అవసరమే ఉండదు. ధర్మశాస్త్రాన్ని తయారుచేయడం, ఖరాబు చేయడం తమచేతిలో ఉంచుకున్నారు. అందుచేత వీరు తమ సుఖంకోసం, తమ బిడ్డల సుఖంకోసం పూర్తిఏర్పాట్లు చేసుకున్నారు. వీరు కేరళలో అడుగుపెట్టేటప్పటికి, బహుశా ఇక్కడ మాత్ర

స్వామిక సంప్రదాయం అమలులోలేదు. ఇతర చెడుగుల వలె ఇక్కడి సమాజంలోకూడ మార్పు వచ్చిఉంటుంది. అయితే బ్రాహ్మణులు క్రీ. శ. 1933-34 దాకా దీనిని నిశ్చలంగా ఉంచారు. రాజ్యవంశం, తిరుఅప్పాడ్, ఉన్నితిరి, నాయర్‌వంటి ఉన్నత, ధనిక జాతులలో, ఆస్తిపై కూతురుకే హక్కు ఉండేది. కుమారుడు తన తోబుట్టువు చెప్పినమాట వింటున్నంతవరకు కూడూ- గుడ్డ లభించేది. తక్కిన జాతులకు మాతృస్వామికమనే ఈ కఠోరనియమాన్ని ఏర్పాటు చేసిన బ్రాహ్మణులు, తమజాతిలో మాతృస్వామికాన్ని దగ్గరికి చేరనివ్వనేలేదు. దక్షిణదేశమంతటా స్త్రీలలో ఘోషాపద్ధతి లేనికాలంలో, నంబూతిరి స్త్రీలు ఘోషా పద్ధతి అనే కఠోర నియమాన్ని పాటించారు. వారు ఇంటి లోపల తమమరది ఎదుటికికూడ వచ్చేవారుకాదు. సంతానం పెరిగి బీదరికం ప్రాప్తిస్తుందనే కారణంతో నంబూతిరి బ్రాహ్మణులు పెద్దకుమారునికి వారసత్వ నియమం పెట్టారు. దీని ప్రకారం తండ్రిఆస్తికి అతడే యజమాని అవుతాడు. చిన్నకుమారులకు తండ్రి ఆస్తిలో ఏమీరాదు. వారు తమ జాతికి చెందిన కన్యలను పెళ్ళిచేసుకోడానికి వీలులేదు.

క్రీ. శ. 19 3-34లో చేసిన చట్టంప్రకారం, ఇప్పుడు తమ్ముళ్ళకుకూడ అధికారాలు ఇవ్వబడ్డాయంటున్నారు. కాని తన స్వంతఆస్తికి, సజాతీయవివాహానికి నోచుకోవడం లేదంటే దుర్వాసుని తపస్సుకోసం కాదు. చిన్నకుమారులు రాజవంశం, తిరుఅప్పాడ్, ఉనితిరి, నాయర్ జాతులకు చెందిన కన్యలను వెదుక్కొంటారు. అయితే భార్యగా మాత్రం

కాదు. ఎందుకంటె నంబూతిరి పురుషులు ఆమెచేతిఅన్నం ముట్టరు. ఒకవేళ తాకితే, బట్టతోసహా స్నానంచేయవలసి వస్తుంది. ఆమె సంతానం బ్రాహ్మణసంతానంకాకుండా, రాజవంశ, తిరుఅప్పడ్, ఉన్నితిరి, నాయర్ సంతాన అవుతుంది. ఆమెకు కూతురుపుడితే తల్లి ఆస్తికి వారసురాలు అవుతుంది భారతదేశంలోని ఇతరప్రాంతీయులు శంకరాచార్యుని వంశంయొక్క ఈ సంప్రదాయాన్నిగూర్చి విని ఆశ్చర్యపడతారు. ఈ సంప్రదాయం తమ ఆత్మగౌరవానికి పూర్తిగా భంగకరమని చెప్పి, పైన పేర్కొన్న నాలుగు జాతులవారు దీనిని ఎందుకు ఎదిరించలేదని ప్రశ్నిస్తారు. చివరికి ఏ కన్యనైనా ఎలాంటి బాధ్యత ఇవ్వకుండా, సంతానానికి ఎలాంటి పితృగోత్ర అధికారం ఇవ్వకుండా, పెండ్లి చేయడమంటే ఆమెను ఉంపుడుకత్తెగా ఉంచడం కాకపోతే మరేమవుతుంది? కాని ఇరువయ్యోశతాబ్దం ప్రథమపాదం దాకా మలబారులోని ఈ జాతులవారు తమ కూతురుకు నంబూతిరితో సంబంధం ఉందంటే గర్వించదగిన విషయంగా భావించేవారు.........

నేడు విద్యావంతులైన నాయర్లకు ఇది నచ్చకపోయినప్పటికి, ఇలాంటి వివాహాలుఇప్పటికీ జరుగుతూ నేడున్నాయి. కొత్తచట్టం ఒకసౌకర్యాన్నికూడ కలిగించింది—నంబూతిరి తండ్రి ఆస్తిలో అతని బ్రాహ్మణేతర కుమారునికికూడ హక్కు ఉంటుంది. నేడుకూడ ఇలాంటి సంబంధాలు ఎందుకు ఉంటున్నాయని అడుగగా, ఒక ఉన్నితిరి యువకుడు ఇలా చెప్పాడు : వాటి ప్రభావం నేటికీ ఉంది. ఉన్నితిరిజాతిలో

కూడ ఒక విచిత్రమైన సంప్రదాయం ఉంది. కన్యను ఏ నంబూతిరి (బ్రాహ్మణుడు) అయినా తనభార్యగా చేసుకొంటే సరే, లేకపోతే ఆమెను తిన్నగా ఇతర ఉన్నితిరి కుటుంబంలోకి ఇచ్చి పెళ్ళిచేయడానికి వీలుఉండదు. ఆమె మొదట తనజాతికంటె పై అంతస్థుకు చెందిన తిరుఅప్పడ్ జాతిలో ఏదో ఒక మగవానిని నాలుగురోజులదాకా వివాహం చేసుకోవలసిఉంటుంది. ఈడువచ్చిన ఆడపిల్లకే వివాహం చేస్తారు. అమె నాలుగురోజులు రాత్రింబగళ్ళు ఒక గదిలో ఆ మగవానివద్ద ఉంటుంది. తర్వాత తిరుఅప్పడ్ మగవాడు కానుకలు తీసుకొనివెళ్ళిపోతాడు. అప్పుడు ఆ కన్యను ఎవరో ఒక ఉన్నితిరికి ఇచ్చి వివాహంచేస్తారు. అదృష్టవశాత్తునగాని, దురదృష్టవశాత్తునగాని తిరుఅప్పడ్ కుటుంబాలు చాలా తక్కువగా ఉన్నాయి. ఇలాంటి సంబంధాలకోసం దూరప్రాంతాలకు వెళ్ళవలసివస్తుంది. ముక్కుబడి చెల్లించడానికి ఎక్కువభాగం ముసలి తిరుఅప్పడ్‌లే దొరుకుతారు. "ఈ సంప్రదాయాన్ని ఎందుకు ఎత్తివేయకూడదు?" అని అడుగగా, ఆ యువకుడు ఇలా జవాబిచ్చాడు: ముసలివారు వ్యతిరేకిస్తారు. వారికంటె ఎక్కువగా నంబూతిరులు వ్యతిరేకిస్తారు. నంబూతిరులకు ప్రత్యక్షంగా జరిగే నష్టాలేమీ ఉండవు. కాని ఒక ఇటుక కదిలిస్తే, భవనమంతా కూలిపోతుందని వారిభయం. కరివెల్లూరులో ఇద్దరు ఉన్నితిరి సోదరీమణులు ఇద్దరూ నంబూతిరుల భార్యలుగా ఉండేవారు. వారికి తల్లి-తండ్రి-సోదరుడు ఎవరూ లేరు. ఇల్లు తప్ప మరే ఆస్తీలేదు. ఒక నంబూతిరి తనభార్యకు,

బిడ్డలకు ఇంతో అంతో ఇచ్చేవాడు. కాని రెండో నంబూతిరి కొద్దిరోజులతర్వాత తనజాతిలోకూడ పెళ్ళిచేసుకొన్నాడు. అతనికి ఆస్తికూడ ఉండేది. కాని తన ఉన్నితిరి భార్య, బిడ్డలవిషయం ఏమీ పట్టించుకొనేవాడు కాదు.

రాహుల్జీ కరివెల్లూరులో కమ్యూనిస్టుకార్యకర్తలను, వివిధవర్గాల ప్రజలను కలుసుకొన్నారు. ఆ రాత్రి ఏర్పాటు చేయబడిన సాంస్కృతిక కార్యక్రమాలను చూశారు. మరునాటి సాయంకాలం బయలుదేరారు. కాలికట్ మీదుగా చెరుత్తురి గ్రామానికి వెళ్ళారు. కేరళమహాకవి కీ. శే. నారాయణమీనన్ వల్లథోల్ ఇక్కడే ఉండేవారు. రాహుల్జీ వెళ్ళినప్పుడు ఆయన ఇంట్లో లేరు. సాయంకాలానికి తిరిగి వచ్చారు. ఇద్దరూ కాస్సేపు మాట్లాడుకొన్నారు. వల్లథోల్ కుమారులలో ఇద్దరు కమ్యూనిస్టుపార్టీ సభ్యులుగా ఉండేవారు.

రాహుల్జీ ఆ మరునాడు కాలికట్ మీదుగా బెంగుళూరుకు వెళ్ళారు. ఇక్కడ రెండురోజులు మాత్రమే ఉండదలచుకొన్నారు. పల్లెటూళ్ళకు వెళ్ళడానికి ఆయనకు అవకాశం లభించలేదు. ఆయన కర్ణాటక కమ్యూనిస్టునాయకుడు ఉపాధ్యాయను కలుసుకొన్నారు. సాయంత్రం సినిమా చూడటానికి వెళ్ళారు. నగరంలో ముప్ఫయిదాకా సినిమా థియేటర్లు ఉండేవి. కాని వాటిలో ఎక్కువగా హిందీసినిమాలే చూపించేవారు. "పంతులమ్మ" అనే తెలుగుసినిమా ఆడుతున్నట్లు తెలిసింది. నాట్యాచార్య కుమార్‌తో కలిసి [illegible] అక్కడకు వెళ్ళారు. కేరళలోవలె ఇక్కడకూడ

హిందీ సినిమాలపై మోజు ఎక్కువవుతున్నట్లు ఆయన గ్రహించారు. "హిందీ సినిమాలద్వారా హిందూస్తానీ సంగీతం, వేష, భాషలు దక్షిణదేశంపై విజయం సాధించాయి. దక్షిణదేశంలో అశోక, సముద్రగుప్తులకు క్షణిక సాఫల్యం లభించింది. హర్షవర్ధనుడు ఓటమిపొంది పారిపోవలసివచ్చింది. కాని మా సినిమాతారలు తమ సౌందర్యం, వేషభూషలు, హావభావం, కోకిలకంఠంద్వారా దక్షిణదేశాన్ని మురిపింపజేశారు. ఈ విజయం మా దక్షిణాది సోదరులకు కోపకారణం కాదనుకొంటాను" అని రాహుల్జీ అన్నారు.

మరునాడు "వార్త" (దినపత్రిక) కార్యాలయంలో కన్నడ సాహిత్యవేత్తలతో ఇష్టాగోష్ఠి చర్చలు జరిపారు. అక్కడకు వచ్చినవారిలో ఎక్కువమంది అభ్యుదయ రచయితలు. రాహుల్జీ సమావేశంనుండి తన బసకు తిరిగి వెళ్ళుతున్నారు. దారిలో ఒకచోట ఇరవై మందిదాకా గుమికూడిఉన్నారు రాహుల్జీ వారి మధ్యదూరి వెళ్ళుచుండగా, "ఫుట్" అని ఏదో ధ్వని వినిపించింది. తన జేబు తడవుకొనిచూశారు. షెఫర్ ఫౌంటెన్ పెన్ మాయమైంది. వెనక్కు తిరిగిచూడగా, ఒక కుర్రవాడు పారిపోతున్నాడు. ఇతరులు వానిని వెంబడించి పట్టుకొన్నారు. కాని వాడు అప్పటికే వేరొకరిచేతికి పెన్ను అందించాడు. వానిని పోలీస్ స్టేషన్ దాకా తీసుకువెళ్ళారు. కాని ఇదంతా వట్టిప్రయాస అని, ఇక పెన్ను దొరకదని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. ఆ షెఫర్ ఫౌంటెన్ పెన్నుతో

ఆయన నాలుగు అయిదు వేలపేజీలుగల పుస్తకాలు వ్రాశారు. అందుచేత పెద్ద నష్టమేమీ కలుగలేదని సంతృప్తి చెందారు. జేబులో కనపడేట్లు ఫౌంటెన్ పెన్ పెట్టుకొంటే, చోరీ అయ్యే ప్రమాదం ఉందని ఆయనకు అదివరకే తెలుసు. బయటికి వెళ్ళేటప్పుడు ఫౌంటెన్ పెన్ను లోపల పడవేసేవారు. కాని ఈ సారి ఎందుకో అలాచేయలేదు.

## బొంబాయి పయనం

రాహుల్జీ ఏప్రిల్ 6వ తేదీన బొంబాయి చేరుకొన్నారు. కమ్యూనిష్టుపార్టీ కార్యాలయంలో మకాం పెట్టారు. సర్దార్ పృథ్వీసింగ్ జీవితచరిత్ర వ్రాయసంకల్పించారు. కాని ఆయన ఆంధ్రనుండి ఇంకా తిరిగిరాలేదు. తారా శంకర వందోపాధ్యాయ రచించిన "పంచగ్రామ్," "మన్వంతర్" అనే నవలలను చదివారు. ఈ పర్యాయం సర్దార్ పృథ్వీసింగ్ జీవితచరిత్రతోబాటు "హిందీకావ్యధార," "పలాయనంవద్దు, పరివర్తన చేయి," "జయయౌధేయ" అనే గ్రంథాలు వ్రాయాలని ఆయన మనస్సుకు తట్టింది. అయితే వెంటనే ఇంత పెద్దపని పెట్టుకొనే ధైర్యం లేకపోయింది. త్వరలో పాస్‌పోర్టు దొరికితే, ఈ పని అసంపూర్తిగా ఉండిపోతుందని భయం.

రాహుల్జీ ఏప్రిల్ 24వ తేదీన "సర్దార్ పృథ్వీసింగ్" జీవితచరిత్ర వ్రాయించడం మొదలుపెట్టారు. జౌనపుర్ జిల్లాకు చెందిన యువకుడు ఠాకుర్ భగవాన్‌సింగ్ చాలా పట్టుదలతో వ్రాశాడు.

ఎన్నో చిక్కులు పెట్టినతర్వాత, ప్రభుత్వం రాహుల్జీకి ప్యాస్‌పోర్టుఇచ్చింది. కొద్దిరోజులతర్వాత విదేశమారక ద్రవ్యంకూడ లభించింది. కాని ఇరాన్ 'వీసా'కు అనుమతి ఎప్పుడు లభించేదీ తెలియలేదు. ఈ ఖాళీ సమయాన్ని పుస్తకాలు వ్రాయడంలో వినియోగించాలని రాహుల్జీ నిశ్చయించుకొన్నారు. అంధేరీలో ఉన్న సర్దార్ పృధ్వీసింగ్ ఇంటికి వెళ్ళి అక్కడే పుస్తకరచన చేశారు.

## కనేరీగుహల సందర్శన

అంధేరీకి కొద్దిమైళ్ళదూరంలో కనేరీ(లేనా)గుహలు ఉన్నాయి. రాహుల్జీ మే నెల 10వ తేదీన అక్కడకు వెళ్ళారు. అజంతా, ఎల్లోరాలలోకూడ చాలాగుహలు, కొండలను తొలచి తయారుచేయబడినవే. ఎల్లోరాలో కొన్ని రెండంతస్థుల, మూడంతస్థుల భవనాల వలెకనిపిస్తాయి. కాని అక్కడ గుహలన్నీ వరుసగా ఒకేచోటఉన్నాయి. అయితే కనారీలో గుహలసంఖ్య వందకుపైగా ఉంటుంది. అవన్నీ ఒక మైలుదూరంలోపల ఉన్నాయి. అవి కొండలో చెల్లాచెదురుగాఉన్నాయి. మూడోనంబరు గుహ ఒక విశాలమైన చైత్యశాల. కార్లాలోని చైత్యశాలకంటె ఎంతోపెద్దది. ఇక్కడ నివసించే భిక్షువులు పూజాసమయంలో ఈ చైత్యశాలలో సమావేశమయ్యేవారు. శాలయావత్తూ, కొండ తొలచి నిర్మింపబడిందే. ద్వారానికి ఎడమవైపున ఇద్దరు రాజుల, ఇద్దరురాణుల కుడ్యచిత్రాలు ఉన్నాయి. రాజుల శరీరం పుష్టికలిగి, అందంగాఉంది. రాణులముఖంపై సౌంద

ర్యానికితోడు నిర్భీతి, స్వేచ్ఛాభావం గోచరిస్తాయి. బయట ఉన్న రెండు స్తంభాలపై క్రీస్తుశకం రెండో శతాబ్దంనాటి లిపిలో విశాలమైన శిలాశాసనం ఉంది. అది అక్కడక్కడ చెడి పోయింది. ఈ గుహను ఎవరో శాతవాహన రాజు నిర్మించాడని రాహుల్జీ అభిప్రాయం. బయట రెండు సింహ స్తంభాలు ఉన్నాయి. అన్నిటికంటె బయట ఒక విశాలమైన మైదానం ఉంది. అక్కడ నాలుగైదువేలమంది కూర్చోడానికి వీలు ఉంది. ఈ గుహకు కుడివైపున మరో అసంపూర్ణమైన చైత్య శాల ఉంది. దానికి కొద్దిదూరంలో ఒకటోనంబరు గుహ ఉంది. భిక్షువుల నివాసానికై దానిని ఉపయోగించేవారు.

రాహుల్జీ ముందుకు వెళ్ళారు. గుహలలో అటూ ఇటూ తిరిగారు. కొండలలో వాగులు కనిపించవు. యాత్రికులు దప్పికతో బాధపడవలసివస్తుంది. అయితే 1800 ఏళ్ళ క్రితం భిక్షువులు మంచినీటికి చాలా చక్కనిఏర్పాటు చేశారు. అన్ని గుహలక్రిందనీటితొట్టెలు, కాలువలు త్రవ్వారు. వర్షపునీరంతా కాలువలగుండా ఈ తొట్టెలలోకి ప్రవహిస్తుంది. ఆ కాలంలో ఇక్కడ వెయ్యి, పన్నెండువందలమంది నివసించేవారు. రోజూ స్నాన పానాలకు ఎంతో ఖర్చయినా, నీటికొరత ఉండేదికాదు. మొదట రాహుల్జీ ఒక నీటితొట్టెవద్ద కూర్చుని, నీటి నల్లనిరంగును చూశారు. ఇది త్రాగడానికి పనికిరాదనుకొన్నారు. కాని లోటాలోకి నింపుకొని చూడగా, చాలా శుభ్రంగా కనిపించింది. దీనితో పాటు నీరు చాలా చల్లగాకూడఉంది. ఎండాకాలంలో అలసి సొలసి, దప్పికగొనివచ్చే యాత్రికునికి ఈ నీరు అమృత

తుల్యంగా ఉంటుంది. నేటికీ ఇక్కడకు వందలాది యాత్రి కులు వచ్చిపోతున్నారు. ఈ అమృతాన్ని త్రాగి, ఆ భిక్షువు లకు కృతజ్ఞత వెల్లడిస్తున్నారు. ఎల్లోరా, అజంతా మొద లైన గుహాలలోకూడ మంచినీటికి ఏర్పాట్లుచేశారు. కాని ఇలా అడుగడుగునా, ఇంత చక్కనిఏర్పాటు ఎక్కడా లేదు. 34 నంబరుగుహ పైకప్పులో నేటికీ కొన్ని రంగురంగులబొమ్మలు వున్నాయి. దీనినిబట్టి లోగడగుహాలగోడలు, పైకప్పులు అంద మైనబొమ్మలతో నిండిఉన్నట్లుతోస్తుంది. ఇక్కడశాతవాహన గౌతమీపుత్రుని కాలంనాటి ఒకశాసనంఉంది. కుర్చీపైన కూర్చుండిగాని, నిల్చునిగాని, ధ్యానమగ్నుడైగాని ఉన్నట్లు బుద్ధునిబొమ్మలెన్నో కనిపిస్తాయి. 79 నంబరు గుహాలో బయటికి తెరచుకొన్న ముంగిలి, రాతిని తొలచి తయారుచేయ బడింది. ఇరుప్రక్కల కూర్చోవడానికి సన్నని అరుగులు ఉన్నాయి. కుడివైపున జలకుండం ఉంది. ఎడమవైపున ఉన్నది బహుశా వంటగది. రెండు స్తంభాలు, మూడు ద్వారాలుగల వరండా ఉంది. తర్వాత ఒకద్వారం ఉంది. దానికి ఒకప్పుడు తలుపు ఉండేది. తర్వాత విశాలమైన సంఘశాల ఉంది. దానికి రెండువైపుల సన్నని అరుగులు ఉన్నాయి. ఎడమవైపున రెండుగదులు ఉన్నాయి. వాటికి ఒకప్పుడు తలుపులు ఉండేవి. గోడలకు ఇప్పటికీ అక్క డక్కడ దట్టమైనసున్నపుపూత కనిపిస్తుంది. వరండాలో కుడి వైపున కుర్చీపై బుద్ధుడుఆసీనుడైనాడు. అతనికి ఎడమప్రక్క అవలోకితేశ్వర, మరెవరో దేవియొక్క కుడ్యచిత్రం ఉంది. 67 నంబరు గుహ ఉత్తరాభిముఖంగా ఉంది. ఇక్కడనుండి

సముద్ర, పర్వతదృశ్యాలు చాలా అందంగా కనిపిస్తాయి. దీని బయటకూడ రాతిని తొలచి ముంగిలి తయారుచేయబడింది. దీనికి రెండువైపుల సన్నని అరుగులు ఉన్నాయి. ఒకవైపున జలకుండం ఉంది. వరండాలో నాలుగు స్తంభాలు ఉన్నాయి. దీనికి మూడువైపులగల గోడలపై బొమ్మలను చెక్కారు. వాటిలో ఎక్కువభాగం బుద్ధునివే. అతడు చాలాచోట్ల కుర్చీపైనే కూర్చుని ఉన్నాడు. కుడివైపున గోడపై అవలోకితేశ్వరునిబొమ్మ, దానితోబాటు ఇద్దరుస్త్రీల బొమ్మలు ఉన్నాయి. ఈమూడుబొమ్మలు చాలా అందంగా ఉన్నాయి. గుహ్మంలోపలికి ప్రవేశిస్తే, వర్గాకారంలోగల ఒక హాలు (శాల) కనిపిస్తుంది. దీనికి నలువైపుల గోడల నిండా బొమ్మలే ఉన్నాయి. అవి అందంగా ఉన్నాయి.

కనేరీలో బుద్ధునితర్వాత అవలోకితేశ్వరుని బొమ్మలే ఎక్కువగాఉన్నాయి. ఇదిచాలా మహత్తరమైనబౌద్ధకేంద్రం అయి ఉంటుందని రాహుల్జీ అభిప్రాయం. శాతవాహన రాజులు నాసిక, తదితర గుహాలలోని భిక్షువులకు చాలా దానాలు చేశారు. పెద్ద చైత్యశాలవారిచే దానంగా ఇవ్వబడినట్లు కనపడుతుంది. కాని రెండు మూడు శతాబ్దాల తర్వాతకూడ శిలాహారరాజవంశం బౌద్ధసంఘాన్ని బాగా పోషించింది. పది పదకొండు శతాబ్దాలలోకూడ ఇక్కడ భిక్షువులు ఉండేవారని రాహుల్జీ అభిప్రాయం. రెండోశతాబ్దంలో అవలోకితేశ్వరునివంటి మహాయాన బోధిసత్వల బొమ్మలను తయారుచేయడం మొదలుపెట్టారని ఖచ్చితంగా రుజువుకాదు. అయితే అవలోకితేశ్వరుని బొమ్మలే ఇక్కడ

ఎక్కువగా ఉన్నాయి. కైలాసంలోని శివునివలె అవలోకి తేశ్వరుని నివాసస్థానంగా ప్రసిద్ధిచెందిన పోతలకపర్వతం ఇదేనేమో అని రాహుల్జీ అనుమానం. లాసాలో దలై లామాయొక్క సుప్రసిద్ధ పోతలకభవనం ఈ సుప్రసిద్ధ పోతలకపర్వతం పేరుతోనే నిర్మింపబడింది.

## గ్రంథ రచన

రాహుల్జీ మార్చి 5 వ తేదీనాటికే పృథ్వీసింగ్ జీవిత చరిత్రను రచించడం పూర్తిచేశారు. "వీసా" కోసం మరి కొద్దిరోజులు ఎదురుచూశారు. కాని "వీసా" వచ్చే జాడ కనిపించలేదు. అందుచేత "హిందీ-కావ్యధార"ను రచించడం మొదలుపెట్టారు. మునిజినవిజయం కృషిఫలితంగా భారతీయవిద్యాభవనంలో ప్రాచీన హిందీ (అపభ్రంశ) సాహిత్యం తగినంత ఉండేది. రాహుల్జీ మార్చి 18వ తేదీన అక్కడకే వెళ్లారు. ప్రాచీనకావ్యాలను తిరగవేశారు. అందులో ఎనిమిదోశతాబ్దానికిచెందిన మహాకవి స్వయంభూ రామాయణం (పఉమ-చరిఉ) ఒకటి. దానిని చదువుతూ, తాను ఇంతటిమహాకవిపేరైనా వినలేదని రాహుల్జీకి ఆశ్చర్యం కలిగింది. సూరదాసు, తులసీదాసులను దృష్టిలో ఉంచుకొన్నప్పటికీ, గత పదమూడువందలసంవత్సరాలలో హిందీ కావ్యరంగంలో స్వయంభూతోసాటి రాగల కవి ఎవరూ పుట్టలేదని, భారతీయవాఙ్మయంలోని పన్నెండుగురు కవి సూర్యులలో స్వయంభూ ఒకడని ఆయన అభిప్రాయం. రాహుల్జీ ఇంకా వెదకగా, క్రీ. శ. 760 నుండి 1300 దాకా

45 మందికి పైగా కవులు దొరికారు. కాని వారిభాష ఎంత ప్రాచీనమైనదంటే, సహాయం అందజేసినప్పటికీ పాఠకులకు అర్థంకావడం కష్టమనిపించింది. ఇలా నెలరోజులు పరిశ్రమ చేసేప్పటటికి రాహుల్జీకి కడుపులో నొప్పిపుట్టింది. ఆయనకు బొంబాయిలో ఉండే ఇష్టంలేదు. కాని "హిందీ-కావ్యధార"ను పూర్తిచేయడం అవసరం. అందుచేత మరో రెండువారాలు ఇక్కడే గడిపారు. ఆ పని పూర్తిచేశారు.

తర్వాత జూలై 11 వ తేదీన ప్రయాగకు బయలుదేరారు. ఆయనస్నేహితులు స్టేషన్‌దాకా వచ్చారు. వారు ప్లాట్‌ఫారంపైకి వచ్చిన రైలుబండిలో కూర్చున్నారు. కాని రాహుల్జీ ఆ పెట్టెలోకి వెళ్ళడానికే సందులేకుండా జనం ఎగబడ్డారు. చివరికి ఆయన ఏదోవిధంగా తనస్థానంలోకి వెళ్ళారు. తీరా చూస్తే తనసందూకా లేదు. దానిలోపలే "హిందీ-కావ్యధార" హస్తలిఖితప్రతి ఉంది. ఆయన చాలా చింతించారు. ఎంతోసేపు వెదకగా, అది ఒకమనిషి కాళ్ళకింద కనిపించింది. రాహుల్జీ ఆ రోజంతా తనస్థానం వదలిపెట్టకుండా కూర్చోవలసివచ్చింది. చివరికి టీ తీసుకోవడానికికూడ అవకాశం లభించలేదు.

రాహుల్జీ లంకకు వెళ్ళకపూర్వం రీజ్ డేవిడ్స్‌గ్రంథాలలో వైశాలిగణాన్నిగూర్చి చదివారు. భారతదేశంలో ఒకప్పుడు ప్రజాస్వామ్యం ఉండేది. రాజు లేకుండానే పరిపాలన జరిగేది. కాని ఈ విషయం కాలగర్భంలో కలసిపోయింది. ఈ శతాబ్దప్రారంభంలో కొందరు యూరోపీయ, భారతీయపండితులు లిచ్ఛవి (వైశాలి), మల్ల మొదలైన

రాజ్యానికి చక్రవర్తి + ప్రజాతంత్ర రాజ్యాలు



ప్రజాతంత్రరాజ్యాలనుగూర్చి వ్రాస్తే, ఎవరూ మొదట్లో నమ్మలేదు. "రాజు లేకుండానే పరిపాలన ఎలాసాధ్యం?" అని ప్రశ్నించారు. ప్రజతంత్ర రాజ్యాలపేర్లు నాణెములలోను, ప్రాచీన శిలాశాసనాలలోను, పాళీపుస్తకాలలోను, ఇంకా కొన్ని గ్రంథాలలోను కనిపించాయి. రాహుల్జీ లంకలో ఉన్నప్పుడు, త్రిపిటక గ్రంథాలు అనేకం తిరగవేయగా, బుద్ధునికాలంనాటి ప్రజాతంత్రరాజ్యాలు ప్రత్యక్షమైనాయి. ఈ ప్రజాతంత్రరాజ్యాలు ఇతర భారతీయులకుకూడప్రత్యక్షమయ్యేట్లు చేయాలని రాహుల్జీ అనుకొన్నారు. అందుచేత లిచ్ఛవి (వైశాలి) గణాన్ని తీసుకొని, రెండేళ్ళక్రితమే "సింహాసేనాపతి" అనే నవలవ్రాశారు అంతకుపూర్వం తాను "వోల్గానుండి గంగ వరకు" అనేపుస్తకంలో "సువర్ణ యౌధేయ" కథ వ్రాసేటప్పుడుకూడ ఈ ప్రజాతంత్ర రాజ్యాన్ని తీసుకుని ఒక నవలవ్రాయదలచారు. నవలకు ఎన్నుకొన్న ఇతివృత్తం సముద్రగుప్త, చంద్రగుప్త విక్రమాదిత్యుల కాలానికి సంబంధించింది. ఆకాలానికి సంబంధించిన సాహిత్య, పురాతత్వసామగ్రిని అధ్యయనం చేసేటప్పుడు, సువర్ణ యౌధేయ కాలాన్నిగూర్చి తనకు ఏర్పడిన భావాలు సరిఅయినవి కావేమోనని రాహుల్జీకి అనిపించింది. ఎందుకంటె సముద్రగుప్తుడు సువర్ణ యౌధేయ గణాన్ని నాశనం చేశాడనే అభిప్రాయం కలిగిఉన్నారు. కానిఇప్పుడు, వస్తుతః చంద్రగుప్త విక్రమాదిత్యుడు ఈ ఘన (!) కార్యం చేశాడనే నిశ్చయానికి వచ్చారు.

సామగ్రిని సేకరించుకోవడానికి కొంతకాలం పట్టింది.

తిరిగి ఇప్పుడు ఎవరైనా లేఖకుని వెదకోవలసిన సమస్య ఎదురైంది. రాహుల్జీ జైలులో ఉండగా ఆరు బృహద్గ్రంథాలు, ఎనిమిది చిన్ననాటకాలు స్వయంగా వ్రాశారు. అయితే అక్కడ గత్యంతరంలేక తానే వ్రాశారు. పైగా తాను వ్రాయడం కంటె, ఇతరులతో వ్రాయిస్తే పని చాలా త్వరగా జరుగుతుందని ఆయన అభిప్రాయం. త్వరగా వ్రాసేవాడు దొరికితే నాలుగైదురోజులలోనే "జయయౌధేయ" రచనను పూర్తిచేయగలనని ఆయన నమ్మకం. ఇలా ఉండగా సత్యనారాయణ దూబే అనువతడు హఠాత్తుగా ప్రయాగకువచ్చాడు. రాహుల్జీ అతనిచేత మొదట "జయయౌధేయ" వ్రాయించారు. 'వీసా' వచ్చిన వెంటనే, రష్యాకు బయలుదేరాలనే ఉద్దేశంకూడ ఒకవైపు ఉంది. దూబే కొంచెం నిదానంగా వ్రాసినందువల్ల 21 రోజులలో (జూలై 26 నుండి ఆగస్టు 16 కు నవల పూర్తిఅయింది.

మరునాడే ఇంకో పుస్తకం మొదలుపెట్టించారు. "పలాయనంవద్దు, పరివర్తనచేయి" అనేది పుస్తకం పేరు. పామరులకు అర్థమయ్యేభాషలో ఈపుస్తకాన్ని రచించారు. పన్నెండురోజులలో ఈపని పూర్తిఅయింది.

రాహుల్జీ "నాజీవనయాత్ర" అనే గ్రంథాన్ని క్రీ. శ. 1940 లో వ్రాయడం మొదలుపెట్టారు. కాని కొన్ని అనివార్య కారణాలవల్ల అది ఆగిపోయింది. ఇప్పుడు అందుకు తిరిగి అవకాశం లభించింది. ఇరాన్నుండి "వీసా" వచ్చేజాడ కనిపించలేదు. అందుచేత దూబేచేత "నాజీవనయాత్ర" ఇప్పటివరకు వ్రాయించి పూర్తిచేశారు.

రాహుల్జీ 'వీసా' కోసం ఇరాన్ ప్రభుత్వానికి ఇదివరకే రెండు టెలిగ్రాములు, ఎన్నో జాబులు వ్రాశారు. ఎట్టకేలకు 1944 సెప్టెంబరు 29 వ తేదీన "వీసా" వచ్చింది.

లెనిన్‌గ్రాడ్ నుండి లోల మార్చి 11 వ తేదీన వ్రాసిన జాబు ఇప్పుడు అందింది. అందులో ఇలా ఉంది:

"ఈగర్ 1942 జనవరి 15 నుండి మా ఇంటివద్దఉన్న సార్వజనిక శిశుసదనానికి వెళ్ళుతున్నాడు... మొదట్లో నేను విశ్వవిద్యాలయ పుస్తకాలయ ప్రాచ్యవిభాగం యొక్క డైరెక్టరుగా ఉండేదానిని. తర్వాత విశ్వవిద్యాలయ పుస్తకాలయాని కంతటికి నన్ను డైరెక్టరుగా చేశారు. నాకు విశ్వవిద్యాలయంలో వేరుగా ఒక ఇల్లు దొరికింది. ఇప్పటి ఇంటికి రానడం సాధ్యంఅయ్యేదికాదు. అప్పుడు ఈగర్ వాసిలియేల్‌స్కీ ఓస్త్రోవ్‌స్కీ సార్వజనిక శిశుసదనానికి వెళ్ళేవాడు......వాడు దగ్గుతో జబ్బుపడ్డాడు...ఏప్రిల్ మొదటి తేదీనుండి నేను సార్వజనిక పుస్తకాలయంలో పని చేస్తున్నాను. మా పాత ఇంటిలో ఉంటున్నాను. ఈగర్ కూడ మొదటి శిశుసదనానికి వెళ్ళుతున్నాడు...ఈ చలి కాలంలో వాడు జబ్బుపడ్డాడు...అయినప్పటికి బలహీనంగా లేడు. వాడు చాలా అందంగాఉన్నాడు. దానితో బాటు చాతుర్యం, గాంభీర్యం, మనోరంజకత్వం గల పిల్లవాడు. వాడు ఎంత ఆకర్షణీయమైనవాడో మీరు ఎప్పుడైనా ఊహిస్తున్నారా? వానికి తనతండ్రి అంటే చాలా ప్రేమ. మీవద్దకు రావడానికి చాలా ఉత్సాహంతో ఎదురు చూస్తున్నాడు. 'నాన్న ఎన్నిరోజులకు వస్తాడు?' అని

రోజూ అడుగుతున్నాడు. నేను కోపంగా ఉన్నప్పుడు, "నిన్ను వదలిపెట్టి భారతదేశానికి వెళ్ళిపోతాను. నీవు నాపట్ల ఏవిధంగా ప్రవర్తించేదీ నాన్నకు చెబుతాను" - అంటాడు. ఇంకో విషయం ఆలోచించండి- వాడు తన బొమ్మలన్నిటినీ భారతదేశానికి తీసుకుపోతాడట. భారతదేశానికి వెళ్ళడానికై వాడు శిశుసదనం డైరెక్టరును, నన్నుకూడ ఆహ్వానించాడు... నేను మీ జాబుకోసం చాలా ఉత్సాహంతో ఎదురుచూస్తున్నాను. 1943 సెప్టెంబరులో మీరు "కోక్స్" ద్వారా పంపినజాబు అందింది. నన్ను టాష్కెంట్ వెళ్ళమని, అక్కడ మనంకలుసుకోగలమని మీరు వ్రాశారు. కాని మీరు లెనిన్‌గ్రాడ్ రావడమే మంచి దనుకొంటున్నాను. లెనిన్‌గ్రాడ్ ముట్టడిని తుద ముట్టించాము... లెనిన్‌గ్రాడ్ రక్షణలో పాల్గొన్నందుకు నాకు ఒక బిరుదు ఇవ్వబడింది. ఇందుకు మీరు నన్ను అభినందించగలరని అనుకుంటున్నాను......"

# పన్నెండో అధ్యాయం

## రష్యాకు ప్రయాణం

రాహుల్జీకి ఇరాన్ మీదుగా రష్యా వెళ్ళడానికి 'వీసా' లభించింది. బొంబాయిలో కొన్ని వస్తువులు కొనుక్కొని, అక్కడనుండే వెళ్ళాలని నిశ్చయించారు. ఇరాన్‌లో ఇరవై పౌనులు, రష్యాలో కేవలం వందపౌనులు, ఖర్చు చేసుకోవడానికి లభ్యమైనాయి. రాహుల్జీ నాలుగైదు తులాల బరువుగల ఉంగరం, గడియారంగొలుసు బొంబాయిలో ఖరీదు చేశారు. సామాను బరువు వీలైనంత తగ్గించుకొన్నారు. అయినప్పటికీ పుస్తకాల బరువే మణుగుకుపైగా ఉంది.

బొంబాయిలో అక్టోబరు మూడోవారంలో అన్నీ సిద్ధం చేసుకొన్నారు. ఇదే సమయంలో విరేచనాలు పట్టుకొన్నాయి. అయితే డాక్టర్ల శ్రద్ధ, మిత్రుల తోడ్పాటువల్ల రెండురోజులలోనే జబ్బునయమైంది. రాహుల్జీ బలహీన స్థితిలో ఉన్నప్పటికీ, వెళ్ళడానికి సిద్ధమైనారు.

అది యుద్ధకాలం. రైలులో స్థలం దొరకడం తేలికైనపనికాదు. అయినప్పటికి రాహుల్జీకోసం అక్టోబరు 27 వ తేదీన అహమ్మదాబాద్ రైలులో రెండోతరగతి సీటు రిజర్వు చేయించారు. బొంబాయినుండి రైలు రాత్రి ఎనిమిది గంటలకు బయలుదేరింది. ఎంతోమంది సహచరులు వీడ్కోలు ఇవ్వడానికై స్టేషన్‌దాకావచ్చారు. వారి రెడ్‌సెల్యూట్

లను, నినాదాలను ప్రయాణీకులు ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయారు.

రైలు అక్టోబరు 28 వ తేదీ ఉదయమే అహమ్మదాబాద్ స్టేషన్ చేరుకొన్నది. అక్కడకూడ ఎంతోమంది సహచరులు ఆయనకు స్వాగతం- వీడ్కోలు ఇవ్వడానికివచ్చారు. రాహుల్జీ దుర్బలస్థితిలో ఉన్నారు. కఠినపథ్యం పాటిస్తున్నారు. ఆయన అక్కడదిగి,సింధుప్రాంతానికివెళ్లే హైద్రాబాద్రైలులో కూర్చున్నారు. మధ్యమధ్య చాలా స్టేషన్ల వద్ద ఆయన సహచరులు కనిపించారు.

ఆరాత్రి అంతా రైలు మార్వాడీ ఇసుకఎడారిలో పయనించింది. పగటిపూట ప్రయాణంచేస్తే రాహుల్జీకి చాలా కష్టంగా ఉండేది. ఉదయం సింధురాష్ట్రంలో ప్రవేశించారు. ఇక్కడ పొదరిళ్ళతోబాటు ఇసుక దిబ్బలుకూడ కనిపించాయి. ఆప్రాంతంలో కాలువలుకూడ ఉన్నాయి. కాని జనసంఖ్య తక్కువైనందువల్ల వాటిని పూర్తిగా ఉపయోగించుకొన్నట్లు కనపడలేదు. అయితే సింధునదిని సమీపించేకొద్దీ కొత్తబస్తీలు, ఈజిప్టుప్రత్తిచేలు ఎక్కువగా కనిపించాయి.

మధ్యాహ్నం ఒంటిగంటకు రైలు హైద్రాబాద్ చేరుకొన్నది. ఇక్కడ బండి మారుతుంది. రెండోతరగతిపెట్టె ఎక్కడా కనిపించలేదు. రాహుల్జీ ఇంటర్క్లాస్పెట్టెలో కూర్చున్నారు. విశాలమైన కాలువలు, సిమెంటు కొండలలో దాల్మియామిల్లు ప్రత్యక్షమైనాయి. సాయంత్రం ఆరుగంటలకు రోహడీ స్టేషన్ చేరుకొన్నారు. క్వెట్టాబండి మూడు

గంటలతర్వాతనే వెళ్ళుతుంది. అయితే రెండోతరగతి సీటు రిజర్వుచేయించమని టెలిగ్రాం ఇచ్చినా లాభం లేదనుకొన్నారు. క్వెట్టా దాటి రోజూ ఇరానకు రైలు వెళ్లేదికాదు. అందుచేత ఏమిచేయాలో రాహుల్జీకి దిక్కుతోచలేదు. ఒకవ్యక్తి ఆయనకు కనిపించి, "మూడురూపాయలు ఇవ్వండి. సీటు రిజర్వుచేయిస్తాను." అన్నాడు. రాహుల్జీ ఆపనే చేశారు.

రాహుల్జీ ఆమరునాడే బొలాన్కనుమదాటి క్వెట్టా చేరుకొన్నారు. ఆయన తెచ్చుకొన్న వస్తువులను కంట్రోలర్ ఆఫీసులో తనఖీ చేశారు. గ్రామఫోన్, కెమెరా మొదలైన కొన్నివస్తువులను వెంట తీసుకుపోవడానికి వీలులేదని అధికార్లు చెప్పారు. ఆ వస్తువులను ఎవరికి అప్పగించాలో రాహుల్జీకి తోచలేదు. భారతి అను మిత్రుడు క్వెట్టాలో ఉండేవాడు. రాహుల్జీ అతని ఇంటికివెళ్ళగా, ఆ సమయానికి లేడు. అతని ఇంట్లో చాల్లీ అనే వ్యక్తి కనిపించాడు. రాహుల్జీ తనవద్దఉన్న వస్తువులను అతనికి అప్పగించారు. వాటిని అమ్మి ఆడబ్బును బాలికాపాఠశాలకు ఇమ్మని చెప్పారు. కాని కెమెరాను ఎవరికీ ఇవ్వదలచుకోలేదు. అది పదేళ్ళుగా తనకు ఎంతో ఉపకరించిన వస్తువు. దానిని సర్దార్ పృథ్వీసింగ్కు పంపించమని చెప్పారు. కాని చాల్లీ ఆపని చేయలేదు.

మరునాడు రాహుల్జీ రైలుస్టేషన్కు వెళ్ళారు. ఇరాన్ వైపు వెళ్ళేరైలు సిద్ధంగాఉంది. రాహుల్జీకి రెండో తరగతి సీటు రిజర్వుచేయబడింది. కస్టమ్సుశాఖవారు అందరి వస్తువు

లను తనఖీ చేశారు. కాని రాహుల్జీని ఏమీ అడగలేదు. గూఢచారులు, కస్టమ్స్ శాఖోద్యోగులకు మధ్య మంచి దోస్తీ ఉంది. పోలీసులు రాహుల్జీని ఒకకంట కనిపెట్టి ఉన్నారు.

సాయంత్రం నాలుగుగంటలకు రైలు బయలుదేరింది. అది స్పైజంన్ దాటివెళ్ళిన తర్వాత ప్రొద్దుగూకింది. భారత దేశంనుండి బయటికి వెళ్ళడానికి ఇప్పటికైనా వీలు కలిగిందని రాహుల్జీ సంతృప్తి చెందారు. నవంబరు మొదటి తేదీ మధ్యాహ్నం నోక్కుండీ చేరుకొన్నారు. కస్టమ్స్ శాఖోద్యోగుల తనఖీ ఇక్కడ ముగుస్తుంది. అందుచేత రైలు నాలుగుగంటలసేపు ఆగింది. కస్టమ్స్ శాఖోద్యోగుల కనుగప్పేవారు రైలునిండా ఉన్నారు. ఉద్యోగులు తనఖీకోసం ఒకపెట్టెలో ప్రవేశిస్తే, మోసగాళ్లు వేరొకపెట్టెలోకి తప్పుకొంటున్నారు. గట్టి కాపలామూలంగా, రైలు పెట్టెలలోకి ప్రవేశించలేనివారు, రైలు కదిలేటప్పుడు ఎగబడుతున్నారు.

రైలు మందగమనంతో వెళ్ళింది. రాత్రి పదకొండు గంటలకు సరిహద్దుదాటి ఇరాన్ స్టేషన్ మిర్జావా చేరుకున్నది.

తర్వాత రాహుల్జీ కొద్దిరోజులకు సోవియట్ రష్యా చేరుకున్నారు. తన భార్యా బిడ్డలను కలుసుకొని, సంతోషించారు. అయితే డాక్టరు స్చేర్బాట్స్కీ లేని పెద్దవెలితి కనిపించింది. అతడు అదివరకే మరణించాడు. జాయస్వాల్ తర్వాత రాహుల్జీకి పరమఆప్తుడు అతడే.

*　　*　　*

రాహుల్జీ [illegible]
[illegible] స్వదేశ స్వాతంత్ర్య సంగతి
ఒక సంవత్సరమయినా ప్రజలకు తెలియదు

రాహుల్జీ సోవియట్ రష్యాలో కొంతకాలం ఉండి స్వదేశానికి తిరిగివచ్చారు. యథాప్రకారం స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. హిందూ-ముస్లిం ఐక్యతకోసం కృషి చేశారు. హిందీ-హిందూస్తానీ సమస్యపై కమ్యూనిస్టుపార్టీ దృక్పథం ఆయనకు నచ్చలేదు. అందుచేత పార్టీ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు.

## కిన్నర దేశంలో

రాహుల్జీ జీవితమంతా ఒక మహాయాత్రగానే ఉంటూ వచ్చింది. యాత్రలద్వారా తాను పొందిన అనుభవాలను పండిత, పామరులందరికీ పంచిపెట్టారు. దేశ స్వాతంత్ర్య సముపార్జనానంతరం— క్రీ. శ. 1948 మే - ఆగష్టు నెలలలో ఆయన హిమాచలప్రదేశ్ వెనకబడిన ప్రాంతంలో పర్యటించారు. ఇది కటూ, స్పతీ, పశ్చిమ టిబెట్, టెహరీగఢ్వాల్ మధ్యగలప్రాంతం. ఇదే "కిన్నర దేశ" మని రాహుల్జీ అభిప్రాయం.

కిన్నరదేశం హిమాచలంలోని ఒక రమణీయమైన ప్రాంతం. రాహుల్జీ ఒక గుర్రంపై మేనెల 14వ తేదీన రామపురానికి బయలుదేరారు. మరునాడు అక్కడికి చేరుకున్నారు. హైస్కూలు ఉపాధ్యాయులు ఆయనకు తేనేటివిందు చేశారు. దేశం స్వాతంత్ర్యంపొంది అప్పుడే సంవత్సరం గడచినా, ఈ ప్రాంతంలోని ప్రజలకు తెలిసినట్లు కనబడలేదు. రాహుల్జీ ఈ విషయాన్ని ప్రజలకు వివరించారు.

మహారాజు పద్మసింహుడు క్రితం సంవత్సరమే మరణించాడు. రాహుల్జీ రాజమాతను కలుసుకొన్నారు. ఆమె తన కష్టాలను రాహుల్జీతో చెప్పింది. సవతిమూలంగా ఆమె చాలా కష్టాలపాలైంది. మీకు ప్రభుత్వంనుండి సాలీనా కొన్ని వేల రూపాయలు భరణంవస్తుందని చెప్పి, రాహుల్జీ ఆమెను ఓదార్చారు. ఆయన చెప్పేదాకా ఆమెకు ఈ విషయం తెలియదు.

తర్వాత ప్రాచీన రాజధాని చిసీకి వెళ్ళారు. అక్కడ అద్మోలామా మకాం వేశాడు. అతడు ఇరవైఏళ్ళుగా పర్యటనచేస్తూ ఇక్కడకు వచ్చాడు. రాహుల్జీ ఒక మహా యాత్రికుడనేసంగతి అతనికి ఎలాగో తెలిసింది. అతడు రాహుల్జీని కలుసుకొని సంభాషించాడు. అద్మోలామా కొన్నేళ్ళు లాసావద్ద ఒక మఠంలో చదివాడు. కాని అతనికి చదువు రుచించలేదు అప్పటినుండి అతడు దేశపర్యటన చేస్తున్నాడు.

రాహుల్జీ ఇలాగే మరొక మంగోలు యాత్రికుని కలుసుకొన్నారు. అతనికికూడ విద్యపై ప్రత్యేకశ్రద్ధ లేదు. లాసామఠంలో కొద్దిరోజులు గడిపాడు. తర్వాత గ్యాంచీ వద్ద మూడేళ్ళు ఏకాంతధ్యానం చేశాడు. అతడు తిరిగి మంగోలుకు వెళ్ళదలచుకోలేదు. ఇలాగే పర్యటించాలని నిశ్చయించుకొన్నాడు. అతడు భారత బౌద్ధతీర్థాలలో పర్యటించడం ఇదే మొదలు. చలికాలంలో అతడు అమృత్సర్‌కు వచ్చాడు అప్పుడక్కడ మతకలహాలు జరుగుతూ ఉండేవి. అతనిని పోలీసులు అరెస్టుచేసి, రెండుమూడు

రోజులు జైలులో పెట్టారు. అతడు రష్యాకమ్యూనిస్టు అని పోలీసుల అనుమానం. మూడురోజుల తర్వాత అతనిని వదలిపెట్టారు.

గేషేధర్మవర్ధన్ తనదేశీయుడేనని, విప్లవానికిపూర్వమే మంగోలియాను వదలిపెట్టి టిబెట్‌కు వచ్చాడని అతడు రాహుల్‌కి చెప్పాడు. టిబెట్ యాత్ర సందర్భంలో తనకు ఎంతో తోడ్పడిన ఈ మిత్రుని వివరాలను రాహుల్జీ ఎంతో ఆసక్తితో విన్నారు. గేషేధర్మవర్ధన్ సేరా మహావిహారంలో ఆచార్యుడైనాడు. ఇది అత్యంత గౌరవప్రదమైన పదవి. సేరాలో అయిదువేలమంది భిక్షువులకుగాను నలుగురు ప్రధాన ఆచార్యులు ఉండేవారు. వారిలో గేషేధర్మవర్ధన్ ఒకడు. కాని టిబెట్‌లోని ఈ విహారం ఇప్పుడు గూండాలకు నిలయమైపోయింది. గేషేధర్మవర్ధన్ "ధర్మపదం", "గీత" "అభిజ్ఞాన శాకుంతలా"లను అందమైన పద్యాలలోకి అనువదించాడు. అతడు భారతదేశంలో కొద్దినెలలు ఉండి, ఆ తర్వాత స్వదేశానికి బయలుదేరాడు. కాని అక్కడకు వెళ్ళలేకపోయాడు. ఇటీవల మంచూరియానుండి కలకత్తా-కాలింపాంగ్ మార్గాన తిరిగి టిబెట్‌కు వస్తూవుండగా, టిబెట్ ప్రభుత్వం అతనిని అరెస్టుచేసి, జైలులో బంధించింది. అతనికి రాజకీయాలతో నిమిత్తంలేదు. విద్యాసముపార్జనే అతని జీవిత ధ్యేయం. అయినప్పటికీ మాతృదేశం అంటే అతనికి చాలా అభిమానం. నవీన మంగోలియాను ప్రశంసించేవాడు. అందుచేత లామాలు ఇరవైఏళ్ళనుండి వ్యతిరేకప్రచారం చేస్తూన్నప్పటికీ, అతడు స్వదేశానికి వెళ్ళదలచాడు. మంచూ

రియా-మంగోలియా సరిహద్దువరకు వెళ్ళాడు. కాని ఆ సరిహద్దును దాటి వెళ్ళడం అసంభవ మనిపించింది. నవీన మంగోలియాపట్ల ఏమాత్రం సానుభూతి కనబరచినా, జపానీయులు అతనిని జైలులో పెట్టేవారు. జపాన్‌తో సంబంధం ఉన్నట్లు ఋజువైతే, మంగోలులుకూడ అతనికి అదేవిధంగా స్వాగతం చెప్పేవారు. అందుచేత అతడు హతాశుడై తన జీవితశేషాన్ని టిబెట్‌లో గడుపుదామని తిరిగి వెళ్ళిపోతుండగా, ప్రభుత్వం అరెస్టు చేసింది. మంగోలియా ఆధునిక వ్యవస్థను ప్రశంసిస్తున్నాడనే కారణంతో అతనిని జైలులో పెట్టారని మంగోలు భిక్షువు చెప్పాడు.

ఇది విని రాహుల్జీ చాలా చింతించారు. జనరల్ షోగంగ్‌తో ఉత్తరప్రత్యుత్తరాలుజరిపారు. గేషేధర్మవర్ధనను జైలునుండి విడిచిపెడతామని వాగ్దానం పొందేదాకా నిద్రపోలేదు.

రాహుల్జీ చినీలోనే మరొక యాత్రికుని కలుసుకొన్నారు. అతనిపేరు బ్రహ్మచారి పరమానంద చైతన్య. అల్మోడా జిల్లాలో జన్మించాడు. అతని వయస్సు నలభై ఏళ్ళు. కాశ్మీర్‌నుండి, నేపాల్‌దాకా అనువనువూ ఇతనికి పరిచయమైంది. దాదాపు ఇరవై ఏళ్ళు అనేక దుర్గమారణ్యాలలో సంచరించాడు. అతనికి యోగ-సమాధిమీద నమ్మకం కుదిరింది కైలాసంలో విహరిస్తూ మూడేళ్ళక్రితం ఈప్రాంతానికి వచ్చాడు. మూడేళ్ళకాలం సమాధిలో ఉండాలని నిశ్చయించాడు. భక్తులు అతనికి ఒక పెద్ద కుటీరం నిర్మించారు. బ్రహ్మచారి చైతన్య తపస్సుప్రారంభించాడు.

రెండేళ్ళు గడిచేటప్పటికి భక్తురాండ్ర సంఖ్యకూడ ఎక్కువైంది. ఒక భక్తురాలు ఇంద్రాయుధంగా తయారై, ఈ విశ్వామిత్రుని తపస్సును భగ్నంచేసింది. "అహం భైరవః త్వం భైరవీ" అనుకొన్నారు. ఒకరోజున ప్రజలు ఈ కుటీరంలో సమావేశమైనారు. బ్రహ్మచారికూడ పాల్గొన్నాడు. అతని ప్రియురాలి తండ్రి "నా కుమార్తెను బ్రహ్మచారికిస్తున్నా" నని నిండు సభలో చెప్పాడు. కన్యాదానం జరిగిపోయింది. బ్రహ్మచారి సంతోషంతో ఉప్పొంగిపోయాడు. కాని కన్యతండ్రికి ఈ అధికారం లేదు. కన్యను లోగడే వేరొకరికి దానంచేశాడు. కిన్నరుల సంప్రదాయం ప్రకారం డబ్బుతీసుకొన్నాడు. అందుచేత మొదటి అల్లుడు ఆ అమ్మాయిని తీసుకుపోవాలని ప్రయత్నించాడు. కాని ఆ అమ్మాయి అతనివెంట వెళ్ళడానికి ఇష్టపడలేదు. ఆమె ఒక ఋషి పాదదాసి అయింది. ఋషి ఆమె జ్ఞాననేత్రాన్ని తెరిపించాడు. ఈ కేసు తహశీల్దారు విచారణకు వెళ్ళింది. కిన్నరుల సంప్రదాయప్రకారం, ఆ అమ్మాయి తండ్రి తీసుకొన్న డబ్బు మొదటి అల్లునికి తిరిగి ఇప్పించారు. కాని బ్రహ్మచారికి ఎందుకో విరక్తి పుట్టింది. నెలక్రిందటనే ఆ అమ్మాయిని పుట్టింటికి పంపివేశాడు. మంగోలు భిక్షువులా ఆమెను వెంట తీసుకొని, యాత్ర చేయవలసిందిగా రాహుల్జీ హితవు చెప్పారు.

ఆయన హానే రాలాఅనే మరో యాత్రికుని కలుసుకొన్నారు. అతడు డార్జిలింగ్‌వద్ద ఒక కుగ్రామంలో జన్మించాడు. ఇరవైఏళ్ళవయస్సు వచ్చేదాకా ఇంటివద్ద సేద్యం

చేశాడు. తర్వాత పరదేశం వెళ్ళాలని బుద్ధిపుట్టింది. తన గ్రామస్థులవెంట నౌకరీకోసం బర్మాకు వెళ్ళాడు. అక్కడ ఒక ఏడాది ఉన్నాడు. "షాన్" సంస్థానంలో రత్నాలు దొరుకుతాయని తెలిసింది. కాలా అక్కడకు వెళ్ళి అయిదేళ్ళకాలం వెదికాడు. కాని రత్నాలు దొరకలేదు. తర్వాత మణిపూర్ మీదుగా బదరీనాథ్, గంగోత్రియాత్రలు చేశాడు. ఈ సందర్భంలో చదవడం, వ్రాయడం నేర్చుకొన్నాడు. పిమ్మట ద్రవిడయాత్ర చేసివచ్చాడు. నాలుగేళ్ళనుండి కిన్నరదేశంలో ఉంటున్నాడు. ప్రజలవద్ద చందాలు వసూలుచేసి, చాలాచోట్ల పాఠశాలలు పెట్టించాడు. అంతకు క్రితం బొంబాయిమీదుగా తిరువాన్కూరు యాత్రచేసి వచ్చాడు. కిన్నరదేశంలో పాఠశాలలు పెట్టించడమే కార్యక్రమంగా పెట్టుకొన్నాడు. స్వయంగా ఒక పాఠశాలలో చదువు చెబుతున్నాడు. వైష్ణవమతప్రచారం చేస్తున్నాడు.

రాహుల్జీ లిప్పా అనే గ్రామంలో జ్యోతిష్కుడైన ఒక లామానుకలుసుకొని సంభాషించారు. తాను ఒక మఠానికి పునాదివేస్తూ ఉండగా ఎముకలు కనిపించాయని లామా మాటల సందర్భంలో చెప్పాడు ఇక్కడ మహామ్మదీయ సమాధులు అనేకం కనిపిస్తున్నాయనికూడ తెలియజేశాడు. "ఎముకలతోబాటు పాత్రలు కూడా ఉంటున్నాయా?"అని రాహుల్జీ ప్రశ్నించారు. "పాత్రలుదొరకడం అని వార్యమే"నని అతడు చెప్పాడు. పాత్రలు చాలావరకు మట్టివని, వాటిని ప్రజలు పారవేస్తున్నారని, కొందరుపిల్లలు

వాటితో కాస్సేపు ఆడుకొని పగలగొడుతున్నారని తెలిసింది. రాహుల్జీ ఇంకా వివరాలు అడిగి తెలుసుకొన్నారు. స్వయంగా ఒకచోటికి వెళ్ళి చూశారు. మృతకసమాధులు మహమ్మదీయులవి కావని, బౌద్ధసమాధులని రుజువైంది. బౌద్ధమతాన్ని సందర్శించారు లామాతో సంభాషణజరిపారు. ఇక్కడ ఏవో మృతకసమాధులుకనిపించినట్లు లామామాటల సందర్భంలో చెప్పాడు. "మా బంధువు ఒకడు గ్రామం చివర మతనిర్మాణానికై భూమి త్రవ్వుతూఉండగా, ఎముకలు బయటపడ్డాయి"అన్నాడు. దీనిపై రాహుల్జీకి ఆసక్తి కలిగింది. "ఎలాంటి ఎముకలు? అని ప్రశ్నించారు."ఇక్కడ ఖ-ఛే రోమ్‌ఖంగ్ (మహమ్మదీయ సమాధులు) బయటపడుతున్నాయి" అని లామా చెప్పాడు. ఎముకలతో బాటు పాత్రలు తప్పనిసరిగా బయటపడుతూఉంటాయి అని, అది నిజమైతే ఇవి మహమ్మదీయ సమాధులు కావని రాహుల్జీ చెప్పారు. దీనిమీందట, సమాధిని ప్రత్యక్షంగా చూశారు. చూచిన ఒకస్త్రీని లామా పిలిపించాడు. దాదాపు పాతికేళ్ళక్రితం కొన్ని పాత్రలు కనిపించాయని ఆమె చెప్పింది. ఇటీవల కనిపించిన మృతకసమాధినిగురించి రాహుల్జీ అడిగారు. ఒక రైతు పొలంలో కొద్ది ఏళ్ళక్రితం మనిషిపుర్రె కనిపించినట్లు తెలిసింది. రాహుల్జీ అతని చేనువద్దకు వెళ్ళారు. దానికి ఆనుకొనిఉన్న పొలంలో, అంతకంటె వెనుకటిసమాధి బయటపడినట్లు చెప్పారు. పొలం యజమాని సంజీరామ్ ఇల్లు అయిదారేళ్ళక్రితం కాలిపోయింది అందుచేత అతని పొలంలో ఇల్లు కట్టుకోవడం ప్రారంభించాడు. అక్కడ ఒక

పెద్ద మృతకసమాధి బయటపడింది. రాహుల్జీ త్రవ్వగోల తీసుకొని, ఆ ప్రదేశం చూపించమనికోరారు. ఇంటిని త్రవ్వి పారవేస్తారేమోనని రైతు భయపడ్డాడు. పొలం అవతలి భాగం చూపించాడు. నెలరోజులక్రిందట ఇక్కడపొలం రాతికంచెను సరిచేస్తూ ఉండగా, సమాధి బయట పడిందని చెప్పాడు. అక్కడ త్రవ్వగా ఎముకబయటపడిం దని తెలియజేశాడు. డబ్బు ఇస్తారనే ఆశతో తన ఇంట్లో నుండి ఒక కంచుగిన్నె, మట్టితో తయారుచేసిన మద్యపాత్ర తెచ్చి ఇచ్చాడు. రెండుపాత్రలూ ఒకే సమాధిలో తలవద్ద కుడివైపు పెట్టిఉన్నట్లు తెలియజేశాడు. రెండుపాత్రల పని తనం అద్భుతంగాఉంది. గిన్నె ఏడున్నర అంగుళాల వ్యాసం కలిగి, పూర్ణ అర్ధగోళ ఆకృతిలో ఉంది. మద్యపాత్రకు బొటనవ్రేలు పట్టేటంత మూతిఉంది. పూర్వం కళేబరాలను తగలబెట్టకుండా పాతిపట్టేవారు.సమాధిలోని కళేబరంతల'పడ మటివైపు' ఉంచేవారు. శవంతోబాటు భోజనం, మద్యం ఉంచేవారు. అప్పటికి ఈ ప్రజలకు బౌద్ధమతం యొక్క కర్మసిద్ధాంతంతో పరిచయంలేదు. అందుచేత కళేబరం ప్రక్క భోజనం,మద్యం ఉంచేవారని రాహుల్జీ అభిప్రాయం. ఆయనవెంటఉన్న ఒక ప్రభుత్వోద్యోగి ఈ సమాధు లలో నగలుకూడ బయటపడుతున్నాయని చెప్పాడు. సమా ధులలో మట్టిపాత్రలే అనేకంగా లభిస్తాయి. ఎందుకంటె కళేబరాలలో ఎక్కువభాగం పేదలవి. పంజీరామ్ తనకు చిన్నసమాధిలో దొరికినవంటూ రెండు అందమైనపాత్రలు ఇచ్చాడు. వాటిలో కంచుగిన్నె పెద్దసమాధిలో దొరికిందే.

[illegible] 392 [illegible]

అతనికి పెద్దసమాధిలో ఇంకా ఏవో వస్తువులు దొరికి ఉంటాయి. వాటిని కమ్మరికి ఇచ్చి, కరిగింపజేసి ఉంటాడు. పెద్ద ధనికుని సమాధి బయటపడినప్పుడు, అందులో ఎన్నో నగలు, నాణెములుకూడ లభిస్తాయని ప్రభుత్వోద్యోగి అన్నాడు.

తలవని తలంపుగా ఇంత విలువైన చారిత్రక సామాగ్రి లభించినందుకు రాహుల్జీ చాలా సంతోషించారు. తర్వాత స్పూసాంగ్లా, తదితర గ్రామాలలో పర్యటించారు. ప్రజలలో వ్యాపించిన అంధవిశ్వాసాలను తొలగించడానికి కృషిచేశారు. వారు ఎదుర్కొంటున్న ఆర్థిక, సాంఘిక సమస్యలను బాగా అధ్యయనం చేశారు.

సాంగ్లా బుద్ధమందిరాన్ని సందర్శించారు. ఇరవై రెండు అంగుళాల పొడవు, చతుర్భుజాలుగల అవలోకితేశ్వర విగ్రహం కనిపించింది. విగ్రహశరీరంలో ఎక్కువ భాగం వస్త్రంతో కప్పిఉంచబడింది. విగ్రహనేత్రాలలో కాంతి వెల్లివిరుస్తున్నది. ఇదొక గొప్పకళ. ఇది ఏడు శతాబ్దాల క్రిందటే లుప్తమైపోయింది. రాహుల్జీ ఆ విగ్రహానికి కప్పిన వస్త్రాన్ని తొలగింపజేశారు. దానికి ఎడమవైపు రెండుచేతులు ఉన్నాయి. పైచేతిలో పుస్తకం, క్రిందిచేతిలో కమలం ఉన్నాయి. కుడివైపునకూడ రెండుచేతులు ఉన్నాయి. పైచేతిలో అక్షమాల, క్రిందిచేతిలో వరదహస్తం ఉన్నాయి. రాహుల్జీ ఈ విగ్రహాన్ని ఫొటోతీశారు. ఇది పన్నెండు పదమూడుశతాబ్దాలక్రితం తయారుచేయబడిన విగ్రహమని రాహుల్జీ అభిప్రాయం.

రాహుల్జీ కిన్నర దేశ ప్రజలు మాట్లాడే భాషను శ్రద్ధతో అధ్యయనం చేశారు. వీరు మాట్లాడే భాషలో మూడు భాషలతో, అంటే టిబెట్ (భోట్ భాష), సంస్కృతం, ఈ రెంటికీ భిన్నమైన మూడో భాషతో ఏర్పడిందని రాహుల్జీ అభిప్రాయం. దీనికి ఆయన "షూ" భాష అని నామకరణం చేశారు.

క్రీస్తుకుపూర్వం మూడో శతాబ్దంలో కిన్నర ప్రజలకు అశోకుని సామ్రాజ్యంతో సంబంధం ఏర్పడిందని, అయితే బౌద్ధమతంతో సంబంధం పెట్టుకోవడానికి అవసరమైనంత సంస్కృతీ, స్థాయి వారిలో లేకపోయిందని రాహుల్జీ అభిప్రాయం. మహమ్మదీయుల సమాధులని భ్రమపడుతున్న మృతకసమాధులే ఇందుకు దృష్టాంతమని ఆయన చెప్పారు. మహమ్మదీయుల సమాధులలో పాత్రలలో భోజనం, మద్యం ఉంచరని, ఈ ప్రాంతంలో మహమ్మదీయులు ఎప్పుడూ నివసించలేదనే విషయం స్థానిక ప్రజలకు తెలియదు. వారి పూర్వులే ఒకప్పుడు కళేబరాలను తగలబెట్టకుండా పాతిపెట్టేవారు. మృతాత్మలు సమాధిలో పస్తుఉండకుండా, ప్రాచీన ఈజిప్టులోవలె ఖాద్య, పేయ సామాగ్రిని ఉంచేవారని రాహుల్జీ అభిప్రాయం.

రాహుల్జీ కిన్నరులసంగీతం విన్నారు. హిమాచలంలో ప్రకృతిశోభ, మధురసంగీతం, మధురకంఠాలకు నైసర్గిక సంబంధంఉంది. అందుచేతనే కొండజాతిస్త్రీ కోకిలకంఠిఅయి వున్నదని రాహుల్జీ అభిప్రాయం. ఆయన ఒకరోజు పర్వతాలలో షికారుచేస్తూఉండగా, ఎక్కడనుంచో ఒకమధురకంఠం

వినిపించింది. దానిని వింటూ ముందుకు వెళ్లారు. మెల్ల మెల్లగా ఆ స్వరం దూరమైంది. కాని ప్రతిధ్వని వినిపిస్తూనే ఉంది. అరమైలుదూరం వెళ్ళి, రాహుల్జీ తిరిగివచ్చారు. ఆ మధురకంఠం ఇంకా పాడుతూనేఉంది. అది స్త్రీ కంఠం. రాహుల్జీ ఆమెను చూడదలచారు. కొంచెం ఎత్తయిన ప్రదేశానికి వెళ్ళారు. ఆమె ఇంకా సంగీతంలో నిమగ్నమై ఉంది. ప్రాచీనకావ్యాలలో వర్ణించినట్లు ఆమెదేహంపై తెల్లనిబట్టలు లేవు. ఆమెచేతిలో వీణలేదు. కాని ఆమెశరీరమే వీణగావుంది. ఆమె తాను కప్పుకొన్న మలినవస్త్రాన్ని, అప్పుడప్పుడు కాళ్ళను, తర్వాత రెండుచేతులను కదలిస్తూ పాడుతున్నది. ఆమెకు ఇరవైయేళ్ళవయస్సు ఉంటుంది. కొంచెంసేపైన తర్వాత ఎవడో ఆటంకం కలిగించాడు. ఆమె సంగీతం వదలి అతనివైపు దృష్టిసారించింది. రాహుల్జీ ఆ ప్రదేశంనుంచి తప్పుకున్నారు.

కిన్నరగీతాలను రాహుల్జీ శ్రద్ధగా పరిశీలించారు. అవి మూడుపాదాలు కలిగి చాలా సరళంగా ఉంటాయి. అది అక్షరఛందస్సు. హ్రస్వం, దీర్ఘం, ప్లుతంచేసుకోవడానికి సంపూర్ణ స్వేచ్ఛ ఉంటుంది. రాహుల్జీ కిన్నరప్రజలను కలుసుకొని, పదకొండుగీతాలు సేకరించారు. ఇందులో ప్రేమగీతాలే ఎక్కువ.

కిన్నరదేశంలో దాదాపు మూడు నెలలు గడిపి, రాహుల్జీ క్రీ. శ. 1948 ఆగస్టు నెలలో తన స్వస్థానికి వెళ్లారు. తర్వాత "కిన్నరదేశంలో" అనే పేరుతో ఒక బృహద్గ్రంథం రచించారు.

భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించిన తర్వాత, రాహుల్జీ ప్రభుత్వ జీతభత్యంపై కొన్ని రచనలు చేశారు. ఆయన చైనాయాత్ర, మరొకపర్యాయం లంకపర్యటనచేసివచ్చారు. పిమ్మట "మధ్యఆసియా చరిత్రను" రెండుసంపుటాలుగా రచించారు. దీనికి కేంద్రసాహిత్య అకాడమీవారు అయిదు వేలరూపాయలు బహుమతిగా ఇచ్చారు.

రాహుల్జీ భారతదేశంలో స్థిరనివాసం కల్పించదలచుకొన్నారు. అందుచేత కమల అనే మరొక వనితను వివాహం మాడారు. ఆమెకు ఇప్పుడు ఇద్దరుపిల్లలు.

రాహుల్జీ తిరిగి కమ్యూనిస్టుపార్టీలో సభ్యుడుగా చేరారు. ఎప్పటివలె పార్టీ కార్యకలాపాలకు చేయూతనివ్వసాగారు. ఇటీవలి సంవత్సరాలలో కారల్‌మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావో సే టుంగ్ జీవితచరిత్రలను రచించారు. ఇవి ఒక్కొక్కటి ఒక బృహద్గ్రంథం. గ్రామీణప్రజలకు అర్థమయ్యే భాషలో "మరకస్ బాబా" (మార్క్స్ మహాశయుడు) గ్రంథాన్ని రచించారు.

రాహుల్జీ లంక విశ్వవిద్యాలయంలో పనిచేస్తుండగా, ఏడాదిక్రితం ఆయనకు తిరిగి జబ్బుచేసింది. అది ముఖ్యంగా మెదడుకు సంబంధించిన జబ్బు. వైద్యం చేయించుకోవడానికి తగినంత డబ్బులేదు. భారతదేశానికి వెళ్లుదామని ఆయన భార్య కమల సలహాయిచ్చింది. కాని వినలేదు. భారతప్రభుత్వంపట్ల ఆయన చాలా తీవ్ర అసంతృప్తిని వెల్లడించారు. రోజులుగడిచే కొద్దీ ఆయనజబ్బు తీవ్రమైంది. నోటిమాట

ఆగిపోయింది. ఈ పరిస్థితిలో ఆయనను భారతదేశానికి తీసుకువచ్చారు.

తాను చాలా అస్వస్థుడుగా ఉన్నట్లు పత్రికలకు ఎక్కించడం రాహుల్జీకి ఇష్టంలేదు. అయినప్పటికీ ఆయన భార్య ఇది తన విధ్యుక్తధర్మంగాకూడ భావించి, పత్రికా ప్రకటన చేసింది. ఇలా ప్రకటనచేసినందుకు రాహుల్జీ ఆమెను తీవ్రంగా మందలించారు. ఆయన గ్రంథాలను ప్రచురించి, విపరీతంగా లాభాలుపొందిన సంస్థలు ఎన్నో ఉన్నాయి. కాని అవి ఎలాంటి ఆర్థికసహాయమూ అందజేయలేదు. రాహుల్జీ పాఠకులు, మిత్రులు తమకు ఓపినంత సహాయంచేశారు. ఆంధ్రప్రజలనుండికూడ కొంత ఆర్థికసహాయం లభించింది. కాని రాహుల్జీకి చికిత్సకు ఇది ఏమాత్రమూ చాలలేదు. ప్రభుత్వం తనకు పట్టనట్లు ఉండిపోయింది.

ఇలాంటిపరిస్థితిలో సోవియట్‌రష్యా విద్యామంత్రిత్వ శాఖవారు చికిత్సకై రాహుల్జీకి ఆహ్వానం పంపారు. మాస్కోకు వెళ్లేముందు ఆయన కలకత్తా, తదితరచోట్ల చికిత్సపొందారు. కొన్ని నెలలు గడిచినా, పరిస్థితిలో మార్పు రాలేదు. రాహుల్జీకి తాను రచించిన "నా జీవనయాత్ర" భార్యచేత చదివిస్తూ, అప్పుడప్పుడు చిరునవ్వునవ్వేవారు. సోవియట్‌రష్యాలో తనకుమారుని యోగక్షేమాలను విచారించేవారు. తనను చూడటానికి వచ్చిన మిత్రులను భోంచేయమని చెప్పేవారు. ఇంతకు మినహా ఆయననోట మరే మాట వినిపించేది కాదు.

ఆయనను ఇటీవల సోవియట్‌రష్యాకు తీసుకువెళ్లారు.

అక్కడ ఒక శానిటోరియంలో ప్రముఖవైద్యులు ఆయనకు చికిత్స చేస్తున్నారు. ఆయన పరిస్థితి కొంతమెరుగైనట్లు వార్తలు వచ్చాయి.

రాహుల్జీ భారతదేశంలో మనందరిమధ్య, స్వస్థకాయుడై తిరుగుతున్నప్పుడు కాకుండా చివరికి స్మారకశక్తికూడ లోపించి, రష్యా శానిటోరియంలో ఉన్నప్పుడు, ఆయనకు భారతప్రభుత్వం 1963లో "పద్మభూషణ్" బిరుదుఇచ్చింది.

రాహుల్జీ బహుముఖప్రజ్ఞాశాలి. ఆయన అన్నిరంగాల లోను కృషిచేసి, అపారమైన అనుభవం గడించారు. పండితులకోసమేగాక పామరులకోసంకూడ గ్రంథాలు రచించారు. వీటిసంఖ్య దాదాపు రెండువందలు. కొనఊపిరి ఉన్నంత వరకు రచనలు చేస్తూనే ఉంటానని ఆయన ప్రతిజ్ఞ.

రాహుల్జీ బహుభాషాపండితుడు. ఆయన దాదాపు ఇరవై భాషలు మాట్లాడగలరు. ఆయాభాషలలో రచనలు చేయగలరు. ఆయన పాండిత్యానికి మెచ్చి కాశీవిద్యాపీఠం వారు కొద్దియేళ్ళ క్రితమే "మహాపండిత" బిరుదుఇచ్చారు. ఓనమాలు తెలియని కుటుంబలోపుట్టి స్వయంకృషిద్వారా ఇంత ఔన్నత్యాన్ని అందుకొన్నవారు అరుదు.

రాహుల్జీ నిస్స్వార్థసేవాపరాయణుడు. పర్సా తిరు మఠ మఠాల ఆధిపత్యం ఇస్తామని చెప్పినా, ఆయన నిరాకరించారు. భోగలాసత్వంవైపు ఆయనదృష్టిపోలేదు. దరిద్ర నారాయణుడుగానే ఉండదలచుకొన్నారు. పేదల హక్కుల కోసం నిర్విరామంగా పోరాడారు.

రాహుల్జీ తనయవ్వనంలో ఆర్యసమాజంచే ఆకర్షింప

బడినారు. దయానందసరస్వతి చెప్పిన ప్రతిమాట వేద వాక్యంగా భావించారు. తర్వాత బౌద్ధవాఙ్మయపఠనం ఫలితంగా ఆయన జీవితంలో పెద్దమార్పువచ్చింది. స్వతంత్ర భావాల వ్యాప్తికి బుద్ధుడు కల్పించిన స్వేచ్ఛ ఆయనకు ఎంతో నచ్చింది. ఆయన నాస్తికుడైనారు. తర్వాత రష్యా విప్లవం, మార్క్సిస్టు గ్రంథపఠనం ఆయన జీవితానికి కొత్తనరవడిని దిద్దాయి. ఆయన ప్రముఖ మార్క్సిస్టు అయినారు.

రాహుల్జీ తనబాల్యంలో ఇంటివద్ద నెయ్యి ఒలకబోసి, పెద్దవారు కోపపడతారనే భయంతో ఇంటినుండి పారిపోయారు. భారతదేశంలోనే గాకుండా ప్రపంచమంతటా ముప్ఫయినాలుగేళ్ళు నిర్విరామయాత్రచేసి వచ్చారు. నెయ్యి ఒలకబోసిననేరం నెత్తిపై పెట్టుకువెళ్ళిన కేదారనాథ్, తన రచనల ద్వారా పాఠకులకు నేతులు ఒలికించే రాహుల్ సాంకృత్యాయన్ అయినారు.

రాహుల్జీ తన చిన్నతనంలో "ఓ మూర్ఖుడా! ప్రపంచ పర్యటన చేయి" అనే పద్యభాగం చదివి, ఒక మహాయాత్రికుడైనాడు. తనతోబాటు ఇంకెందరో యాత్రికులను తయారుచేసే ఉద్దేశంతో, "ఘుమక్కడ్ శాస్త్రం" (యాత్రావిజ్ఞాన శాస్త్రం) కూడ రచించారు. ప్రపంచంలో మొట్టమొదట ఇలాంటి గ్రంథం రచించిన ఖ్యాతి రాహుల్జీకే దక్కింది.

రాహుల్జీ బౌద్ధసన్యాసివేషంలో ఉంటున్నందువల్ల, ఆయనకు ఈ ప్రపంచంతో సంబంధంలేదని కొందరు భావించారు. కాని ఈ వేషంలో ఉంటూనే కాంగ్రెస్‌వాదిగా,

క్యమ్యూనిస్టుగా ప్రజలకు సేవచేశారు. ఆయనకు "సైన్సు" తెలియదనుకొని ఆచార్యకృపలానీ ఒకసారి ఏదో బోధించడానికి తయారైనారు. కృపలానీని కలుసుకోవడం అదే మొదలు అయినందువల్ల, రాహుల్జీ ఆయనను వదలిపెట్టారు. కాని ఆ తర్వాత "విశ్వకి రూపరేఖ" అనే గొప్ప శాస్త్రీయ గ్రంథాన్ని రచించి, కృపలానీలాంటివారిని ఆశ్చర్యచకితులుగా చేశారు.

రాహుల్జీ త్వరలో స్వస్థకాయుడై, రష్యానుండి భారతదేశానికి వచ్చే సుముహూర్తంకోసం మనందరం ఎదురుచూస్తున్నాం.

---





# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B170 |
| పుస్తకం పేరు | మహోన్నత మానవుడు రాహుల్ సాంకృత్యాయన్ |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | నొ |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 401 |
| పెద్ద సైజు పేజీలు | నొ |
| ఖాళీ పేజీలు | 400, 1 Sci |
| లేని పేజీలు | నొ |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |